శ్రీమతే రామానుజాయ నమః



# భక్తినివేదన

[ వేదాంత మాసపత్రిక ]

సంపుటి ౧౨ || వికారి – చైత్రము || సంచిక ౧





సంపాదకులు:
తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు:
కవికళ్ళు గుదిమెళ్ళ రామానుజాచార్యులు

28. శ్లో. యతేన్ద్రియ మనోబుద్ధిః । మునిర్మోక్ష పరాయణః
విగతేచ్ఛా భయక్రోధో । య స్సదా ముక్త ఏవ సః॥

అర్థము :- యః = ఎవడు. యతేన్ద్రియమనో బుద్ధిః = నిగ్రహింపబడిన ఇంద్రియములు మనస్సు బుద్ధికలవాడును. విగతేచ్ఛాభయక్రోధః = పోగొట్టబడిన కోరిక, భయము, కోపము గలవాడును, మోక్షపరాయణః = మోక్షమొక్కటియే ప్రయోజనముగా కలవాడును, మునిః = ఆత్మావలోకనపరుడును అగునో, సః = వాడు, సదా = ఎల్లప్పుడును, ముక్తః ఏవ = ముక్తుడే (భవతి = అగుచున్నాడు.)

తా॥ ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని ఇతర విషయములయందు ప్రవర్తించనీయక, కోరికను, భయమును కోపమును వీడి, మోక్షము నొక్కదానినే కోరి, ఆత్మను సాక్షాత్కరించుచునుండువాడు ముక్తప్రాయుడే యగుచున్నాడు.

అవ. నిత్యనైమిత్తికకర్మలను అంగముగా కలిగియున్న యీ కర్మయోగమును ఆచరించుటకు సుకరోపాయమును ఉపదేశించుచున్నాడు.

29. శ్లో. భోక్తారం యజ్ఞ తపసాం । సర్వలోక మహేశ్వరమ్
సుహృదం సర్వ భూతానాం । జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి॥

అర్థము :- సః = అట్టివాడు, మాం = నన్ను, యజ్ఞతపసాం = యజ్ఞములకును తపస్సులకును, భోక్తారం = అనుభవించువానినిగాను, సర్వలోకమహేశ్వరం = సకలలోకేశ్వరులకును ఈశ్వరునిగాను, సర్వభూతానాం = సమస్తప్రాణులకును, సుహృదం = హితునిగాను, జ్ఞాత్వా = తెలిసికొని, శాన్తిం = సుఖమును, ఋచ్ఛతి = పొందుచున్నాడు

తా॥ నన్ను యజ్ఞతపస్సులకు భోక్తనుగాను, లోకేశ్వరులందరకును ఈశ్వరునిగాను, సకలప్రాణులకు హితునిగాను తెలిసికొన్నవాడు కర్మయోగము నా యారాధనయే యని తెలుసుకొని దాని నాచరించుచు సౌఖ్యమును పొందగలుగుచున్నాడు.

ఇతి శ్రీ భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మసన్న్యాసయోగోనామ పంచమోఽధ్యాయః

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాద రూపమును అయిన శ్రీభగవద్గీత యందలి కర్మసన్యాసయోగమనెడి

ప ం చ మా ధ్యా య ము.

| | | | |
|---|---|---|---|
| అర్జునుని శ్లోకము | 1 | ఈ అధ్యాయమందలి శ్లోకసంఖ్య | 29 |
| భగవంతుని శ్లోకములు | 28 | ఇప్పటికైన మొత్తము శ్లోకముల సంఖ్య | 232 |



## షష్ఠాధ్యాయార్థ సంగ్రహము

శ్లో. యోగాభ్యాసవిధి ర్యోగీ
చతుర్ధాయోగ సాధనమ్
యోగసిద్ధి స్స్వయోగస్య
పారమ్యం షష్ఠఉచ్యతే॥

అర్థము :- యోగాభ్యాసవిధిః = యోగము నలవరచుకొనురీతియు, యోగీ చతుర్ధా = యోగి నాలుగువిధములగుటయు, యోగసాధనం = అభ్యాసము, వైరాగ్యములనెడు యోగసాధనమున్ను, యోగసిద్ధిః = విఘ్నితమైనను యోగము సిద్ధించురీతియు, స్వయోగస్య = తననుగూర్చిన భక్తియోగము యొక్క, పారమ్యం = అన్నిటికి మిన్నయగుటయు, షష్ఠే = ఆరవ అధ్యాయమున, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ ఆత్మను దర్శించుట యోగమనబడును; దాని నలవరచుకొను రీతియు, యోగుల పరిపాకదశలనుబట్టి నాలుగు విధములుగ నుండుటయు, అభ్యాసము వైరాగ్యము లనెడు యోగసాధనములున్ను, ఈ యోగము మధ్య విచ్ఛిన్నమైనను బెడిసికొట్టకుండుట, పుణ్యలోకముల ననుభవింపజేయుట, మిగిలినయోగమును సాధించుటకు వీలైన గొప్పకులమున పుట్టించుటయున్ను, భగవంతుని గూర్చిన భక్తియోగము భగవంతునివలెనే అన్నిటికంటె మిక్కిలి గొప్పదగుటయు, ఈ యారవయధ్యాయమున చెప్పబడెను.

# శ్రీ భగవద్గీత - షష్ఠాధ్యాయము

# విషయసూచిక

ఇంతవరకు కర్మయోగమును సాంగోపాంగముగా నుపదేశించి యీ యధ్యాయమున ఆ కర్మయోగమునకు ఫలమగు యోగమనబడు ఆత్మ సాక్షాత్కారముగూర్చి సమస్త పరికరములతో నిందు తెలుపుట.

శ్రీ హ య గ్రీ వా య న మః

శ్రీ భగవద్గీతా - షష్ఠోఽధ్యాయః

# ఆత్మ సంయమ యోగః



అవ. కర్మయోగి యొక్కడే కర్మయోగియు, జ్ఞానయోగియును కాగలడు. జ్ఞానయోగి జ్ఞానయోగియేగాని కర్మయోగి కానేరడు అని శ్రీ కృష్ణుడు చెప్పుచున్నాడు.

శ్రీ భగవా నువాచ = భగవంతుడు పలికెను.

1. శ్లో. అనాశ్రితః కర్మఫలం । కార్యం కర్మ కరోతి యః
స సన్న్యాసీ చ యోగీ చ । న నిరగ్నిర్న చాక్రియః॥

అర్థము :- కర్మఫలమ్ = కర్మలయొక్క ఫలమును, అనాశ్రితః = కోరనివాడై, కార్యం (ఇతి) = కర్మయే చేయదగినది (అని), యః = ఎవడు, కర్మ = కర్మను, కరోతి = చేయుచున్నాడో, సః = వాడే, సన్న్యాసీచ = జ్ఞానయోగి, యోగీ చ = కర్మయోగియును, నిరగ్నిః = యజ్ఞాదులను విడిచినవాడు, న = కాడు, అక్రియ శ్చ = కేవలజ్ఞాననిష్ఠుడును, న = కాడు.

తా॥ పరమాత్మ ఆరాధనరూపమగు కర్మయే ప్రయోజనమని యెంచి ఫలమును కోరక కర్మలను చేయువాడే, కర్మయోగియైనను జ్ఞానయోగియైనను; అంతియుకాని యజ్ఞాదులను చేయనివాడుగాని కేవల జ్ఞాననిష్ఠుడుగాని అట్లు ఉభయయోగనిష్ఠుడు కాజాలడు.

అవ. అందులకు కారణము ఆ కర్మయోగములో జ్ఞానాంశ ప్రధానముగా నుండుటయేయని చెప్పుచున్నాడు.

2. శ్లో. యం సన్న్యాస మితి ప్రాహు । ర్యోగం తం విద్ధి పాణ్డవ
న హ్యసన్న్యస్త సఙ్కల్పో । యోగీ భవతి కశ్చన॥

అర్థము :- హే పాణ్డవ = ఓ అర్జునా ! యం = దేనిని, సన్న్యాసం ఇతి = జ్ఞాన యోగమని, ప్రాహుః = చెప్పుదురో, తం = దానిని, యోగం (ఇతి) = కర్మ యోగమని, విద్ధి = తెలుసుకొనుము. అసన్న్యస్తసఙ్కల్పః = దేహమే ఆత్మయని భ్రమించువాడు, కశ్చన = ఒకడున్ను, యోగీ = కర్మయోగి, నభవతిః = కాడుగదా ?

తా॥ ఆత్మయొక్క వాస్తవజ్ఞానమే జ్ఞానయోగము. దానినే కర్మ యోగమనియు గ్రహింపుము. ఏలయన — కర్మయోగియైనవా డెవ్వడును ఆత్మయాథాత్మ్యజ్ఞానముచే దేహాత్మభ్రాంతిని పోగొట్టు కొనకుండగ నుండడు గదా !

అవ. కర్మయోగమే యే ప్రమాదము లేకుండగ ఆత్మసాక్షాత్కారమును సాధించునని చెప్పుచున్నాడు.

3. శ్లో. ఆరురుక్షోర్మునే ర్యోగం । కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ । శమః కారణ ముచ్యతే॥

అర్థము :- యోగం = ఆత్మావలోకనమును, ఆరురుక్షోః = పొందగోరునట్టి, మునేః = మునికి, కర్మ = కర్మయోగము, కారణం = సాధనముగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది. యోగారూఢస్య = స్థిరమగు ఆత్మావలోకనముగల, తస్య, ఏవ = వానికే, శమః = కర్మత్యాగము, కారణం = సాధనముగా ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ ముముక్షువై ఆత్మను సాక్షాత్కరించ గోరువానికి కర్మయోగము సాధనము. స్థిరమగు ఆత్మావలోకనము కలవానికి కర్మనివృత్తియే కారణము. అనగా ఆత్మావలోకనము కలుగువరకు కర్మలుచేసి తీరవలసినదే.

అవ. యోగారూఢు డెప్పుడగునో లేక ఎట్లగునో చెప్పుచున్నాడు.

4. శ్లో. యదా హి నేన్ద్రియార్థేషు । న కర్మస్వ నుషజ్జతే
సర్వసఙ్కల్ప సన్న్యాసీ । యోగారూఢ స్తదోచ్యతే॥

అర్థము :- యదా = ఎప్పుడు, ఇంద్రియార్థేషు = శబ్దాది విషయములయందును, కర్మసు చ = కర్మలయందును, న అనుషజ్జతే = ఆసక్తి కలిగియుండడో, తదా, హి = అప్పుడే, సర్వసంకల్ప సన్న్యాసీ = సకల సంకల్పములను విడిచినవాడై, యోగారూఢః = స్థిరమగు ఆత్మదర్శనము కలవాడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ ఆత్మను మాత్రమే అనుభవించు స్వభావము కలవానికి ప్రాకృత విషయములయందును, వాటికి సంబంధించిన కర్మలయందును ఆసక్తి యుండదు. వానికే సంకల్పములను ఉండవు. వాడు స్థిరమైన ఆత్మదర్శనము కలవాడగును. కావున వాడు యోగారూఢుడని చెప్పబడును. ఆస్థితి కలుగువరకు కర్మలు చేయవలెను.

అవ. ఆత్మోజ్జీవనమున మనస్సునకుగల సంబంధమును చెప్పుచున్నాడు.

5. శ్లో. ఉద్ధరే దాత్మనా ఽఽత్మానం । నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు । రాత్మైవ రిపు రాత్మనః॥

అర్థము :- ఆత్మనా = మనస్సుచేత, ఆత్మానం = ఆత్మను, ఉద్ధరేత్ = ఉద్ధరించవలెను. ఆత్మానం = ఆత్మను, న అవసాదయేత్ = అధోగతి పాలుచేయరాదు. ఆత్మనః = ఆత్మకు, ఆత్మైవ = మనస్సే. బంధుః = చుట్టము, (భవతి = అగుచున్నది), ఆత్మనః = ఆత్మకు, ఆత్మైవ = మనస్సే. రిపుః = శత్రువు (భవతి = అగుచున్నది)

తా॥ మనస్సును విషయములమీదకు పోనీయక ఆత్మను ఉద్ధరించవలెను, గాని విషయప్రావణ్యముచే ఆత్మను అధోగతిపాలు చేయరాదు. ఆత్మకు వశమైన మనస్సే చుట్టము. అట్లు కానిది శత్రువు.

6. శ్లో. బన్ధు రాత్మా ఽఽత్మన స్తస్య। యేనాఽఽత్మైవాఽఽత్మనా జితః
అనాత్మన స్తు శత్రుత్వే। వర్తే తాత్మైవ శత్రువత్॥

అన్వయము :- ఆత్మనైవ = తనచేతనే, యేన = ఏ పురుషునిచే, ఆత్మా = మనస్సు, జితః = జయింపబడునో, ఆత్మనః = తనయొక్క, ఆత్మా = మనస్సు, తస్య = వానికి, బంధుః = బంధువు, (భవతి = అగుచున్నది), అనాత్మనస్తు = మనస్సును జయించనివానికి, ఆత్మైవ = మనస్సే, శత్రువత్ = శత్రువువలె, శత్రుత్వే = అపకారమునందు, వర్తేత = ప్రవర్తించును.

తా॥ మనస్సును జయించవలెనన్న దానిని విషయములవైపు పోనీయరాదు. అట్లు జయించబడినచో ఆ మనస్సు వానికి బంధువువలె హితము నొనగూర్చును. లేనిచో విరోధివలె పగచూపుచు సంసారమున ముంచును.

అవ. యోగప్రక్రియను చెప్పదలంచి దానిని ప్రారంభించుటకు కావలసిన ఇంద్రియ నిగ్రహమును ద్వంద్వసహనమును చెప్పుచున్నాడు.

7. శ్లో. జితాత్మనః ప్రశాన్తస్య । పరమాత్మా సమాహితః
శీతోష్ణ సుఖదుఃఖేషు । తథా మానావమానయోః॥

అన్వయము:- శీతోష్ణ సుఖదుఃఖేషు = చలి, వేడి, సుఖము, దుఃఖము మున్నగు ద్వంద్వములయందును, తథా = అట్లే, మానావమానయోః = గౌరవా గౌరవములయందును, జితాత్మనః = వికారమును చెందని మనస్సు కలవాడును, ప్రశాన్తస్య = బాహ్యేన్ద్రియ నిగ్రహము కలవాడును అగువానికి, ఆత్మా = పరిశుద్ధమగు జీవాత్మ, పరం = మిక్కిలి, సమాహితః = విశదముగా అనుసంధింపబడును.

తా॥ శీతోష్ణ-సుఖదుఃఖాది ద్వంద్వములకు వికారమును చెందక బాహ్యేంద్రియములనరికట్టినవానికి మనస్సునందు ప్రత్యగాత్మ నిజరూపముతో స్పష్టముగా అనుసంధింపబడును.

అవ. ఆ రెండింటికిని పలయు సాధనములను చెప్పుచున్నాడు.

8. శ్లో. జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా
కూటస్థో విజితేన్ద్రియః ।
యుక్త ఇ త్యుచ్యతే యోగీ
సమలోష్టాశ్మకాఞ్చనః॥

అర్థము :— (యః = ఏ), యోగీ = కర్మయోగి, జ్ఞాన-విజ్ఞాన-తృప్తాత్మా = ఆత్మస్వరూపము, దానికిగల ప్రకృతి వైలక్ష్యముల జ్ఞానములచే తృప్తిని చెందిన మనస్సు కలవాడును, కూటస్థః = నిర్వికారమగు శుద్ధాత్మను అనుసంధించువాడును, విజితేన్ద్రియః = ఇంద్రియముల జయించినవాడును, సమలోష్టాశ్మకాఞ్చనః = మట్టి, రాయి, బంగారములను సమముగ నెంచువాడును అగునో, (సః = వాడు), యుక్తః ఇతి = ఆత్మదర్శనమునకు తగినవాడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

శరీరముకంటె వేరుగా ఆత్మ కలదనుకొనుట జ్ఞానము. ఈ యాత్మకు నిత్యత్వ, ఆనందత్వాదులుండుటచే ప్రకృతికంటె వేరనుకొనుట విజ్ఞానము. ఈ రెండిటిచేతను తృప్తిజెంది, పరిశుద్ధాత్మానుసంధానముచే ఇంద్రియముల జయించి, దానిచే బంగారమును మట్టివలెను, రాయివలెను, నిర్లక్ష్యముగ చూచు గలవాడు ఆత్మదర్శనమునకు తగినవాడు.

9. శ్లో. సుహృన్మిత్రా ర్యు దాసీన
మధ్యస్థ ద్వేష్య బన్ధుషు।
సాధు ష్వపి చ పాపేషు
సమ బుద్ధి ర్విశిష్యతే॥

అర్థము:— సుహృత్ = భిన్నవయస్కులై హితమును కోరువారి యందును, మిత్ర = సమవయస్కులై మేలును కోరువారి యందును, అరి = నైమిత్తిక శత్రువులయందును, ఉదాసీన = తటస్థులయందును, మధ్యస్థ = సహజము గనే, కీడుమేళ్ళను కోరని వారియందును, ద్వేష్య = సహజ శత్రువుల యందును, బన్ధుషు = చుట్టముల యందును, సాధుషు అపి = సజ్జనుల యందును, పాపేషు చ = పాపాత్ములయందును, సమబుద్ధిః = సమాన మైన బుద్ధికలవాడు, విశిష్యతే = గొప్పవాడు అగుచున్నాడు.

తా॥ భిన్నవయస్సుకలిగి హితమును కోరు సుహృత్తులందును, సమ వయస్కులై హితమునుకోరు మిత్రులయందును, ఏదైనా కార ణముచే చెరుపునుకోరు శత్రువుల యందును, కారణము లేకుం డుటచే ఇష్టానిష్టముల గావింపని ఉదాసీనుల యందును, సహ జముగనే హితాహితముల జేయని మధ్యస్థులయందును, పుట్టుక తోనే అనర్థముల జేయగోరు ద్వేష్యులయందును, పుట్టుకతోనే హితపరులగుబంధువులయందును, పుణ్యాత్ములయందును, పాపా త్ములయందును సమానబుద్ధికలవాడు యోగాభ్యాసమునకు మిక్కిలి తగినవాడు.

10. శ్లో. యోగీ యుఞ్జీత సతత। మాత్మానం రహసి స్థితః
ఏకాకీ యత చిత్తాత్మా। నిరాశీ రపరిగ్రహః॥

అర్థము:— యోగీ = కర్మయోగి, సతతం = ఎల్లప్పుడును, ఏకాకీ = ఒంటరివాడును, యతచిత్తాత్మా = మనస్సు యొక్క చింతను అరికట్టినవాడును, నిరాశీః = ఆశ లేనివాడును, అపరిగ్రహః = మమతలేనివాడును (అగుచు), రహసి = జనులు లేనిచోట, స్థితః = ఉన్నవాడై, ఆత్మానం = మనస్సును, యుఞ్జీత = యోగమునం దుంచవలెను.

తా॥ కర్మయోగి ప్రతిదినమును యోగాభ్యాసకాలమున జనులులేని చోట ఒంటరిగా కూర్చుండి చింతలులేని మనస్సుతో ఆత్మ దర్శన నిష్ఠ కలవాడు కావలెను. ఆ నిష్ఠచే వానికి ఇతరవస్తువు లయందపేక్షగాని, మమతగాని యుండదు.

అవ. యోగాభ్యాసమునకు కావలసిన బాహ్యోపకరణములను, మనస్సు యొక్క ఏకాగ్రతను చెప్పుచున్నాడు.

11. శ్లో. శుచౌ దేశే ప్రతిష్ఠాప్య। స్థిర మాసన మాత్మనః
నా త్యుచ్ఛ్రితం నాతి నీచం। చేలాజిన కుశోత్తరమ్॥

అర్థము:— శుచౌ = పరిశుద్ధమైన, దేశే = ప్రదేశమందు, స్థిరం = దృఢమైనట్టియు, న, అతి ఉచ్ఛ్రితం = మిక్కిలి ఎత్తులేనిదియు, న, అతినీచం = మిక్కిలి క్రిందకు కానట్టియు, చేలాజినకుశోత్తరం = బట్ట, చర్మము, దర్భలు ఒక దానిపై నొకటి కలదియు నగు, ఆసనం = పీఠమును, ఆత్మనః = తనకు, ప్రతిష్ఠాప్య = స్థిరముగా వేసుకొని.

తా॥ పవిత్రమైన స్థలమున కఱ్ఱతో చేయబడిన సమపరిమాణముగల పీటపై ముందు బట్ట ఆపైన కృష్ణాజినము దానిపైన దర్భలు పరచుకొని స్థిరముగా చేసుకొని— (దీనికి ముందుశ్లోకముతో సంబంధము).

12. శ్లో. తత్రైకాగ్రం మనః కృత్వా । యత చిత్తేన్ద్రియక్రియః
ఉపవిశ్యాఽసనే యుఞ్జ్యా । ద్యోగ మాత్మ విశుద్ధయే॥

అర్థము:— తత్ర = ఆ, ఆసనే = పీఠమునందు, ఉపవిశ్య = కూర్చుండి, మనః = మనస్సును, ఏకాగ్రం = నిశ్చలముగా, కృత్వా = చేసి, యతచిత్త ఇన్ద్రియ క్రియః = మనోవ్యాపారములను, ఇంద్రియ వ్యాపారములను స్వాధీనపరచుకొని, ఆత్మవిశుద్ధయే = ఆత్మకుగల బంధనివృత్తి కొఱకు యోగం = ఆత్మదర్శనమును, యుఞ్జ్యాత్ = చేయవలెను.

తా॥ ఆపీటపై కూర్చుండి ఆత్మదర్శనమునందే మనస్సునునిలిపి మనస్సును ఇంద్రియములను స్వేచ్ఛగా సంచరింపనీయక సంసార బంధము పోవుటకొరకు ఆత్మదర్శనము చేయవలెను.

అవ. శరీరమును గూర్చియు, మనస్సును గూర్చియు పాటింపవలసిన నియమములను చెప్పుచున్నారు.

13. శ్లో. సమం కాయ శిరోగ్రీవం । ధారయ న్నచలం స్థిరమ్
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం । దిశ శ్చా నవలోకయన్॥

అర్థము:— కాయ శిరోగ్రీవం — దేహమును, తలను, మెడను, సమం = తిన్నగాను, అచలం = కదలకుండునట్లును, స్థిరం = స్థిరముగాను, ధారయన్ = నిలుపుచు, దిశః = దిక్కులను, అనవలోకయన్ = చూడకుండగ, స్వం = తనదియగు, నాసికాగ్రం = కనుబొమల మధ్యభాగమును. సంప్రేక్ష్య = చూచి.

తా॥ శరీరము, తల, మెడ వంకరలేకుండగ తిన్నగానుంచి యిటునటు కదల్పక ఆనుకొని స్థిరముగానుంచి దిక్కులనుచూడకుండగ తన కనుబొమల మధ్యయందు దృష్టినినిలిపి (దీనికిముందుశ్లోకముతో సంబంధము కలదు).

14. శ్లో, ప్రశాన్తాత్మా విగతభీ । ర్బ్రహ్మచారివ్రతే స్థితః
మన స్సంయమ్య మచ్చిత్తో । యుక్త ఆసీత మత్పరః॥

అర్థము:— ప్రశాన్తాత్మా = శాంతించిన మనస్సు కలవాడును, విగతభీః = భయములేని వాడును, బ్రహ్మచారివ్రతే = బ్రహ్మచర్య వ్రతమునందు, స్థితః = ఉన్న వాడును అగుచు, మనః = మనస్సును, సంయమ్య = అణచి, మచ్చిత్తః = నాయందు మనస్సు కలవాడును, యుక్తః = సావధానుడును, మత్పరః = నన్నే చింతించువాడును అయి, ఆసీత = కూర్చుంచవలెను.

తా॥ శాంతించిన మనస్సుకలవాడై, భయములేనివాడై, బ్రహ్మచర్యము కలవాడై, మనస్సును నిగ్రహించి నాయందు చిత్తమును చేర్చి సావధానముగ నన్నే చింతించుచు కూర్చుండవలెను.

15. శ్లో. యుఞ్జన్నేవం సదాఽఽత్మానం । యోగీ నియత మానసః
శాన్తిం నిర్వాణ పరమాం । మత్సంస్థా మధిగచ్ఛతి॥

అర్థము:— యోగీ = యోగాభ్యాసపరుడు, ఏవం = ఇట్లు, సదా = ఎల్లప్పుడును, ఆత్మానం = మనస్సును, (మయి = నాయందు), యుఞ్జన్ = చేర్చుచు, నియతమానసః = నిశ్చలమైన మనస్సు కలవాడై, నిర్వాణపరమాం = మోక్షముయొక్క ఉత్కృష్టావస్థయును, మత్సంస్థాం = నాయందుండు నట్టిదియునగు, శాన్తిం = శాంతిని, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

తా॥ యోగాభ్యాసపరుడు మనస్సునకు సుఖమైన ఆలంబనముగ నాయందు మనస్సును నిశ్చలముగ నిలిపి నన్నే ధ్యానించుచుండుటవలన ఆకలి దప్పి మొదలగు ఊర్ములు ఆరును లేనివాడై మిక్కిలి ఉత్తమమైన మోక్షావస్థను నాయందున్నట్టి చిత్త శాంతిని పొందుచున్నాడు.

16. శ్లో. నాత్యశ్నత స్తు యోగో ఽస్తి । నచైకాన్త మనశ్నతః
స చాతి స్వప్న శీలస్య । జాగ్రతో నైవ చార్జున॥

అర్థము:— హే అర్జున = ఓ అర్జునుడా! అత్యశ్నతః = హెచ్చుగా తినువానికి, యోగః = యోగము, నాస్తి = లేదు, ఏకాంతం = బొత్తిగా, అనశ్నతఃచ = తిననివానికిన్ని, న = లేదు, అతిస్వప్నశీలస్య = మిక్కిలి నిద్రించు స్వభావము కలవానికిని, న = లేదు, జాగ్రతఃచ = మిక్కిలి మేలుకొని యుండువానికిని, న = లేదు.

తా॥ అపరిమితముగా తినువానికిని, అసలే తినని వానికిని, మిక్కిలి నిద్రించు వానికిని, ఎప్పుడును మేల్కొనియుండు వానికిని యీ యోగము సిద్ధించజాలదు.

17. శ్లో. యుక్తాహార విహారస్య । యుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య ।యోగో భవతి దుఃఖహా॥

అర్థము:— యుక్తాహారవిహారస్య = మితమగు తిండి సంచారముగలవానికిని, కర్మసు = కర్మలయందు, యుక్తచేష్టస్య = మితమైన వ్యాపారము కలవానికిని, యుక్తస్వప్నావబోధస్య = మితమైన నిద్ర మేలకువకలవానికిని, దుఃఖహా = సంసారబంధమును పోగొట్టునట్టి, యోగః = యోగము, భవతి = కలుగుచున్నది.

తా॥ మితాహారవిహారములును, కర్మలయందలి మితప్రవృత్తియు, మితనిద్ర మెలుకువలుకలవానికి సకలబంధవిమోచకమగు యోగము సిద్ధించును.

18. శ్లో. యదా వినియతం చిత్తం । ఆత్మన్యే వావతిష్ఠతే
నిస్పృహస్సర్వకామేభ్యో । యుక్త ఇత్యుచ్యతే తదా॥

అర్థము:— యదా = ఎప్పుడు, చిత్తం = మనస్సు, ఆత్మన్యేవ = ఆత్మయందే, విని యతం = నియమింపబడినదై, అవతిష్ఠతే = నిలుచుచున్నదో, తదా = అప్పుడు, సర్వకామేభ్యః = అన్ని కోరికల నుండియు, నిస్పృహః = ఆశలేనివాడై, యుక్తఇతి = యోగమునకు తగినవాడని, ఉచ్యతే = చెప్ప బడుచున్నాడు.

తా॥ ఆత్మను నిరతిశయ ప్రయోజనమని తలంచుటచే చిత్తమా యాత్మయందు మిక్కిలినియమింపబడి నిశ్చలమై ఉండినపుడు సమస్త కోరికలయందును నిస్పృహుడై యోగార్హుడగును.

19. శ్లో. యథాదీపో నివాతస్థో । నేఙ్గతే సోపమా స్మృతా
యోగినో యతచిత్తస్య । యుఞ్జతోయోగమాత్మనః॥

అర్థము:— నివాతస్థః = గాలిలేనిచోటనున్న, దీపః = దీపము, యథా = ఏప్రకారముగా, నఇఙ్గతే = చలింపదో, యతచిత్తస్య = నియమించబడిన మనస్సు కలిగి నట్టియు, యోగం = ఆత్మసాక్షాత్కారమును, యుఞ్జతః = చేయుచున్నట్టి, యోగినః = యోగియొక్క, ఆత్మనః = ఆత్మస్వరూపమునకు, సా = ఆ దీపముయొక్క నిశ్చలత్వము, ఉపమా = పోలికగా, స్మృతా = తలంప బడినది.

తా॥ గాలిలేనిచోటనుండు దీపముకదలక కాంతితో కూడి యుండు నట్లు ఆత్మసాక్షాత్కారము జేయుచున్న యోగికిని, మనస్సున కితరవ్యాపారములు లేకుండుటచే ఆత్మయు నిశ్చలమగు జ్ఞాన ప్రభతో వెలుంగుచుండును.

అవ. యోగమునందు అందరకును ఆదరము కలుగుటకొఱకు ఇదియే నిరతిశయ పురుషార్థమని విస్తరించి చెప్పుచున్నాడు.

20. శ్లో ॥ యత్రోపరమతే చిత్తం । నిరుద్ధం యోగసేవయా ।
యత్రచైవాఽఽత్మనాఽఽత్మానం । పశ్యన్నాత్మని తుష్యతి॥

అర్థము:— యోగసేవయా = యోగానుష్ఠానముచే, నిరుద్ధం = అరికట్టబడిన, చిత్తం = మనస్సు, యత్ర = ఏ యోగమందు, ఉపరమతే = సుఖించుచున్నదో. యత్రచ = ఏయోగమందైతే, ఆత్మనా = మనస్సుచేత, ఆత్మానం = ఆత్మను, పశ్యన్ = చూచుచు, ఆత్మన్యేవ = ఆత్మయందే, తుష్యతి = సంతోషించుచున్నాడో.

తా॥ యోగమును చక్కగ నాచరించుటచే విషయవిరక్తి చెందిన మనస్సు దేనియందు రమించునో. దేనియందు మనస్సుచే ఆత్మనుచూచి ఇతరములగోరక దానియందే సంతోషించుచుండునో (ముందుశ్లోకముతో అన్వయము)

21. శ్లో. సుఖ మాత్యన్తికం యత్తత్ । బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్
వేత్తి యత్ర నచైవాయం । స్థిత శ్చలతి తత్త్వతః॥

అర్థము:- యత్ = ఏది, అతీన్ద్రియం = ఇన్ద్రియములకు గాన్పించనిదియు, బుద్ధిగ్రాహ్యం = బుద్ధిచేతనే గ్రహించతగినదియు, ఆత్యన్తికం = మిక్కిలి అధికమైనదియు నగు, సుఖం = సుఖమో, తత్ = ఆ సుఖమును, యత్ర = ఏ యోగమునందు, వేత్తి = తెలుసుకొనుచున్నాడో, యత్ర = ఏయోగమునందు, స్థితః = ఉన్నవాడై, అయం = ఈ యోగి, తత్త్వతః = ఆత్మస్థితి నుండి, నచలతిఏవ = బొత్తిగా చలించడో.

తా॥ ఏస్థితియందు ఇంద్రియములకు గొన్పించక, ఆత్మవిషయమైన బుద్ధిచేతను మాత్రమే గ్రహింపదగిన నిరతిశయసుఖమును అనుభవించుచు ఆసుఖాతిశయముచే ఆస్థితినివిడువకయుండునో (ముందుశ్లోకముతో అన్వయము)

22. శ్లో. యం లబ్ధ్వా నా పరం లాభం । మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన । గురుణాఽపి విచాల్యతే॥

అర్థము:— యం = ఏయోగమును, లబ్ధ్వా = పొంది, తతః = దానికంటె, అపరం = వేరైన, లాభం = లాభమును, అధికం = గొప్పదానినిగా, నమన్యతే = తలంపడో, యస్మిన్ = ఏయోగమునందు, స్థితః = ఉన్నవాడై, గురుణా = గొప్పనదై, దుఃఖేనాపి = దుఃఖముచేతనై, న విచాల్యతే = చలింప జేయబడడో.

తా॥ ఏయోగమునుపొంది ఇతరలాభముల నంతకంటె హెచ్చుగా పాటించకయుండునో, ఏస్థితియందుండి భరింపరాని దుఃఖముల చేనైనను చలింపచేయబడడో (దీనికిని ముందు శ్లోకముతో సంబంధము)

23. శ్లో. తం విద్యాదుఃఖసంయోగ । వియోగం; యోగసజ్ఞితమ్
స నిశ్చయేన యోక్తవ్యో । యోగోఽనిర్విణ్ణచేతసా॥

అర్థము:— దుఃఖసంయోగవియోగం = దుఃఖసంబంధమునకు విరుద్ధమైన, తం = ఆ స్థితిని, యోగసజ్ఞితం = యోగమనిపేరు కలదానినిగా, విద్యాత్ = తెలుసుకొనవలెను, సః యోగః = ఆ యోగము, నిశ్చయేన = ఇట్టిది యను నిశ్చయముచేత, అనిర్విణ్ణచేతసా = విసుగుజెందక సంతోషము గల మనస్సుకలవానిచే, యోక్తవ్యః = ఆచరించ తగినది.

తా॥ ఈవిధమైన దుఃఖస్పర్శనైనను సహించని యీస్థితికి యోగమని పేరు. ఇది నిరతిశయపురుషార్థమని ప్రారంభముననేనిశ్చయించి ఇంకను ఫలము కలుగలేదేయని విసుగుచెందక సంతుష్టాంతరంగుడై దీనిని అభ్యసించవలెను.

అవ॥ వెనుక చెప్పబడిన మమకారము లేకుండుట మొదలగు యోగసాధనము లనే తిరిగి సుఖముగ నెఱుంగుటకై క్రోడీకరించి చెప్పుచున్నారు.

24. శ్లో. సఙ్కల్పప్రభవా న్కామాన్ । త్యక్త్వా సర్వానశేషతః
మనసైవేన్ద్రియగ్రామం । వినియమ్య సమన్తతః॥

అర్థము:— సఙ్కల్పప్రభవాన్ = సంకల్పమువలన కలుగు, కామాన్ = కోరికలను, సర్వాన్ = అన్నింటిని, అశేషతః = పూర్తిగా, మనసైవ = మనస్సు చేతనే, త్యక్త్వా = విడిచి, ఇన్ద్రియగ్రామం = ఇంద్రియము లన్నింటిని, సమన్తతః = అన్ని విషయములనుండియు, వినియమ్య = నిగ్రహించి.

తా॥ సంకల్పమువలన లభించిన పశుపుత్రమిత్రకళత్రాదు లందరును తనకు సంబంధించనివారుగా భావించి విడిచి ఇంద్రియములను తమతమ విషయములనుండి నిగ్రహించి (దీనికిని ముందు శ్లోకముతో సంబంధము)

25. శ్లో- శనై శ్శనై రుపరమేత్ । బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా । న కిఞ్చిదపి చిన్తయేత్॥

అర్థము:— ధృతిగృహీతయా = వివేకముతోకూడిన, బుద్ధ్యా = బుద్ధిచేత, శనైః శ్శనైః = మెల్లమెల్లగా, ఉపరమేత్ = విరమింపవలెను, మనః = మనస్సును, ఆత్మసంస్థం = ఆత్మయందున్నదానినిగా, కృత్వా = చేసి, కిఞ్చిదపి = దేనిని గాని, నచిన్తయేత్ = తలచకూడదు.

తా॥ వివేకముతో మెల్లమెల్లగా మనస్సును ఆత్మకంటె వేరైనవాటి నుండి మరల్చి ఆత్మయందే నిలిపి యితరమైనవాటిని వేటిని తలంచరాదు.

26. శ్లో. యతో యతో నిశ్చరతి । మన శ్చఞ్చల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత । దాత్మన్యేవ వశం నయేత్॥

అర్థము:— చఞ్చలం = చంచలించునదిగాన, అస్థిరం = నిలకడగానుండని, మనః = మనస్సు, యతః యతః = ఏయేవిషయముల్వైపుగా. నిశ్చరతి = బయలు దేరుచున్నదో. తతస్తతః = ఆయావిషయమునుండి. ఏతత్ = ఈ మనస్సును, నియమ్య = మరల్చి, ఆత్మన్యేవ = ఆత్మయందే. వశంనయేత్ = వశమును పొందించవలెను.

తా॥ మనస్సు సహజముగా చంచలించు స్వభావముగలదగాన ఆత్మయందుస్థిరముగా నిలువక ఏయే విషయములవైపు ప్రవర్తించునో ఆ యా విషయములనుండి దానిని మరలించి ఆత్మయే నిరతిశయప్రియమైనదని భావించి దానియందే నిలుచునట్లు చేయవలెను.

27. శ్లో. ప్రశాన్త మనసం హ్యేనం । యోగినం సుఖముత్తమమ్
ఉపైతి శాన్తరజసం । బ్రహ్మభూత మకల్మషమ్॥

అర్థము:— ప్రశాన్తమనసం = ఆత్మయందే నిశ్చలమైన మనస్సుకలవాడును, అకల్మషం = పాపములేనివాడును, శాన్తరజసం = అణగిపోయిన రజోగుణము కలవాడును, బ్రహ్మభూతం = శుద్ధాత్మస్వరూపముతో నున్నవాడును అగు ఏనం = ఈ, యోగినం = యోగిని, ఉత్తమం = గొప్పదైన, సుఖం = ఆత్మానుభవసుఖము, ఉపైతిహి = పొందుచున్నదిగదా!

తా॥ మనస్సు ఆత్మయందు నిశ్చలముగానున్నచో పాపములన్నియు పోవును. దానిచే రజోగుణమణగిపోవును, దానివలన నీయోగి శుద్ధాత్మస్వరూపముతో నుండును. అప్పుడీ యోగికి ఉత్తమమైన ఆత్మానుభవసుఖము లభించును.

అవ. ఇట్టి యోగాభ్యాసమునకు ఫలమును చెప్పుచున్నాడు.

28. శ్లో. ఏవం యుఞ్జన్ సదాఽఽత్మానం । యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ । మత్యన్తం సుఖ మశ్నుతే॥

అర్థము:— ఏవం = ఈవిధముగా, ఆత్మానం = ఆత్మనుగూర్చి, యుఞ్జన్ = యోగము నభ్యసించుచున్నవాడై, విగతకల్మషః = పోయిన పాపములు కలవాడైన, యోగీ = యోగాభ్యాసి, బ్రహ్మసంస్పర్శం = బ్రహ్మానుభవరూపమైన అత్యన్తం = అపరిమితమగు, సుఖం = సుఖమును, సదా = ఎల్లప్పుడును, సుఖేన = అనాయాసముగా, అశ్నుతే = అనుభవించుచున్నాడు.

తా॥ పైనచెప్పినట్లు యోగి ఆత్మయోగము నభ్యసించుచు ప్రాచీన పాపముల నన్నిటిని పోగొట్టుకొని బ్రహ్మానుభవరూపమగు అపరిమిత సుఖమును అనాయాసముగా ఎల్లప్పుడును అనుభవించుచుండును.

అవ. యోగాభ్యాసవిధిని సవిస్తరముగా చెప్పి ,ఇకముందు నాలుగు శ్లోకములచే, ఆత్మ లన్నియు తమలో తామును, పరమాత్మతోను సమానముగా నుండునని చూచు టయే యీ యోగముయొక్క పరిపాకావస్థ గాన దాని క్రమపరిపాకమును నాలుగు తరగతులుగా విభజించి దానినిబట్టియే యోగులు నాలుగు తెరంగులని చెప్పుచున్నారు.

29\. శ్లో. సర్వభూతస్థ మాత్మానం । సర్వభూతానిచాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా । సర్వత్ర సమదర్శనః॥

అర్థము:— యోగయుక్తాత్మా = యోగముచే పొందబడిన ఆత్మస్వరూపము కలవాడు, సర్వత్ర = అన్ని ఆత్మలయందును, సమదర్శనః = సమదృష్టి తలవాడై, ఆత్మానం = తన ఆత్మను, సర్వభూతస్థం = సమస్త భూతములయందున్న దానినిగాను, సర్వభూతాని = సమస్త భూతములను, స్వాత్మని = తన ఆత్మయందును, ఈక్షతే = చూచుచున్నాడు.

తా॥ పరిశుద్ధమగుఆత్మలన్నియు వాస్తవముగ ఒకేజ్ఞానాకారముతో నుండును. యోగాభ్యాసముచే తనయాత్మను సాక్షాత్కరించిన వాడు (స్థాలీపులాకన్యాయముగా అన్నిఆత్మలును అదే ఆకార ముతో నున్నవని గ్రహించును) గాన తన యాత్మను సర్వ భూతములతో సమానమైన ఆకారము కలదానినిగాను, సర్వ భూతములను తన యాత్మతో సమానమైన ఆకారము కలవా టినిగాను చూచుచున్నాడు.

30\. శ్లో. యో మాం పశ్యతి సర్వత్ర । సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి । సచమే న ప్రణశ్యతి॥

అర్థము:— యః = ఎవడు, సర్వత్ర = అన్ని ఆత్మలయందును, మాం = నన్ను, పశ్యతి = చూచుచున్నాడో, సర్వంచ = అన్ని ఆత్మలను, మయి = నాయందు, పశ్యతిచ = చూచుచున్నాడో, తస్య = వానికి, అహం = నేను న ప్రణశ్యామి = కనబడకపోను, మే = నాకు, సచ = వాడున్ను, న ప్రణశ్యతి = కనబడకపోడు.

తా॥ పరిశుద్ధమైన ఆత్మలు పరస్పరమును, పరమాత్మతోను సమానములుగా నుండును. కావున యోగపరిపాక దశను పొందినవాడు ఆత్మ పరమాత్మలలో దేనినిచూచినను, అన్నిటినిచూచినట్లే గాన వాడు తన ఆత్మస్వరూపమును జూచునపుడు నేను వానివంటివాని నేగాన వానికి నేను కనబడకపోను. నేను నా స్వరూపమును అనుసంధించుకొనునప్పుడు వాడు నావంటివాడే గాన నాకు వాడు కనబడకపోడు.

31. శ్లో. సర్వభూతస్థితం యో మాం । భజత్యేకత్వ మాస్థితః
సర్వథా వర్తమానోఽపి । స యోగీ మయి వర్తతే॥

అర్థము:— యః = ఎవడు, ఏకత్వం = నాతోడుసామ్యమును, ఆస్థితః = పొందినవాడై, సర్వభూతస్థితం = సమస్తభూతములయందున్నట్టి, మాం = నన్ను, భజతే = సేవించుచున్నాడో, సఃయోగీ = ఆ యోగి, సర్వథా = అన్నివిధముల, వర్తమానోఽపి = ఉంటున్నను, మయి = నాయందు, వర్తతే = ఉంటున్నాడు.

తా॥ ఈయోగి యోగదశలో నావలెనే సంకోచములేని జ్ఞానమే ఆకారముగా కలిగియుండును. కావున నాతో సామ్యమును పొందును. కావుననే తనను దర్శించుకొన్నను నన్ను దర్శించుచున్నట్లే. అదియే నన్ను సేవించుట, అట్టివాడు యోగమును విడిచి లౌకికవ్యాపారములు చేయుచు తనను సర్వభూతములను చూచుచున్నను వాటియందు నా సామ్యమునే చూచుచున్నాడు.

32. శ్లో. ఆత్మౌపమ్యేన సర్వత్ర । సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యదివా దుఃఖం । స యోగీ పరమో మతః

అర్థము:– అర్జున = అర్జునా!, యః = ఎవడు, సర్వత్ర = అంతటను, ఆత్మౌపమ్యేన = తనసామ్యముచే, సర్వత్ర = అంతటనుగల, సుఖంవా = సుఖమును గాని, యదివాదుఃఖం = దుఃఖమునుగాని, సమం = సమానముగా, పశ్యతి చూచుచున్నాడో, సఃయోగీ = ఆ యోగి, పరమః = మిక్కిలి గొప్ప వాడుగా, మతః = తలంపబడును.

తా॥ ఈయోగికి తనయొక్కయు, ఇతరులయొక్కయు ఆత్మలన్నియు జ్ఞానాకారముతో సమానములగును గాన ఇతరుల పుత్రజన్మా దులు తనకు సంబంధించనట్లే, తన పుత్రజన్మాదులును తనకు సంబంధించవని చూచును. ఇతడే ఉత్కృష్టయోగ పరిపాక దశను పొందినవాడు.

అవ. యోగసాధనములలో ప్రధానమగు మనోనిగ్రహము దుశ్శకమగుటచే దాని కుపాయమును జెప్పుమని అర్జును డడుగుచున్నాడు.

అర్జున ఉవాచ — అర్జునుడు పలికెను.

33. శ్లో. యోఽయంయోగస్త్వయాప్రోక్తః । సామ్యేన మధుసూదన
ఏతస్యాహం న పశ్యామి । చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్॥

అర్థము:– మధుసూదన = శ్రీకృష్ణా!, సామ్యేన = సామ్యముచేత, యం, అయం, యోగః = ఏయీయోగము, త్వయా = నీచేత, ప్రోక్తః = చెప్పబడినదో, ఏతస్య = ఈ యోగముయొక్క, స్థిరాం, స్థితిం = నిలకడగా నుండుటను, చఞ్చలత్వాత్ = మనస్సుయొక్క చాంచల్యమువలన, నపశ్యామి = చూడ జాలకున్నాను.

తా॥ ఆత్మలన్నియు జ్ఞానాకారములగుటచే పరస్పరమును, ఈశ్వరుని తోను సమానములుగ దర్శించవలెనని యీ యోగమును నీవు చెప్పితివి. మనస్సు మిక్కిలి చంచలమైనదగుటవలన ఆ యోగము స్థిరముగా నిలుచు ట్లు గాన్పించదు.

34. శ్లో. చఞ్చలంహి మనః కృష్ణ! । ప్రమాథి బలవ ద్దృఢమ్
తస్యాహం నిగ్రహం మన్యే । వాయోరివ సుదుష్కరమ్॥

అర్థము:— కృష్ణ = శ్రీకృష్ణా!, మనః = మనస్సు, చఞ్చలం = చలించు స్వభావము కలదియు, బలవత్ = బలవంతమైనదియు, ప్రమాథి = క్షోభ పెట్టునదియు, దృఢంహి = దృఢమైనదియుగదా!, తస్య = అట్టి మనస్సు యొక్క, నిగ్రహం = అరికట్టుటను, వాయోః (నిగ్రహం) ఇవ = గాలిని నిగ్రహించుటవలె, సుదుష్కరం = మిక్కిలి అసాధ్యమని, మన్యే = తలంచుచున్నాను.

తా॥ కృష్ణా! అలవాటుపడిన వాటియందైనను నిలుకడలేక చలించునదై ఒకచోట నిలుపుటకుశక్యముకానంత బలిష్ఠమై బలాత్కారముగా న్యాకులపరచుచు ఇతరత్ర దృఢముగా చరించు నీ మనస్సును ఎదురుగాలిని విసనకఱ్ఱతో నడ్డుటవలె దుష్కరమని తలంచుచున్నాను.

అవ. అర్జునుని ప్రశ్నకు శ్రీకృష్ణ పరమాత్మ సమాధాన మొసంగుచున్నాడు.
శ్రీ భగవానువాచ — శ్రీకృష్ణుడు పలికెను.

35. శ్లో. అసంశయం మహాబాహో! । మనో దుర్నిగ్రహంచలమ్
అభ్యాసేన తు కౌన్తేయ! । వైరాగ్యేన చ గృహ్యతే॥

అర్థము:— మహాబాహో = గొప్ప భుజములు గల, కౌన్తేయ = అర్జునుడా!, మనః = మనస్సు, చలం = చలించు స్వభావము కలదియు, దుర్నిగ్రహం = నిగ్రహింప శక్యము కానిదియును, అసంశయం = సందేహములేదు, అభ్యాసేన = అలవాటుచేతను, వైరాగ్యేనచ = విరక్తిచేతను, గృహ్యతే = వశము గావింపబడుచున్నది.

తా॥ అర్జునా! మనస్సు చలించు స్వభావముకలది గాన నిగ్రహింప శక్యముకానిదే. సంశయములేదు. కాని, ఆత్మ సుఖాకారమైనదని అలవరచుకొనుటచే కలుగు ఆభిముఖ్యముచేతను, తదితరములు దుఃఖాకారములని తెలియుటచే కలుగు విరక్తిచేతను మనస్సు వశమగును.

36. శ్లో. అసంయతాత్మనాయోగో ၊ దుష్ప్రాపఇతి మేమతిః
వశ్యాత్మనాతు యతతా ၊ శక్యోఽవాప్తుముపాయతః॥

అర్థము:— అసంయతాత్మనా = జయింపబడని మనస్సు గలవానిచే, యోగః = సమదర్శనయోగము, దుష్ప్రాపః = పొంద శక్యముకానిది, ఇతి = అని, మే = నాయొక్క, మతి = నిశ్చయము, ఉపాయతస్తు = కర్మయోగ మనెడు ఉపాయముచేనైతే, వశ్యాత్మనా = జయింపబడిన మనస్సు కలవాడై, యతతా = ప్రయత్నించువానిచేత, అవాప్తుం = పొందుటకు, శక్యం = సాధ్యమైనది.

తా॥ మనస్సును జయించలేనిచో నీ యోగము పొందుట శక్యము కానిదని నాయభిప్రాయము. నీ కుపదేశించిన కర్మయోగముచే మనస్సును జయించి యోగము నభ్యసించినవానికి మాత్ర మీ సమదర్శన యోగము సాధ్యమగును.

అవ. యోగముయొక్క మహాత్మ్యమును ఎరుంగగోరి అర్జును డడుగుచున్నాడు.

అర్జున ఉవాచ — అర్జునుడు పలికెను.

37. శ్లో. అయతిశ్శ్రద్ధయోపేతో ၊ యోగా చ్చలిత మానసః
అప్రాప్య యోగసంసిద్ధిం ၊ కాంగతిం కృష్ణ! గచ్ఛతి॥

అర్థము:— కృష్ణ = శ్రీకృష్ణా!, శ్రద్ధయా = శ్రద్ధతో, ఉపేతః = కూడుకొన్నవాడై, అయతిః = యత్నములేనివాడు, యోగసంసిద్ధిం = యోగసిద్ధిని, అప్రాప్య = పొందక, యోగాత్ = యోగమునుండి, చలితమానసః = చలించిన మనస్సుకలవాడు, కాం = ఏ, గతిం = గతిని, గచ్ఛతి = పొందుచున్నాడు?

తా॥ కృష్ణా! శ్రద్ధలో యోగమునందు ప్రవర్తించియు, దానిని బల పరచు ప్రయత్నము చేయకపోవుటచే యోగసిద్ధిని బడయ జాలక దానినుండి చిత్తము చలించినవాడు కామభోగమోక్ష నరకములలో నే గతిని పొందును?

38. శ్లో. కచ్చిన్నోభయ విభ్రష్ట । శ్ఛిన్నాభ్రమివ నశ్యతి
అప్రతిష్ఠో మహాబాహో । విమూఢో బ్రహ్మణః పథి॥

అర్థము:— మహాబాహో = కృష్ణా!, అప్రతిష్ఠః = ప్రతిష్ఠ లేనివాడును, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, పథి = మార్గమునందు, విమూఢః = మిక్కిలి మోహము నొందినవాడును, ఉభయవిభ్రష్టః = రెండింటికిని చెడినవాడైన, ఛిన్నాభ్రం ఇవ = తెగినమేఘమువలె, న నశ్యతికచ్చిత్ = నశింపడుగదా.

తా॥ ఫలమునుగోరి యథావిధిగా అనుష్ఠింపబడినకర్మ ఫల మొసంగును గాని నీవు చెప్పినట్లాచరించినచో సాంసారిక ఫలప్రదము కాదుగదా! కాబట్టి సాంసారిక ఫలభ్రష్టుడగును. ఆత్మప్రాప్తి నొసంగునందుమా విమోహమువలన యోగమునుండి భ్రష్టుడగుటచే నదియును సిద్ధింపదు. ఒక పెద్దమేఘమునువిడిచి మరియొక మేఘములో చేరజాలక మధ్యనే గాలిచేనశించిన మేఘఖండమువలె వీడును నశించునా?

39. శ్లో. ఏతం మే సంశయం కృష్ణ! । చ్ఛేత్తు మర్హస్యశేషతః
త్వదన్య స్సంశయస్యా స్య । చ్ఛేత్తా నహ్యుపపద్యతే॥

అర్థము:— కృష్ణ = శ్రీకృష్ణా!, మే = నాయొక్క, ఏతం = ఈ, సంశయం = సందేహమును, అశేషతః = పూర్తిగా, ఛేత్తుం = పోగొట్టుటకు, అర్హసి = తగుచున్నావు, అస్య = ఈ, సంశయస్య = సందేహమునకు, ఛేత్తా = పోగొట్టువాడు, త్వదన్యః = నీకంటె నితరుడు, న ఉపపద్యతే = తగడుగదా.

తా॥ కృష్ణా! ఈ సందేహమును పూర్తిగా పోగొట్టుటకు నీవు తప్ప మరియొక డెవ్వడును అర్హుడుకాడు గావున నా సందేహమును తొలగింపుము.

అవ. అర్జునుని ప్రశ్నకు శ్రీకృష్ణ పరమాత్మ విస్తరించి సమాధాన మొసంగుచున్నాడు.

శ్రీ భగవాన్ ఉవాచ — శ్రీకృష్ణుడు పలికెను.

40. శ్లో. పార్థ నైవేహ నాఽముత్ర । వినాశ స్తస్య విద్యతే
నహి కల్యాణకృత్కశ్చి । ద్దుర్గతిం తాత గచ్ఛతి॥

అర్థము:— పార్థ = అర్జునా!, తస్య = వానికి, ఇహ = స్వర్గాదిభోగమందు, వినాశః = నాశము, నవిద్యతే ఏవ = ఉండనే యుండదు, అముత్రచ = బ్రహ్మాను భవమందును, న = కలుగనేరదు, తాత = నాయనా!, కల్యాణకృత్ = శుభమైన యోగము చేయువాడు, కశ్చిత్ = ఎవ్వడును, దుర్గతిం = చెడ్డ గతిని, నగచ్ఛతిహి = పొందడుగదా!.

తా॥ అర్జునా! అట్టివానికి స్వర్గాది భోగానుభవముగాని, ఆత్మాను భవముగాని లభింపకపోవుట యుండదు. ప్రత్యవాయము కలుగదు. ఇట్టి శుభమైన యోగమునారంభించినవాడు ఎన్నడును ఏవిధముగను చెడడు.

41. శ్లో. ప్రాప్యపుణ్యకృతాం లోకా । నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే । యోగభ్రష్టోఽభిజాయతే॥

అర్థము:— యోగభ్రష్టః = యోగభ్రష్టుడు, పుణ్యకృతాం = పుణ్యమును చేసినవారి యొక్క, లోకాన్ = లోకములను, ప్రాప్య = పొంది, శాశ్వతీః = అనేకములైన, సమాః = సంవత్సరములు, ఉషిత్వా = ఉండి. శుచీనాం = పరిశుద్ధులగు, శ్రీమతాం = శ్రీమంతులయొక్క, గేహే = గృహమందు, అభిజాయతే = పుట్టుచున్నాడు.

తా॥ యోగమును ప్రారంభించి భ్రష్టుడైనవాడు పుణ్యాత్ములు పొందెడు లోకమును పొంది యోగమునకు విరుద్ధముగా తా నభిలషించిన భోగములను యోగమహిమచే పెక్కు వత్సరములు అధికముగా ననుభవించి తిరిగి తనకు యోగారంభమున కనుకూలించు శుచిగల శ్రీమంతుల యిండ్లలో పుట్టును.

12. శ్లో. అథవా యోగినా మేవ । కులే భవతి ధీమతామ్
ఏతద్ధి దుర్లభతరం । లోకే జన్మ యదీదృశమ్॥

అర్థము:— అథవా = లేక, ధీమతాం = జ్ఞానులగు, యోగినాం = యోగులయొక్క కులేఏవ = గృహమునందే, భవతి = పుట్టుచున్నాడు, లోకే = లోకమునందు, ఈదృశం = ఇటువంటి, జన్మ = పుట్టుక, యత్ = ఏదికలదో (అది) దుర్లభతరంహి = మిక్కిలి దుర్లభమైనదికదా!.

తా॥ లేదా తా నాచరించిన యోగమహిమచే స్వయముగ యోగము నాచరించునట్టియు, పరులకు యోగము నుపదేశింప జాలినట్టియు బుద్ధిమంతుల యింట బుట్టుచున్నాడు. ఇట్టి జన్మ ఇతర సామాన్య ప్రజలకు మిక్కిలి దుర్లభము.

43. శ్లో. తత్ర తం బుద్ధిసంయోగం । లభతే పౌర్వదైహికమ్
యతతే చ తతోభూయ । స్సంసిద్ధౌ కురునన్దన! ॥

అర్థము:— కురునన్దన = అర్జునా!, తత్ర = ఆ జన్మమునందు. పౌర్వదైహికం = పూర్వదేహమునందు కలిగిన, తం = ఆ, బుద్ధిసంయోగం = యోగబుద్ధితోడి కూడికను, లభతే = పొందుచున్నాడు, తతః = ఆ బుద్ధిసంయోగము వలన, సంసిద్ధౌ = మంచిసిద్ధి నిమిత్తము, భూయః = తిరిగి. యతతే = ప్రయత్నించుచున్నాడు.

తా॥ అర్జునా! ఈ యోగభ్రష్టుడు అ జన్మమునందు తిరిగి యోగమును గూర్చిన బుద్ధితో కూడుకొని మరల నిర్విఘ్నముగా యోగము సిద్ధించవలెనని ప్రయత్నించును.

44. శ్లో. పూర్వాభ్యాసేన తేనైవ । హ్రియతే హ్యవశోఽపిసః
జిజ్ఞాసురపి యోగస్య । శబ్దబ్రహ్మాదివర్తతే॥

అర్థము :— సః = ఆయోగభ్రష్టుడు, అవశోఽపి = స్వాధీనములేనివాడైనను, తేన = ఆయోగమునకు సంబంధించిన, పూర్వాభ్యాసేన ఏవ = పూర్వజన్మాభ్యాసము చేతనే, హ్రియతేహి = ఆకర్షింపబడుచున్నాడుగదా!, యోగస్య = యోగము యొక్క, జిజ్ఞాసురపి = తెలియగోరువాడును, శబ్దబ్రహ్మ = దేవమనుష్యాది శబ్దములచే చెప్పబడు ప్రకృతిని, అతివర్తతే = అతిక్రమించుచున్నాడు.

తా॥ ఈ యోగభ్రష్టుడు క్రిందటి జన్మలో యోగము నభ్యసించు చుండెను గాన ఆ యలవాటుచేతనే తాను తలంచకపోయినను మరల ఆ యోగమువైపే ఆకర్షింపబడుచున్నాడు. యోగము నాచరింపక పోయినను దానిని తెలియగోరువాడుకూడ క్రమముగ ప్రకృతిబంధమునుండి ముక్తుడగును.

45. శ్లో. ప్రయత్నా ద్యతమానస్తు । యోగీ సంశుద్ధకిల్బిషః
అనేకజన్మ సంసిద్ధ । స్తతోయాతి పరాంగతిం॥

అర్థము:— తతః = అందువలన, సంశుద్ధకిల్బిషః = పూర్తిగా పాపములు పోయినవాడు, అనేక జన్మసంసిద్ధః = పెక్కు జన్మలకు యోగమునకు తగినవాడై, ప్రయత్నాత్ = హెచ్చు పట్టుదలవలన, యతమానః = యోగమున ప్రయత్నించు, యోగీతు = యోగియన్నవో, పరాంగతిం = గొప్పదైన యోగమును, యాతి = పొందుచున్నాడు.

తా॥ యోగముయొక్కమాహాత్మ్యమింతగొప్పది. కావుననే యోగ జిజ్ఞాసువుకూడ అనేక జన్మలకు పాపములను నశింపజేసుకొని యోగమునకు తగ్గవాడై మిక్కిలి పట్టుదలతో దానిననుష్ఠించి దానినుండి చలించినను మరల నా యోగమును దానిఫలముగు ఆత్మప్రాప్తిని తప్పక పొందును.

అవ. ఇట్లు యోగమును యోగిని పొగడి అర్జునుని యోగివికమ్మని ప్రోత్సహించి జీవాత్మయోగమును ముగించుచున్నాడు.

46. శ్లో. తపస్విభ్యోఽధికో యోగీ । జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ । తస్మాద్యోగీ భవార్జున॥

అర్థము:– అర్జున = అర్జునా!, యోగి = యోగాభ్యాసముచేయువాడు, తపస్విభ్యః = తపస్సులులకంటెను, అధికః = గొప్పవాడు, జ్ఞానిభ్యఃఅపి = జ్ఞానులకంటెను, అధికః = గొప్పవాడుగా, మతః = తలంపబడినవాడు, యోగీ = యోగాభ్యాసి, కర్మిభ్యశ్చ = కేవల కామ్యకర్మలు చేయువారికంటెను, అధికః = గొప్పవాడు, (భవతి = అగుచున్నాడు) తస్మాత్ = అందువలన, (త్వం = నీవు) యోగీ = యోగాభ్యాసపరుడవు, భవ = అగుము.

తా॥ చాంద్రాయణాది తపస్సులచేతను, ఆత్మజ్ఞానముకంటె ఇతర జ్ఞానములచేతను, కేవల కామ్యకర్మలచేతను సాధింపబడుదాని కంటె అధికమగు పురుషార్థమును ఈ యోగము సాధించును. గాన తపస్వులు, జ్ఞానులు, కర్మఠులకంటె నీయోగాభ్యాసిఅధికుడు. కావున అర్జునా! యోగివగుము.

అవ. శ్రీకృష్ణపరమాత్మ ఇకముందు ఉపదేశించదలచిన ప్రధాన మోక్షసాధనమగు భక్తియోగమును ప్రసంగించుచున్నాడు.

47. శ్లో. యోగినా మపి సర్వేషాం । మద్గతే నాన్తరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం । స మే యుక్తతమో మతః॥

అర్థము:– మద్గతేన = నన్ను పొందియున్న, అన్తరాత్మనా, = మనస్సుతో, శ్రద్ధావాన్ = శ్రద్ధకలవాడై, యః = ఎవడు, మాం = నన్ను, భజతే = సేవించుచున్నాడో, సః = వాడు, మే = నాకు, యోగినాం = యోగులకంటెను, సర్వేషామపి = తపస్వి మొదలగు అందరికంటెను, యుక్తతమః = మిక్కిలి శ్రేష్ఠుడని, మతః = తలపబడినవాడు.

తా॥ యోగపరిపాకావస్థనుబట్టి నాలుగు విధములుగా చెప్పబడిన యోగులకంటెను, తపస్వి మొదలగు మూడువిధములగు వారికంటెను నాయందుమనస్సునిలిపి నన్నుపొందవలెనని త్వరపడుచు నన్నుఉపాసించునట్టిభక్తుడు శ్రేష్ఠుడని నాయభిప్రాయము.

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే ఆత్మసంయమయోగో నామ షష్ఠోఽధ్యాయః

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున
సంవాదరూపమును అయిన శ్రీ భగవద్గీత యందలి ఆత్మసంయమయోగమునెడు
ఆ ర వ అ ధ్యా య ము.

| | | | |
|---|---|---|---|
| అర్జునుని శ్లోకములు | 5 | ఈ అధ్యాయమందలి శ్లోకసంఖ్య | 47 |
| భగవంతుని శ్లోకములు | 42 | ఇప్పటివరకైన మొత్తము శ్లోకముల సంఖ్య | 280 |

## సప్తమాధ్యాయార్థ సంగ్రహము.

శ్లో॥ స్వయాథాత్మ్యం ప్రకృత్యాఽస్య । తిరోధిశ్శరణాగతిః
భక్తభేదః ప్రబుద్ధస్య । శ్రైష్ఠ్యం సప్తమ ఉచ్యతే॥

ప్రతిపదార్థము:— స్వయాథాత్మ్యం = పరమపురుషుని వాస్తవస్వరూప నిర్ణయమున్ను, ప్రకృత్యా = ప్రకృతిచే, అస్య = ఈ భగవంతుని స్వరూపముయొక్క, తిరోధిః = మరుగుపరచబడుటయు, శరణాగతిః = దానిని తొలగించుటకు సాధనమగు శరణాగతియు, భక్తభేదః = భక్తులలో తారతమ్యమున్ను, ప్రబుద్ధస్య = జ్ఞానియొక్క, శ్రైష్ఠ్యం = ఉత్తమత్వమున్ను, సప్తమే = ఏడవ అధ్యాయమునందు, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ ఈ ఏడవ అధ్యాయమున ఉపాసింపబడు భగవంతుని యదార్థ స్వరూపము, అది ప్రకృతిచే మరుగుపరచబడియుండుట, దానిని తొలగించు సాధనమగు శరణాగతి, భగవద్భక్తులలోగల తారతమ్యము, అందు జ్ఞానియొక్క గొప్పతనమున్ను చెప్పబడుచున్నవి.

# శ్రీ భగవద్గీత - సప్తమాధ్యాయము

# విషయసూచిక.

శ్లో: సంఖ్య.

1 పరబ్రహ్మయగు వాసుదేవుడే ఉపాసింపదగినవాడనుట.

2. అతడు సమస్త చేతనములకును అచేతనములకును శేషి యగుచున్నాడనుట. 4, 5

ఏవస్తువు ఎవనికి అన్నివిధముల తనకొరకై నియమింపబడదగి యుండునో, తనచే ధరింపబడదగియుండునో, తనకు మాత్రమే ఉపకారావహమై యుండునో అది వానికి శేష మనియు, అట్టివాడు శేషియనియు చెప్పబడును. అందులకే శరీరమును (శేషము) అందుండు జీవుడును (శేషి) నిదర్శనము.

సమస్త చేతనములును, అచేతనములును త్రైవిధముగ పరమాత్మచే తనకొఱకే నియమింపబడదగియు, తనకే అతిశయావహములయ్యు గాన్పించుచున్నవి. గాన భగవంతుడు సర్వశేషి యనియు సమస్త చేతనాచేతనములు అతనికి శేషమనియు చెప్పబడును.

3. నారాయణుడే సకల జగత్తునకు కారణము. 6

4 నారాయణుడే సకల జగత్తున కాధారము. 7

5. నారాయణుడే సమస్త శబ్దములచేతను చెప్పబడుచున్నాడు. 8—11

6. నారాయణుడే సకల చేతనా చేతనములను నియమించువాడు. 12

(నియమించుట యనగా ప్రవర్తింపజేయుట)

7. నారాయణుడు సకల కళ్యాణ గుణాకరుడగుటచే నాతని మించినవాడు లేడు. 13

శ్లోక సంఖ్య.

8. ఇట్టివాని యెఱుంగజాలక పోవుటకు కారణము, అనాదికాలము నుండియు విడువక వచ్చుచున్న పాపరాసులచే తటస్థించు సత్వరజస్తమో గుణమయములైన దేహములుగాను ఇంద్రియములుగాను భోగ్య వస్తువులుగాను గాన్పించు పదార్థములచే గప్పబడియుండుటయే. 13—15

9. అట్టి యావరణను తొలగించుటకు సాధనము భగవత్ప్రపత్తియే. 14

అట్టి ప్రపత్తి అనేక జన్మలలో నార్జింపబడిన మహత్తర పుణ్యవిశేషములచే లభించును.

(ప్రపత్తి యనగా భగవంతుడే తనను రక్షించునను మహా విశ్వాసముతో తన రక్షణ నొకింతయు తాను చేసుకొనకయుండుట)

10. ఉపాసకులలో గల పరస్పర వైలక్షణ్యము. 16

ఆ వైలక్షణ్యము వారభిలషించు ఫలభేదమునుబట్టి వచ్చుచున్నది.

ఫలభేద మెట్టిదనగా కొందరైశ్వర్యమును, కొందరు ఆత్మయాథాత్మ్యమును, మరికొందరు భగవత్ప్రాప్తిని కోరుదురు. అట్లు కోరుటకు కారణము వారి వారి పుణ్యవిశేషమే.

11. ఇందు భగవత్ప్రాప్తి నభిలషించువాడు ఉత్తముడు. 17, 18

ఏలనన— వాడన భగవంతునకు మిక్కిలి ఇష్టము. అందులకు కారణము— వాడు నిత్యయుక్తుడును, ఏకభక్తియు నగుటయే.

నిత్యయుక్తుడు = నేనే వానికి ఫలమగుటచే నాతో వానికి సంబంధము ఎడతెగనిది. ఇతరులకు నాతో సంబంధము వారికి కావలసిన ఫలము చేజిక్కువరకే.

ఏకభక్తి = నాయందే భక్తి, ఇతరులకు భక్తి తాముకోరు వస్తువులయందును, వాటిని యిచ్చువాడనుగాన కొంత నాయందును.

12. ఇట్టివాడు చిక్కుట మిక్కిలి యరుదు. 19, 27

13. ఐశ్వర్యార్థులకును, శుద్ధాత్మస్వరూపకాములకును, భగవత్కాములకును, తెలియ దగినట్టియు, ఆచరింప దగినట్టియు విశేషములను వివరించుట. 28, 30

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ భగవద్గీతా - సప్తమోఽధ్యాయః

# జ్ఞాన విజ్ఞాన యోగః

అవ. ఉపాసింపబడువాని స్వరూపమును లెస్సగ నెఱింగిననగాని ఉపాసించుట దుర్ఘటముగాన, వెనుకటి యధ్యాయము చివరి శ్లోకమున "భజతే యోమాం" అని "మాం" అని చెప్పబడిన తన వాస్తవ స్వరూపమును శ్రీకృష్ణు డర్జున కెఱింగించుచున్నాడు.

1. శ్లో. మయ్యాసక్తమనాః పార్థ । యోగం యుఞ్జన్ మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం । యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥

అర్థము:- పార్థ = అర్జునా!, మయి = నాయందు, ఆసక్తమనాః = లగ్నమైనమనస్సు కలవాడవున్ను, మదాశ్రయః = నన్నే ఆధారముగా కలవాడవున్ను, యోగం = నన్నుగూర్చిన భక్తియోగమును, యుఞ్జన్ = ఆచరించుటకు ప్రవర్తించినవాడవును (అయి) మాం = నన్ను, అసంశయం = నిశ్చయముగాను, సమగ్రం = సంపూర్ణముగాను, యథా = ఏవిధముగా, జ్ఞాస్యసి = తెలిసికొనగలవో, తత్ = దానిని, శృణు = వినుము.

తా॥ అర్జునా! నీ మనస్సును నాయందు దృఢముగానిలిపి నన్ననుభవించుటయే ధారకముగాగలిగి నన్నుగూర్చిన భక్తియోగమును ఆచరించుటకు ప్రవర్తింపుము. నన్ను నిశ్చయముగను సంపూర్ణముగను తెలియగల జ్ఞానమును నేను నీ కుపదేశించుచున్నాను. శ్రద్ధగా వినుము.

అవ. ఇంకను సావధానముగా వినుటకై ఆ చెప్పబోవు విషయమును ఫలముతోకూడ తిరిగి కొలదిగ వివరించుచున్నాడు.

2. శ్లో. జ్ఞానం తేఽహం సవిజ్ఞానం । ఇదం వక్ష్యామ్యశేషతః
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ । జ్ఞాతవ్య మవశిష్యతే॥

అర్థము:— యత్ = ఏజ్ఞానమును, జ్ఞాత్వా = తెలిసికొనినయెడల, భూయః = తిరిగి, ఇహ = ఈనావిషయమై, జ్ఞాతవ్యం = తెలియవలసినది, అన్యత్ = మరియొకటి, న అవశిష్యతే = మిగిలియుండదో, సవిజ్ఞానం = నా వైలక్షణ్య జ్ఞానముతోకూడిన, ఇదం = ఈ చెప్పబోవు, జ్ఞానం = నా స్వరూప జ్ఞానమును, అశేషతః = పూర్ణముగ, అహం = నేను, తే = నీకు, వక్ష్యామి = చెప్పగలను.

తా॥ నేను నా యసాధారణ ధర్మములచే చేతనాచేతనములకంటె వేరైనవాడననియు, నా స్వరూపమిట్టిదనియు నీకు తెలియ జెప్పెదను. దీనినెఱుంగుదువేని ఇక నీకు నావిషయమై తెలుసుకొనవలసిన దేమియు నుండదు.

అవ. ఈ చెప్పబోవు జ్ఞాన మందరకును లభించునది కాదనుచున్నాడు.

3. శ్లో. మనుష్యాణాం సహస్రేషు । కశ్చి ద్యతతి సిద్ధయే
యతతా మపి సిద్ధానాం । కశ్చి న్మాం వేత్తి తత్త్వతః॥

అర్థము:— మనుష్యాణాం = మనుష్యులయొక్క, సహస్రేషు = వేల మందిలో, కశ్చిత్ = ఒకానొకడు, సిద్ధయే = సిద్ధికొఱకు, యతతి = ప్రయత్నించుచున్నాడు, యతతాం = ప్రయత్నించువారలలో, కశ్చిత్ = ఒకానొకడు, మాం = నన్ను, వేత్తి = తెలుసుకొనుచున్నాడు, సిద్ధానాం అపి = సిద్ధి కలవారలలోను, కశ్చిత్ = ఒకానొకడు, తత్త్వతః = వాస్తవముగ, వేత్తి = తెలుసుకొనుచున్నాడు.

తా॥ వేలకొలది మనుష్యులలో నెవ్వడో యొకడు మాత్రమే ఆత్మజ్ఞానము సిద్ధించువరకు ప్రయత్నించును. అట్లు ప్రయత్నించు వేయిమందిలో నొక్కడే భగవంతుని తెలుసుకొనును. అట్లు తెలుసుకొనిన వారలలో నెవ్వడో యొక్కడు మాత్రమే భగవంతుని వాస్తవముగ నెఱుంగగలడు.

అవ. ఈ శ్లోకము మొదలు 12 వ శ్లోకము వరకు తన వాస్తవ స్వరూపము
నెఱిగించుచు మొదట నీ శ్లోకముచే కార్యరూపముగను, కారణరూపము
గను నున్న ప్రకృతికి తాను శేషియగుటచే దానికంటె తాను
వేరని తెలుపుచున్నాడు.

4. శ్లో. భూమి రాపోఽ నలో వాయుః । ఖం మనో బుద్ధి రేవ చ
అహఙ్కార ఇతీ యం మే । భిన్నా ప్రకృతి రష్టధా॥

అర్థము:— భూమిః = భూమి: ఆపః = నీరు, అనలః = నిప్పు, వాయుః = గాలి
ఖం = ఆకాశము, మనః = మనస్సు, బుద్ధిః = మహత్తత్వము, అహ
ఙ్కారః = అహంకారతత్వము, ఇతి = అని, అష్టధా = ఎనిమిది విధము
లైన, ప్రకృతిః = మూలప్రకృతి, మే ఏవ = నా యధీనమైనదియే.

తా॥ పంచభూతముల రూపముగాను, మనస్సు మొదలగు ఇంద్రియ
ముల రూపముగాను, మహత్తత్వ రూపముగాను, అహంకార
రూపముగాను మొత్తము ఎనిమిది విధములుగ విభజింప
పడియున్న ప్రకృతి నా యధీనమైనదియే.

అవ. జీవాత్మ ప్రకృతికిని తానే శేషియగుటచే తాను దానికంటెను వేరని
తెలుపుచున్నాడు.

5. శ్లో. అపరేయ మిత స్త్వన్యాం । ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతాం మహాబాహో! । యయే దం ధార్యతే జగత్॥

అర్థము:— మహాబాహో = అర్జునా!, ఇయం = ఈ చెప్పబడిన యచేతన ప్రకృతి,
అపరా = తక్కువది, ఇతఃతు = దీనికంటె, అన్యాం = వేరైన, జీవ
భూతాం = జీవస్వరూపమైన, ప్రకృతిం = చేతన ప్రకృతిని, మే = నా
యొక్క, పరాం = ప్రధానమైన దానినిగా, విద్ధి = తెలిసికొనుము,
యయా = ఏచేతన ప్రకృతిచే, ఇదం జగత్ = ఈ యచేతన జగత్తు,
ధార్యతే = ధరింపబడుచున్నదో.

తా॥ వెనుకటి శ్లోకమున చెప్పబడిన ప్రకృతి తక్కువైనది. దీనికం
టెను ప్రధానమైన జీవరూపముగానుండు నా ప్రకృతి మరి
యొకటి కలదు. దానిచే మొదటి యచేతన ప్రకృతియగు జగ
త్తంతయు ధరింపబడుచున్నది.

శ్రీమతే రామానుజాయ నమః

పరమ పౌరాణికులైన శ్రీ పళ్లై లోకాచార్యులువారు సాయించిన

# ప్రమేయశేఖరము (ఆంధ్రానువాద సహితము.)



శ్రీ పరమపదనాథులు



శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి యాజమాన్యమున
తిరుమలలో ఉచిత ఉపనయనములు గావింపబడిన వటువులు

అస్మద్గురుభ్యో నమః



శ్రీమతే రామానుజాయనమః

# ప్రమేయ శేఖరము - ప్రస్తావన

నీరు సముద్రమునుండి ఆవిరిరూపమున పైకిపోయి, తిరిగి వర్షరూపమున భూమిపై పడి, ఎచ్చటపడినను తిరిగి తిరిగి చివరకు సముద్రమునే చేరును. అటులనే ప్రతి జీవాత్మయు పరమాత్ముని నుండి విడువడి అనేక జన్మ పరంపరలను పొంది తిరిగి తిరిగి చివరకు పరమాత్ముని చేరవలసి యున్నది. ఎంత త్వరలో చేరకలిగిన అంత యధిక యానందమును చెందగలడు. ఈ జీవిత పరంపరయొక్క అంతిమ లక్ష్యము; నిత్యము - నిరవధికము - నిరవచ్ఛిన్నము - నిరతిశయము - నిరూపమానము నగు - యానందదాయియైన పరమాత్ముని సాయుజ్యప్రాప్తి మాత్రమే.

అచేతనము లగు పాషాణాది రూపముల నుండి చేతనము లగు మానవరూప పర్యంతము ఈ జీవునికి అజ్ఞానావస్థ (మైనారిటీస్థితి); మానవజన్మమొదలు జ్ఞానావస్థయును (మెజారిటీస్థితి) కలుగుచున్నది. జ్ఞానావస్థకు కారణమును, ప్రారంభమును, యగు మానవజన్మ కలిగినప్పటి నుండియు పరమాత్ముడు బాధ్యతను ఈ మానవునికే విడిచివేయుచున్నాడు. అనగా తన భావి పరిణామము ఎటుల నుండవలసినదియు మానవుని సంకల్ప - వికల్పములపై ఆధారపడియుండు నన్నమాట. పరిణమింపజేయువాడు ఎప్పటికిని పరమాత్ముడే-సామాన్య కారకుడు అయినప్పటికిని, అట్టి పరిణామమునకు విశేష కారణము మాత్రము మానవునియొక్క స్వకీయములైన అనాది కర్మవాసనాసంజనితములైన జ్ఞాన శక్త్యులే కారణము లగుచున్నవి,

ఈ కించిత్జ్ఞాన, కించిత్ స్వాతంత్ర్యములే మానవుని వినాశనమునకు కారణములు, అభివృద్ధినిరోధకములును, స్వరూపవిరుద్ధములును అగుచున్నవి.

ఈ రహస్యమును తెలుసుకున్న మానవుడు స్వస్వరూపజ్ఞానాది అర్థపంచకజ్ఞానమును కలవాడై, తన స్వరూపవిరుద్ధమగు కించిత్ జ్ఞాన - కించిత్ స్వాతంత్ర్యములను పరిత్యజించి, తను సాధనములనుకొను కర్మ, జ్ఞాన భక్తులను తన భావి సుష్ఠుపరిణామమునకు కారణములు కావని తెలుసుకొని, సంపూర్ణ శేషత్వ పారతంత్ర్యజ్ఞానములతో సిద్ధోపాయభూతుడగు పరమాత్మనే ఉపాయోపేయములుగ నధ్యవసించి యున్నచో, తిరిగి ఆ పరమాత్ముడే స్వామిగాన సంపూర్ణ బాధ్యతను వహించి, తన సొత్తగు ఈ జీవుని తన నిత్య సాన్నిధ్యమునకు తానే చేర్చుకొని తన నిత్యానందమును ప్రసాదించును.

అటులజేయక స్వస్వాతంత్ర్యాంధుడైగాని లేక ఇతర శేషత్వదూషితుడైగాని యున్నచో, ఈ జీవుడు అనాదికర్మవాసనచే సంసారచక్రమునబడి భ్రమించుచునే యుండును. ఇట్టి సంపూర్ణ శేషత్వ పారతంత్ర్యములతో కూడుకున్న అధ్యవసాయమునే ప్రపత్తి యందురు. ఇట్టి నిష్ఠను గలవానినే ప్రపన్ను డందురు. ఇట్టి ప్రపన్నుడు తన నిత్య నైమిత్తికకృత్యములలో అనుష్ఠించవలసిన

ఒక విలక్షణ యనుష్ఠాన విశేషమును ఏతదనుష్ఠాన ఫలితమును ఉపనిషత్ప్రతిపాదితము, అతి రహస్యము, అతి గంభీరము అగుదానిని ప్రమేయశేఖరమను పేరుతో పరమకారుణికులైన పిళ్లై లోకాచార్యులువారు స్త్రీలకు, పిల్లలకు, పామరులకుకూడ సులభముగ తెలియువిధమున ద్రావిడభాషలో తెలియజేసి యున్నారు.

ఏదో ఒకలక్ష్యమును నిర్దేశించుకొని వానిని శీఘ్రముగను, సులభముగను కష్టరహితముగను చేరదలచుకున్న బుద్ధిమంతుడు ముందు ఆ లక్ష్యస్వరూప స్వభావములను తత్ప్రాప్తిమార్గమును తెలుసుకొనవలయును. తెలుసుకొనినదానిని మరచిపోకుండగ తదనుసరణకాలమునందు స్ఫురించునటుల దానిని యిప్పటినుండియుకూడ స్మరించుకొనుచుండవలయునుగదా. మననము జేసినదియేగదా సమయమునకు సరిగా స్ఫురించును.

అటులనే ముముక్షు వగు జీవుడు కూడ తన లక్ష్యమగు పునరావృత్తిరహితమగు పరమపురుషుని నిత్య నిలయమును పొందవలెనన్నచో అది నీ స్వాధీనములోనున్న విషయమే యనియు అందుల కుపాయము తన్మార్గమగు అర్చిరాదిమార్గమును సదా స్మరించుకొనుచుండుటయేయనియు, ఈ స్మరణ మొక్కటియే వేదములు - యజ్ఞములు - తపస్సు - దానములు మున్నగువాని వలన కలుగు పుణ్యముకంటె అధిక ఫలప్రదాయియై, పరమపదము నిచ్చుననియు, గాన ముముక్షువగు వాడెన్నడును ఈ విషయమై పరాకు చెందదనియు, గాన నీవుకూడ దీనిని స్మరించుకొనుచుండుమనియు అర్జునునకు శ్రీకృష్ణుడు భగవద్గీత 8అ. 27, 28, శ్లోకములద్వారా:-

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥
వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ, దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం।
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా యోగీ పరం స్థాన ముపైతి చాద్యం,"

అని ఉపదేశించియున్నాడు.

అనగా ముముక్షువగు వానికి అర్చిరాది మార్గస్మరణము సదా అవశ్య కర్తవ్యమని నిశ్చయింపబడినదని యర్థము.

ఈ అర్చిరాది మార్గగమనము - తత్ఫలములనుగూర్చి ఈ ఉపనిషత్తులందు, బ్రహ్మసూత్రములయందునుకూడ అనేక ప్రమాణములు గలవు.

ఛాందోగ్యోపనిషత్తునందు :

"యథా పుష్కరపలాశ ఆపో నశ్లిష్యంతే ఏవ మేవంవిది పాపం కర్మ నశ్లిష్యతే," అని ప్రారంభించి.

"అథ యదు చాస్మిఞ్ఛవ్యం కుర్వంతి యది చ నార్చిష మేవాభిసమ్భవంతి,
అర్చిషోఽహ రహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణపక్షా ద్యాన్
షడుదఙ్ఙేతి మాసాం స్తాన్ మాసేభ్య స్సంవత్సరం సంవత్సరా దాదిత్య
మాదిత్యా చ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవ
స్స ఏనాన్ బ్రహ్మ గమయ త్యేష దేవపథో బ్రహ్మపథః ఏతేన ప్రతిపద్యమానా
ఇమం మానవ మావర్తం నావర్తంతే నావర్తంతే.................అనియు

బృహదారణ్యకోపనిషత్తునందు :-

యే ఏవ మేత ద్విదు ర్యేచేమేఽరణ్యే శ్రద్ధాం సత్య ముపాసతే,
తేఽర్చిష మభిసంభవంతి అర్చిషోఽహ రహ్న ఆపూర్యమాణపక్ష
మాపూర్యమాణపక్షా ద్యాన్ షణ్మాసా నుద జ్ఞాదిత్య ఏతి,
మాసే న్మాసేభ్యో దేవలోకం, దేవలోకా దాదిత్య, మాదిత్యా
ద్వైద్యుతం, వైద్యుతా త్పురుషోఽమానవ స్స ఏత్య
బ్రహ్మలోకాన్ గమయతి.

ఆ ఉపనిషత్తునందే తిర్గి:-

యదా వై పురుషోఽస్మా ల్లోకా త్ప్రైతి స వాయు మాగచ్ఛతి
తస్మై స తత్ర విజిహీర్తే యథా ఆడంబరస్య ఖం
తేన స ఊర్థ్వ మాక్రమతే స చంద్రమస మాగచ్ఛతి
తస్మై స తత్ర విజిహీర్తే యథా దుందుభేః ఖం "++++" అనియు

వాజసనేయియందు:-

యదా వై పురుషోఽస్మా ల్లోకా త్ప్రైతి స వాయు
మాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీర్తే యథా రథచక్రస్య
ఖం తేన స ఊర్ధ్వ మాక్రమతే స ఆదిత్య మాగచ్ఛతి "+++" అనియు

కౌషీతకి బ్రాహ్మణోపనిషత్తునందు:-

చిత్రో హ వై గార్గ్యాయణి ర్యక్ష్యమాణ ఆరుణిం వవ్రే స హ పుత్రం
శ్వేతకేతుం ప్రహిణాయ యాజయేతి తం హాసీనం పప్రచ్ఛ
గౌతమస్య పుత్రాస్తి సంవృతం లోకే యస్మి న్మా ధాస్య స్య
న్యము తాహో వాధ్వా తస్య లోకే ధాస్యసీతి స హోవాచ
నా హ మేత ద్వేద హన్తాచార్యం పృచ్ఛానీతి స హ పితర మాసాద్య
పప్రచ్ఛే తీతి మాఽప్రక్షీ త్కథం ప్రతిబ్రవా ణీతి స హోవా
చా హ మప్యేత న్న వేద సదస్యేవ వయం స్వాధ్యాయ మధీత్య
హారామహే య న్నః పరే దద త్యేహ్యుభౌ గమిష్యావ ఇతి॥
స హ సమిత్పాణి శ్చిత్రం గార్గ్యాయణిం ప్రతిచక్రమ ఉపాయానీతి
తం హోవాచ బ్రహ్మార్ఘోఽసి గౌతమ యో న మాన ముపాగా
ఏహి త్వా జ్ఞాపయిష్యామీతి ॥ ౧ ॥

స హోవాచ యే వై కే చాస్మాల్లోకా త్ప్రయంతి చంద్రమస
మేవ తే సర్వే గచ్ఛంతి తేషాం ప్రాణైః పూర్వపక్ష ఆప్యాయతే
తా నపరపక్షే న ప్రజనయ త్యేత ద్వై స్వర్గస్య లోకస్య
ద్వారం య శ్చంద్రమా స్తం యత్ప్రత్యాహ త మతిసృజతేఽథ
య ఏనం ప్రత్యాహ త మిహ వృష్టి ర్భూత్వా వర్షతి స ఇహ
కీటో వా పతంగో వా శకుని ర్వా శార్దూలో వా సింహో వా
మత్స్యో వా పరశ్వా పురుషో వా ఽ అన్యో వై తేషు స్థాఽనేవ

ప్రత్యాజాయతే యథాకర్మ యథావిద్యం తమాగతం పృచ్ఛతి
కోఽసీతి తం ప్రతిబ్రూయాద్ విచక్షణా దృతవో రేత
ఆభృతం పంచదశాత్ ప్రసూతాత్ పిత్ర్యావత స్తన్మా పుంసి
కర్తర్యేరయధ్వం, పుంసా కర్త్రా మాతరి మా నిషిక్తః స జాయ
ఉపజాయమానో ద్వాదశ త్రయోదశ ఉపమాసో ద్వాదశ
త్రయోదశేన పిత్రాసం తద్విదే ప్రతితద్విదేఽహం తన్మ
ఋతవో మర్త్యవ ఆభరధ్వం తేన సత్యేన తపసా
ఋతు రస్మ్యార్తవోఽసి కోఽస్మి త్వ హ మస్మీతి తమతిసృజతే ॥ ౨ ॥
స ఏతం దేవయానం పన్థాన మాపద్యా గ్నిలోక మాగచ్ఛతి
స వాయులోకం స ఆదిత్యలోకం స వరుణలోకం
స ఇంద్రలోకం స ప్రజాపతిలోకం స బ్రహ్మలోకం హ తస్య
వా ఏతస్య బ్రహ్మలోక స్యారో హ్రదో ముహూర్తా యేష్టిహా
విరజా నదీల్యో వృక్షః సాలజ్యం సంస్థాన మపరాజిత
మాయతన మింద్రప్రజాపతీ ద్వారగోపౌ విభుప్రమితం
విచక్షణాసంద్యమితౌజాః పర్యంకః ప్రియాచ మానసీ
ప్రతిరూపా చ చాక్షుషీ పుష్పాణ్యావయతౌ వై చ
జగన్త్యంబా శ్చాంబావయవీ శ్చాప్సరసోఽంబయా
నద్య స్త మిత్థంవిదా గచ్ఛతి తం బ్రహ్మాహాభిధావత మమ
యశసా విరజాం వాఽయం నదీం ప్రాపన్మా వాయం
జరయిష్యతీతి. ॥ 3 ॥
తం పంచశతా న్యప్సరసాం ప్రతియంతి శతం
మాలాహస్తాః శత మంజనహస్తాః శతం చూర్ణహస్తాః
శతం వాసోహస్తాః శతం ఫలహస్తా స్తం బ్రహ్మాలంకారే
ణాలంకుర్వంతి స బ్రహ్మాలంకారేణా లంకృతో బ్రహ్మ
విద్వాన్ బ్రహ్మైవాభిప్రైతి స అగచ్ఛ త్యారం హ్రదం
త న్మనసాత్యేతి,త మిత్వా సంప్రతివిదో మజ్జంతి స ఆగచ్ఛతి
ముహూర్తాన్యేష్టిహాంస్తేఽస్మాదపద్రవంతి స అగచ్ఛతి విరజాం
నదీం తాం మన సైవాత్యేతి తత్సుకృతదుష్కృతే ధూనుతే
తస్య ప్రియా జ్ఞాతయఃసుకృత ముపయం త్యప్రియా
దుష్కృతం తద్యథా రథేన ధావయ న్రథచక్రే పర్య
వేక్షత ఏవ మహోరాత్రే పర్యవేక్షత ఏవం సుకృతదుష్కృతే
సర్వాణి చ ద్వంద్వాని స ఏష విసుకృతో విదుష్కృతో
బ్రహ్మ విద్వాన్ బ్రహ్మైవాభిప్రైతి. ॥ ౪ ॥

స ఆగచ్ఛతీల్యం వృక్షం తం బ్రహ్మగంధః ప్రవిశతి
స ఆగచ్ఛతి సాలజ్యం సంస్థానం తం బ్రహ్మరస

ప్రవిశతి ఆగచ్ఛ త్యపరాజిత మాయతనం తం బ్రహ్మతేజః
ప్రవిశతి స ఆగచ్ఛ తీంద్రప్రజాపతీ ద్వారగోపౌ తావస్మా
దపద్రవతః స ఆగచ్ఛతి విభుప్రమితం తం బ్రహ్మయశః
ప్రవిశతి స ఆగచ్ఛతి విచక్షణా మాసందీం
బృహద్రథంతరే సామనీ పూర్వౌ పాదౌ శ్యైతనౌధసే
చాపరౌ పాదౌ వైరూపవైరాజే శాక్వరరైవతే తిరశ్చీ
సా ప్రజ్ఞా ప్రజ్ఞయా హి విపశ్యతి స ఆగచ్ఛ త్యమితౌజసం
పర్యంకం స ప్రాణ స్తస్య భూతం చ భవిష్య చ్చ పూర్వౌ
పాదౌ శ్రీశ్చేరా చాపరౌ బృహద్రథంతరే అనూచ్యే భద్రయ
జ్ఞాయజ్ఞీయే శీర్షణ్యే ఋచ శ్చ సామాని చ ప్రచీనా
తానాని యజూంషి తిరశ్చీనాని సోమాంశవ ఉపస్తరణ -
ముద్గీథ ఉప శ్రీః శ్రీ రుపబర్హణం తస్మి న్బ్రహ్మాస్తే
తమిత్థం విత్పదేనైవాగ్ర ఆరోహతి తం బ్రహ్మాహ
కోఽసీతి తం ప్రతిబ్రూయాత్ ॥ ౫ ॥
ఋతుర స్మ్యార్తవోఽస్మ్యాకాశాద్యోనేః సంభూతో భాయా
ఏతత్సంవత్సరస్య తేజోభూతస్య భూతస్య భూతస్యాత్మా
త్వమాత్మాసి య స్త్వమసి సోఽహమస్మీతి తమాహ
కోఽహమస్మీతి సత్య మితి బ్రూయా త్కిం తద్యత్సత్య
మితి యదన్య దేవేభ్య శ్చ ప్రాణేభ్య శ్చ తత్సదథ
యద్దేవా శ్చ ప్రాణాశ్చ తత్యం తదేతయా వాచాభి -
వ్యాహ్రియతే సత్య మిత్యేతావదిదం సర్వ మిదం
సర్వమసీత్యేవైనం తదాహ తదేత చ్ఛ్లోకేనాభ్యుక్తం
యజూదరః సామశిరా అసావృఙ్ మూర్తి రవ్యయః
స బ్రహ్మేతి హి విజ్ఞేయ ఋషి ర్బ్రహ్మమయో మహా నితి
త మహ కేన పౌంస్యాని నామాన్యాప్నోతీతి ప్రాణేనేతి
బ్రూయా త్కేన స్త్రీనామా నీతి వాచేతి కేన నపుంసకానీతి
మనసేతి కేన గంధా నీతిఘ్రాణేనేతి బ్రూయా త్కేన
రూపాణీతి చక్షుషేతి కేన శబ్దానీతి శ్రోత్రేణేతి కేనాన్నర -
సానీతి జిహ్వయేతి కేన కర్మాణీతి హస్తాభ్యా మితి
కేన సుఖదుఃఖే ఇతి శరీరేణేతి కేనానందం రతిం ప్రజాతి
మిత్యుపస్థే నేతి, కేనేత్యా ఇతి పాదాభ్యా మితి కేన
ధియో విజ్ఞాతవ్యం కామా నితి ప్రజ్ఞయేతి ప్రబ్రూయా
త్తమాహాపో వై ఖలు మే హ్యసావయం తే లోక ఇతి
సా యా బ్రహ్మణి జితిర్యా వ్యష్టి స్తాం జితిం జయతి
తాం వ్యష్టిం వ్యశ్నుతే య ఏవం వేద య ఏవం వేద ॥ ౭ ॥
ఇతి శ్రీ కౌషీతకిబ్రహ్మణోపనిషది ప్రథమోఽధ్యాయః

శ్రీమతే రామానుజాయనమః.



# భక్తినివేదన

(వేదాంత మాసపత్రిక)


| సంపుటి 12 | వికారి—చైత్రం | సంచిక 1 |
|---|---|---|




సంపాదకులు
పండిత
తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు
కవిరత్న
గుదిమెళ్ల రామానుజాచార్యులు

శ్రీ మతేరామానుజాయనమః



# శ్రీ శ్రీమాన్ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు వ్రాయునది.

ప్రియమైన భక్తాగ్రేసరులారా!

బదరీనాథులో. మన సంఘముచే నిర్మించబడుచున్న అష్టాక్షరీ క్షేత్రమందలి రామానుజకూటము 24 గదులతో తయారైనది. సత్సంగసదనముకూడా చాలవరకు తయారైనది. ఒకటి రెండు నెలలు పనిచేయుటద్వారా మిగిలినరంగులువేయుట, సిమెంటుచేయుట వగైరా చివరి పనులు పూర్తికాగలవు. అందుచే వికారినామ సం॥ శ్రావణ బహుళ ౫ శనివారము (ది[illegible]-59)న ఈ అష్టాక్షరీక్షేత్రముయొక్క సంప్రోక్షణము, ఆవిష్కరణోత్సవము జరుపుటకు నిశ్చయించబడినది. ఈ ఉత్సవము సేవించుటకై ఇదివరలో బదరీకివచ్చినవారున్నూ, మరియు కొత్తవారున్నూ- అనేకమంది బదరీకి రాగోరుచు తమకు సదుపాయముగనుండుటకై ప్రత్యేకముగ రైళ్ళను ఏర్పాటుచేయించవలసిందిగ కోరుచున్నారు. మనసంఘముద్వారా రైళ్ళను ఈ పర్యాయము వేయుటకు మాకు ఉద్దేశములేకపోవుటచే - ఇదివరలో 4, 5 పర్యాయములు బదరీకి స్పెషల్ యాత్రారైళ్ళను వేసి నడుపుచు చాలా అనుభవమును కలిగియున్నట్టియు, మరియు మన అష్టాక్షరీ క్షేత్రములో విద్యుద్దీపముల కైంకర్యమును చేయుచున్నట్టియు, ధార్మికస్వభావముకలిగి, భగవద్భాగవత భక్తిశ్రద్ధలుకలిగి యున్నట్టియు, గీతాట్రావెల్‌సర్వీసు, విజయవాడవారిని ఈ విషయమై బదరీకి స్పెషల్‌రైళ్ళను వేయమంటిమి. వారును మూడురకములైన ప్రత్యేకయాత్రా రైళ్ళను వేయుటకు ఏర్పాటుచేసిరి. వారి లాభనష్టములతో మనకెట్టి సంబంధములేదు. అన్నివిధములైన భాధ్యతలు, పూచీలు వారివే. టిక్కెట్టు రేటును మాతో సంప్రదించి హెచ్చులాభము నాశించకుండగ న్యాయముగనే ఏర్పాటుచేసిరి. మరియు యాత్రకు ప్రయాణములోగాని, బసలలోగాని, భోజనములలోగాని తదితర సదుపాయములోగాని ఎట్టియిబ్బందిని కలుగజేయకుండగ చాలా జాగ్రత్తగ యాత్రనుచేయించి తీసికొనిరాగలమని మాసన్నిధిన పెరుమాళ్ళవద్ద ప్రమాణముచేసిరి. వీరు చెప్పినటుల నడచుకొనగల స్వభావముగలవారనే వీరియందు మాకు నమ్మకము గలదు. గాన ఈ యాత్రకు రాదలచిన వారందరును వారు ఏర్పాటుచేయుచున్న ప్రత్యేక యాత్రారైళ్ళలో తప్పక-నిర్భయముగా యాత్రచేయవచ్చును. ఒంటరిగరాదలచిన వారుకూడ నిర్భయముగ యాత్రకు రావచ్చును.

అనేక మంగళాశాసనములు.

T 405/II/268 నెం. ద్వారా రైల్వేవారు స్పెషల్ ట్రయిన్ ఇచ్చారు.

T 469/II/15-16-19/59 నెంబర్లద్వారా స్పెషల్ క్యారేజీలు ఇచ్చారు.

---

| 1 వ బండి | 2 వ బండి | 3 వ బండి |
|---|---|---|
| ది 16-7-59 న పూర్తి స్పెషల్ ట్రయిన్ 60 రోజులు. | ది 28-7-59 చీరాలనుంచి ది 30-7-59 విజయవాడ నుంచి 45 రోజులు. | ది 30-7-59 న విజయవాడ నుంచి 28 రోజులు |

బదరీనారాయణ్‌లో ది 8-8-59 న శ్రీ విశిష్టాద్వైత ప్రచార సంఘంవారిచే ప్రతిష్టా మహోత్సవము జరుపబడుచున్న "అష్టాక్షరిక్షేత్ర" దర్శనమునకు చేరునట్లు.



ప్రతివారికీ, ప్రతిబండిలోను రాత్రిపూట పడుకునేందుకు పూర్తి బెర్తు ఇవ్వబడుతుంది. త్వరపడండి! ఎన్నో క్షేత్రాలు! ఎన్నెన్నో పట్టణాలు!

**6500 మైళ్ళు!** గీతా ట్రావెల్ సర్వీసు వారిచే **45 క్షేత్రాలు!**

---

## కాశీ, బదరి, కాశ్మీరు, ద్వారకతో సంపూర్ణ ఉత్తర దేశయాత్ర

---

**1** వ బండి **60** రోజులకు, బదరీ, కాశ్మీరులకు పోనురాను బస్‌చార్జీలతో, రెండు వేళలా భోజనంతో 1 వ తరగతి టికెట్ 1 కి రు **785** భోజనం లేకండ పైవిధంగా రు **665**.

2 వ తరగతి పైవిధంగా టికెట్ 1కి రు **665**. భోజనం లేకండ పైవిధంగా 2 వ తరగతి టికెట్ 1కి రు**485**.

3వ తరగతి పైవిధంగా టి 1కి రు **425**. భోజనం లేకండా పైవిధంగా 3వ తరగతి టి 1 కి రు **300**.

**2** వ బండి **45** రోజులకు, బదరీ కాశ్మీరులకు పోనురాను బస్‌చార్జీలతో, రెండు వేళలా భోజనంతో 3వ తరగతి టికెట్ 1కి రు**375** భోజనం లేకండా పైవిధంగా టి1కి రు**285**.

**3** వ బండి **28** రోజులకు బదరీకి మాత్రం పోనురాను బస్‌చార్జీలతో, రెండు వేళలా భోజనంతో 3వ తరగతి టి 1కి రు**250** భోజనం లేకండా పైవిధంగా టి1కి రు**185**.

* పై మూడుబండ్లలోవచ్చు యాత్రీకులకు, వీలునుబట్టి ఉదయంపూట కాఫీ-భోజనం టికెట్లతోవచ్చు యాత్రీకులకు మాత్రం-ఉచితంగా ఇవ్వబడుతుంది.

# వివరాలు

## పూర్తి స్పెషల్ ట్రెయిన్ 60 రోజులకు

1-'59 జులై 16 విజయవాడనుంచి రాత్రి 10 గంటలకు శుభముహూర్తమున పూర్తి స్పెషల్ ట్రెయిన్ బయలుదేరును.

17 వాల్తేరు : 1 రోజు-సింహాచలమునకు వెళ్ళి సప్తధారలలో స్నానముచేసి శ్రీ వరహా నరసింహాస్వామి దర్శనము చేయుట, హార్బరు, ఆంధ్ర యూనివర్సిటీ, కింగ్ జార్జి ఆస్పిటలు, స్టీమర్లు తయారుచేయు సింధు నావిగేషన్ చూచుట.

18 పూరి: 1 రోజు-సముద్రస్నానము, సుభద్రా బలరాముల, జగన్నాథస్వామి, సాక్షి గోపాలస్వామివారల దర్శనము, శాశ్వతాన్నదాన భోగదర్శనము.

19, 20 కలకత్తా: 2 రోజులు - హుగ్లీ నదీస్నానము, మహాకాళిదర్శనము, శ్రీ రామకృష్ణ పరమహంసమఠం, పరశురామ మందిరము, విక్టోరియా మెమోరియల్ హాల్, జూ, మ్యూజియం, బొటానికల్ గార్డెన్స్, పదిహేను అంతస్థుల సెక్రటేరియట్ భవనము, సుభాష్‌బోస్ భవనము, హౌరాబ్రిడ్జి వగైరాలు చూచుట.

21,22,23 గయ: 3 రో॥ ఫల్గుణీనది స్నానము, విష్ణుపాదదర్శనము, అక్షయ వటంవద్ద పిండదానము, బుద్ధగయ, బుద్ధదేవుని దర్శనము.

24,25,26 కాశి : 3రో॥64 ఘట్టములలో గంగా నదీస్నానము, విఘ్నేశ్వర దర్శనము, అన్నపూర్ణ, కాలభైరవ, విశాలాక్షి గౌరీభాయిల దర్శనము, విశ్వవిద్యాలయము, భారతమాతమందిరము, అశోక స్థూపము, వ్యాసకాశి, సారనాథ్, మొదలైనవి చూచుట.

27 అలహాబాదు : 1 రో॥ (ప్రయాగ) గంగా, యమున, సరస్వతి నదుల త్రివేణీసంగమ స్నానము, పిండప్రదానములు చేయుట, నెహ్రూభవనము, వాసుకి ఆలయము, భరద్వాజ ఆశ్రమము, ప్రభుదత్తబ్రహ్మచారి ఆశ్రమము, భూగర్భములోని అశోకుని కోట, వగైరాలు చూచుట.

28 అయోధ్య : 1 రో॥ సరయూనది స్నానం, శ్రీరంగజీ మందిరదర్శనం, శ్రీరామ జన్మమందిరం, కైకేయి కోపగృహం, రత్నగద్దె, హనుమాన్ దేవాలయం, రామ లక్ష్మణుల యవతార సమాప్తి ఘాటు, అయోధ్యయందలి చరాచరములకు మోక్షమిచ్చిన సరయూనది ఘాట్.

29, 30 నైమిశారణ్యం : 2రో॥ చక్రతీర్థస్నానం గోమతి నదిస్నానం, అరణ్యరూపముగ నున్న నారాయణుని దర్శించుట, సూత మహాముని శౌనకాది మహాఋషులకు, అష్టాదశ పురాణములను వినిపించిన పవిత్రస్థలం, శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవాలయమును దర్శించుకొని- ఇచటికి 6 మైళ్ళలోగల "మిశ్రి" క్షేత్రమును దర్శించుట, ఇచ్చటనే శ్రీరామచంద్ర మూర్తి అశ్వమేధయాగమును జేసెను.

లవకుశులు శ్రీ రామాయణమును మొట్టమొదటిసారిగ ఇచ్చటనే పాడిరి. త్రేతాయుగమున "సీతాదేవి" భూగర్భమున చేరిన పవిత్రస్థలమును దర్శించుట. దధీచి మహాఋషి సార్ధకోటి తీర్థముల నాహ్వానించి అందు స్నానమాడి- తన శరీరమును, ఎముకలను ఇంద్రునికి 'వజ్రాయుధము' వగైరాలుగ దానమిచ్చిన పవిత్రక్షేత్రము.

31 హరిద్వార్ : 1 రో॥ భగీరథుడు గంగాదేవిని భూమిమీదికి తెచ్చిన పవిత్ర స్థలము, దక్షయజ్ఞశాల, మాయాదేవి దర్శనము, బిర్లామందిరము, భీమునికుండములు, దర్శించుకొని, శుద్ధగంగను స్నానట.

ఆగష్టు 1,నుంచి16 బదరీయాత్ర : 16రో॥ ఋషీకేశ్ లో ఆంధ్రాశ్రమము, గీతాశ్రమము స్వామి శివానంద ఆశ్రమము, లక్ష్మణ ఝూలా వగైరాలు దర్శించుకొని, రెండవతేదీని కార్లపైని బయలుదేరి, దేవప్రయాగాది పంచప్రయాగలు దర్శించుకుంటూ, హిమాలయపర్వతములపై ఆహ్లాదకరముగ మోటారు ప్రయాణమును సాగించి పిప్పల్ కోట మూడవ తేదీనిచేరి-కాలినడకన, మానవలోకాన్ని తరింపజేయుటకు వెలసిన శ్రీ బదరీనారాయణము ఏడవతేదీ సాయంకాలము చేరి 8, 9, 10 తేదీలలో నరనారాయణులను దర్శించుకొని శ్రీ విశిష్టాద్వైత ప్రచారసంఘము వారిచే నిర్మింపబడిన శ్రీ అష్టాక్షరీక్షేత్ర ప్రతిష్టా మహోత్సవములను దర్శించి బ్రహ్మకపాలములో పిండప్రదానములు చేసుకొని శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యరుస్వామివారి ఆశీర్వాదానుగ్రహములు పొంది, 11వ తేదీ ఉదయము బయలుదేరి 16వ తేదీకి ఋషీకేశము చేరుట.

17 అమృతసర్: 1రో-లవ్రుని మూర్ఛను పోగొట్టుటకై తెచ్చిన అమృతకలశమును స్థాపించిన స్థలంపైనే సిక్కులబంగారు దేవాలయము, జలియన్ వాలాభాగ్ హత్యాప్రదేశము దర్శించుట.

18,నుంచి25 కాశ్మీరుయాత్ర: 8రో-పఠాన్ కోట నుంచి బస్సులపై జమ్ముపట్టణము మీదుగా కాశ్మీరుచేరి మూడురోజులు హాయిగా గడిపి తిరిగివచ్చుట.

26 కురుక్షేత్రం 1 రో- సూర్యగుండస్నానము, కౌరవ పాండవ యుద్ధభూమి, గీతోపదేశముచేసిన పుణ్యభూమి, భీష్ముని అంపశయ్య వగైరాలు చూచుట. మహాపర్వదినమైనకృష్ణజయింతిని యిచ్చటనే గడుపుదుము.

27,28,29 ఢిల్లి 3 రో- యమునానది స్నానము, లాల్ ఖిల్లా, జంతర్ మంతర్, లక్ష్మీనారాయణ్ మందిరము, రాజఘాట్, కుతుబ్ మీనార్, పార్లమెంటు భవనము, ఆల్ యిండియా రేడియో స్టేషను అశోకాహోటల్, స్పీకరు అనంతశయనం అయ్యంగారు, రక్షణశాఖ ఉపమంత్రి గా॥ శ్రీ కె. రఘురామయ్య, విద్యాశాఖ ఉపమంత్రి గా॥ శ్రీ బి. గోపాలరెడ్డి, లా కమిషన్ అధ్యక్షులు శ్రీ తెన్నేటి విశ్వనాథంగారల దర్శనము, వారితో సంభాషణ, తేనేటివిందు, ఫొటో.

30, 31 మధుర 2 రో-యమునానది స్నానము, శ్రీకృష్ణుని జన్మస్థానము, గోకులబృందా

వనము, కంసవధాస్థలము, కాళింగ మడుగు వగైరా.

**సెప్టెంబరు 1 ఆగ్రా:** 1 రో-జగత్ప్రసిద్ధి పొందిన తాజ్‌మహాల్, దయాల్‌భాగ్‌లోని రాధామాధవస్వామి దేవాలయము, ఔరంగజేబుకోట వగైరా.

**2 భోపాల్ :** 1 రో- రాజాగారి అందమైన కోట, సిటీ అందమును చూచుట.

**3 ఉజ్జయిని :** 1 రో- క్షిప్రానది స్నానము, మహాకాళిదర్శనము, భర్తృహరి జన్మస్థానము, విక్రమాదిత్యుని పట్టణము, భోజమహారాజుకు విక్రమాదిత్యుని సింహాసనము దొరికినస్థలము, గణపతి దేవాలయము వగైరా.

**4 డాకూర్‌ద్వారక :** 1 రో- శ్రీకృష్ణతులాభార ప్రదేశము, పుష్కరిణీ స్నానము.

**5 అజంతా - ఎల్లోరా** 1 రో - ప్రపంచములోని ఏడువిచిత్రములలో నొకటియైన అజంతా-ఎల్లోరాగుహల శిల్పనైపుణ్యమును తిలకించుట.

**6 నాసిక్ :** 1 రో- గోదావరి పుట్టినచోటు, పంచవటి, శ్రీరామదర్శనము, శూర్పణఖ ముక్కు చెవులు కోసినచోటు వగైరా.

7,8,9 బొంబాయి, 3 రో - మహాలక్ష్మిమందిరము, మలబార్‌హిల్సు, ఎలిఫెంట్ కేవ్స్ ఇండియాగేట్, మ్యూజియం, జూ, హాంగింగ్‌గార్డెన్స్, తాజమహాల్ హోటల్, హార్బరు మొదలైనవి చూచుట, గణపతి నవరాత్రమహోత్సవముల వైభవమునకు బొంబాయిలోనే వుండి తిలకించు భాగ్యము లభించుచున్నది.

10 పండరీపురము : 1 రో॥ చంద్రభాగ నదీ స్నానము, పాండురంగ, సక్కుభాయి, తుకారాం, జ్ఞానదేవుల దర్శనము.

11, 12 హైదరాబాదు, 2 రో॥ సాలార్‌జంగు మ్యూజియము, బంజరిహిల్స్, జూ, చార్‌మినార్, ఫలక్‌నామా, గోలకొండకోటలో రామదాసుబందిఖానా, ఆంధ్ర రాజధాని అసెంబ్లీ భవనము, హిమాయత్‌సాగర్, విమానాశ్రయము సారథీస్టూడియో వగైరా.

13 విజయవాడ : ఉదయము 5 గం॥ లకు విజయవాడ చేరి, కృష్ణానదీస్నానము, కనకదుర్గ, వేంకటేశ్వర స్వామి వారల దర్శనము చేసుకొని స్వగృహములచేరి, బంధుదర్శనము చేసుకొని గంగపూజ చేసుకొనుట.

**<u>రెండవబండి:</u>—** 45 రోజులకు, వివరాలు [1 పెట్టె జనతాభోగి: 1 పెట్టె టూరిస్టుక్యారేజి]

ది 23-7-59 న చీరాలనుంచి రాత్రి 0 గం॥లకు శుభముహూర్తమున బైలుదేరి విజయవాడచేరి ది 28-7-59 న విజయవాడనుంచి రాత్రి 8 గం॥లకు బైలుదేరును. ది 1-8-59 న ఢిల్లీ 1 రోజు॥ ఆగష్టు 2 హరిద్వారం 1 రో॥ ఆగష్టు 3 ఋషీకేష్‌నుంచి బదరీయాత్రకు బస్సులపైన బైలుదేరుట. బదరీయాత్ర 14 రో॥ ఆగష్టు 17 అమృతసర్ 1 రో॥ 18 నుంచి 25 వరకు కాశ్మీరుయాత్ర 8 రో॥ 26 కురుక్షేత్రం 1 రో॥ 27 నుంచి 29 ఢిల్లీ 3 రో॥ 30 మథుర 1 రో॥ 31 ఆగ్రా 1 రో॥ సెప్టెంబరు 1 ఉజ్జయిని 1 రో॥ 2 డాకూర్‌ద్వారక 1 రో॥ 4 నాసిక్ 1 రో॥ 5 నుంచి 7 వరకు, బొంబాయి 3 రో॥ 8 పండరీపురం 1 రో॥ 9 హైదరాబాద్ 1 రో॥ 10-9-59 ఉదయం 7 గంటలకు విజయవాడ చేరుట.

మూడవబండి 28 రోజులకు వివరాలు [1 పెట్టె జనతాభోగి]

ది 30-7-59 న విజయవాడనుంచి రాత్రి 8 గం॥లకు రైలు దేరును.

1 రోజు ఢిల్లీ 1 రోజు హరిద్వారం, 14 రోజులు బదరీయాత్ర ముగించుకుని, నేరుగా విజయవాడకు చేరుట.

* ఆయాస్టేషనులలోని, క్షేత్రములలోని విశేషములను, స్థలములను, వినోదములను 2 వ బండివారు, 3 వ బండివారు, తమతమ ప్రోగ్రాముల ప్రకారం చూడవచ్చును.

## ముఖ్య నిబంధనలు

1. ప్రతియాత్రికులు, తమవెంట 20 శేర్లకంటె ఎక్కువ సామానులు తేకూడదు. తెచ్చిన యెడల రైల్వేచార్జీల ననుసరించి చార్జీచేయబడి – వాగన్లో తీసుకరాబడుతుంది. 2. బండిదిగిన తరువాత పట్టణములలో తిరుగుజట్కా, బస్సు. ట్రామ్, చార్జీలు, సింహాచలము, గోకులబృందావనము, అజంతా, ఎల్లోరా వగైరాలకు బస్ చార్జీలు యాత్రీకులే భరించుకొనవలయును. 3. బదరీ, కాశ్మీరులు వెళ్ళునపుడు, ఒకపూటభోజనము, ఒకపూట పలహారము యివ్వబడును. 4. మూడుసంవత్సరముల మొదలు పన్నెండు సం॥ల లోపువారికి అర్థచార్జి వసూలు చేయబడును. 5. టిక్కెట్లను అడ్వాన్సుగా ఇచ్చి బుక్ చేయువారు, తాముకట్టిన అడ్వాన్సు సొమ్ముపోను మిగతాపైకం మొత్తం ది 6-7-59 వ తేది లోపుగా చెల్లించి, పూర్తిటిక్కెట్లను ఇప్పటి రైల్వే రూల్సుప్రకారం పొందాలి. రైల్వేవారికి మేముకూడా 6 రోజుల ముందుగ పూర్తిపైకం చెల్లించాలి గనుక యాత్రీకులు తమ పూర్తిపైకాన్ని 10 రోజులముందు తప్పక చెల్లించాలి.

## సదుపాయములు

1. ఈ యాత్రలో రాత్రిపూట రైలుబండిలో పడుకునేందుకు ప్రతివారికి పూర్తి బెర్తు యేర్పాటు చేసియున్నాము.
2. యాత్రికులు తమసామానులు బండిలోనేవుంచి పట్టణములలోని వినోదములు చూచివచ్చుటకు వీలుగా బండికి కాపలాయున్నది.
3. స్త్రీలు వంటరిగా ప్రయాణంచేసినను తగిన సహాయసహకారములు లభింపగలవు.
4. బహిష్టు స్త్రీలకు ప్రత్యేకస్థలము గలదు.
5. పైకము దాచుటకు, నూటికి ఒకరూపాయి చొప్పున కమీషన్ తీసుకొని, ఇనుప పెట్టెలో భద్రపరచి అడిగినప్పుడు ఇచ్చు సదుపాయము కలదు.
6. బండివెంట వైద్యసదుపాయముకొరకు డాక్టరు శ్రీ కంభంమెట్టు విష్ణువర్ధనరావు గారువుండి, యాత్రికుల సహాయముకొరకు వచ్చుటకు దయతో అంగీకరించారు.
7. యాత్రికులకు పోష్టు సదుపాయము గలదు. రిజష్టర్లు, మణియార్డర్లు, ఆర్గనైజరు అనుమతితో తెప్పించుకోవలెను.
8. రైల్వేలోగాని ఇతరత్రాగాని దైవికముగా, రాజకీయముగా జరుగు కష్టనష్టములకు కంపెనీవారు బాధ్యులుగారు.

* యాత్రలలో అనుభవజ్ఞులైన శ్రీవైష్ణవ బ్రాహ్మణులతో రుచిగ శుచిగ వంటచేయించ బడును.

* తమకు, ఏ బండికి టిక్కెట్లు కావలసినది, ఏ తరగతి టిక్కెట్లు కావలసినది వివరంగా వ్రాస్తూ టిక్కెట్ 1కి 1వ తరగతికి రు100లు 2వ తరగతికి రు75 లు 3వ తరగతికి రు 50 చొప్పున కావలసిన సీట్లకు పైకం మనియార్డరుద్వారా వెంటనేపంపి, మీ సీట్లను బుక్ చేసుకోండి. గీతా ట్రావెల్ సర్వీస్, పప్పుబజారు, విజయవాడ-1

* సామాన్య కుటుంబీకులుకూడా ఈ పవిత్ర ప్రతిష్ఠామహోత్సవముచూసి తరించుటకు వీలుగా, ఇప్పటి రైల్వేవారి చార్జీలను అనుసరించి శ్రీ శ్రీ శ్రీ జీయరు స్వామివారి ఆజ్ఞానుసారం చాలా తక్కువరేట్లతో, సంపూర్ణ ఉత్తరదేశయాత్ర ఏర్పాటు చేసాము.

* టూరెస్టుక్యారేజి 2వ తరగతి లా కుషన్‌సీట్లతోను, స్నానాలగదులతోను 40 మందికి ఏర్పాటు కావడంచేత, టూరెస్టు క్యారేజీలలో వచ్చువారివద్ద టి 1కి అదనంగా రు 25 వసూలు చేయబడతాయి.

* యాత్రలుచేయడమే విశేషం, "ఆ యాత్రల్ని వొట్టిరోజుల్లో కాకండా శుభసమయాల్లో చేస్తేనే మానవజన్మ చరితార్థం" అనాడే యాత్రాఫలం యాత్రికులకు దక్కుతుంది.

---

సాలుచందా రు 5 లు భక్తినివేదన—BOOK POST రి. నెం A. 195

శ్రీ వాసుదాసాశ్రమము - నడిగడ్డపాలెం - చుండూరుపోష్టు, గుంటూరు జిల్లా.

శ్రీ.................................................గారు.

...................................

Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Victory Press, Vijayawada-1 For Sriman Press, Nadigaddapalem.

# "మన జీయరుస్వామివారు"

త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు హైదరాబాదునందలి సీతారాంబాగు రామానుజకూటమునందు వేంచేసియున్నారు. ఈ మధ్యనే వీరు సికింద్రాబాదునకువిచ్చేసి 4 రోజులు అచ్చట శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయములో ఉపన్యసించిరి. తిరిగి 21-4-59 తేదీన సీతారాంబాగునకు విచ్చేసిరి.

సీతారాంబాగులో వీరిద్వారా ది [illegible]7-4-59 తేదీని "సమిష్టిఉపనయన కార్యక్రమము" మహావైభవముగా జరుపబడినది.

మరియు వీరియధ్వర్యముననే సీతారాంబాగులోనే అఖిలభారత శ్రీవైష్ణవమహాసభయు, మరియు శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ వార్షికవిశేష సమావేశమును, మహావైభవముగ జరుపబడినది. చాలమంది దక్షిణ ఉత్తరదేశీయ పండితప్రకాండులువిచ్చేసి ఈ సభయందు పాల్గొనిరి.

ఈ వివరములన్నియు రాబోవుపత్రికలో ప్రచురించగలము. శ్రీవారు యిచ్చటనుండి వారముపదిదినములలో వరంగలువిచ్చేసి అచ్చట 10 దినములు వరకు యుందురు.

అటుపిమ్మట షోలాపూరు, బొంబాయిలమీదుగా చాతుర్మాస్యదీక్షకు బదరికాశ్రమమునకు వెళ్ళవలెనని వీరుతలంచుచున్నారు.

బదరికాశ్రమములో అష్టాక్షరిక్షేత్రమందలి రామానుజకూటము, సత్సంగసదనముల సంప్రోక్షణాదికము ది 8-8-59 తేది లగాయతు 9 రోజుల వరకు శ్రీవారి అధ్వర్యమున జరుపబడగలవు.

# బదరివా[illegible]లు

ఈనెలలో బదరీనాథునకు పెద్దమంచుకొండ నారాయణపర్వతమునుండి జారి, బదరినాథుదేవాలయము ఉత్తరపువైపునను, నేపాలుధర్మశాలలో కొంతభాగమును, దానిఎదుటనున్న ఆంధ్రధర్మశాలను పాడుచేసినది.

మన అష్టాక్షరిక్షేత్రము అలకనందకు తూర్పుగట్టుపై నరపర్వతముయొక్క విశాలమైన మైదానమున నుండుటచే మన రామానుజకూటమునకుగాని, సత్సంగసదనమునకుగాని ఎట్టినష్టములు సంభవించలేదు - ఎంతహెచ్చు మంచుకురిసినను ఏవిధమైననష్టములుకలుగనట్టి ప్రదేశముగ జూచియే ఇంతవ్యయప్రయాసలుచేసి ఈ కట్టడములు నిర్మించడమైనది.

బదరినాథులో బదరినారాయణుని దేవాలయపుతలుపులు మే 11 తేదిని తెరువబడి ఆనాటినుండి బదరి నారాయణుని పూజారాధన యారంభింపబడెను. ఆనాడే జ్యోతిర్దర్శనదినము. ఆనాటినుండియు మన రామానుజకూటముయొక్కయు, సత్సంగసదనముయొక్కయు మిగిలినకట్టడపుపనులు తిర్గి ఆరంభించబడెను. ది 8-8-1959 తేదిన వీటి సంప్రోక్షణ గృహప్రవేశమహోత్సవము తప్పకజరుగగలుగు ఇందులకు సంబంధించిన ఆహ్వానపత్రిక స్థలాంతరమున ప్రచురింపబడినది. ఈ కట్టడపుపనులు పూర్తిచేయించుటకైయ్యు ముందుగ కావలసిన సామానులనన్నిటిని రవాణాచేయించుటకొరకున్ను, మన శ్రీ శేషదాసు (రాజు) గారు ది 13-4-1959 తేదీనే యిచ్చటనుండి బయలుదేరి ఋషీకేశమునకువెళ్ళిరి. శ్రీమాదిత్యాది శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు ఈ నెలాఖరున బదరికి ప్రయాణమైవెళ్ళుచున్నారు - యాత్రికుల సౌఖర్యార్థమై 3 రకముల [illegible] ఏర్పాటు చేయడమైనది.

గుదిమెళ్ళ రామానుజాచార్యులు
సహాయ కార్యదర్శి

# కట్నములు

రాజమంద్రివాస్తవ్యులు శ్రీమాన్ ముదుంబై వరాహ నరసింహాచార్యులుగారి జ్యేష్ఠ పుత్రుడు చి. రామానుజాచార్యులుకు పాలకొల్లువాస్తవ్యులు శ్రీమాన్ వంగల శ్రీమన్నారాయణాచార్యులుగారి కుమార్తెను ఇచ్చి జరిపించిన వివాహమహోత్సవ సందర్భములో శ్రీవిశిష్టాద్వైతప్రచారక సంఘమువారి భక్తినివేదన పత్రికకు పెళ్ళికుమారుని తండ్రిగారు ఇచ్చిన కట్నము రు 25/-లు, పెండ్లికుమార్తె తండ్రిగారు ఇచ్చినది కట్నం రు 4/-లు వధూవరులకు శ్రియఃపతి సమస్తభాగ్యభోగ ఐశ్వర్యములు ఇచ్చుగాక.

సాలుచందా రు 5/లు భక్తినివేదన—BOOK POST రి. నెం. A. 195

శ్రీ వాసుదాసాశ్రమం — నడిగడ్డపాలెం (పోష్టు) (వయా చేబ్రోలు) గుంటూరు జిల్లా.



Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Bharathi Press, Tenali For Sriman Press, Nadigaddapalem.

శ్రీమతే రామానుజాయ నమః



శ్లో॥ శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా.

# భక్తినివేదన

## [వేదాంత మాసపత్రిక]

సంపుటి ౧౨ || వికారి - వైశాఖము || సంచిక ౨

### బద్ధదశ

శ్లో. దర్పోదగ్ర దశేంద్రియానన మనోనక్తంచరాధిష్ఠితే
దేహేఽస్మిన్ భవసింధునా, పరిస్రుతే, దీనాం దశామాస్థితః
ఆర్యత్వే, హనుమత్సమేన గురుణా సందర్శితార్థః పుమాన్
లంకారుద్ధ విదేహరాజతనయా న్యాయేన లాలస్యతే.

### తాత్పర్యము

అవారితమగు గర్వముచే నతిశయించిన పదితలలవంటి పది యింద్రియములు గలిగి, రావణునివంటి మనస్సుచే అధిష్ఠింపబడి, సముద్రమువంటి సంసారముచే నావరింపబడిన లంకవంటి దేహమునందు దీనాదీనదశ నధిగమించియున్న సీతవంటి జీవుడు, హనుమంతుని వంటి ఆచార్యునిచే తెలుపబడిన తత్త్వార్థజ్ఞానము కలవాడై, యూతనిచే లంకయందు దవరోధింపబడిన సీతవలె నోదార్చబడుచున్నాడు.

సంపాదకులు :
విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :
కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులు

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ భగవద్గీతా - అష్టమోఽధ్యాయః

# అక్షరపరబ్రహ్మయోగః



అవ. మూడువిధములగు అధికారులకును తెలియదగినవిగాను చేయదగినవి గాను ఏడవ అధ్యాయాంతమున ప్రసక్తమైన విషయములను ఏడింటిని వివరముగా తెలియగోరి అర్జునుడు ప్రశ్నించుచున్నాడు.

అర్జున ఉవాచ = అర్జునుడు పలికెను.

1. శ్లో. కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం । కిం కర్మ పురుషోత్తమ !
అధిభూతం చ కిం ప్రోక్త । మధిదైవం కిముచ్యతే ॥

అర్థము :- పురుషోత్తమ = శ్రీకృష్ణా ; తద్బ్రహ్మ = తద్బ్రహ్మయనగా, కిం = ఏమి ? అధ్యాత్మం = అధ్యాత్మమనగా, కిం = ఏమి ? కర్మ = కర్మయనగా, కిం = ఏమి ? అధిభూతంచ = అధిభూతమనియును, కిం = ఏది ; ప్రోక్తం = చెప్పబడినది ; అధిదైవం = అధిదైవమని, కిం = ఏది, ఉచ్యతే = చెప్పబడుచున్నది ?

తా॥ ఓ కృష్ణా ! కైవల్యార్థులకు తెలియవలసిన తద్బ్రహ్మ, అధ్యాత్మము, కర్మ యనగానేమియో, ఐశ్వర్యార్థులకు తెలియవలసిన అధిభూతము, అధిదైవము అనగా నేమియో తెలుపుము.

2. శ్లో. అధియజ్ఞః కథం కోఽత్ర । దేహేఽస్మిన్ మధుసూదన ।
ప్రయాణకాలే చ కథం । జ్ఞేయోసి నియతాత్మభిః ॥

అర్థము :- మధుసూదన = శ్రీకృష్ణా ! అత్ర = ఈ. అస్మిన్ దేహే = కాన్పించుశరీర మున. అధియజ్ఞః = అధియజ్ఞుని చెప్పబడువాడు. కః = ఎవడు ? కథం = ఎట్లు ? ప్రయాణకాలే చ = శరీరమును విడిచిపోవు సమయమున, నియతాత్మభిః = స్వాధీనమనస్కులగు నీ ముప్వరిచేతను. కథం = ఎట్లు, జ్ఞేయః = తెలియదగినవాడవు. అసి = అగుచున్నావు ?

తా॥ (శ్రీ)కృష్ణా ! ఈ కాన్పించుశరీరమున అధియజ్ఞమని పిలువబడువా డెవడు ? వాడట్లు పిలువబడుట కేమికారణము ? ఆత్మ శరీర మును విడిచిపోవు తరుణమున స్వాధీనమనస్కులగు నీ ముప్వ రిచేతను నీవెట్లు ధ్యానింపబడవలయును ?

అవ. ఈ ప్రశ్నల కన్నిటికిని శ్రీ భగవానుడు క్రమముగ నుత్తరమొసంగు చున్నాడు. అందీశ్లోకమున తత్ర్బహ్మ, అధ్యాత్మము, కర్మల స్వరూపము నెఱింగించుచున్నాడు.

శ్రీ భగవానువాచ = శ్రీకృష్ణుడు పలికెను.

3. శ్లో. అక్షరం బ్రహ్మ పరమం । స్వభావోఽధ్యాత్మ ముచ్యతే
భూతభావోద్భవకరో । విసర్గః కర్మసంజ్ఞితః ॥

అర్థము :- పరమం = గొప్పదగు, అక్షరం = నాశరహితమగు జీవసముదాయము. బ్రహ్మ = తత్ర్బహ్మగా (ఉచ్యతే = చెప్పబడుచున్నది). స్వభావః = ప్రకృతి. అధ్యాత్మం = అధ్యాత్మమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది. భూతభావోద్భవకరః = మనుష్యత్వాదిసిద్ధికి కారణమైన, విసర్గః = రేత స్సును విడుచుట, కర్మసంజ్ఞితః = కర్మయనబడును.

తా॥ ప్రకృతికంటెను; బద్ధులకంటెను విలక్షణమగు శుద్ధాత్మ సముదా యము తత్ర్బహ్మయనియు, ఆత్మను నిరంతరమంటియుండు భూత సూక్ష్మములును, వాటివలనబుట్టు వాసనాదులును అధ్యాత్మ మనియు, మనుష్యుడుగా బుట్టుటకు కారణమైన సంభోగము కర్మయనియు చెప్పబడును. ఈ మూడింటిలో మొదటిది ముము క్షువులకు పొందబడుటకును మిగిలిన రెండును విడువబడుటకును నెఱుంగదగినవి.

అవ. అధిభూత, అధిదైవ, అధియజ్ఞముల స్వరూపము నెఱింగించు చున్నాడు.

4. శ్లో. అధిభూతం క్షరోభావః । పురుష శ్చాధిదైవతమ్
అధియజ్ఞోఽహ మేవాత్ర । దేహే దేహభృతాం వర ॥

అర్థము :— దేహభృతాం = దేహధారులలో, వర = శ్రేష్ఠుడవైన ఓ యర్జునా! క్షరోభావః = నశించుస్వరూపముగల భూతసూక్ష్మముల నాశ్రయించియుండు శబ్దాదులు, అధిభూతం = అధిభూతమనబడును, పురుషః = సమస్త దేవతలకు పైనుండు సర్వేశ్వరుడు, అధిదైవతం = అధిదైవతమనబడును, అత్ర దేహే = ఈ కాన్పించు ఇంద్రాది శరీరమునందున్న, అహమేవ = నేనే, అధియజ్ఞః = అధియజ్ఞమనబడువాడను.

తా॥ బ్రహ్మేంద్రాదు లనుభవించు విషయములకంటె విలక్షణమై తనకాధారమగు భూతసూక్ష్మములతో కూడియుండు అధిభూతమనబడు శబ్దాదిభోగములును, ఆ బ్రహ్మేంద్రాదు లందరికంటెను పైవాడగుటచే అధిదైవతమని చెప్పబడు సర్వేశ్వరుడును ఐశ్వర్యార్థుల కెఱుంగదగినవి. ఇంద్రాదులలో నంతర్యామిగానుండి సమస్త యజ్ఞములచే నిజముగ నారాధింపబడుటచే నధియజ్ఞమనబడు శ్రియఃపతి ముగ్గురిచే నెఱుంగదగినవాడు.

అవ. ముగ్గురు అధికారులును ఎఱుంగవలసిన మరణకాలమునందలి ధ్యానమునుగూర్చిన ప్రశ్న కుత్తర వొసంగుచున్నాడు.

5. శ్లో. అన్తకాలే చ మా మేవ । స్మర న్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి స మద్భావం । యాతి నా స్త్యత్ర సంశయః॥

అర్థము :— అన్తకాలేచ = మరణసమయమందు, మాం ఏవ = నన్నే, స్మరన్ = ధ్యానించుచున్నవాడై, కళేబరం = శరీరమును, ముక్త్వా = విడిచిపెటి, యః = ఎవడు, ప్రయాతి = పోవుచున్నాడో, సః = వాడు, మద్భావం = నా స్వభావమును, యాతి = పొందుచున్నాడు, అత్ర = ఈవిషయమై, సంశయః = సందేహము, నఅస్తి = లేదు.

తా॥ మరణ సమయమున భగవంతుని మాత్రమే తలంచుచు చనిపోవువాడు నిస్సంశయముగ తాను తలంచు భగవత్స్వరూపమునే పొందితీరును.

అవ. మరణకాలధ్యాన మేదైనను గానిమ్ము అది స్మరింపబడు విషయమునకు సజాతీయమైన ఆకారము నొసంగియేతీరు స్వభావముకలదై యుండునని చెప్పుచున్నాడు.

6. శ్లో. యం యం వాఽపి స్మరన్భావం । త్యజత్యన్తే కళేబరమ్
తం తమేవైతి కౌన్తేయ ! । సదా తద్భావభావితః ॥

అర్థము :— కౌన్తేయ = అర్జునా ; అన్తే = మరణసమయమున, యం యం భావం వా అపి = ఏయే స్వరూపమునైనను సరియే. స్మరన్ = తలంచుచు, కళేబరం = శరీరమును, త్యజతి = విడుచుచున్నాడో. సదా = ఎల్లప్పుడును, తద్భావభావితః = ఆ భావనయొక్క సంస్కారపటిమ కలవాడై, తం తం ఏవ = ఆయా స్వరూపమునే, ఏతి = పొందుచున్నాడు.

తా॥ ఏ స్వరూపమును తలంచుచు చనిపోవుచున్నాడో, నిరంతర మా స్వరూపధ్యాన సంస్కారపటిమచే తిరిగి జన్మాంతరమునం దాస్వరూపముతోనే పుట్టుచున్నాడు.

అవ. ఫలము అంతిమతలంపును బట్టియు, అంతిమతలంపు సంస్కారపటిమను బట్టియు సంస్కారపటిమ భావనాతిశయమునుబట్టియు, భావనాతిశయము చేయబడు కర్మనుబట్టియు నుండునుగాన వర్ణాశ్రమధర్మము నాచరింపుమని యుపదేశించుచున్నాడు.

7. శ్లో. తస్మాత్సర్వేషు కాలేషు । మామనుస్మర యుధ్య చ
మయ్యర్పితమనో బుద్ధిః । మామేవైష్యస్యసంశయః ॥

అర్థము :— తస్మాత్ = కాబట్టి, సర్వేషు కాలేషు = అన్ని వేళలయందును, మాం = నన్ను, అనుస్మర = ధ్యానింపుము, యుధ్య చ = యుద్ధమునున్ను చేయుము, మయి = నాయందు, అర్పితమనోబుద్ధిః = మనస్సును బుద్ధిని యుంచినవాడవై, మాం ఏవ = నన్నే, ఏష్యసి = పొందగలవు. అసంశయః = సందేహములేదు.

తా॥ కావున, చనిపోవువరకును సర్వదా నన్నే ధ్యానించుచు దానికి ముఖ్యకారణమైన వర్ణాశ్రమములకు చెందిన నిత్యనైమిత్తిక కర్మలను చేయుచుండుము. ఇట్లుపాయముగ నాయందు నీ మనోబుద్ధులనుంచి మరణసమయమున నన్నే తలంచుచు నీవు కోరిన రీతిగ నన్ను పొందుటలో సందేహమే లేదు.

మనస్సునుంచుట యనగా ధ్యానించుట.

బుద్ధినుంచుట యనగా ఫలమునిచ్చునని నమ్మియుండుట.

అవ. ఇట్లు సాధారణముగా తానభిలషించు ఫలప్రాప్తి మరణసమయ ధ్యానముపై నాధారపడియుండును గాన ముగ్గురును చేయవలసిన ఉపాసనరీతులలోగల తారతమ్యమునుతెలుపగోరి మునుముందు ఐశ్వర్యార్థుల ఉపాసనవిధానమును దానిని బట్టియుండు మరణ సమయపు ధ్యానపద్ధతిని తెలుపుచున్నాడు

8. శ్లో. అభ్యాసయోగయుక్తేన । చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం । యాతి పార్థానుచిన్తయన్ ॥

అర్థము :– పార్థ = అర్జునా ; అభ్యాసయోగయుక్తేన = అభ్యాసయోగములతో కూడుకొనియున్నదగుటచే, నాన్యగామినా = చలించనటి, చేతసా = మనస్సుచేత, దివ్యం = అప్రాకృతుడను, పరమం = చేతనాచేతన విలక్షణుడైన, పురుషం = పురుషుడనగునన్ను, చిన్తయన్ = ధ్యానించుచున్నవాడై, (మాం ఏవ = నన్నే) యాతి = పొందుచున్నాడు.

తా॥ అభ్యాసమనగా – ధ్యేయమగు వస్తువునందు సర్వదా మనస్సునుంచుట. యోగమనగా ప్రతినిత్యము ధ్యానసమయమున ప్రీతితో ప్రత్యక్ష సమానాకారముగ చేయబడు ప్రధానోపాసనము. ఈ రెండింటివలనను మనస్సు ఏకాగ్రమగును. అట్టి మనస్సుతో నంతిమ సమయమున పరమాత్మను ధ్యానించినచో ఐశ్వర్యమున భగవంతుని పోలిన యాకారముతో తిరిగిజన్మించును.

9. శ్లో. కవింపురాణమనుశాసితార । మణోరణీయాంసమనుస్మరేద్యః
సర్వస్యధాతారమచిన్త్యరూప।మాదిత్యవర్ణంతమసఃపరస్తాత్॥

అర్థము :– కవిం = సర్వజ్ఞుడును, పురాణం = పురాతనుడును, అనుశాసితారం = అన్నిటికి నాజ్ఞాపకుడును, అణోః = అణువగు జీవునికంటె, అణీయాంసం = మిక్కిలి సూక్ష్మమైనవాడును, సర్వస్య = సకలజగత్తునకును, ధాతారం = సృష్టికర్తయును, అచిన్త్యరూపం = చింతింపశక్యముకాని స్వరూపముకలవాడును, తమసః = ప్రకృతికంటె, పరస్తాత్ = బహిర్భూతమైన, ఆదిత్యవర్ణం = సూర్యునివంటి రంగుకలవాడును.

తా॥ సర్వజ్ఞుడును, పురాతనుడును, ప్రపంచమునకు శిక్షకుడును, జీవునికంటెను సూక్ష్మమైనవాడును, సృష్టికర్తయు, చింతింపశక్యముకాని విలక్షణ స్వరూపుడును, అప్రాకృతమై సూర్యునివలె ప్రకాశించు దివ్యమంగళ శరీరము కలవాడును అగు పురుషుని

(దీనికి ముందుశ్లోకముతో సంబంధము కలదు.)

10. శ్లో. ప్రయాణకాలే మనసా ఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యమ్ ॥

అర్థము :– దివ్యం = దివ్యమైన, పరంపురుషం = పరమపురుషుని, యః = ఎవడు, భక్త్యా = భక్తితోను, యోగబలేన చ ఏవ = యోగబలముతోనున్న, యుక్తః (సన్) = కూడుకొనినవాడగుచు, అచలేన = నిశ్చలమైన, మనసా = మనస్సుతో, ప్రయాణకాలే = మరణసమయమున, భ్రువోః = కనుబొమలయొక్క, మధ్యే = మధ్యయందు, ప్రాణం = ప్రాణవాయువును, సమ్యక్ = బాగుగా, ఆవేశ్య = స్థాపించి, అనుస్మరేత్ = స్మరించునో, సః = వాడు, తం = ఆ పరమపురుషుని, ఉపైతి = పొందుచున్నాడు

తా॥ అట్టి దివ్యమైన పరమపురుషుని నిత్యాభ్యాసముగల భక్తియోగ బలముచే చలించని మనస్సుకలవాడై చనిపోవుసమయమందు కనుబొమలమధ్య ప్రాణవాయువును చక్కగా నిలిపి సదాస్మరించువాడు తప్పక ఆ దివ్యపురుషునితో సమానమగు ఐశ్వర్యముకలవాడగును.

అవ. కైవల్యమును కోరువారు స్మరింపవలసిన పద్ధతిని చెప్పుచున్నాడు.

11. శ్లో. యదక్షరం వేదవిదో వదన్తి । విశన్తియ ద్యతయో వీతరాగాః
యదిచ్ఛన్తోబ్రహ్మచర్యంచరన్తి।తత్తేపదంసఙ్గ్రహేణప్రవక్ష్యే ॥

అర్థము :- వేదవిదః = వేదార్థము నెఱింగినవారు, యత్ = దేనిని, అక్షరం = వికారములు లేనిదానినిగా, వదన్తి = చెప్పుచున్నారో, యత్ = ఏ అక్షరమును, వీతరాగాః = కోరికలులేనివారగు, యతయః = జితేంద్రియులు, విశన్తి = ప్రవేశించుచున్నారో, యత్ = ఏ యక్షరమును, ఇచ్ఛన్తః = పొందగోరుచున్నవారై, బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యవ్రతమును, చరన్తి = ఆచరించుచున్నారో, తత్ = ఆ, పదం = పొందబడు వస్తువునుగూర్చి, తే = నీకు, సఙ్గ్రహేణ = సంక్షేపముగా, ప్రవక్ష్యే = చెప్పగలను,

తా॥ వేదార్థము నెఱింగిన పెద్దలే యక్షరమును స్థౌల్యాది వికారములు లేనిదానినిగా చెప్పుదురో, విరక్తులగు యతులు ఏ యక్షరమును పొందుదురో; ఏయక్షరమును పొందగోరి బ్రహ్మచర్యము నాచరింతురో నిఖిలవేదాంత ప్రసిద్ధమైన అట్టి నా స్వరూపమగు అక్షరమును ఉపాసనకు తగినట్లు నీకు సంగ్రహముగ జెప్పెదను.

12. శ్లో. సర్వద్వారాణి సంయమ్య । మనో హృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ । మాస్థితో యోగధారణామ్॥

అర్థము :— సర్వద్వారాణి = సకలజ్ఞానేంద్రియములను, సంయమ్య = అరికట్టి, మనః = మనస్సును, హృది = హృదయమునందు, నిరుధ్యచ = నిలిపి యుంచి, యోగధారణాం = యోగమనబడు ధారణను, ఆస్థితః = పొందిన వాడై, ఆత్మనః = తనయొక్క, ప్రాణం = ప్రాణవాయువును, మూర్ధ్ని = శిరస్సునందు, ఆధాయ = ఉంచి

తా॥ జ్ఞానేంద్రియములను వాటి పనులనుండి మరలించి హృదయ కమలమందున్న పురుషోత్తమునియందు మనస్సును నిలిపి అచ్చట స్థిరమైన స్థితికలవాడై తన ప్రాణవాయువును తలయందుండు సుషుమ్నయందు ప్రవేశపెట్టి, (వీనికి ముందుశ్లోకముతో సంబంధముకలదు.)

13. శ్లో. ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ । వ్యాహరన్ మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం । స యాతి పరమాం గతిమ్॥

అర్థము :— బ్రహ్మ = పరమాత్మను బోధించునట్టి, ఓమ్ ఇతి = ఓం అనెడు, ఏకాక్షరం = ఒకే అక్షరమును, వ్యాహరన్ = ఉచ్చరించుచు, మాం = నన్ను, అనుస్మరన్ = ధ్యానించుచున్నవాడై, దేహం = శరీరమును, త్యజన్ = విడుచుచున్నవాడై, యః = ఎవడు, ప్రయాతి = వెడలిపోవునో, సః = వాడు, పరమాం గతిం = గొప్పదైన గతిని, యాతి = పొందుచున్నాడు.

తా॥ నన్ను బోధించునట్టి ఓం అనెడు ఒకే అక్షరమును ఉచ్చరించుచు ఓంకార వాచ్యుడనగు నన్ను ధ్యానించుచు శరీరమును విడిచి అర్చిరాది మార్గమున పోవువాడు నాతో సమానమగు ఆకారముగల తన శుద్ధాత్మ స్వరూపమును పొందును.

అవ. ఇట్లు ఐశ్వర్యార్థికిని, కైవల్యార్థికిని తాము పొందగోరు ఫలములకు తగునట్లు భగవంతు నుపాసింపవలసిన రీతిని పేర్కొని, ఇప్పుడు భక్తుని భగవదుపాసనా పద్ధతిని, ఆతడు భగవంతుని పొందురీతిని చెప్పుచున్నాడు.

14. శ్లో. అనన్యచేతా స్సతతం । యో మాం స్మరతి నిత్యశః
తస్యా హం సులభః పార్థ ! । నిత్యయు క్తస్య యోగినః॥

అర్థము :- పార్థ ! = అర్జునా ! యః = ఎవడు, నిత్యశః = ప్రతినిత్యమున్ను, సతతం = సర్వకాలమందున్ను, అనన్యచేతాః = ఇతర విషయములపై ప్రవర్తించని మనస్సుకలవాడై, మాం = నన్ను, స్మరతి = చింతించుచున్నాడో, నిత్యయుక్తస్య = నాతోడి నిత్యసంబంధముకల, తస్య = అట్టి; యోగినః జ్ఞానికి, అహం = నేను, సులభః = సుఖముగా పొందతగినవాడను, (భవామి = అగుచున్నాను).

తా॥ అర్జునా ! భక్తి యోగారంభమునుండియు సర్వకాలమును ఇతర విషయములను తలంచక నన్నే స్మరించుచు నాతోడి నిత్యసంబంధమును కోరునట్టి భక్తియోగికి నేనే పొందదగినవాడను, ఆతడు నన్ను సుఖముగ పొందగలడు.

అవ. ఇక మీదట మిగిలిన యధ్యాయముచే భక్తునకును, కైవల్యార్థికిని గమ్యస్థానమునుండి తిరిగి రాకుండుటయు, ఐశ్వర్యార్థికి తిరిగి రావలసియుండుటయును చెప్పుచున్నాడు.

15. శ్లో. మా ముపేత్య పున ర్జన్మ । దుఃఖాలయ మశాశ్వతమ్
నా ప్నువ న్తి మహాత్మాన । స్సంసిద్ధిం పరమాంగతాః॥

అర్థము :- మహాత్మానః = గొప్పమనస్సుకలవారును, పరమాం = గొప్పదైన, సంసిద్ధిం = సిద్ధిని, గతాః = పొందినవారునుఅయి, మాం = నన్ను, ఉపేత్య = పొంది, పునః = తిరిగి, దుఃఖాలయం = దుఃఖములకు స్థానమైనట్టియు, అశాశ్వతం = అస్థిరమైనదియునగు, జన్మ = జన్మమును, న ఆప్నువన్తి = పొందరు.

తా॥ గొప్ప మనస్సుకలవారు నా నిజస్వరూపము నెఱింగి నాయందే తమ మనస్సును లగ్నముచేసి నన్నే ఆశ్రయించి ఉపాసించి సంసిద్ధి రూపుడనైన నన్ను పొందుచున్నారు. పిదప, వారు దుఃఖ పరంపరలకు తావరమగు నస్థిర జన్మలను పొందరు.

అవ. ఐశ్వర్యగతిని పొందినవారు. తిరిగి వచ్చుటకును, భగవంతుని పొందినవారు తిరిగి రాకుండుటకును కారణము నికముందు చెప్పు చున్నాడు.

16. శ్లో. ఆబ్రహ్మభువనాల్లోకాః । పునరావర్తినోఽర్జున
మా ముపేత్య తు కౌన్తేయ । పునర్జన్మ న విద్యతే॥

అర్థము :— అర్జున = అర్జునుడా! ఆబ్రహ్మభువనాత్ = బ్రహ్మలోకమునుంచి తనుండెడి, లోకాః = లోకములన్నియు, పునరావర్తినః = తిరిగివచ్చెడివి. (భవన్తి = అగుచున్నవి) కౌన్తేయ! = అర్జునా! మాం = నన్ను : ఉపేత్య = పొంది నచో, పునర్జన్మ = తిరిగి పుట్టుక, న విద్యతే = కలుగనేరదు.

తా॥ అర్జునా! బ్రహ్మలోకము మొదలైన లోకములెల్ల నశించునవి. కావున, ఆలోకములను పొందినవారికి తిరిగివచ్చి సంసారమున జన్మించుట తప్పదు. నేను నిర్వికారుడ నగుటచే నన్ను పొందిన వారికి నాశప్రసక్తిలేదు. కనుక వారికి తిరిగిపుట్టుట యుండ నేరదు.

అవ. బ్రహ్మలోక పర్యంతముగల లోకములును, ఆలోకస్థులును భగ వంతునిచే నేర్పరచబడిన కాలనియమము ననుసరించి పుట్టుచును గిట్టుచును ఉందురని చెప్పుచున్నాడు.

17. శ్లో. సహస్రయుగ పర్యన్త । మహర్య ద్బ్రహ్మణో విదుః
రాత్రిం యుగసహస్రాన్తాం । తేఽహోరాత్రవిదో జనాః॥

అర్థము :— అహోరాత్రవిదః = రాత్రి - పగలు అనెడు కాలనిర్ణయమునెఱుంగు, తే జనాః = ఆ జనులు, బ్రహ్మణః = చతుర్ముఖునకు, యత్ = ఏది, అహః = పగలో, (తత్ = దానిని) సహస్రయుగపర్యన్తం = వేయి చతు ర్యుగములు పరిమితి కలదానినిగాను, రాత్రిం = రాత్రిని, యుగసహ స్రాన్తాం = వేయిచతుర్యుగములు పరిమితి కలదానినిగాను, విదుః = తెలుసు కొనుచున్నారు.

తా॥ నా సంకల్పముచే గావింపబడిన అహోరాత్రుల నిర్ణయము నెఱిం గినవారు చతుర్ముఖ బ్రహ్మకు పగలు వేయి చతుర్యుగముల పరి మితి కలదిగాను, రాత్రియును వేయి చతుర్యుగముల పరిమితి కలదిగాను ఎఱుంగుదురు.

18. శ్లో. అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః । ప్రభవ న్త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయన్తే । తత్రైవా వ్యక్త సంజ్ఞకే॥

అర్థము :– అహరాగమే = బ్రహ్మకు పగలైనపుడు, అవ్యక్తాత్ = బ్రహ్మశరీరమైన ప్రకృతినుండి, సర్వాః = సమస్తమైన, వ్యక్తయః = వస్తువులన్నియు, ప్రభవన్తి = పుట్టుచున్నవి. రాత్ర్యాగమే = బ్రహ్మకు రాత్రిరాగానే; అవ్యక్త సంజ్ఞకే = అవ్యక్తావస్థయనబడు, తత్రఏవ = ఆబ్రహ్మ దేహమునందే, ప్రలీయన్తే = లీనమగుచున్నవి.

తా॥ బ్రహ్మకు పగలు వచ్చినపుడు మూడు లోకములయందలి సమస్త వస్తువులును చతుర్ముఖ బ్రహ్మశరీరమునుండి పుట్టుచున్నవి. అట్లే ఆ బ్రహ్మకు రాత్రి రాగానే ఆ దేహమునందే లీనమగుచున్నవి.

19. శ్లో. భూతగ్రామ స్సఏ వాఽయం । భూత్వా భూత్వా ప్రలీయతే
రాత్ర్యాఽగమేఽ వశః పార్థ । ప్రభవ త్యహ రాగమే॥

అర్థము :- పార్థ = అర్జునా ! సః = అట్టి, అయం = ఈ, భూతగ్రామః ఏవ = భూత సమూహమే, భూత్వాభూత్వా = పుట్టిపుట్టి, రాత్ర్యాగమే = రాత్రిరాగానే, ప్రలీయతే = లయమునుపొందుచున్నది. అహరాగమే = పగలురాగానే, ప్రభవతి = పుట్టుచున్నది.

తా॥ అట్టి యీ భూతజాతమంతయు కర్మకు వశమై తనను సారముగా చతుర్ముఖ బ్రహ్మకు పగలు రాగానే పుట్టుచు, రాత్రి రాగానే అడగిపోవుచున్నది.

అవ. పిమ్మట కైవల్యమును బడసినవారికిని తిరిగి పుట్టుటలేదని చెప్పు చున్నాడు.

20. శ్లో. పర స్తస్మాత్తు భావోఽ న్యో । వ్యక్తోఽ వ్యక్తా త్సనాతనః
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥

అర్థము :— తస్మాత్ = అటువంటి, అవ్యక్తాత్ = ప్రకృతికంటె, పరః = గొప్పదియు, అన్యః = వేరైనదియు, సనాతనః = నిత్యమైనదియునగు, యః = ఏ, భావః = పదార్థము, సర్వేషు = సమస్తమైన, భూతేషు – ఆకాశాదిభూతములు, నశ్యత్సు = నశించుచున్నను, న వినశ్యతి = నశించదో, సః = అది.

తా॥ అచేతనమగు నీ ప్రకృతికంటె గొప్ప పురుషార్థమైనవాడును, జ్ఞానాకారుడు గాన దానికంటె విజాతీయుడును, ఏప్రమాణమునకును గోచరించనివాడును, నిత్యమైనవాడును, ఆకాశాది భూతములు నశించినను వాటియందుండియు నశించని వాడునునగు పరిశుద్ధమైన ఆత్మ – (దీనికి ముందుశ్లోకముతో సంబంధముకలదు).

21. శ్లో. అవ్యక్తోఽ క్షర ఇత్యుక్తః । త మాహుః పరమాం గతిమ్
యం ప్రాప్య న నివర్తన్తే । తద్ధామ పరమం మమ॥

అర్థము :—అవ్యక్తః = ఏప్రమాణములకును తెలియతగని, అక్షరః ఇతి = పరిశుద్ధమైన ఆత్మస్వరూపముఅని, ఉక్తః = చెప్పబడినది, తం = దానిని, పరమాం = ముఖ్యమైన, గతిం = గతినిగా, ఆహుః = చెప్పుచున్నారు, యం = ఏ పరిశుద్ధాత్మస్వరూపమును, ప్రాప్య = పొందిన, నివర్తన్తే = మరలపుట్టరో, తత్ = అది, మమ = నాయొక్క, పరమం = గొప్పదగు, ధామ = నియమనస్థానము, భవతి = అగుచున్నది.

తా॥ ఏప్రమాణములకును తెలియబడదు. ప్రకృతి సంబంధమునకు తగని పరిశుద్ధ స్వరూపుడు. వేదవేత్తలీస్వరూపమును పరమగతి యని చెప్పుదురు. ఇట్టి యాత్మస్వరూపమును పొందినవారు మరల పుట్టరు. ఇది నాకు ముఖ్యమైన నియమనస్థానము.

అవ. భక్తుడు పొందునట్టి ఫలమింతకెన్నియో మఱుంగు ఉత్తమమైన దనుచున్నాడు.

22. శ్లో. పురుష స్స పరః పార్థ! । భక్త్యా లభ్య స్త్వనన్యయా
యస్యా న్తస్థాని భూతాని । యేన సర్వ మిదం తతమ్॥

అర్థము :— పార్థ = అర్జునా ! భూతాని = సమస్తప్రాణులును, యస్య = ఎవనియొక్క అన్తస్థాని = లోపలనున్నవో, యేన = ఎవనిచేత, ఇదం సర్వం = ఈ ప్రపంచమంతయు, తతం = వ్యాపింపబడియున్నదో, సః = అట్టి, పరః పురుషః = పరమపురుషుడు, అనన్యయా = ఇతర విషయములేని, భక్త్యా = భక్తిచేత, లభ్యః = పొందదగినవాడు.

తా॥ అర్జునా ! ఎవనిలోపల సమస్త భూతములును అంతర్గతములై యున్నవో, ఏ పరమపురుషునిచే సమస్త ప్రపంచము వ్యాప్తమై యున్నదో అట్టి పరమాత్మ అనన్యమగు భక్తిచే మాత్రమే పొందదగినవాడు.

అవ. ఆత్మయొక్క నిజరూపము నెఱింగిన కేవలునకును పరమపురుష నిష్ఠుడగు భక్తునకును లభించునట్టి యర్చిరాది మార్గమునుగూర్చి చెప్పుచున్నాడు.

23. శ్లో. యత్ర కాలే త్వనావృత్తి । మావృత్తించైవ యోగినః
ప్రయాతా యాన్తి తం కాలం । వక్ష్యామి భరతర్షభ ! ॥

అర్థము :— భరతర్షభ = అర్జునా ; యత్రకాలే = ఏకాలమునందు, ప్రయాతాః = శరీరమును విడిచిపోయిన, యోగినః = జ్ఞానులు, అనావృత్తిం = పునర్జన్మ రాహిత్యమును, ఆవృత్తించఏవ = పునర్జన్మమును, యాన్తి = పొందుచున్నారో, తం = ఆ, కాలం = కాలమును, వక్ష్యామి = చెప్పగలను.

తా॥ అర్జునా ! దేహమును విడిచి ఏకాలాభిమాని దేవతలుండు మార్గమునపోయిన యోగులు తిరిగిపుట్టరో, ఏకాలాభిమాని దేవతలున్న మార్గమునపోయిన వారుతిరిగి పుట్టుదురో ఆ మార్గములనుగూర్చి చెప్పెదను.

అవ. అర్చిరాది మార్గమునుగూర్చి చెప్పుచున్నాడు.

24. శ్లో. అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్లః । షణ్మాసా ఉత్తరాయణమ్
తత్ర ప్రయాతా గచ్ఛన్తి । బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥

అర్థము :— అగ్నిర్జ్యోతిః = అగ్నిరూపమైన తేజస్సును. అహః = పగలును. శుక్లః = శుక్లపక్షమును. షణ్మాసాః = ఆరుమాసములుగల. ఉత్తరాయణం = ఉత్తరాయణమును. (యత్ర = ఎచ్చట. సన్తి = కలరో) తత్ర = ఆదారిని. ప్రయాతాః = ప్రయాణముచేసిన. బ్రహ్మవిదః = బ్రహ్మోపాసకులగు. జనాః = జనులు. బ్రహ్మ = బ్రహ్మమును. గచ్ఛన్తి = పొందుచున్నారు.

తా॥ అగ్నిరూపమైన తేజోఽభిమాని దేవతయు, పగటి యభిమాని దేవతయు, శుక్ల పక్షాభిమాని దేవతయు, ఆరుమాసముల పరిమితి గల ఉత్తరాయణాభిమాని దేవతయు, మొదలగు వారుండునట్టి మార్గవిశేషమున పోయిన బ్రహ్మోపాసకులు బ్రహ్మనే పొందుదురు.

అవ. ధూమాది మార్గమునుగూర్చి చెప్పుచున్నాడు.

25. శ్లో. ధూమో రాత్రి స్తథా కృష్ణ । షణ్మాసా దక్షిణాయనమ్
తత్ర చాన్ద్రమసం జ్యోతి । ర్యోగీ ప్రాప్య నివర్తతే॥

అర్థము :— ధూమః = ధూమాభిమానిదేవతయు. రాత్రిః = రాత్రియభిమానిదేవతయు. తథా = అట్లే. కృష్ణః = కృష్ణపక్షాభిమానిదేవతయు. షణ్మాసాః = ఆరు నెలలుపరిమితిగల. దక్షిణాయనం = దక్షిణాయనమునకు అభిమానిదేవతయు. (యత్ర సన్తి = ఏమార్గమునకలరో) తత్ర = ఆమార్గమందు. చాంద్రమసం = చంద్రసంబంధియగు. జ్యోతిః = తేజస్సును. ప్రాప్య = పొంది. యోగీ = పుణ్యకర్మలనాచరించువాడు. నివర్తతే = తిరిగి పుట్టుచున్నాడు.

తా॥ ధూమాభిమాని దేవతయు, రాత్రి అభిమాని దేవతయు, కృష్ణపక్షాభిమాని దేవతయు, ఆరుమాసములు పరిమితిగల దక్షిణాయనాభిమాని దేవతయు, ఏమార్గమందుందురో అట్టి చంద్ర మండల మార్గమున పుణ్యాత్ముడుపోయి తిరిగివచ్చి భూమి యందు పుట్టును.

అవ. ఈరెండు మార్గములను గూర్చియు వేదప్రమాణ ప్రసిద్ధిని చూపుచున్నాడు.

26. శ్లో. శుక్లకృష్ణేగతీ హ్యేతే । జగతః శ్శాశ్వతే మతే
ఏకయా యాత్యనావృత్తి । మన్యయాఽఽవర్తతే పునః॥

అర్థము :— శుక్లకృష్ణే = శుక్లపక్షకృష్ణపక్షసంబంధములగు, ఏతే గతీ = ఈ రెండు దారులను, జగతః = లోకమునకు, శాశ్వతే = స్థిరమైనవిగా, మతేహి = శాస్త్రసమ్మతములుగదా ; ఏకయా = ఒకదానిచేతను, అనావృత్తిం = తిరిగి పుట్టకుండుటను, యాతి = పొందుచున్నాడు, అన్యయా = వేరొకదాని చేత, పునః = మరల, ఆవర్తతే = తిరిగి పుట్టుచున్నాడు

తా॥ శుక్లపక్షముతో కూడినది యర్చిరాది మార్గము; కృష్ణపక్షముతో కూడినది ధూమాది మార్గము; అర్చిరాది మార్గమున పోయినవాడు తిరిగి భూలోకమున పుట్టడు. ధూమాది మార్గమున పోయినవాడు మరలవచ్చి భూమిపై జన్మించుచున్నాడు. ఈ మార్గములు రెండును జ్ఞానులకును, పుణ్యకర్ములకును శాశ్వతమైనవని శ్రుతులు ఉద్ఘోషించుచున్నవి.

అవ. ఈ మార్గములను నిరంతరము తలంచుచుండుటయు భగవదుపాసన వలె భగవత్ప్రాప్తికి సాధనమగుచున్నదిగాన నట్లు తలంచుచుండ మని యుపదేశించుచున్నాడు.

27. శ్లో. నైతే సృతీ పార్థ! జానన్ । యోగీ ముహ్యతి కశ్చన
తస్మా త్సర్వేషు కాలేషు । యోగయుక్తో భవా ర్జున ! ॥

అర్థము :— పార్థ = అర్జునా ! ఏతేసృతీ = ఈరెండుదారులను. జానన్ = ఎఱుంగుచున్న. కశ్చనయోగీ = ఏయోగియున్ను. న ముహ్యతి = మోహమును చెందడు. తస్మాత్ = కాబట్టి, అర్జున ! = అర్జునుడా ! సర్వేషుకాలేషు = అన్నివేళలయందును, యోగయుక్తః = యోగముతో కూడినవాడవు. భవ = అగుము

తా॥ అర్జునా ! ఈ రెండు దారులలో నర్చిరాది మార్గము పరిగ్రాహ్యము. ధూమాది మార్గము పరిత్యాజ్యము. ఇట్లు తలంచు యోగి మరణ సమయమున భ్రమను చెందడు. తనకు హితమగు నర్చిరాది మార్గమునుబట్టియే పోవును. కాబట్టి, నీవు ఎల్లకాలమును అర్చిరాది మార్గమునే తలంచుచుండుట యనెడు యోగముతో కూడియుండుము.

అవ. ఇట్లు ఏడు ఎనిమిది యధ్యాయములలో చెప్పబడిన శాస్త్రార్థముల నన్నింటిని యెఱుంగుటవలనకలుగు ఫలమును చెప్పుచున్నాడు.

28. శ్లో. వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు య త్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్॥

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అక్షరపరబ్రహ్మ యోగోనామ అష్టమోఽధ్యాయః

అర్థము :- ఇదం = ఈరెండధ్యాయములలో చెప్పబడిన భగవంతుని మహిమను, విదిత్వా = తెలుసుకొని, వేదేషు = వేదములయందును, యజ్ఞేషు = యజ్ఞములయందును, తపస్సు = తపస్సులయందును, దానేషు చ ఏవ = దానములయందును, యత్ = ఏ, పుణ్యఫలం = పుణ్యఫలము, ప్రదిష్టం = చెప్పబడినదో తత్సర్వం = దానినంతను, అత్యేతి = అతిక్రమించుచున్నాడు, యోగీచ = జ్ఞానియై, పరం = గొప్పదియగు, ఆద్యం = అనాదియైన స్థానం = పదవిని, ఉపైతి = పొందుచున్నాడు.

తా॥ ఇట్లీ రెండధ్యాయములలో చెప్పబడిన భగవంతుని మాహాత్మ్యమును తెలిసికొనుటవలన వేదములను అభ్యసించుటచేతను, యజ్ఞతపోదానాది పుణ్యకర్మల నాచరించుటచేతను ఏఫలము కలుగునని చెప్పబడినదో ఆఫలమునంతను గడ్డిపరకవలె తలంచును. ఇంతియగాక జ్ఞానికి పొందదగిన అన్నిటికిని మిన్నయగు అనాది స్థానమునున్ను పొందుచున్నాడు.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన శ్రీభగవద్గీత యందలి అక్షర పరబ్రహ్మ యోగమనెడు ఎనిమిదవ అధ్యాయము.

| | | |
|---|---|---|
| ఈయధ్యాయమునందలి శ్లోకములసంఖ్య | 28 | ఇందర్జునునిశ్లోకములు 2 |
| ఇప్పటికి మొత్తమైన శ్లోకములు | 338 | శ్రీకృష్ణుని శ్లోకములు 26 |







# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

## అష్టాక్షరిక్షేత్రము - బదరీనాథ్ - గార్వాలజిల్లా.

# బదరీ నారాయణమున అన్న దాన విరాళ వివరములు

శ్రీ దండి శ్రీమన్నారాయణరామానుజజీయర్ స్వామివారి మంగళాశాసనపూర్వకము

తెలియజేయునది:— శ్రీమతే నారాయణాయనమః.

---

(1) బదరీ నారాయణమున మన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారి ద్వారా యేర్పాటు చేయబడిన అష్టాక్షరీ క్షేత్రమున ప్రతి సంవత్సరమున్ను వైశాఖమాసమునుండి కార్తీకమాసమువరకు అయిన ఆరుమాసములు ఆగంతుకులైన శ్రీవైష్ణవులకు, విద్యార్థులకు, ఆంధ్రదేశీయ యాత్రికులక దండి సన్న్యాసులకు, అంగవికలులకు, దరిద్రులకును అన్నదానమును యథావకాశముగ జరుపబడ చుండుటకు నిశ్చయింపబడినది.

ప్రతిమానవునకును తన తోడి మానవుల సహాయము తప్పదు గాన తనకున్న దానిలో దే కాల పాత్రల నారసి కొంతభాగమును దాన ధర్మములకై వినియోగించవలెను. పూర్వజన్మమున పె పుట్టుటచేతనే గదా ఈ జన్మమున ఐశ్వర్యలాభము. అట్లే ముందు జన్మమునకై, సుఖజీవనమున యీ జన్మమునందును దానధర్మములు గావించవలదా!

చూడుడు దానికిది యెంత మంచి యవకాశమో!!

దేశమా— ప్రపంచములో పరమపవిత్రమైన దేవతాభూమియగు బదరికాశ్రమము.

కాలమా—దేవతల యారాధన అయినపిమ్మట మానవులు బదరీశు నారాధించు పవిత్రమైన ఆరుమాసముల

పాత్రలా— బదరీశుని సేవించి బ్రహ్మకపాలమున పితృఋణమును తీర్చుకొని శ్రీ అష్టాక్షరీ మంత్రము జపించి తరించగోరు పుణ్యమూర్తులగు యాత్రికులు.



శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము వారిద్వారా బదరీనాథ్‌లో [illegible]
శ్రీ భూదేవీ సహిత శ్రీనివాసులు - రాజ్యలక్ష్మి గోదాదేవి భగవద్రామానుజ [illegible]

**Sri Srinivasa Ramanuja Swamy Varu at Badrinath Garhwal Dt.**
**Installed by : Sri Visishtadwitha Pracharaka Sangham.**





శ్రీమతే రామానుజాయ నమః.

వికారి వైశాఖము
1-5-1959

భక్తినివేదన
ప్రచార విభాగము



# అఖిల భారత
# శ్రీవైష్ణవ మహాసభలు

సమిష్టి ఉపనయనములు



## సీతారాంబాగ్ - హైదరాబాద్

ఆంధ్ర ప్రింటింగ్ వర్క్సు, వరంగల్.

శ్రీమతే రామానుజాయ నమః.

# అఖిల భారత శ్రీవైష్ణవ మహాసభలు

## సమిష్టి ఉపనయనములు

## సీతారాంబాగ్ — హైదరాబాద్.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ శాశ్వతాధ్యక్షులగు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి యాజమాన్యమున, అఖిల భారత శ్రీవైష్ణవ మహాసభలు సీతారాంబాగులో శ్రీ రామచంద్రస్వామివారి సన్నిధి ప్రాంగణమున 26-4-1959 మొదలు 29-4-59 వరకు 4 రోజులు మహా వైభవముగా జరిగినవి.

ఈ సభలో విద్వత్సమావేశములు, సంస్కృతోపన్యాసములు, లక్ష్మీపూజలు, పండిత సన్మానములు సమిష్టి ఉపనయనములు, అఖండ తదియారాధనలు బహుముఖముల పరమ విలక్షణముగా జరిగినవి.

ఈ మహాసభకు దేశము నలుముఖములనుండి పండితులు, ప్రతినిధులు దాదాపు 200 మంది విచ్చేసిరి.

26-4-59 వ తేది సాయంత్రము సభా ప్రారంభములో మన జీయ్యర్ స్వామివారు, ఇటీవల శ్రీరంగములో జరిగిన శ్రీరంగనాథుని అగ్ని ప్రమాదమునకు అనుతప్త హృదయముతో అయిదు నిముషములు సభవారందరు లేచి నిలిచి మౌనములో శ్రీరంగనాథునకు మానసికముగా "శ్రీమన్ శ్రీరంగ శ్రియమనుపద్రవా మనుదినం సంవర్థయ" అని మంగళాశాసనము చేయవలసినదిగా కోరిరి. సభవారందరు అట్లు కావించిరి.

29-4-59 వ తేది మధ్యాహ్నం గం॥ 4 నుండి సంస్కృత పండిత సమావేశము శ్రీమన జీయ్యర్ స్వామివారి అధ్యక్షతలో జరిగెను. ఇందులో 33 విద్వాంసులు పాల్గొనిరి. సంస్కృత విద్వత్సభను శ్రీమాన్ న్యాయ వేదాంత విద్వాన్ ఉ.వే. తే. కం. గోపాలాచార్యులుగారు సంస్కృతములో సభను ప్రారంభించిరి. ఆపిదప మహావిద్వాన్ తిరుపతి వాస్తవ్యులగు శ్రీఉ.వే. శ్రీమాన్ డి.టి. తాతాచార్యులు-గారు గంగాప్రవాహము వంటి వాగ్ధారతో సంస్కృత భాషలో ప్రస్తుత సమయములో పండితుల కర్తవ్యము ధర్మ ప్రచారమని ప్రబోధించిరి.

### ఈ పండిత సభలో పాల్గొనిన విద్వాంసుల తిరునామములు

1. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయ్యర్ స్వామివారు.
2. శ్రీశ్రీశ్రీ సంపత్కుమార యతిరాజ జీయ్యర్ స్వామివారు (కోరుట్ల)
3. శ్రీమాన్ ఉ.వే. తే. కం. గోపాలాచార్యుల స్వామివారు.
4. ,, ,, కవిరత్న గుడిమెళ్ల రామానుజ స్వామివారు
5. ,, ,, మహావిద్వాన్ డి. టి. తాతాచార్యస్వామివారు (తిరుపతి)
6. ,, ,, తిరుపతి శఠగోపాచార్య స్వామివారు
7. ,, ,, దాశరథి వెంకటాచార్య స్వామివారు
8. ,, ,, సంతానం గోపాలాచార్య స్వామివారు
9. ,, ,, గుడిమెళ్ల వెంకటనరసింహాచార్య స్వామివారు
10. ,, ,, తిరుమల పళ్లెల్లమూడి రామానుజ స్వామివారు (శ్రీరామతీర్థం)
11. ,, ,, చలమచర్ల రంగాచార్య స్వామివారు.

12. శ్రీమాన్ ఉ.వే. వేదాల తిరువేంగడాచార్య స్వామివారు
13. ,, ,, ఈయుణ్ణి వీరరాఘవాచార్య స్వామివారు
14. ,, ,, ఉపన్యాస భూషణ కో. కం. రంగాచార్యస్వామివారు (వరంగల్)
15. ,, ,, కో. కం. అప్పలాచార్య స్వామివారు
16. ,, ,, శ్రీవచనభూషణం పెరియవర్తి వెంకటనరసింహాచార్యస్వామివారు
17. ,, ,, మరింగంటి లక్ష్మీనరసింహాచార్యస్వామివారు
18. ,, ,, శిరిసనఘట్ల కృష్ణమాచార్య స్వామివారు
19. ,, ,, పుట్టపర్తి శ్రీనివాసాచార్య స్వామివారు
20. ,, ,, శఠగోపాచార్యస్వామివారు
21. ,, ,, వంగీపురం నరసింహాచార్య స్వామివారు
22. ,, ,, తి॥ వెగ్గంటి సంపత్కుమారాచార్యస్వామివారు (సింహాచలం)
23. ,, ,, శ్రీపుత్తిరుమలపురి హేళ్ల వెంకటాచార్యస్వామివారు (రాజమండ్రి)
24. ,, ,, ప్రతివాదిభయంకరం వేదాంతాచార్యస్వామివారు
25. ,, ,, చిలకూరి వెంకట రాఘవాచార్యస్వామివారు
26. ,, ,, మరింగంటి శ్రీరంగాచార్య స్వామివారు
27. ,, ,, స॥ చ॥ రఘునాథాచార్య స్వామివారు
28. ,, ,, మాడభూషి వెంకట రాఘవాచార్యస్వామివారు
29. బ్రహ్మశ్రీ విశ్వనాథ శర్మగారు
30. ,, ఖండవల్లి నరసింహశాస్త్రిగారు
31. ,, గోవింద శర్మగారు
32. శ్రీమాన్ ఉ.వే. ప్యారకపురి శ్రీరామాచార్య స్వామివారు
33. ,, ,, ఆరావముద అయ్యంగార్ స్వామివారు

ఈ మహాసభలో పాల్గొనిన విద్వాంసు లందరు శ్రీ జియ్యర్ స్వామివారు, రాజా పాక ఖర్చులు, శాలువలు, సంభావనముగా సన్మానము గావించిరి. డాక్టర్ కె. రంగాచార్యులగారి స్వాగతోపన్యాసముతో సభ ప్రారంభమయి శ్రీమాన్ చిలకమర్తి శ్రీనివాసాచారిగారి వైదిక ప్రార్థన సహాయములతోను సభ వైభవముగా జరిగెను.

ఈ పండిత మహా సభా నిర్వాహణములోను, తదియారాధన నిర్వాహణములోను, మాకు సకలవిధముల సీతారాంబాగ్‌లో నున్న శ్రీవైష్ణవ స్వాములును శ్రీ భూసురు పెద్దలును, ఎంతయో సహాయపడి ఈ కార్యక్రమము నిర్వహించిరి. ఈ సభల నిచ్చట సల్పుటకును, వీరి సక్రమ నిర్వాహణకును "శ్రీ లక్ష్మీనివాస్ గనేరీవాలా" గారు ముఖ్య కారకులు. ప్రారంభము నుండియు చివర వరకు వీరు చాల సేవ యొనర్చిరి. "శ్రీ లక్ష్మీప్రసాద్ బంకట్‌లాల్" గారు కూడ ఎంతయో సహాయపడిరి. మరియు శ్రీమాన్ శృంగారం నరసింహాచార్యుల గారున్నూ, శ్రీ మడపు శ్రీనివాస రావుగారున్నూ, యస్. వేణుగోపాలాచార్యుల గారున్నూ, శ్రీ మొ. రామానుజాచార్యులగారున్నూ చాల సేవ జేసిరి.

గోహత్య నిషేధముగూర్చి త్వరలో ప్రభుత్వము శాసనము గావించవలసినదిగాను దేవాలయములపై శాసనము చేయునప్పుడు ఆయా సాంప్రదాయ పండితులతో సంప్రదించి జేయవలసినదిగా కోరుచు యీ సభలో రెండు తీర్మానములు గావింపబడెను. సభ శ్రీ జీయర్ స్వామివారి మంగళాశాసనముతో 29-4-59 నాటి రాత్రి 10 గంటలకు ముగిసెను.

శ్రీ జీయ్యర్ స్వామివారి యాజమాన్యమున శ్రీ సీతారాంబాగ్‌లో వరదరాజస్వామివారి సన్నిధిని జరిగిన సమిష్టి ఉపనయనములు గావించుకొనిన వటువులు.

1 చిరంజీవి. యం. మురళీధరాచార్యులు
2 ,, సి. హెచ్. వరదాచార్యులు
3 ,, పి. రామాచార్యులు
4 ,, టి. పిళ్లాచార్యులు
5 ,, జి. పాండురంగాచార్యులు
6 ,, జి. రామాచార్యులు
7 ,, కె. కృష్ణమాచార్యులు
8 ,, చి. వెంకటాచార్యులు
9 ,, పి. సంపత్కుమారాచార్యులు
10 ,, కె. రామానుజాచార్యులు

11 చిరంజీవి- డి. కృష్ణమాచార్యులు
12 ,, బి. శేషాచార్యులు
13 ,, జి. రామమోహనరావు
14 ,, జి. రంగారావు
15 ,, ఏ. మోహనరావు
16 ,, పి. అనంతకిషన్ రావు
17 ,, డి.వి. రమేశకుమార్
18 ,, యక్. రంగారావు
19 ,, పి. దామోదరరావు
20 ,, పి. మోహనరావు
21 ,, జి. రఘునాథరావు
22 ,, యం. శ్రీధరరావు
23 ,, యం. మోహన్ రావు
24 ,, డి. వి. బాలకిషన్ రావు
25 ,, యం. వెంకటకిృష్ణారావు
26 ,, జి. వెంకటరామారావు
27 ,, పి. మురళీధరరావు
28 ,, సి. కృష్ణారావు
29 ,, కె. తిరుమలరావు
30 ,, పి. శ్యామసుందరరావు
31 ,, పి. రామమోహనరావు
22 ,, జి. నరహరిరావు
33 ,, యం. శ్యామసుందరరావు
34 ,, యం. లక్ష్మినరసింహారావు
35 ,, సి. వెంకటగోపాల్ రావు!
36 ,, కె. కిషన్ రావు
37 ,, మోహన్ దాసు
38 ,, రమేశ్, నర్సింగ్ దాసు
39 ,, రాంపాల్ శర్మ
40 ,, దామోదర్
41 ,, కె. సంపత్కుమార్
42 ,, ఉత్తరాది బ్రాహ్మణ బాలుడు

ఈ వటువులందరకు యథా శాస్త్రీయముగా 26-4-59 తేది నాటిరాత్రి ఉదక శాంతి జరిపింపబడెను. 27 తేది పగలు గం. 11-26 ని॥ లకు చక్కగా పంచశిఖలతో యథావిధిగా ఉపనయనములు జరిపింపబడెను. ఈ వటువలలో కొందరికి వారి కోరికపై శ్రీ జియ్యర్ స్వామివారు పంచ సంస్కారములు గావించిరి. 4 దినములు సకాలములో మూడు వేళల అగ్ని కార్యము, సంధ్యావందనములు, వటువులకు చెప్పబడెను. యీ విధముగా బ్రాహ్మణ ధర్మ పోషణార్థమై సం॥ నకు రెండు పర్యాయములు ఉపనయనములు గావించుచుందురు. అవకాశమున్న వారందరును తమ తమ ఉపనయన ఖర్చులను తామే భరించుకొనుచును, ఎవరైనను రు. 30/- కు మించకుండ అది యారాధనమే గాక, వటువులకందరకును, ఉపనయనములు జరిపించి, వారందరును సంధ్యావందనము చేయు కొనుచు గాయిత్రీనిష్ఠాలగునటుల జేయుటయే యీ సమిష్టి కార్యక్రమము యొక్క ప్రధానోద్దేశ్యము.

ఈ పర్యాయము కార్యక్రమములో 41 మందికి ఉచితముగ ఉపనయనములు గావింపబడెను. 28 మంది తమ ఖర్చులు తామే భరించిరి. మరియు జియ్యర్ స్వామివారి అధ్యక్షతక్రింద గీతా పరీక్షలు, స్తోత్రపాఠములు, పరీక్షలు జరిగినవి. శ్రీమాన్ కాండూరు నరసింహాచార్యులుగారు (కిషన్‌గంజి) పరీక్షార్థులకు బహుమతిగా విలువగల అనేక మంచి పుస్తకములు ఉచితముగా బహూకరించిరి. ఈ పరీక్షలు పెక్కు మంది వరంగల్ నుండి శ్రీ ముడుంబై రామానుజాచార్యులవారిచే సుశిక్షితులైవచ్చిరి. శ్రీ జియ్యర్ స్వామివారు ఈ పరీక్షా విధానమునకు చాల సంతోషించిరి. నాలాయిర దివ్య ప్రబంధములు. భగవద్గీత శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రము, ఆళవందార్ స్తోత్రము ముకుందమాల, యతిరాజవింశతి, శ్రీలక్ష్మి అష్టోత్తర శతనామ స్తోత్రములు పరీక్షలు జరుపబడి బహుమతులు యివ్వబడెను.

మరియొక విశేషము. ఒక 15 సంవత్సరముల ప్రాయముగల శికిందాబాద్ శ్రీ వైష్ణవ బాలుడు నాలాయిరం వాచోవిధేయముగా వించుకొని ముఖపరీక్ష యిచ్చినందులకుగాను శ్రీజీయర్ స్వామివారు సంతసించి అతనికి ఒక శాలువ రు. 16/- యిచ్చి సత్కరించి ఆశీర్వదించిరి. ఈ సభలు 3 రోజులు సన్నిధిలో లక్ష్మిపూజలు శ్రీమహిళామండలివారు చాలచక్కగా జరిపించిరి. 30-4-59 వ తేది నాటి ఉదయం శ్రీ జీయర్ స్వామివారు తమ పరివారముతో యాదగిరి గుట్ట సన్నిధికి వేంచేసిరి. ఆలయ ధర్మకర్తలు, స్థానిక స్వాములు, పెక్కురు భక్తులు శ్రీ స్థానాచార్యులు, శ్రీమాన్ శంగిపురం నరసింహాచార్యులుగారు శ్రీజీయర్ స్వామివారికి ఛత్రచామరాది సత్కారములతో స్వాగతమిచ్చిరి. సన్నిధిలో శ్రీనృసింహస్వామిని సేవించుకొని శ్రీ జీయర్ స్వామివారు ఆలయములో ఉపన్యసించిరి ఆలయాధికారులు శ్రీస్వామివారిని చాలవిశేషముగ సత్కరించిరి. ఈఆలయపరిపాలనచాలబాగున్నది.

భక్తినివేదన — పరివార విభాగము                వికారి వైశాఖం 1—5—59

హైదరాబాదు సీతారాంబాగులో 26-4-59 నుండి 29-4-59 వరకు జరిగిన అఖిల భారత శ్రీవైష్ణవ మహాసభయొక్కయు, సమిష్టి ఉపనయనములయొక్కయు జమ-ఖర్చులు.

| జమ | | ఖర్చులు | |
|---|---|---|---|
| సభా విరాళములు | రు. 1768-00 | ఉపనయనముల నిమిత్తం | రు. 674-48 |
| ఉపనీత వటువుల పోషకుల నుండి | 840-00 | తదియారాధన నిమిత్తం | 1380-98 |
| తదియారాధనకై రొక్కరూపవిరాళములు | 343-00 | సభల నిమిత్తం (మొత్తం అన్నికలిపి) | 1995-26 |
| తదియారాధనకై సామానులవిరాళములు | 549-00 | | |
| మొత్తం | 3500-00 | మొత్తం | 4050-72 |

ఇప్పటికి ఆదాయము రు. 3500 కాగా, వ్యయము 4050-72 అనగా రు. 550-72 అధికవ్యయమయినది.

## వి వ ర ము లు.

### ఉపనయన నిమిత్తం యిచ్చినవారు

| | |
|---|---|
| శ్రీ పి. శ్రీనివాసరావుగారు | 60-0 |
| ,, ఎ. రామారావుగారు | 30-0 |
| ,, పి. రంగారావుగారు | 30-0 |
| ,, డి. వి. అప్పారావుగారు | 30-0 |
| ,, కొంపల్లి జానకమ్మగారు | 30-0 |
| ,, శ్రీమా. నరసింహారావుగారు | 60-0 |
| ,, పి. గోపాలరావుగారు | 60-0 |
| ,, పి. వెంకటరావుగారు | 30-0 |
| ,, జి. నరహరిరావుగారు | 60-0 |
| ,, కె. గోపాలరావుగారు | 30-0 |
| ,, పి. వెంకటరాఘవరావుగారు | 30-0 |
| ,, ఎం. వెం. రామాచార్యులుగారు | 30-0 |
| ,, శ్రీరామపాలె వాసుదేవజీ | 30-0 |
| ,, ఎస్. హనుమంతరావుగారు | 30-0 |
| ,, జి. లక్ష్మణాచారిగారు | 30-0 |
| ,, యం. శ్రీనివాసరావుగారు | 30-0 |
| ,, జి. వెంకటాచార్యులుగారు | 30-0 |
| ,, కాం. సుదర్శనాచార్యులుగారు | 30-0 |
| ,, బి. లక్ష్మణాచార్యులుగారు | 30-0 |
| ,, పి. నరసింహాచార్యులుగారు | 30-0 |
| ,, కె. నరశింహాచార్యులుగారు | 30-0 |
| ,, ఎం. వెంకటరావుగారు | 30-0 |
| ,, పి. రామకిషన్‌రావుగారు | 30-0 |
| ,, శ్రీరాం పండిత్‌గారు | 30-0 |
| | 840-0 |

### సభా విరాళములు యిచ్చినవారు

| | |
|---|---|
| శ్రీ రాజాగోవర్ధన్‌లాల్ పిత్తిగారు | 125-0 |
| ,, డాక్టరు కె. రంగాచార్యులుగారు | 100-0 |
| ,, డే. ఆళ్వారుదారు నాయుడుగారు (మెట్టుగూడ) | 52-0 |
| ,, నరశింహులుగారు | 5-0 |
| ,, కె. బాబయ్యగారు | 3-0 |
| ,, సం. రామకిషన్‌రావుగారు | 5-0 |
| ,, గోవిందు రామచెందరావుగారు | 5-0 |
| ,, మల్లాపేట అంతమ్మ లింగమ్మగార్లు | 10-0 |
| ,, డా. మానిక్‌రావుగారు | 3-0 |
| ,, వి. నర్సింలుగారు | 3-0 |
| ,, వెంకటయ్యగారు | 2-0 |
| ,, అల్లాడి జానకమ్మగారు | 5-0 |
| ,, పి. గోపాలరావుగారు | 40-0 |
| ,, శ్రీ-విసె-బౌవర్కుప్ర ఆల్యాబాద్ | 5-0 |
| ,, సజ్జన్‌లాల్ (షంషేర్‌గంజ్) | 28-0 |
| ,, గూడ నరహరిరావుగారు | 56-0 |
| ,, డా. సత్యనారాయణగారు | 2-0 |
| ,, మామిడాల నరశింహారావుగారు | 15-0 |
| ,, సత్యనారాయణ క్లాత్‌స్టోర్సు | 3-0 |
| ,, మద్దుల శీతమ్మగారు | 2-0 |
| ,, సుంకం వెంకయ్యగారు | 1-0 |
| ,, జూలపల్లి వెంకటారావుగారు | 5-0 |
| ,, పెమ్మరాజు వెంకటరాఘవరావుగారు | 10-0 |
| ,, కొంపల్లి జానకమ్మగారు | 20-0 |

| | |
|---|---|
| శ్రీ పా. నారాయణగారు | 1-0 |
| ,, కె. రాధాకృష్ణయ్య అండ్ సన్స్ | 3-0 |
| ,, ఆ. గౌరిశంకరయ్యగారు | 5-0 |
| ,, ములుగు వెంకటయ్యగారు | 2-0 |
| ,, పి. ఆర్. ముకుందదాస్ మలానిగారు | 2-0 |
| ,, కె. రాజయ్యగారు | 3-0 |
| ,, ఆర్. కృష్ణమాచార్యులుగారు | 2-0 |
| ,, ఏ. లక్ష్మారావుగారు | 2-0 |
| ,, అప్పరాజు వెంకటాద్రిరావుగారు వసూలుచేసి యిచ్చినది | 8-0 |
| ,, ప్రతాపగిరాచార్యులుగారు | 5 0 |
| ,, వే. వేణుగోపాలాచార్యులుగారు వసూలుచేసి యిచ్చినది | 49-0 |
| ,, డా. డి. నరశింహాచార్యులుగారు వసూలుచేసి యిచ్చినది | 66-0 |
| ,, డా॥ చి. అప్పలాచార్యులుగారు వసూలు | 30-0 |
| ,, గాడపల్లి మరింగంటి శ్రీనివాసాచార్యులుగారు వసూలు | 29-0 |
| ,, సి. శ్రీనివాసాచార్యులుగారి వసూలు | 29-0 |
| ,, యం. వెంకటాద్రిమరావుగారు | 10 0 |
| ,, వేదాంతం రాఘవాచార్యులుగారి వసూలు | 46-0 |
| ,, శ్రీరామాచార్యులగారి వసూలు | 6-0 |
| ,, శ్రీరాములు శ్రేష్ఠిగారు శికిందరాబాదు వసూలు | 22-0 |
| ,, కం. రామానుజాచార్యులుగారి వసూలు | 5-0 |
| ,, గో. శేషాచార్యులుగారి వసూలు | 42-0 |
| ,, కాం. మధుసూదనాచార్యులుగారి వసూలు | 80-0 |
| ,, మూల పరాంకుశంద్వారా | 1-0 |
| ,, లక్ష్మీప్రసాద్ బంకట్ లాల్ జి, గనేరిమాలాగారి వసూలు | 780-0 |
| తదితరులు | 33-0 |
| మొత్తం | 1768-0 |

## తదియారాధనకు విరాళములిచ్చినవారు

| | |
|---|---|
| శ్రీ పి. శ్రీనివాసరావుగారు | 20-0 |
| ,, యె. రాంరావుగారు | 10-0 |
| ,, తిరుమల పిళ్ళైచార్యులుగారు | 15-0 |
| ,, కైలాస శంకరయ్యగారు, | 30-0 |
| ,, రాజాగోవర్ధనలాల్ పిత్తిగారు | 100-0 |
| ,, ఆళ్వందారువార్ధుగారు | 6-0 |
| ,, జూలూరు రాంకిషన్ రావుగారు | 10-0 |
| ,, డా. హనుమంతరావుగారు | 10-0 |
| ,, పన్నాలాల్ పిత్తిగారు | 100-0 |
| ,, శికిందరాబాదు మహిళామండలి శ్రీ తేలుగుంట్ల రుక్మిణమ్మ శ్రీమతి రేవూరినరశింహులుగారి సతీమణిగార్లు | 42-0 |

## తదియారాధన సామాన్లు సమర్పించినవారు

| | | | |
|---|---|---|---|
| శ్రీ డి. వి. అప్పారావు | శే | 100 | బియ్యం |
| ,, సం. పురుషోత్తంరావుగారు | శే | 19 | ,, |
| ,, మ. పురుషోత్తంరావుగారు | శే | 20 | ,, |
| ,, సిద్ధంస్వామిగారు | శే | 6 | ,, |
| ,, డె. వెంకటాద్రిగారు | శే | 20 | ,, |
| ,, పి. రంగారావుగారు | శే | 30 | ,, |
| ,, బచ్చు బాలయ్యగారు | శే | 25 | ,, |
| ,, హీరానందురాంగఖు | శే | 110 | ,, |
| ,, ద్వారకా వాసుహద్దు | శే | 60 | ,, |
| ,, రామా ప్రతాప్ కిన్నలాల్ శ్రీనివాసపిత్తిగారు | శే | 240 | ,, |
| ,, దాచెపల్లిపాపయ్యగుప్తగారు | శే | 120 | ,, |
| ,, మహారాజ్ గంజివారు | శే | 170 | ,, |

శ్రీ వో. సుబ్రహ్మణ్యం శెట్టిన ద్రాసు ఇంగువడబ్బా
,, కన్నయాలాల్ & బీలాణి శనగపప్పు 30 శేర్లు
శనగపిండి శే 40 మినపప్పు 15 శే
,, సరస్వతిబాయి రాధాకిషన్ జి-కందిపప్పు శే 60
,, సంతపురి పురుషోత్తమరావుగారు-
కందిపప్పు శే 5
,, వి వి. శెట్టి సరోజమ్మ కందిపప్పు శే 5
,, బండాల లక్ష్మయ్యగారు చక్కెర-
,, చక్రపాణిగారు చక్కెర-
,, కో. కా. శివప్పగారు కూరగాయలు- చింతపండు
బెల్లం, నూనె- మిరపకాయలు
,, లక్ష్మీప్రసాద్ బంకట్ లాల్ బేగంబజారువారి
ద్వారా 3 డబ్బాలు నూనె, పప్పులు

కూరగాయలు వస్త్రాలు అనేకమంది భక్తులు విరివిగా సమర్పించిరి.

ఇట్లు,
ఆహ్వాన సంఘం,
అఖిల భారత శ్రీవైష్ణవ మహాసభ.

శ్రీమతే రామానుజాయ నమః

పరమ ప్రమాణికులైన శ్రీ పిళ్లై లోకాచార్యులువారు సాయించిన

# ప్రమేయశేఖరము (ఆంధ్రానువాదసహితము)

(గతసంచిక తరువాయి)

మరియు ఈ విషయమే బ్రహ్మసూత్రములందు

| | | |
|---|---|---|
| సూ 509 | అర్చిరాదినా తత్ప్రథితేః | 4-3-1 |
| సూ 510 | వాయు మబ్దా దవిశేషవిశేషాభ్యాం | 4-3-2 |
| సూ 511 | తటితో௨ధి వరుణ స్సమ్బంధాత్ | 4-3-3 |
| సూ 512 | ఆతివాహికా స్తల్లింగాత్ | 4-3-4 |

ఇత్యాది సూత్రములచేతను తెలుపబడియున్నది.

మరియు పూర్వాచార్యులగు వరదాచార్యులవారిట్లు తెలిపిరి:-

శ్లో॥ సత్సంగా ద్భవనిస్పృహో గురుముఖాత్
శ్రీశం ప్రపద్యాత్మవాన్ ।
ప్రారబ్ధం పరిభుజ్య కర్మసకలం
ప్రక్షీణ కర్మాంతరః ।
న్యాసా దేవ నిరంకుశేశ్వరదయా -
నిర్లూన - మాయాన్వయః ।
హార్దానుగ్రహలబ్ధమధ్యధమని -
ద్వారా ద్బహి ర్నిర్గతః ।

శ్లో॥ ముక్తోర్చి - ర్దిన - పూర్వపక్ష - షడుదజ్
మాసాబ్ద వాతాంశుమత్,
గ్లౌ - విద్యు - ద్వరుణేంద్ర ధాతృమహితః
సీమాంత - సింధ్వాప్లుతః ।
శ్రీ వైకుంఠ ముపేత్య నిత్య మజడం
తస్మి న్పరబ్రహ్మణః
సాయుజ్యం సమవాప్య నందతి సమం
తేనైవ ధన్యః పుమాన్ ॥

శ్లో॥ ప్రాత ర్నిత్యానుసంధేయం పరమార్థం ముముక్షుభిః
శ్లోకద్వయేన సంక్షిప్తం సువ్యక్తం వరదోబ్రవీత్ ॥

అనియు చెప్పబడియున్నది.

ఈ విధముగ ఈ విషయమై శ్రుతి-స్మృతి – ఇతిహాస – పురాణోక్తమై శిష్టానుష్ఠేయమై యున్నది. అచ్చటచ్చటనున్న ఈ విషయమునంతను క్రోడీకరించి, క్రమబద్ధముగ అందరు ననుసంధించుకొని తరించుట కనుకూలముగ అతి సంక్షిప్తరూపమున శ్రీ పిళ్లైలోకాచార్యులువారు ఈ ప్రమేయశేఖర ప్రబంధరూపమున మనకు ప్రసాదించియున్నారు. కాన దీనిని ప్రతి ప్రపన్నుడు ప్రతినిత్యము తప్పక అనుసరించుకొనవలసియున్నది. అంతిమకాలమందు మాత్రము ఆవశ్యకమగు అంతిమ స్మరణను యిప్పటినుండియు సదా అనుసంధించు యవసరమేలయని సంశయింపబనిలేదు.

ప్రాణప్రయాణకాలమున కంఠము కఫవాతపిత్తములచే రుద్ధమై, మరణవేదనమున బడి యుండునపుడు ఈ అంతిమస్మృతి ఎట్లు కలుగును. అందుచే ప్రపన్నుడు ఆ అంతిమస్మృతిని యిప్పుడే స్మరించుచు తను చేయు భగవత్ప్రపత్తితోపాటు ఈ భారమునుకూడ సర్వరక్షకునియందుంచుటచే (ఆయనదేభారమని తెలుసుకొని ఉపన్యసించియుండుటచే) ఆయనే తదవసరసమయమున దానిని స్మరింపగలడు-(ప్రతినిత్యము జరుపు ఈ స్మరణేతప్ప ప్రపన్నునకు వేరే యే అంతిమ స్మృతి యవసరములేదని యభిప్రాయము,)

అయినచో దీని స్మరణము ఒకపర్యాయము మాత్రము చాలదా ? ప్రతినిత్యము ప్రాతఃకాలముననే దీని యనుసంధానమేల యని యనుకొనరాదు. ద్వయమంత్రముతో ప్రపత్తిని జేయవలసినది ఒకపర్యాయము మాత్రమే. అయినప్పటికిని, ప్రతిక్షణమును ద్వయమంత్రమును "ప్రపద్యే – ప్రపద్యే" అని వర్తమాన నిర్దేశముతో సార్థముగ ననుసంధించుకొనుట ఎటుల సముచితమైయున్నదో అటులనే సత్వగుణము అభివ్యక్తమైనపుడు కలుగు భయము నివర్తించుటకును, ఇతర ఉపాయముల యందు మనస్సు ప్రవర్తింపకుండుటకును, కాలక్షేపార్థమును, భోగ్యతచేత విడనాడబడజాలనది యగుటచేతను, మనస్సు చిరాభ్యస్తమైనదానినే సమయమునకు స్ఫురింపజేయు స్వభావము కలదనుటచేతను, ప్రతిక్షణమును సమీపించుచున్న ప్రయాణమును మరచి ప్రకృతిలంపటుడై ప్రవర్తించకుండుటకును, రజోతమోగుణప్రమాదములు పోవుటకును పరమార్థ దృష్టి పటుతరమగుటకును, ప్రతినిత్యము ప్రాతః ఏతదనుసంధానముకూడ అత్యంతావసరమై యున్నది, విషయము చిన్నదిగనే యున్నను, ఫలితముమాత్రము ప్రబలమైనది.

మన కూటస్థులగు శ్రీనమ్మాళ్వార్లుకూడ తిరువాయ్మొత్త దివ్యప్రబంధమున "శుత్ విశుంబణిముకిల్ (10-10-9) అను పదిపాశురములద్వారా ఈ అర్చిరాదిమార్గానుభవమును విశదపరచియున్నారు.

సహృదయహృదయులగు ముముక్షుసోదరు లందరును ఈ గ్రంథమును కంఠస్థపరచుకొని ప్రతినిత్యమును అనుసంధించుకొనుచు, ఈ శరీరవియోగానంతరమున తాముకూడ అర్చిరాది మార్గ గమనానందమును యనుభవింప ప్రయత్నింతురుగాక.

మరియు తమ భావి భవితవ్యమును దీనిద్వారా తెలుసుకొని నిర్భరులై యుందురుగాక.

అస్మద్గురుభ్యో నమః

శ్రీమతే రామానుజాయ నమః

పరమపావనీయులైన శ్రీ పిళ్లై లోకాచార్యులువారు సాయించిన

# ప్రమేయశేఖరం

| ద్రావిడము - మూలము | ఆంధ్రానువాదం |
|---|---|
| 1. నిర్హేతుక - భగవత్కటాక్ష మడియాగ అజ్ఞాతసుకృత ముండాం. | 1. నిర్హేతుకమైన భగవత్కటాక్షము వలన అజ్ఞాతసుకృతము కలుగును. |
| 2. అదడియాగ అద్వేష ముండాం. | 2. దానివలన అద్వేషము కలుగును. |
| 3. అదడియాగ భగవద్భాగవత విషయం - గళిల్ ఆభిముఖ్య ముండాం. | 3. దానివలన భగవద్భాగవతుల విషయమున ఆభిముఖ్యము కలుగును. |
| 4. అభిముఖ్య ముండానవారే త్యాజ్యోపాదేయ - విభాగ - జ్ఞానత్తిల్ కౌతుక ముండాం. | 4. అభిముఖ్యము కలిగిన వెంటనే త్యాజ్యోపాదేయ - విభాగ - జ్ఞానమున కుతూహలము కలుగును. |
| 5. అత్తాలే సాత్త్విక - సంభాషణ ముండాం. | 5. దానివలన సాత్త్వికులతో సల్లాపించుట కలుగును. |
| 6. అత్తాలే సదాచార్య - సమాశ్రయణ ముండాం | 6. దానివలన సదాచార్యులు నాశ్రయించుట కలుగును. |
| 7. అదుండానవారే త్యాజ్యోపాదేయ - నిశ్చయ ముండాం. | 7. అది కలిగిన వెంటనే త్యాజ్యో - పాదేయముల నిశ్చయము కలుగును. |
| 8. అదుండానవారే ప్రాప్యాంతరత్తిల్ వైరాగ్యముం, పరమప్రాప్యత్తిల్ అభినివేశము ముండాం. | 8. అది కలిగిన వెంటనే ప్రాప్యాంతరముల యందు విరాగమున్ను, పరమప్రాప్యమున అభినివేశమున్ను కలుగును. |
| 9. అనంతరం, ప్రాప్యాంతర - నివృత్తిక్కుం పరమప్రాప్య - సిద్ధిక్కుం అడియాన సిద్ధోపాయ - స్వీకార ముండాం. | 9. అటుపిమ్మట, ప్రాప్యాంతరముల నివృత్తికిని పరమప్రాప్య - సిద్ధికిని కారణమైన సిద్ధోపాయ స్వీకారము కలుగును. |
| 10. అనంతరం, భగవత్ప్రాప్తియిలే త్వరై ముండాం | 10. అటుపిమ్మట, భగవత్ప్రాప్తియందు త్వర కలుగును. |

| ద్రావిడము – మూలము | ఆంధ్రానువాదం |
| --- | --- |
| **11.** అనంతరం, (అహంస్మరామి) ఎన్ గిరవడియే ఈశ్వరస్మృతిక్కు విషయభూతనాం. | **11.** అటుపిమ్మట "అహంస్మరామి" (నేను స్మరింతును) అనునటుల సర్వేశ్వరుని స్మృతికి విషయభూతుండగును. |
| **12.** అనంతరం, భూతసూక్ష్మ – శరీర – పరిష్వంగ ముండాం. | **12.** అటుపిమ్మట, భూతసూక్ష్మ శరీరముతో పరిష్వంగము కలుగును. |
| **13.** అనంతరం, పరమాత్మ సంసర్గ ముండాం. | **13.** అటుపిమ్మట, పరమాత్మతో సంసర్గము కలుగును. |
| **14.** పిన్బు, హార్దానుగ్రహత్తాలే మార్గవిశేష ప్రకాశ ముండాం. | **14.** పిమ్మట, హృదయాంతర్వర్తియగు అంతరాత్మని యనుగ్రహముచే మార్గవిశేషము ప్రకాశించును. |
| **15.** పిన్బు, హృదయగుహా నిర్గమన ముండాం. | **15.** పిమ్మట, హృదయ గుహనుండి వెడలివచ్చును |
| **16.** అనంతరం, మూర్ధన్య నాడీ నిష్క్రమణ ముండాం. | **16.** అటుపిమ్మట, మూర్ధన్యనాడీద్వారా బయటకు వెళ్ళిపోవును. |
| **17.** అనంతరం, అర్చిరాది–మార్గ గమన ముండాం. | **17.** అటుపిమ్మట; అర్చిరాది మార్గముగ పోవును. |
| **18.** అనంతరం, ఆదివాహిక సత్కార ముండాం. | **18.** అటుపిమ్మట, ఆదివాహికులచే సత్కరింపబడును. |
| **19.** అనంతరం, ఆవరణాతిక్రమణ ముండాం. | **19.** అటుపిమ్మట, అండావరణమును దాటును. |
| **20.** అనంతరం, ప్రకృత్యతిలంఘన ముండాం. | **20.** అటుపిమ్మట, ప్రకృతి మండలమును అతిక్రమించును. |
| **21.** అనంతరం, విరజాస్నాన ముండాం. | **21.** అటుపిమ్మట, విరజా నది యందు స్నానమాచరించును. |
| **22.** అనంతరం, సూక్ష్మశరీర విశ్లేష ముండాం. | **22.** అటుపిమ్మట, సూక్ష్మశరీరము విడిచిపోవును. |
| **23.** అనంతరం, అపహత పాప్మత్వాది గుణగణ ప్రాదుర్భావ ముండాం. | **23.** అటుపిమ్మట, అపహతపాప్మత్వాది గుణసముదాయము యొక్క యావిర్భావము కలుగును. |

| ద్రావిడము - మూలము | ఆంధ్రానువాదం |
|---|---|
| 24. అనంతరం, అమానవ కర స్పర్శ ముండాం. | 24 అటుపిమ్మట, అమానవ పురుషుని హస్తస్పర్శ కలుగును. |
| 25. అనంతరం, భగవత్సంకల్ప కల్పితమాన దివ్య దేహప్రాప్తి ముండాం. | 25. అటుపిమ్మట, భగవంతుని సంకల్పముచే కల్పితమైన దివ్య దేహము ప్రాప్తించును. |
| 26. అనంతరం, అకాలకాల్య దివ్యదేశ ప్రాప్తి ముండాం. | 26. అటుపిమ్మట, అకాలకాల్య మను దివ్య దేశము ప్రాప్తించును. |
| 27. అనంతరం, ఆరంహ్రదతటస్నాన ముండాం. | 27. అటుపిమ్మట, ఆరంహ్రద మను తటాకమున స్నానము జేయును. |
| 28. పిన్బు, దివ్యాలంకార ముండాం. | 28. పిమ్మట దివ్యాలంకారము లభించును. |
| 29. పిన్బు, దివ్యవిమానారోహణ ముండాం. | 29. పిమ్మట దివ్యవిమానము నధిష్టించును. |
| 30. పిన్బు, తిల్యకాంతారప్రవేశ ముండాం. | 30. పిమ్మట తిల్యకాంతరమును ప్రవేశించును. |
| 31. అనంతరం, దివ్యాప్సరస్సత్కార ముండాం. | 31. అటుపిమ్మట, దివ్యాప్సరసలు సత్కరింతురు. |
| 32. అనంతరం, తిల్యగంధప్రవేశ ముండాం. | 32. అటుపిమ్మట, తిల్యగంధప్రవేశముకలుగును. |
| 33. అనంతరం, బ్రహ్మగంధ ప్రవేశ ముండాం. | 33. అటుపిమ్మట, బ్రహ్మగంధ ప్రవేశముకలుగును |
| 34. అనంతరం, అప్రాకృత గోపురప్రాప్తి ముండాం. | 34. అటుపిమ్మట, అప్రాకృతమైన గోపురసందర్శన ప్రాప్తి కలుగును. |
| 35. అనంతరం, దివ్యనగర ప్రాప్తి ముండాం. | 35. అటుపిమ్మట, దివ్యనగర సందర్శన ప్రాప్తి కలుగును. |
| 36, అనంతరం, సూరిపరిషత్ ప్రత్యుద్గమనముండాం | 36. అటుపిమ్మట, నిత్యసూరివర్గము యొక్క స్వాగతసత్కారము కలుగును. |
| 37. అనంతరం, రాజమార్గ గమన ముండాం. | 37. అటుపిమ్మట, రాజమార్గమున బయనించును. |
| 38. అనంతరం, బ్రహ్మతేజః ప్రవేశ ముండాం. | 38. అటుపిమ్మట, బ్రహ్మతేజస్సున ప్రవేశించును. |
| 39. అనంతరం, దివ్యగోపురప్రాప్తి ముండాం. | 39. అటుపిమ్మట దివ్యగోపురమును సందర్శించును. |
| 40. అనంతరం, బ్రహ్మవేశ్మప్రవేశ ముండాం. | 40. అటుపిమ్మట, బ్రహ్మవేశ్మమును ప్రవేశించును. |
| 41. అనంతరం, దివ్యమంటపప్రాప్తి యుండాం. | 41. అటుపిమ్మట, దివ్యమంటపమున ప్రవేశించును. |
| 42. అనంతరం, దివ్యపారిషత్ ప్రాప్తి యుండాం. | 42. అటుపిమ్మట, దివ్యపారిషదుల సందర్శనప్రాప్తి కలుగును. |

| ద్రావిడము - మూలము | ఆంధ్రానువాదము |
| --- | --- |
| 43. అనంతరం, సపత్నీక సర్వేశ్వర దర్శనముండాం. | 43. అటుపిమ్మట పిరాట్టిమారులతో కలసి యున్న సర్వేశ్వరుని సందర్శనము లభించును. |
| 44. అనంతరం, స్తుతి ప్రణామాంజలి, ప్రముఖ సంభ్రమానువర్తన ముండాం. | 44. అటుపిమ్మట, స్తుతించుట, నమస్కరించుట, అంజలిజోడించుట మున్నగు ఆనందపారవశ్య చర్యలను జరుగును. |
| 45. అనంతరం, పరమాత్మ సమీపప్రాప్తి యుండాం | 45. అటుపిమ్మట, పరమాత్మని సమీపించును. |
| 46. అనంతరం, పాదపీఠ పర్యంకారోహణ ముండాం | 46. అటుపిమ్మట, పాదపీఠమును, పర్యంకమును అధిరోహించును. |
| 47. అనంతరం, భగవదుత్సంగ సంగ ముండాం. | 47 అటుపిమ్మట, భగవంతునిచే ఒడిలోనికిచేర్చు కొనబడును. |
| 48. ఆలోకనాలా పాద్యనుభవ ముండాం. | 48. చూచుట, సంభాషించుట మున్నగుయను భవములు కలుగును. |
| 49. అనంతరం, ఆలింగనాద్యనుభవ ముండాం. | 49. అటుపిమ్మకు, ఆలింగనాద్యనుభవములు కలుగును. |
| 50. అనంతరం, స్వరూప రూప గుణ విగ్రహాద్యను భవ ముండాం. | 50. అటుపిమ్మట దివ్యాత్మస్వరూపము, రూపము కల్యాణగుణములు, దివ్యమంగళ విగ్రహము మున్నగువాని యనుభవము కలుగును. |
| 51. అనంతరం, అనుభవజనిత ప్రీతి ప్రకర్ష ముండాం. | 51. అటుపిమ్మట, అనుభవమువలన జనించిన ప్రత్యతిశయము కలుగును. |
| 52. అనంతరం, నానావిధ విగ్రహ పరిగ్రహ ముండాం. | 52. అటుపిమ్మట, అనేకవిధములైన విగ్రహముల ధరించును. |
| 53. అనంతరం, సర్వదేశ సర్వకాల సర్వావస్థో చితమాన సర్వప్రకార కైంకర్య ముండాం. | 53. అటుపిమ్మట, సర్వదేశములయందును సర్వకాలముల యందును, సర్వావస్థలయందును యోగ్యమైనట్టు సర్వప్రకార కైంకర్యములు లభించును. |

పిళ్లైలోకాచార్యులు తిరువడిమళే శరణం. ప్రమేయశేఖరము సమాప్తము.

ప్రమేయశేఖరమున ప్రమాణముగ ఈయబడినవాని వివరములు.

11 వ సూత్రమున "అహం స్మరామి". వరాహచరమ శ్లోకము.

"స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః। ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మామజం।
తతస్తం మ్రియమాణం తు కాష్ఠపాషాణసన్నిభం। అహం స్మరామి మద్భక్తం నయామి పరమాంగతిః"

## కలుగు దశావిశేషముల క్రమము

1. భగవన్నిర్హేతుక జాయమాన - కటాక్షముచేనైన అజ్ఞాతసుకృతము.
2. అద్వేషము.
3. భగవద్భాగవతాభిముఖ్యము.
4. త్యాజ్యోపాదేయ విభాగజ్ఞాన కౌతూహలము
5. సాత్త్విక సభాషణము.
6. సదాచార్యుల సమాశ్రయణము.
7. త్యాజ్యోపాదేయ నిశ్చయము
8. ప్రాప్యాంతర వైరాగ్య - పరమప్రాప్యాభినివేశము,
9. సిద్ధోపాయ స్వీకారము.
10. భగవత్ప్రాప్త్యర్థత్వర.
11. భగవత్కృతి విషయీభూతము.
12. భూతసూక్ష్మ పరిష్వంగము.
13. పరమాత్మ సంసర్గము.
14. మార్గవిశేష ప్రకాశము.
15. హృదయగుహా నిర్గమనము.
16. మూర్ధన్యనాడీ నిష్క్రమణము.
17. అర్చిరాది మార్గగమనము.
18. ఆతివాహిక సత్కారము.
19. ఆవరణాతి క్రమణము.
20. ప్రకృత్యతి లంఘనము.
21. విరజాస్నానము.
22. సూక్ష్మశరీర విశ్లేషము.
23. అపహతపాప్మత్వాది గుణగణప్రాదుర్భావము.
24. అమానవకర స్పర్శము.
25. భగవత్సంకల్ప కల్పిత దివ్యదేహప్రాప్తి.
26. అకాలకాల్య దివ్యదేశప్రాప్తి.
27. ఐరం మదీయసరస్స్నానము.
28. దివ్యాలంకారము.
29. దివ్యవిమానారోహణము.
30. తిల్యకాంతార ప్రవేశము.
31. దివ్యాప్సర సత్కారము.
32. తిల్యగంధప్రవేశము.
33. బ్రహ్మగంధ ప్రవేశము.
34. అప్రాకృత గోపురప్రాప్తి.
35. దివ్యనగరప్రాప్తి.
36. నిత్యసూరి స్వాగతము.
37. రాజమార్గగమనము.
38. బ్రహ్మతేజః ప్రవేశము.
39. దివ్యగోపుర ప్రాప్తి.
40. బ్రహ్మవేశ్మ ప్రవేశము.
41. దివ్యమంటపప్రాప్తి.
42. వ్యపరిషత్ప్రాప్తి.
43. శ్రియఃపతి సందర్శనము.
44. ససంభ్రమాను వర్తనము.
45. పరమాత్మ సమీపప్రాప్తి.
46. పాదపీఠ పర్యంకారోహణము.
47. భగవదుత్సంగ సంగమము.
48. ఆలోకనాలాపాద్యనుభవము.
49. ఆలింగనాద్యనుభవము.
50. భగవత్స్వరూప రూపగుణ విగ్రహాద్యనుభవము.
51. అనుభవజనిత ప్రీతి ప్రకర్షము.
52. నానావిధ విగ్రహపరిగ్రహము.
53. సర్వదేశ సర్వకాల సర్వావస్థోచిత సర్వప్రకారసర్వేశ్వర కైంకర్యప్రాప్తి.

శ్రీ హయగ్రీవాయ నమః

# ప్రచార విభాగము

[ హైదరాబాద్ సీతారాంబాగలో శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారి అధ్యక్షతను 27-4-59 వ తేదీన జరిగిన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ కార్యకారణీ సమితిలో ఆమోదింపబడి తిరిగి హైదరాబాద్ సీతారాం బాగులో శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి అధ్యక్షతక్రింద 29-4-59 వ తేదీన జరిగిన ఈ సంఘ వార్షిక విరాట్ సమావేశములో ప్రతిపాదింపబడిన తీర్మానములు. ]

**3 వ తీర్మానము :**

శ్రీవైష్ణవులలో విద్యాభివృద్ధికి తోడ్పడుటకుగాను, ఒక నిధిని ఏర్పాటు చేయుటకున్ను, దానియొక్క సక్రమ వసూలు వినియోగము చేయుటకున్ను, తగిన కార్యవిధానమును ఏర్పాటు చేయవలసినదిగా ఒక ఉపసమితిని ఏర్పాటు చేయుటకు తీర్మానించుచు, అందులకుగాను రాజమండ్రి కాపురస్థులగు శ్రీమాన్ న. చ. శఠకోపాచార్యులుగారిని సంఘటకులుగా (కన్వీనరుగా) ఏర్పాటుచేయుచు తీర్మానించటమైనది.

ఆమోదించటమైనది.

శ్రీ. రా. జీయర్

**4 వ తీర్మానము :**

అష్టాక్షరీక్షేత్ర రామానుజకూటము, సత్సంగ సదనము యొక్క, నూతనగృహప్రవేశ మహోత్సవము, సంప్రోక్షణము, ది 8-8-59 వ తేదీనుండి 3 రోజులు జరుపుటకు, అందులకయ్యే యావత్తు ఖర్చులున్ను, అచ్చట మనసంఘ వైభవమునకు తగినటుల చేయవలసినదిగా, అధ్యక్షులును, కార్యదర్శులను కోరటమైనది.

మరియు అవకాశమున్నంత త్వరలో అచ్చటనే నిత్యతదీయారాధన జరుపుటకున్ను, అధ్యక్షులను, కార్యదర్శులను కోరటమైనది.

శ్రీ రా. జీయర్

**ప్రతిపాదకులు :-**

శ్రీమత్తిరుమలపురి హాళ్ళ వెంకటాచార్యులుగారు.

**ఆమోదకులు :-**

శ్రీ శివకోటి లక్ష్మీనరసింహం, విజయవాడ.

ఇంతవరకు ఈ సంఘ కార్యక్రమమును, చక్కగానిర్వహించినందులకు ఈసంఘకార్యకారణీ నిర్వాహకులకు ధన్యవాదములు సమర్పించటమైనది.

ఆమోదించటమైనది.

శ్రీ రా. జీయర్

**5వ తీర్మానము :**

ఈ క్రింది మహాశయులతో శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ కేంద్ర కార్యకారణీ సమితిని ఏర్పాటు చేసుకొనుటమైనది.

**1.** శాశ్వత అధ్యక్షులు :–
శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యరుస్వామివారు.

**2.** ప్రధాన శాశ్వత కార్యదర్శి :–
శ్రీమాన్. ఉ.వే.తె.కం. గోపాలాచార్యులుగారు

**3.** శాశ్వత సహాయకార్యదర్శి :–
శ్రీమాన్, కవిరత్న గుడిమెళ్ళ రామానుజాచార్యులుగారు, శ్రీ వాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం పోష్టు. తెనాలి తాలూకా గుంటూరు జిల్లా. (ఆంధ్రప్రదేశ్)

**4.** కోశాధికారి :–
శ్రీ శివకోటి లక్ష్మీనరసింహంగారు, విజయవాడ గవర్నరుపేట, రాజగోపాలచారివీధి.

**5.** సభ్యులు :–

1. శ్రీమాన్ ఉ. వె. న. చ. శఠకోపాచార్యులుగారు, రాజమండ్రి.
2. కూనంనేని వెంకటప్పయ్యదాసు, నడిగడ్డపాలెం
3. శ్రీమాన్ ఉ. వె. పరాశర సుదర్శన భట్టర్ అయ్యవార్లంగారు, కోరుకొండ.
4. శ్రీమాన్ ఉ.వె. తిరుమల పురిహెళ్ళ వెంకటాచార్యులుగారు, రాజమండ్రి.
5. శ్రీమాన్ ఉ. వె. తి. వ. కుమార వెంకటాచార్యులు అయ్యవార్లంగారు, శ్రీ రామతీర్థం
6. శ్రీమతి అమరవాది లక్ష్మీనరసమ్మగారు. నరసాపురం.
7. శ్రీ ఉ వె. శ్రీమాన్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ సంపత్కుమార యతిరాజ జియ్యర్‌స్వామివారు.

ప్రతిపాదకులు :
శ్రీ అధ్యక్షులువారు :

ఆమోదించటమైనది.
ఆమోదించటమైనది.

శ్రీమన్ నారాయణ రామానుజజీయ్యర్.

శ్రీమతే రామానుజాయ నమః

# సంతోష వార్త

శ్రీమన్ శ్రీరఙ్గ శ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ ।
శ్రీమన్ శ్రీరఙ్గ శ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ ॥.

శ్రీయతిపతియొక్క కరుణాకటాక్ష విశేషముచేత శ్రీరంగమందలి మన శ్రీ రంగనాథుని (పెరియ పెరుమాళ్ళ) దివ్యమంగళ విగ్రహ సందర్శనము మనకు తిరిగి లభించుటకు ఏర్పాట్లు అతిచురుకుగా జరుగుచున్నవి. గర్భగృహముయొక్క మరమ్మత్తులు పూర్తియైనవి. పెరియపెరుమాళ్ళ తిరుమేని కైంకర్యముప్రారంభమై జరుగుచున్నది. ఇంకొకనెల దినములలో ఇదియు సంపూర్తి కాగలదు. తదితరపనులు ప్రారంభింపబడి చురుకుగా నిర్వహింపబడుచున్నవి.

ది 2-7-1959 తేదిని ప్రారంభింపబడి ది 12-7-1959 తేదివరకు

సంప్రోక్షణను జరుపుటకు ఏర్పాట్లు జరుగుచున్నవి. శ్రీయతిపతి మనలనుతిరిగి శ్రీరంగనాథుని సేవించుకొనగల భాగ్యవంతులుగ కటాక్షించుగాక!

భక్తులందరును ఈ మహత్తరకైంకర్యమునందు యథాశక్తిగ ఆర్థికకైంకర్యముచు జేసుకొని పాపవిముక్తులగుదురుగాక.

## ఈ కైంకర్యమునకగు ఖర్చుల అంచనా

| | | | |
|---|---|---|---|
| 1. మూలవరుల తిరుమేని కైంకర్యమునకు | రూ. | | 3,500 |
| 2. గర్భగృహ మరమ్మత్తులకు | | | 6,000 |
| 3. తిరువాచి మరమ్మత్తులకు 500 తులములబంగారం. | | 50,000 | |
| మజూరి | | 2000 | |
| | | | 52,000 |
| 4. కులశేఖరపడి. (బంగారం 75 తులములకు | | 7,500 | |
| | మజూరి | 750 | 8,250 |
| 5. సింహాసనంమరమ్మత్తు బంగారం 150 తుII | | 15,000 | |
| వెండి 2000 తుII | | 4,000 | |
| మజూరి | | 5,000 | 24,000 |
| 6. ఆదిశేషుల శిరస్సులకు బంగారం 750 తుII | | 75,000 | |
| మజూరి | | 1,500 | 76,500 |
| 7. ఆదిశేషుల తిరుమేనిఅంగి వెండి 10,000 | | 20,000 | |
| మజూరి | | 10,000 | 30,000 |
| 8. సంప్రోక్షణకు తదీయారాధనాదికం | | 15,000 | |
| అర్చక సంభావన | | 3,000 | |
| వేదపారాయణ అధ్యాపకం | | 3,000 | |
| సంచారములు, తదితరములు. | | 9,000 | 30,000 |
| | | | 2,30,250 |

తిరుమేని కైంకర్యమునకు కల్లెడ జమీందారు శ్రీమాన్ విర్రబలి వెంకటేశ్వరరావుగారు రూ 3500 సమర్పించిరి. కైంకర్యవిరాళములను పంపదలచినవారు "ఎగ్జిక్యూటివు ఆఫీసరు, శ్రీ రంగనాథస్వామి దేవస్థానము శ్రీరంగము తిరుచ్చి. 6 అని పంపవలసినది.

శ్రీ మన్నారాయణ రామానుజ జీయర్.

శ్రీమతే రామానుజాయనమః



# బదరీ వార్తలు

శ్రీమన్నారాయణ జీయర్‌స్వామివారి యాజ్ఞానుసారముగ తెలియజేయునదేమనగా:- బదరినాథులో సుమారు 14 సంవత్సరముల కొక పర్యాయము మంచుకొండలు విరిగి ప్రవాహ రూపమున గ్రామముమీదపడి చాల నష్టపరచుచుండునని ప్రతీతి గలదు. తదనుగుణముగనే ఈ సంవత్సరమున మంచుపడి గ్రామములోని చాల ఇండ్లు పాడైనవి. శ్రియఃపతి కటాక్షముచే అష్టాక్షరీక్షేత్రములోని రామానుజకూటమునకుగాని, సత్సంగసదనమునకు గాని ఎట్టి నష్టమున్ను సంభవించలేదు. అందుచే బదరినాథుని కోవెల తలుపులు తెరచినప్పటినుండియు తిరిగి మన కట్టడముల పని ప్రారంభించబడినది. మన రాజుగారు (శేషదాసుగారు) ప్రారంభముననే అచ్చటకువెళ్ళి కట్టడములపనిని జేయించుచున్నారు. మన శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారును కూడ ది 14-5-59 తేదీన బయలుదేరి బదరికి వేంచేసిరి. వచ్చే ఆగస్టునెల మొదటివారమునకు కావలసిన పని పూర్తిచేయబడి ది 8-8-1959 తేదీకి ఈ రెండుకట్టడముల సంప్రోక్షణ ఉత్సవములు వరుసగ మూడురోజులు జరుపుటకు తగు ఏర్పాటులన్నియును జరుపబడుచున్నవి. గనుక భక్తులెల్లరును తప్పక ఈ మహోత్సవమునకు బదరినాథునకు విచ్చేసి సేవించుకొని యానందింపవలసినది. ఈ మహోత్సవమును జరుపుటకు ఉదారులుగా భక్తులెల్లరు విరాళముల సమర్పింపవలసినది. మరియు, రామానుజకూట సత్సంగనిర్మాణముల జరిపించుటకు వాగ్దానము చేసినవారలును, శ్రీ శ్రీనివాసరామానుజులకు తమపేర శాశ్వతముగ పూజలను చేయించువారునుకూడ తాము మావద్ద చేసిన విరాళవాగ్దానములలో యింకను చాలధనము పంపవలసియున్నది. అనుకున్నపని యంతయును ముగింపులోనికివచ్చినది గాన, బాకీలున్న దాతలందరును కూడ బంధుమిత్రులను ప్రోద్బలము చేయుటద్వారాను తమ తమ యావత్తువిరాళముల బాకీలను వెంటనే అతిత్వరలో పంపివేయ గోరుచున్నాము. విరాళములు మాకు చేరుటలో ఆలస్యమైనచో మేము చాల యిబ్బంది పడవలసివచ్చును. గాన బాకీలున్నవారందరునుకూడ వెంటనే బాకీసొమ్మునంతను పంపగోరెదను.

బదరిలో ప్రతినిత్యము మరియు అవకాశానుసారముగ 100 మందికి తదీయారాధనమును జరిపించగోరుచున్నాము. అందుల కుత్సాహమున్నవారలు ఆ కైంకర్యములోకూడ పాల్గొన గోరుచున్నాము.

సర్వేజనా స్సుఖినోభవంతు.

రామానుజ కూటము
బదరినాథ్, గార్వాలజిల్లా
యు. పి.

ఇట్లు
తె. కం. గోపాలాచార్యులు

# అష్టాక్షరీక్షేత్ర రామానుజకూట విరాళము

బదరిలో మన సంఘము వారిచే నిర్మింపబడుచున్న అష్టాక్షరీక్షేత్ర రామానుజ కూటములో ఒకగది కట్టించుటకు హైదరాబాద్ వాస్తవ్యులగు శ్రీమాన్ ఎ. రామస్వామి అయ్యంగారు, వీరి సతీమణి శ్రీ రంగనాయకమ్మగారు రు 3500/- లు విరాళముగా సమర్పించిరి. శ్రియఃపతి వీరికి సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక!

---

బదరికాశ్రమములో మన సంఘమువారిచే నిర్మింపబడుచున్న శ్రీ అష్టాక్షరీక్షేత్ర రామానుజ కూటములో ఒకగది నిర్మించుటకుగాను భీమవరం కాపురస్తురాలగు శ్రీ మడిపల్లి సీతామహాలక్ష్మమ్మగారు ఒకగది కట్టించుటకుగాను 3500/- రూపాయలు విరాళమిచ్చుటకుగాను వాగ్దానము గావించి 1000/- వెయ్యిరూపాయాలు (ప్రస్తుతము) సమర్పించిరి. శ్రియఃపతి వీరికి సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక!

---

మన శ్రీ జియ్యర్ స్వామివారి యాజమాన్యమున బదరికాశ్రమములో నిర్మింపబడుచున్న అష్టాక్షరీక్షేత్ర రామానుజకూటమునకు విరాళముగా రు500/-లు శ్రీ జైసాని చార్టీసువారు (మద్రాసు) సమర్పించిరి. శ్రియఃపతి యీ పవిత్ర సంస్థకు అనేక మంగళాశాసనములు కృపచేయుగాక!

---

# సత్సంగ సదన విరాళము

బదరికాశ్రమములో శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి యాజమాన్యమున నిర్మింపబడుచున్న సత్సంగ సదనమునకు విజయవాడ వాస్తవ్యురాలగు శ్రీవిందూరు తాయారమ్మగారు లోగడ రు 500/- గాక ఇప్పుడు రు 1100/-లు సమర్పించిరి. శ్రియఃపతి యీమెకనేక మంగళాశాసనములు కృపచేయుగాక!

# శాశ్వత పూజలు

శ్రీ బాచిరెడ్డి శాయిరెడ్డి, కాశిరెడ్డి, రామచంద్రారెడ్డిగార్లు కణతాల రు 275/-

శ్రీ కొమాండూరి రామావతారంగారి కుమారుడు రామానుజాచార్యులుగారు లోగడ 29/- గాక ఇప్పుడిచ్చినది. హైదరాబాద్ 246/-

శ్రీ నూనె రంగయ్యగారి కుమారుడు లక్ష్మీనరసయ్యగారు, నడిగూడెం లోగడ 174/- గాక ఇప్పుడిచ్చినది. 58/-

శ్రీ కందుకూరు సుందరమ్మగారు కందుకూరు. వాగ్దానం 275/- లో ఇచ్చినది. 135/-

శ్రీ వెనుదురు జానకమ్మరాణిగారు రాజపేట. (బంగారుగాజాద్వారా) 193/-

శ్రీ నీలం జానకమ్మ చెర్నపల్లిరాణీగారు, దోమలగూడ. 116/-

శ్రీ కొత్తపల్లి శ్రీనివాసమ్మగారు వాగ్దానం 116/- లో అడ్వాన్సు. 1/-

శ్రీ కైలాసం నరసింహంగారు, సికిందరాబాద్. 29/-

శ్రీ కబళ్వాయి రాధాకృష్ణరావుగారు 29/-

శ్రీ తాళ్ళపల్లి బాలవీరయ్యగారు, మేడిచెల్ గ్రామం 29/-

శ్రీ కొండూరు వెంకటాచార్యులుగారి భార్య రంగనాయకమ్మగారు 29/-

శ్రీ సాదినేని వెంకటేశ్వర్లుగారు, కొర్నిపాడు 29/-

శ్రీ దొప్పలపూడి అనసూయమ్మగారు శ్రీరంగపురం. 29/-

శ్రీ గాదిరెడ్డి వెంకమ్మగారు, జనార్ధనపురం 29/-

శ్రీ కొల్లారెడ్డి మాణిక్యమ్మగారు ,, 25/-

శ్రీ మలిరెడ్డి సుబ్బమ్మగారు ,, 17/-

శ్రీ మలిరెడ్డి నారాయణమ్మగారు ,, 34/-

శ్రీ కొల్లారెడ్డి రామలక్ష్మమ్మగారు ,, 18/-

శ్రీ కొండపల్లి పున్నమ్మగారు ,, 40/-

శ్రీ కూనపురెడ్డి మహాలక్ష్మమ్మగారు 27/-

శ్రీ దివ్వెల రత్తమ్మగారు, చేరాల. 58/-

శ్రీ ప్యారక రంగాచార్యులుగారు, సీతారాంబాగ్ 20/-

శ్రీ మూల పరాంకుశరామానుజదాసుగారు 57-4-0

శ్రీ గోవర్ధనం నరశింగరాచార్యులుగారు లోగడ 11/- గాక ఇప్పుడు 10/-

శ్రీ భట్టరు లక్ష్మణాచార్యులుగారు 18/-

శ్రీమాన్ ధ. తి. ల. కు. వేం. తిరుమలాచార్యులుగారు మైలవరం, 27/-

శ్రీ వేదాల వెంకటనరసింహాచార్యులుగారు 29/-

శ్రీ ఓరుగంటి కమలమ్మగారు డాక్టరు, లోగడ 55/- గాక ఇప్పుడు. 3/-

శ్రీ దేశంశెట్టి అళ్వందారయ్యగారి భార్యా పేర లోగడ 10/- గాక ఇపుడు జమ ఇచ్చినది. 19/-

శ్రీ మంచుకొండ లక్ష్మయ్యగారు 11/-

శ్రీ జక్క్యాల నరసింహంగారు 11/-

శ్రీ తేలుకూటు హనుమయ్యగారు 11/-

శ్రీ తేలుకుంట వెంటయ్యగారు 11/-

శ్రీ వేలూరి లింగయ్యగుప్తగారు 11/-

శ్రీ కాదేపల్లి అంజయ్యగారు 11/-

శ్రీ నాగుమల్లి రామకృష్ణయ్యగారు 11/-

శ్రీ శ్రీపతి గుండేరావుగారు 11/-

శ్రీ ఊప్పాల నరహరిరావుగారు 11/-

శ్రీ సముద్రాల చెంద్రయ్యగారు 11/-

శ్రీ తేలుకుంట నరహరిగారు 11/-

శ్రీ మహాదేవు దాసుగారు 11/-

## శాశ్వతనిధి

శ్రీ చేగు వెంకటప్పయ్య అనే వెంకటకృష్ణారావుగారు జగ్గయ్యపేట. 100/-

శ్రీ క. జగన్నాథరావుగారు ఈదర. 29/-

శ్రీ సామవేదం శేషమ్మగారు 5/-

## సత్సంగసదన విరాళములు

శ్రీ వంకదారు సత్యనారాయణగారు, ఏలూరు సత్సంగసదనమునకు మరల రు 350/-

విగ్రహమునకు మరల 200/-

శ్రీ కాండూరు గోదారంగనాయకమ్మగారు సీతారాంబాగ్ 16/-

శ్రీ ప్యారంక రంగాచార్యులుగారు 16/-

శ్రీ పరాంకుశం సీతారామమ్మగారు, శ్రీకాకుళం 50/-

## కట్నములు

శ్రీ కూర్మం - శ్రీభాష్యం రామానుజాచార్యులుగారు,తమ్ములు శ్రీ కూర్మాచార్యులుగారికుమార్తె వివాహ సమయమున పంపిన సంఘ కట్నం. 5/-

శ్రీ. తి. వె. రంగనాధాచార్యులుగారు కుమార్తె వివాహ సమయమున సంఘమునకిచ్చిన కట్నం 3/-

శ్రీ. తి. వె. అప్పలాచార్యులుగారు వారి మేనల్లుని వివాహ సమయమున సంఘమునకిచ్చిన కట్నం 3/-

శ్రీ. తి. వె. పద్మనాభ అయ్యంగారు తమ కుమార్తె వివాహసమయమున కట్నం. 3/-

పైవారి కుమారుని ఉపనయన సమయమున పంపిన సంఘ కట్నం 2/-

శ్రీ గొడవర్తి భాష్యకారాచార్యులుగారు తమ కుమారుని వివాహ సమయమున పంపిన సంఘ కట్నం 1/-

శ్రీ యం. శేషాచార్యులుగారు పంపిన కట్నం 2/-

పెక్కాలి శ్రీ మహిళామండలివారి శుక్రవార పూజా కట్నం 2/-

శ్రీ ఎ. శాయనాచార్యులుగారు వివాహ కట్నంగా పంపినది. 5/-

శ్రీమాన్ కవిరత్న గుడిమెళ్ల రామానుజాచార్యులుగారు తమ కుమార్తె వివాహము జరిపిన సందర్భములో సంఘమున కిచ్చిన కట్నం 5/-

రాజపాలియంలో :-

నల్లాని చక్రవర్తుల సంపత్కుమార జగన్నాథాచార్యులుగారు తమ కుమారునికి ఉపనయనం చేసుకుని విశిష్టాద్వైత ప్రచారక భక్తినివేదన పత్రికకు కట్నంగా సమర్పించినది. 2/-

ముకుంద శోభనాద్రాచార్యులుగారు తమ రెండవ కుమారుని వివాహం చేసుకుని విశిష్టాద్వైత ప్రచారకభక్తి నివేదన పత్రికకు కట్నంగా ఇచ్చినది. 1/-





# శ్రీ మనజియ్యర్ స్వామి

మన త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు హైదరాబాదులో సమష్టి ఉపనయన కార్యక్రమమును అఖిలభారత శ్రీ వైష్ణవమహాసభను వైభవముగా పూర్తిగావించుకొని ది 30-4-59 యాత్రార్థమై యాదగిరిగుట్టకు సపరివారముగ వేంచేసిరి. అచ్చట స్థానాచార్యులువారగు శ్రీ ఉ. వే. శ్రీమాన్ వంగిపురం నరసింహాచార్యస్వామివారు కోవిలపరివారముతో, మేళతాళములతో, ఛత్రచామరములతో సగౌరవముగ శ్రీ స్వామివారిని ఎదుర్కొని స్వాగతమిచ్చి పెరుమాళ్ళ సన్నిధికి గొనిపోయి పెరుమాళ్ళను సేవింపజేసి తీర్థ ప్రసాద శఠారుల సమర్పించి గౌరవించిరి. పిమ్మట బసలో శ్రీ జీయరుస్వామివారి ఉపన్యాసము జరిగెను. దేవస్థానమువారు రు 116/- లను శ్రీ జీయరుస్వామివారికి సమర్పించిరి. అచ్చటి ఏర్పాటులకు, వైభవమునకు శ్రీ జీయరుస్వామివారు చాల సంతోషించిరి.

పిమ్మట హైదరాబాదునకు విచ్చేసి శ్రీ కొంపల్లి అండాళమ్మ, నరహరిరావుగార్ల ప్రార్థనచే శ్రీ జీయరు స్వామివారు హైదరాబాదులోని కండికల్ మెట్టు అనుస్థానమునగల శ్రీ రామచంద్రస్వామి దేవస్థానమునకు వేంచేసి అచ్చట నాలుగుదినము లుండిరి.

ది 2-5-59 తేదీన పీలుఖానావారు కోరికపై ఉదయమున అచ్చట భజనకార్యక్రమము, ఉపన్యాసము జరుపబడెను. మరియు ది 4-5-59 తేదీని సాయంకాలమున లక్ష్మీపూజా కార్యక్రమము జరుపబడి అచ్చట ఒక మహిళామండలిశాఖ ఏర్పాటుచేయబడెను. చాలమంది స్త్రీ పురుషులీ కార్యక్రమములో పాల్గొని చాల యానందించిరి.

## పాలమాకుల శ్రీరామసామ్రాజ్య మహాపట్టాభిషేకోత్సవములు

ది 5-5-59 తేదీని శ్రీ జీయరుస్వామివారు హైదరాబాదునకు 20 మైళ్ళ దూరములోగల పాలమాకుల యను గ్రామమునకు వేంచేసిరి. అచ్చట శ్రీమాన్ తిరుమలరావుగారను మహాభక్తులు తాము స్వయముగను కొందరు స్వాములద్వారాను 128 పర్యాయములు శ్రీ వాల్మీకిరామాయణమును పారాయణమును గావించిరి. ఇపుడు అందులకై మహాసామ్రాజ్య పట్టాభిషేకమును 25 మంది శ్రీవైష్ణవ ఋత్విక్కుల ఆర్త్విజ్యముక్రింద జరుప దలచి శ్రీ జీయరుస్వామిని వచ్చి ప్రార్థించగా శ్రీస్వామివారు సపరివారముగ అచ్చటకు వేంచేసి 10 రోజులు అచ్చటనే యుండిరి. ఈ క్రతువునకు శ్రీ ఉ. వే. శ్రీమాన్ ప్యారకపురి భట్టరు శ్రీ రామాచార్యులుగారు ఆచార్యత్వము వహించి చాల వైభవముగా జరిపించిరి. ప్రతినిత్యము సాయంకాలము రాత్రులయందు ఆయా నాటి శ్రీమద్రామాయణ పారాయణ ఘట్టముల ఉపన్యాసములు జరుగుచుండెడివి. శ్రీ తిరుమలరావుగారొక్కరే స్వయముగ ఈ క్రతువును అతి భక్తిశ్రద్ధలతో వైభవముగ నిర్వహించిరి. చాల ధన్యజీవులు, చాలమంది పండితులు పెద్దలు యిందు పాల్గొనిరి.

శ్రీ జీయరుస్వామివారు అచ్చటినుండి సపరివారముగ 15 వ తేది ఉదయమునకు వరంగలునకు వేంచేసిరి. వరంగలులో శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యులువారు శ్రీ గీతాప్రచారసేవదళమువారి యాజమాన్యముతో చాలచక్కటి ఏర్పాట్లనుగావించి, మేళతాళములతో శ్రీ జియర్ స్వామివారికి స్వాగతమిచ్చి శ్రీ వెంకటేశ్వర స్వామివారి దేవాలయమున (మెయినురోడ్డు వరంగలు) విడిదిని ఏర్పాటుగావించిరి. ప్రతినిత్యము ఉదయమునను సాయంకాలమునను ఉపన్యాసములు వగైరా కార్యక్రమములు ఉత్సాహముగా జరుగుచున్నవి. ఈనెలాఖరువరకు యిచ్చటనే శ్రీ స్వామివారు యుందురు.

పిమ్మట జడికల్లు దేవస్థానమువారి కోరికపై అచ్చటి కొకపర్యాయము వెంచేసి శ్రీ చక్రవర్తి తిరుమగను వారినిసేవించుకొని, పిమ్మట, కంబంమెట్టు జగ్గయ్యపేట - కోదాడ - ఆశ్రమముల మీదుగా శ్రీ రంగమునకు వైశైనంకత్సరంలో వెళ్ళి అచ్చట సంప్రోక్షణాదుల సేవించుకొని అటుపిమ్మట బదరికాశ్రమమునకు వెళ్లవలెనని శ్రీ జీయరు స్వామి సంకల్పము.

శ్రీ ఉ. వె. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారు ఈ 14 తేదిని రాజమహేంద్రవరములో బయలుదేరి మధ్య వరంగల్లులో శ్రీ జీయరుస్వామివారిని కలుసుకొని తిరిగి అమర్నాడే అచ్చటనుండి బయలుదేరి ఢిల్లీమీదుగా సురక్షితముగా ఋషీకేశమునకు వేంచేసిరి. అచ్చటినుండి కావలసిన సామానుల తీసుకొని బదరికి వేంచేయుదురు.

శ్రీరస్తు



శ్రీమతే రామానుజాయనమః

శ్రీ పరాశరభట్ట రనుగ్రహించిన

# శ్రీ గుణరత్నకోశము

## అవతారిక

వాన ప్రస్థాశ్రమస్థులైయున్న శ్రీ కూరత్తాళ్వార్లు - ఆండాళమ్మగార్లకు శ్రీ రంగనాథుని ప్రసాద కటాక్షవిశేషముచే శ్రీ పరాశరభట్టరువారు అవతరించిరి. అందుచే వీరు శ్రీరంగనాథ శ్రీరంగనాయకులయొక్క పుత్రులనియే భావింపబడి పూజింపబడుచున్నారు. వీరు యతిరాజ ఎంబారులచే జన్మప్రభృతి ద్వయమంత్రానుసంధానముతో పెంచి పెద్దజేయబడిరి. అందుచే వీరికి జననియైన శ్రీరంగనాచ్చియారు యందు అమితమైన ప్రేమ - ఆ ప్రేమ పరీవాహామే 61 శ్లోకముల రూపముగ ప్రవహించి శ్రీ గుణరత్నకోశమున భద్రపరుపబడినది ఆ కోశము తెరచి రత్నరూపమైన శ్రీదేవి గుణముల ధరించుటకొరకై వాటిని ఈ కోశమున సంపుటీకరించిన శ్రీ పరాశరభట్టారకులను మున్ముందు స్తుతించుచు, వారికటాక్షము నాపై ప్రసరించి మంగళమొనరించు గాక యని ప్రార్థించుచున్నారు.

### తనియను

శ్రీ పరాశరభట్టార్యః శ్రీ రఙ్గేశపురోహితః ।
శ్రీవత్సాఙ్కసుత శ్శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే.

### అర్థము

శ్రీరఙ్గేశపురోహితః = శ్రీరంగనాథుని పురోహితులును;
శ్రీవత్సాఙ్కసుతః = కూరత్తాళ్వారుల కుమారులకు;
శ్రీమాన్ = శ్రీమంతులునగు;

శ్రీపరాశరభట్టార్యః = శ్రీపరాశరభట్టరను పూజ్యులు;
మే = నాయొక్క;
భూయసే = అధికమైన;
శ్రేయసే = శ్రేయస్సునకై;
అస్తు = కారకు లగుదురుగాక.

### తాత్పర్యము

మనకు ప్రథమాచార్యులైన శ్రీరంగనాథునికి ఆచార్యులై, సర్వలోకైకహితుడైన సర్వేశ్వరునికి కూడ పురోహితుడై, శ్రీరంగనాథుని సన్నిధియందు ఆచార్య నియమనానుసారముగ వేదము పురాణము మున్నగువానిని విన్నవించుచుండియు, శ్రీరంగనాథుని ప్రసాదముచే శ్రీ కూరత్తాళ్వారులకు కుమారులై జ్ఞానభక్తి వైరాగ్య శ్రీలచే పరిపూర్ణులైన అర్థపంచక తత్త్వనిష్ఠాతులై మాకు నాచార్యనిష్ఠ్రేశము యతిరాజులచే శ్రీ పరాశరభట్టరను తిరునామమును వహించిన స్వామివారు.

# ఉభయవేదాన్త ప్రవర్తకసంఘము ఏకాదశ వార్షికోత్సవము, శ్రీకూర్మము

ఈ సంఘము వార్షికోత్సవము శ్రీకూర్మ క్షేత్రమున వ్యాకరణశిరోమణి శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీమత్తోయిల్ కందాళై వెంకటరామానుజాచార్యులుగారు (P. O. L.) గారి అధ్యక్షతను అతివైభవముగ ది 4-5-59 తేది నుండి ది 10-5-59 వరకు జరుపబడినది.

శ్రీమాన్ న్యాయపతి బాలకృష్ణగారున్నూ, శ్రీమాన్ భాష్యం రామానుజాచార్య కూర్మాచార్య సోదరులున్నూ, శ్రీ రామానుజ జీయర్ స్వామివారి తిరునక్షత్రోత్సవముతో పాటుగ ఈ సభలుకూడ అతివైభవముగా జరిపించిరి.

ఇందు న్యాయశిరోమణి శ్రీ ఉ. వే. శ్రీమాన్ ని. కం. వెంకటనరసింహాచార్యులు గారున్నూ, శ్రీ ఉ. వే. శ్రీమాన్ తి. వ. రామానుజ స్వామిగారున్ను (శ్రీరామతీర్థం ఆయుర్వేద మహోపాధ్యాయ) శ్రీ ఉ. వే. శ్రీమాన్ కందాళై అప్పలాచార్యులువారు (శ్రీరామతీర్థము. ద్రావిడ వేదాన్త మహోపాధి)

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తి. పి. రంగనాథాచార్యులుగారు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ తి. పె. వెం. కూర్మాచార్యులుగారున్నూ, శ్రీ ఉ. వే. శ్రీమాన్ చామర్తి సీతారామాచార్యులుగారున్నూ శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీ భాష్యం భాష్యకారాచార్యులువారున్నూ, శ్రీమాన్ వ. అ. గోవిందాచార్యులుగారున్నూ అధ్యక్షులున్నూ ఉపన్యసించిరి. సభలు, ఉత్సవము అతివైభవముగా జరిగినవి.

శ్రీకాకుళము

శ్రీమాన్ న్యాయపతి బాలకృష్ణగారు, శ్రీకూర్మమునుండి పండితుల నందరను ఆహ్వానించి, శ్రీభాష్యం రామానుజాచార్యులుగారు పేరుకలసి శ్రీకోదండ రామస్వామివారి ఆలయములో అతివైభవముగా భగవద్రామానుజుల తిరునక్షత్రోత్సవమును జరిపిరి.

---

సాలుచందా రు 5/లు భక్తినివేదన—BOOK POST రి. నెం. A. 195

శ్రీ వాసుదాసాశ్రమం — నడిగడ్డపాలెం (పోష్టు) (వయా చేబ్రోలు) గుంటూరు జిల్లా.



... లైబ్రరీ
Tirupathi, (Chithur dt.)



Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Bharathi Press, Tenali For Sriman Press, Nadigeddapalem.

శ్రీమతే రామానుజాయ నమః

శ్లో॥ శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా.



# భక్తినివేదన

[ వేదాంత మాసపత్రిక ]

సంపుటి ౧౨ ‖ వికారి - జ్యేష్ఠము ‖ సంచిక 3

## భక్తికృత్యము

శ్లో॥ కర్మజ్ఞాన సురూప యౌవన గతాం, భక్త్యాఖ్య దూత్యాహృతామ్
హృత్స్నం వేష్టిత మన్త్రమంగళగుణాం జీవాత్మకాన్తాం హితామ్
నిర్మగ్నాం విరజాజలే, శుచిముఖీం వైకుణ్ఠ భాగస్థితామ్
దృష్ట్వా, నన్దతి, వన్తు మిచ్ఛతి, హరిశ్చిత్రం సతాం [illegible]

తాత్పర్యము

వర్ణాశ్రమ ధర్మాచరణాత్మకమైన కర్మయోగమను సౌన్దర్యము[illegible] స్వస్వరూపాత్మ సాక్షాత్కార నిష్ఠారూపమైన జ్ఞానయోగమనెడు యౌవనముతోను, కూడి[illegible] [illegible]తుడను బాహ్య చిహ్నమైన కంఠస్థమగు మంగళసూత్రముగల ప్రియమైన జీవా[illegible] [illegible]తను. భక్తియనెడు దూతికద్వారా తనయొద్దకు రప్పించుకొని, విరజానదియందు మంగళస్నాన మాచరింపజేసి, నిర్మలమైన ముఖవర్చస్సుతో వెలుంగుచు, వైకుంఠనగరమున తన దివ్యమంటపములో తన యెదుటనిలచియుండగా జూచి, పరమానందభరితుడై శ్రియఃపతి నిత్యముక్త బృందము రెప్పవేయక సదా చూచుచుండగ ఆనందముతో ఆనందింపజేయగోరుచున్నాడు. ఇదేమి ఆశ్చర్యము !!!

సంపాదకులు :
విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :
కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులు

1959 - జులై

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ గుణరత్నకోశము

అవతారిక శ్రీ లక్ష్మీదేవిని పురుషకారమును జేయ ప్రార్థించుచున్నారు.

శ్లో॥ శ్రియై సమస్త - చిదచి, ద్విధాన - వ్యసనం హరేః
అంగీకారిభి రాలోకైః, సార్థయన్త్యై కృతోఞ్జలిః

## అర్థము

హరేః = శ్రీమన్నారాయణుని యొక్క
సమస్తచిదచిద్విధానవ్యసనం:-
సమస్త = సమస్తములైన
చిత్ = జీవాత్మలయొక్క
అచిత్ = ప్రకృతియొక్కయు
విధాన = సృష్టింపబడిన
వ్యసనం = ఆసక్తిని
అంగీకారిభిః = అంగీకారముతో కూడుకున్న
ఆలోకైః = చూపులచేత
సార్థయన్త్యై = సఫలపరచుచున్న
శ్రియై = శ్రీలక్ష్మిపిరాట్టికి
అంజలిః = నమస్కారము
కృతః = చేయబడుచున్నది.

## తాత్పర్యము

శ్రియఃపతి అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు. సమస్తకళ్యాణ గుణాత్మకుడు, అఖిల హేయ ప్రత్యనీకుడు. ఆయనే తన యానందమునకై తిలార్థముగ సమస్త చరాచరములయొక్క సృష్టి - స్థితి - లయకర్తయునై యున్నాడు. గాని ఆయన హితచింతకుడును, నిరంకుశ స్వతంత్రుడునగు జగత్పితయై యుండుటచే, సృష్ట్యాదులకై వలయు జ్ఞాన - శక్తి - బల - ఐశ్వర్య - వీర్య - తేజస్సులను - దయ - వాత్సల్య - క్షమాది కళ్యాణములను ప్రకాశింపజేయుటకు పురుషకార భూతురాలై, అనుక్షణమైనను ఎడబాటు లేకుండగ నిత్య వక్షస్థల నివాసినియై విరాజిల్లు జగన్మాతయగు శ్రీలక్ష్మిపిరాట్టియొక్క ఆలోకనాలాపనాది పురుషకారముండిననేగాని ఆ సృష్ట్యాదిలీలలు నెరవేరజాలవు. అందుచే సర్వేశ్వరుని నిత్య కింకరియై, జగద్హితకురాలై భగవదాశ్రయురాలై, చేతనాశ్రేయణీయురాలై భగవంతునికి వినిపించుటకై చేతనుల మొరల నాలకించునదై, వాత్సల్యము చేజీవుల కర్మను - ప్రేమచే ఈశ్వరుని కృపను క్షమించియు, దిద్దుబాటుచేసియు ఉభయత్ర పురుషకారమును జేయగల కృప - పారతంత్ర్య అనన్యార్హ శేషత్వముగలదైన శ్రీదేవికి నాకు పురుషకారమునుజేసి, భగవత్కటాక్ష పాత్రుడనగు నటుల జేయగోరుచు నమస్కరించి ప్రార్థించుచున్నాను.



**Sri Srinivasa Ramanuja Swamy Varu at Badrinath Garhwal Dt.**
**Installed by : Sri Visishtadwitha Pracharaka Sangham.**

శ్రీరస్తు!                    శ్రీమతే రామానుజాయ నమః                    శుభమస్తు!!







# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము

## అష్టాక్షరీక్షేత్రము - బదరీనాథ్ - గార్వాలజిల్లా.

# బదరీ నారాయణమున అన్న దాన విరాళ వివరములు

శ్రీ దండి శ్రీమన్నారాయణరామానుజజీయర్ స్వామివారి మంగళాశాసనపూర్వకము తెలియజేయునది:— శ్రీమతే నారాయణాయనమః.

---

(1) బదరీ నారాయణమున మన శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారి ద్వారా యేర్పాటు చేయబడిన అష్టాక్షరీక్షేత్రమున ప్రతి సంవత్సరమున్ను వైశాఖమాసమునుండి కార్తీకమాసమువరకును అయిన ఆరుమాసములు ఆగంతుకులైన శ్రీవైష్ణవులకు, విద్యార్థులకు, ఆంధ్రదేశీయ యాత్రికులకు, దండి సన్న్యాసులకు, అంగవికలులకు, దరిద్రులకును అన్నదానమును యథావకాశముగ జరుపబడు చుండుటకు నిశ్చయింపబడినది.

ప్రతిమానవునకును తన తోడి మానవుల సహాయము తప్పదు గాన తనకున్నదానిలో దేశ కాల పాత్రల నారసి కొంతభాగమును దాన ధర్మములకై వినియోగించవలెను. పూర్వజన్మమున పెట్టి పుట్టుటచేతనే గదా ఈ జన్మమున ఐశ్వర్యలాభము. అట్లే ముందు జన్మమునకై, సుఖజీవనమునకై యీ జన్మమునందును దానధర్మములు గావించవలదా!

చూడుడు దానికిది యెంత మంచి యవకాశమో!!

దేశము— ప్రపంచములో పరమపవిత్రమైన దేవతాభూమియగు బదరికాశ్రమము.

కాలము—దేవతల యారాధన అయినపిమ్మట మానవులు బదరీశు నారాధించు పవిత్రమైన ఆరుమాసములు.

పాత్రలు— బదరీశుని సేవించి బ్రహ్మకపాలమున పితృఋణమును తీర్చుకొని శ్రీ అష్టాక్షరీ మంత్రమును జపించి తరించగోరు పుణ్యమూర్తులగు యాత్రికులు.

T. 469/11/19/59 నెం. ద్వారా స్పెషల్ కారేజీలు రైల్వేవారు ఇచ్చారు.
ది 28-7-59 న చీరాలనుండి, ది 30-7-59 న బెజవాడనుండి

2వ బండి 45 రోజులు: ప్రతివారికి రాత్రిపూట పడుకునేందుకు పూర్తి బెర్త్

3వ బండి 28 రోజులు: 1 పెట్టె టూరిస్టుకారు, 1 పెట్టె H A L పైన జనతాక్యారేజీలు ఏర్పాటుచేసినాము.

## బదరీ, కాశ్మీరు, ద్వారకతో సంపూర్ణ ఉత్తరదేశయాత్ర :

పూర్తి ట్రయిన్ యాత్రావివరాలు 16-7-59 న విజయవాడనుండి

1 రో_ సింహాచలము, 1 రో_ పూరి 2 రో- కలకత్తా 3 రో- గయ 3 రో-కాశి 1 రో-అలహాబాద్ 1 రో_ అయోధ్య 2 రో- నైమిశారణ్యం 1 రో_హరిద్వారం 1 రో- ఋషీకేశం 15 రో-బదరీయాత్ర 1 రో-అమృతసర్ 8 రో-కాశ్మీరుయాత్ర 1 రో-కురుక్షేత్రం 3 రో-ఢిల్లీ 2 రో మధుర 1 రో-ఆగ్రా 1 రో- భోపాల్ 1 రో- ఉజ్జయిని 1 రో- జామ్‌నగర్ ద్వారక 1 రో-అజంతా ఎల్లోరా 1 రో-నాసిక్ 3 రో-బొంబాయి 1 రో పండరీపురం 2 రో_ హైదరాబాద్ విజయవాడ చేరుట.

2వ బండి యాత్రా వివరాలు 28_7_59న చీరాల నుండి

1 రో_ విజయవాడ 1 రో_ఢిల్లీ 1 రో_ హరిద్వార్ 1 రో_ఋషీకేశ్ 14 రో_ బదరీయాత్ర 1 రో_అమృతసర్ 8 రో_ కాశ్మీరుయాత్ర 1 రో_ కురుక్షేత్రం 3 రో_ ఢిల్లీ 1 రో_ మధుర 1 రో_ ఆగ్రా 1 రో_ ఉజ్జయిని 1రో_జామ్‌నగరుద్వారక 1 రో_నాసిక్ 3 రో_బొంబాయి 1 రో_ పండరీపురం 1 రో_ హైదరాబాద్, విజయవాడచేరుట.

2వ బండి 3వ తరగతి బదరీ కాశ్మీరులకు పోనురాను బస్ చార్జీలతో, రెండు వేళలా భోజనంతో టి 1 కి రు 375 లు. భోజనములేకుండా పై విధముగా రు 285 లు. టూరిస్టుకారులో వచ్చువారికి అదనముగా రు. 25 లు.

3వ బండి 30-7-59న సరాసరి, ఢిల్లీవెళ్ళి, బదరీనాథ్ దర్శించుకొని తిరిగి సరాసరి విజయవాడచేరుట, బదరీకి బస్ చార్జీలతో, భోజనంతో టి 1కి రు. 250/- భోజనం లేకుండ రు. 185/- కావలసిన టిక్కెట్లను టి 1కి రు 50/- చొ॥న 30_6_59 లోగా కట్టి రిజర్వు చేసుకోండి.

వివరాలకు : గీతా ట్రావెల్ సర్వీసు
ఫోన్ నెం. P. P. 93 పప్పులబజారు, విజయవాడ_1.



# ప్రచార విభాగము

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారి భగవద్గీతా పరీక్షలు

### ఉద్దేశములు

భగవద్గీతార్థము అందరికిని అందజేసి సదనుష్ఠాన పరులగునట్లు ప్రచారము చేయుటయే యీ పరీక్షలకు ముఖ్యోద్దేశము.

### యోగ్యత

స్త్రీలుగాని, పురుషులుగాని ఏ వయస్సులో నున్నవారైనను యీ పరీక్షలలో పాల్గొనవచ్చును.

### పరీక్షా విధానము – పాఠ్యక్రమము

మొత్తము గీతయంతయు 6 పరీక్షలుగా విభజింపబడి 4 నెలలకు ఒక పరీక్ష చొప్పున 2 సంవత్సరములలో గీత యంతయు పూర్తిగా పరీక్షింపబడును.

సంఘముచే ప్రచురింపబడిన భగవద్గీతా ప్రశ్నోత్తరావళిలోని,

| | |
|---|---|
| 1, 2, 3 అధ్యాయములు మొదటి పరీక్ష | 10, 11, 12 అధ్యాయములు నాల్గవ పరీక్ష |
| 4, 5, 6 అధ్యాయములు రెండవ పరీక్ష | 13, 14, 15 అధ్యాయములు ఐదవ పరీక్ష |
| 7, 8, 9 అధ్యాయములు మూడవ పరీక్ష | 16, 17, 18 అధ్యాయములు ఆరవ పరీక్ష |

ఆయా పరీక్షల కాయా యధ్యాయములనుండితీసి యీక్రింద తెలుపబడిన శ్లోకములను ఒక్కొక్క పరీక్షకు 30 శ్లోకములు చొప్పున టీకా తాత్పర్యములతో వల్లించవలెను. ఏ యధ్యాయములలో పరీక్ష నీయగోరువారు ఆ యధ్యాయములలోని యీ క్రింది శ్లోకముల టీకాతాత్పర్యములతో వల్లించవలెను. ఎవరే మూడు అధ్యాయములలో నైనను ఒక క్రమములో పరీక్ష నొసంగవచ్చును. ఒకసారి పరీక్షకు దరఖాస్తుకట్టి ఏ ప్రతిబంధకములచేతనైనను హాజరు కాజాలనివారు రాబోవు పరీక్షలో నీ పరీక్ష నీయవచ్చును. ఉదయము 7-30 నుండి 10 గం. వరకు పరీక్ష జరుగును. దానికి పరీక్ష రుసుము వేరుగా నీయ నవసరములేదు. ఒక్కొక్క అధ్యాయమునకు 2 ప్రశ్నలు చొప్పున 3 అధ్యాయములకు 6 ప్రశ్నలున్ను, ఆ యధ్యాయములకు సంబంధించిన 3 శ్లోకములకు టీకా తాత్పర్యములతో నొక ప్రశ్నయు మొత్తం 7 ప్రశ్నలుండును. సంఘముచే ప్రచురింపబడిన ప్రశ్నోత్తరావళిలోని ప్రశ్నలే యడుగబడుచుండును. టీకా తాత్పర్యములుకూడా సంఘముద్వారా ప్రచురింపబడిన గీతా శ్లోకముననుసరించియే చదువవలెను.

షరా:- పరీక్షార్థులకు ఒకేసారి కొనినచో 3-0-0 లు విలువగల ప్రశ్నోత్తరావళి 3 భాగములు 2-0-0 లకున్ను 4-0-0 లు విలువగల గీతాకోశము, 3-0-0 లకున్ను యివ్వబడును. పోష్టు ఖర్చులు వేరు.

### పరీక్షలను జరుపు సమయము

పరీక్షలు ప్రతి సంవత్సరము జనవరి, మే, సెప్టెంబరు నెలలలో చివరి ఆదివారము మధ్యాహ్నము గం. 2-30 నుండి 5-0 ల వరకు జరుపబడుచుండును.

### పరీక్షలను జరుపు విధానము

అంగీకరింపబడిన కేంద్రగ్రామములయందలి స్కూలు ప్రధానోపాధ్యాయుల పేరుతోగాని లేక ఆ గ్రామము మరియొక పెద్దల పేరుతోగాని పరీక్షాపత్రములు పంపబడును. వారా పత్రికలను పరీక్షాసమయమునకు 15

నిమిషములు ముందుగా పరీక్షా భవనమునందే సీలు తెరచి అభ్యర్థులకు 5 నిముషములు ముందు పంచుదురు. జవాబులు వ్రాసిన పత్రములను భద్రపరచి మరునాడు పోష్టులో రిజిష్టరుగా కార్యాలయమునకు పంపుదురు. అట్టివారి పేరులను చిరునామాను దరఖాస్తులతోనే తెలుపవలెను.

## ఉత్తీర్ణత

60 మార్కులు అంతకుపైన ఉత్తమ తరగతిగాను, 45 మార్కులు అంతకుపైన రెండవతరగతి 40 మార్కులు లభించినవారే ఉత్తీర్ణులుగను గణింపబడుదురు.

## దరఖాస్తులు

దరఖాస్తులను ప్రతిపరీక్షకు ఒక నెల ముందుగా కార్యాలయమునకు 0-8-0 ఫీజుతో మనియార్డరుగా గాని తపాలాబిళ్ళల రూపముగాగాని పంపుచు యీ క్రిందివిధముగా దరఖాస్తులను వ్రాసి పంపవలెను. 0-1-0 బిళ్ళ పంపినచో దరఖాస్తు అచ్చుఫారం పంపబడును. దరఖాస్తు (పరీక్ష ప్రార్థనాపత్రిక) విధానముక్రింద నొసంగబడినది చూడుడు.

## యోగ్యతా పత్రిక

పరీక్షలు ముగించిన ఒక నెలలో ఫలితములు కేంద్ర వ్యవస్థాపకులకు ప్రత్యేకముగను, భక్తినివేదన పత్రిక మూలమునను తెలుపబడును. ఆయా యధ్యాయములలో నుత్తీర్ణులైనవారిని తాత్కాలిక యోగ్యతా పత్రిక లొసంగ 18 అధ్యాయములు పూర్తి కాగానే శాశ్వత సంపూర్ణ యోగ్యతాపత్రికయు తదోచిత సన్మానమును ఒసంగబడును. అన్ని పరీక్షలలోను ప్రథమ కక్షలో నుత్తీర్ణులైనవారికి విశేష బహుమాన మొసంగబడును. అన్ని విషయములలోను పరీక్షా మంత్రిది తుది నిర్ణయముగా నుండును.

## టీకా తాత్పర్యములతో వర్ణించవలసిన శ్లోకములు

| గీత | శ్లోక సంఖ్య |
|---|---|
| మొదటి అధ్యాయము | 1 10 14 39 40 41 |
| రెండవ ,, | 7 12 22 27 38 47 55 56 57 58 59 61 62 63 70 |
| మూడవ ,, | 8 11 13 21 30 36 37 42 43 |
| నాల్గవ ,, | 7 8 11 13 14 24 28 34 40 |
| ఐదవ ,, | 10 13 18 29 |
| ఆరవ ,, | 5 9 11 12 13 14 16 17 26 34 35 40 41 42 43 44 47 |
| ఏడవ ,, | 7 14 15 16 17 18 19 21 22 |
| ఎనిమదవ ,, | 5 6 7 13 16 24 25 27 |
| తొమ్మిదవ ,, | 2 14 17 18 19 22 26 27 29 30 31 32 34 |
| పదియవ ,, | 9 10 11 25 35 37 41 |
| పదునొకండవ ,, | 13 26 27 32 33 40 43 44 54 55 |
| పదిరెండవ ,, | 7 8 9 10 13 14 15 16 17 18 19 20 |
| పదమూడవ ,, | 7 8 9 10 11 21 33 |
| పదునాల్గవ ,, | 3 5 10 11 12 13 17 18 23 24 25 26 |
| పదిహేనవ ,, | 1 2 3 4 6 7 8 9 14 17 18 |
| పదునారవ ,, | 1 2 3 4 5 20 21 23 24 |
| పదునేడవ ,, | 8 9 10 14 15 16 28 |
| పదునెనిమిదవ ,, | 5 6 14 17 42 43 44 46 58 61 62 66 70 78 |

# వార్తామాల

(గతసంచిక తరువాయి)

## అయిదవవార్త (తత్త్వత్రయము)

తత్త్వములు - అచిత్తులనియు, చిత్తులనియు ఈశ్వరుడనియు మూడు (అచిత్తు=అచేతనము ప్రకృతి = ప్రధానము. అనునవి సమానార్థకములు)

అచిత్తుయొక్క స్వరూపము:- జ్ఞానశూన్యత్వముతోకూడియున్న జడత్వము-

దీనియొక్క స్వభావము :— సతతము పరిణామమును పొందుచుండుట. (చిత్తు = ఆత్మ = జీవుడు = ప్రత్యక్, అనునవి సమానార్థకములు-

చిత్తుయొక్క స్వరూపము:- జ్ఞాతృత్వముకూడియున్న శేషత్వము

దీనియొక్క స్వభావము:- కైంకర్యైకపరత్వము

(ఈశ్వరుడు = పరమాత్మ = భగవంతుడు = బ్రహ్మఅనునవి సమానార్థకములు)

ఈశ్వరునియొక్క స్వరూపము:- జ్ఞాతృత్వము కూడియున్న శేషిత్వము

ఈయనయొక్క స్వభావము:- సర్వరక్షకత్వము

### -: మరియొక పద్ధతిగ విభాగము :-

తత్త్వములు జడమనియు, అజడమనియు రెండువర్గములు,
జడము నిర్గుణమనియు, సగుణమనియు రెండుతరగతులు
సగుణము త్రిగుణమనియు, ఏకగుణమనియు రెండువిధములు
త్రిగుణము ప్రకృతిఅనియు, ప్రాకృతమనియు రెండుభేదములు
అజడము ప్రత్యక్కుఅనియు, పరాక్కుఅనియు రెండుతరగతులు,
ప్రత్యక్కు - ఆత్మఅనియు, ఈశ్వరుడనియు రెండుపదార్థములు
పరాక్కు - జ్ఞానమనియు, జ్ఞేయమనియు రెండుకూటములు.

## ఆరవ వార్త (గుణత్రయము)

సత్వము, రజస్సు, తమస్సు, అను మూడుగుణములుకలది ప్రకృతి. ఈమూడు గుణములు లోను ఒక్కొక్కటి మూడేసివిధములుగా నుండును.

| | | |
|---|---|---|
| తామస తామసము. | రజత తామసము | సాత్విక తామసము. |
| తామస రాజసము. | రాజస రాజసము | సాత్విక రాజసము, |
| తామస సాత్వికము | రాజస సాత్వికము | సాత్విక సాత్వికము. |

ఇంక.

తామస తామసము - నిద్రను కలిగించును.
తామస రాజసము - శోకమును కలిగించును.
రాజస సాత్త్వికము - పరహింసను ప్రేరేపించును.
రాజస తామసము - విషయాంతరములలో ముంచును.
రాజసరాజసము - కామ్య కర్మలలో ముంచును.
రాజససాత్త్వికము - భగవంతుని స్తుతించుటలో ప్రవర్తింపజేయును.
సాత్త్విక తామసము - భగవన్మంత్రములలో ఆసక్తిని కలిగించును.
సాత్త్విక రాజసము - ప్రకృత్యాత్మ వివేకమును కలిగించును.
సాత్త్విక సాత్త్వికము - భగవత్సాక్షాత్కారములో ప్రవర్తింపజేయును.

## ఏడవ వార్త

తత్త్వత్రయమునకు 1. స్వరూపము. 2. స్వరూప నిరూపకధర్మములు. 3. నిరూపితస్వరూప విశేషణము 4. వ్యాపారము. అని నాలుగువిభాగము లుండును

ఇందు ఈశ్వరునియొక్క స్వరూపము- సత్యమై; జ్ఞానమై; అనంతమై; ఆనందమై; అమలమై యుండును.

స్వరూప నిరూపకధర్మము - సత్యమయమైనదై;
జ్ఞానరూపమైనదై అనంతాత్మకమైనదై ఆనందరూపమై అమలమైనదై యుండును.

నిరూపిత స్వరూపవిశేషణము:— జ్ఞానశక్త్యాది సమస్తకల్యాణగుణములున్ను గుణముల వలెనె విశేషణములై గుణప్రకాశకములైన దివ్యమంగళ విగ్రహములున్ను, ఈ విధముగా నిరూపితమైన వస్తువు.

దంపత్యాశక్తమై యుండును. ఈ దంపతులకు శేషభూతములో నున్న చేతనాచేతనములన్నియు శరీరభూతములై శేషములైయుండును

వ్యాపారము:- తనయొక్క ఆనందమునకు బహిర్గతరూపముచేయు సమస్తజగత్తుయొక్క సృష్టి స్థితి సంహారములున్ను మోక్షప్రదత్వమున్ను అయియున్నవి. ఈవిధముగా అన్నివిధములను సమానతలెయను కలిగియున్న దంపతులు అన్యోన్యము అతిశయకరులై యుండురు. ఇందులకు కారణమేమియనగా - ఆయన శ్రియఃపతియగుటయును, ఆమె విష్ణుపత్ని అగుటయు అయియున్నది.

సర్వేశ్వరునికంటెను పిరాట్టికిగల అధికవ్యాపారమేమనగా అధికార సంపత్తియును, పురుషకారత్వములునై యున్నవి.

సర్వేశ్వరునికిగల అధిక వ్యాపారమేమియనగా దండధరత్వమున్ను ఉభయ భూతుడగుటయునై యున్నవి.

చేతనునియొక్క స్వరూపము:- సత్యమై, జ్ఞానమై, ఆనందమై, అమలమై, అణువై యుండును.

స్వరూపక నిరూపక ధర్మము:- సత్యమయమైనదై, జ్ఞానరూపమైనదై, ఆనందాత్మకమైనదై అమలమైనదై, అణురూపమైనదై యుండును.

నిరూపిత స్వరూపవిశేషణము - శరీరమువలె శేషభూతమైనదై అనంతజ్ఞానాది గుణాత్మకమైనదై యుండును.

వ్యాపారము:- అనుభవజనిత ప్రీతికారిత కైంకర్యము

అచిత్తుయొక్క స్వరూపము:- మూడువిధములై యుండును అవియనగా అప్రాకృతము, ప్రాకృతము కాలము అని ఇందు అప్రాకృతముయొక్క స్వరూపము జ్ఞానము.

స్వరూప నిరూపక ధర్మము జ్ఞానత్వము

నిరూపిత స్వరూప విశేషము:- శరీరమువలె శేషత్వము.

వ్యాపారము:- ఇచ్ఛానుగుణ పరిణామము

ప్రాకృతముయొక్క స్వరూపము:- జడము.

స్వరూప నిరూపక ధర్మము:- జడత్వము

నిరూపిత స్వరూప విశేషణము:- శరీరమువలె శేషభూతమై యుండుట గుణత్రయత్వము, సతత పరిణామత్వమును.

వ్యాపారము:- బద్ధచేతనుని స్వస్వరూపమును పరస్వరూపమును మరపించేయుటయును అయి యున్నది.

కాలముయొక్క స్వరూపము:- విభువై, జడమై యుండుట.

స్వరూప నిరూపక ధర్మము:- విభుత్వము, జడత్వమును.

నిరూపిత స్వరూప విశేషణము:- శరీరమువలె శేషభూతమై యుండుట. కలకాష్ఠాది రూప పరిణామము కలిగియుండుటయును.

వ్యాపారము:- సృష్ట్యాదుల కుపకరణమై యుండుటయునై యున్నది.

## శ్రీరంగవార్తలు

శ్రీరంగములో పెరియపెరుమాళ్ల (శ్రీరంగనాథుని సంప్రోక్షణ ది 12-7-59 తేదిని జరుపనిశ్చయింప బడినది. ఇందులకై 6-7-59 తేదిని ఉదకశాంతనే అంకురారోపణ ఇత్యాదులతో దీక్షప్రారంభింప బడును. ది 11-7-59 తేదీని సహస్రకలశాభిషేకము జరుగును.

ఇందులకై మూడవప్రాకారములో పెద్దపందిరి వేయబడుచున్నది. పెరియపెరుమాళ్ళను సేవించుటకై రూ. 2-0-0 చొ॥ టిక్కెట్టు ఏర్పాటుచేయబడినది. ఇవతలప్రాకారమునుండి విమానసంప్రోక్షణను సేవించుటకు మాత్రము 0-8-0 చొప్పున టికెట్టుఏర్పాటుచేయ బడినది. ఈసంప్రోక్షణకు కావలసినయావత్తు ఏర్పాటులును, ఆదిశేషులకు బంగారు కవచము, రజతకవచములు తయారైనవి వేలకొలదియాత్రికులు వత్తురని, అందులకు వలయుఏర్పాటులన్నియు విరివిగ జరుగుచున్నవి.

శ్రీమతే రామానుజాయ నమః



# అనుష్ఠాన విశేషములు

## సదాచార్యులు

సదాచార్యులనగా

శ్లో॥ ఆచినోతి హి శాస్త్రార్థ నాచారే స్థాపయత్యసౌ
స్వయ మాచరతే యస్మా త్తస్మా దాచార్య ఈరితః॥

శ్లో॥ సిద్ధం సత్సంప్రదాయే స్థిర ధియ మనఘం॥

శ్లో॥ ఉభాభ్యా మేవ పక్షాభ్యా మాకాశే పక్షిణాం గతిః
తథైవ జ్ఞానకర్మాభ్యాం ప్రాప్యతే బ్రహ్మణః పదమ్॥

శ్లో॥ గుశబ్ద స్త్వన్ధకారే స్యాద్రుశబ్ద స్తన్నిరోధకః
అన్ధకార నిరోధిత్వా ద్గురు రిత్యభిధీయతే॥
అజ్ఞైత్తై యమడనారాయ్
వేరుకొండుమైప్పొ యూనిరన్దేన్ వెవెణ్డినంగాళ్
ఞానమనుట్టాన మివై నన్గాగవే వుడయనాన
గురువై అడైందక్కాల్ మానిలత్తీర్ తేనార్ కమల
త్తిరుమామకన్ కుళఅనన్ తానే వైకుంద తరుమ్॥
ఇత్యాది ప్రమాణములందు చెప్పబడుచున్నట్టి
శ్రీమన్నారాయణునిరొక్క ఆరవ స్వరూపులై

శ్లో॥ జ్ఞాని త్వాత్మైవ మే మతం॥

అనునటుల భగవానునకు ప్రాణభూతులై సాక్షాత్ భగవత్స్వరూపులై. సత్సంప్రదాయసిద్ధులై జ్ఞానానుష్ఠానములు శరీరమందు తడిమి తెలుసుకోగలమన్నంతగా నున్నటువంటి పరమ సాత్త్వికులై సర్వదా అనుగ్రహైక శీలురై అజ్ఞానాంధకార నివర్తకులై స్వాచార్య పరతంత్రులై

శ్లో॥ కళైవాయ తుంబం కళైయాతోటివాయ్
కళైకణ్ మత్తిలేన్

అని ప్రాపకములందవ్యవసాయమును

శ్లో॥ యాం మడలూరున్దు మెమ్మాళియజ్జెకట్టిరా
నుడై తూమడల్ తణ్ణన్దులాయ్ మలర్ కొణ్డ శూళువోమ్

అని ప్రాప్యమందు త్వరను కలవారై

శ్లో॥ దేవతాంతర శబ్దాది భక్తి కృష్ణాఖ్య హేతుషు
సామ్యకృత్ పరమైకాంతి గురావత్యన్త భక్తిమాన్

అనియు "ఘాతేప్రమశరీయేన్" అనియు శ్లో॥ నయుకే నోంచ తేయాకు అని స్వాచార్యాశ్రమా నైకనిష్ఠులై పరసమృద్ధైక ప్రయోజనులై పరమభాగవత నిష్ఠులై నిరపేక్షులై పూర్ణులై సతతము గుణానుభవ కైంకర్యపరులై యుండువారు సదాచార్యులనబడుదురు.

ఇట్టి ఆచార్యుల నుద్దేశించియే తైత్తిరీయోపనిషత్తునందు తద్విగుణసయుండు ఆత్మ అంత రాత్మ, పరమాత్మ అని పరమాత్మ శబ్దముచే చెప్పబడెను.

ఈ ఆచార్యత్వమనునది ఉత్తారకత్వము, ఉపకారకత్వము అని రెండువిధములుగా నుండును. క్షంప ఉత్తారకాచార్యులు సంప్రదాయము నుపదేశించినవారు మంత్రార్థములు ఉపదేశించినవారు ఉపకారకాచార్యులనబడుదురు. సచ్ఛిష్యులైనవారు ఈ యిద్దరి విషయములను సమానముగ ప్రతిపత్తి కలిగియుండవలయును. వీరిద్దరిలోను ఎవరైన నొకరి విషయమున వైషమ్యమును కలిగి యున్నచో సర్వేశ్వరుని యొక్క తిరువడిగళ్లు రెండింటిలోను వైషమ్యమును కలిగినవారివలె నగును. అందువలన ఆత్మోజ్జీవనము ఉజ్జీవింపబాలదు. ఈ పెద్దలు ఉద్ధరింపజేయవలచిన వారికిని అనిష్టుడగును.

ఈ యిద్దరు ఆచార్యులలోను జ్ఞానానుష్ఠానములలో వైషమ్యమున్నచో ఎవరియందెట్టు ప్రతిపత్తిని కలిగియుండ వలెనన్నచో.

శ్లో॥ "జ్ఞానానుష్ఠాన వైషమ్యాత్, ప్రబలో యస్తు దుర్బలః ॥
ఉత్తారకస్తు పూర్వస్స్యా దపరస్తూపకారకః

అను ప్రమాణవచనము ననుసరించి మంత్రప్రదులు - మంత్రార్థప్రదులునగు యిద్దరు ఆచార్యులలోను ఎవరియందైతే జ్ఞానానుష్ఠానములు అధికముగ నుండునో వారి విషయములో ఉత్తారకాచార్యులను ప్రతిపత్తియును, జ్ఞానానుష్ఠానములు తగ్గియున్నవారి విషయమున ఉపకారాచార్యులును ప్రతిపత్తియును కలిగియుండవలెను.

అనగా మంత్రార్థప్రదులగు యాచార్యులు జ్ఞానానుష్ఠాన ప్రబలులైయున్నచో వారే ఉత్తారకాచార్యులగుదురు. వీరు పడవను ప్రధానమైన చుక్కానిని పట్టుకొని నడుపువారి వంటి వారగుదురు. మంత్రప్రదులగు యాచార్యులు జ్ఞానానుష్ఠాన దుర్బలులైయున్నచో వారు ఉపకారకాచార్యులు మాత్రమే యగుదురు. వీరు మంచి పడవవంటి వారిగుదురు.

ఇద్దరు యాచార్యులును జ్ఞానానుష్ఠాన ప్రాబల్యము గలవారే అయియున్నచో ఎటుల భావించవలెననగా, వారివారి స్వరూపములలోనున్న వారలనుగా భావింపవలెను. అనగా మంత్రప్రదులగు ఆచార్యులకు స్వరూపము ఉత్తారకత్వమున్ను, అర్థప్రదులగు ఆచార్యులకు స్వరూపము ఉపకారకత్వమున్ను అయియున్నవి.

అట్టిస్థితిలో దేనిని రక్షించవలెనన్నచో వీనియొక్క పరమాచార్యుల తిరువడిగళ్లను చూపవలయును.

"పితామహం నాథ మునిం విలోక్య" అనునటుల పరమాచార్యులు ఉత్తారకులగుటలో ఎట్టిలోటును యుండదుగదా. వీరివిషయమున ఉపకారకత్వ ప్రతిపత్తియే తప్ప తిరిగి అర్థప్రదులగువారి తిరువడిగళ్ళను యాశ్రయించ నవసరములేదు. ఎందుచేతననగా అర్థప్రదులగువారికి మంత్రప్రదులగువారిపట్ల ఉపకారస్మృతి యుండునుగనుక.

ఉపకారస్మృతియనగా, ఈ ఆచార్యులు ఈ చేతనుని నిర్హేతుకకటాక్షముచే దిద్దుబాటును గావించి.

శ్లో॥ ప్రకర్షే ఽపతరాజన్యో, ప్రధావన్తం ప్రమాథినమ్।
జ్ఞానాంకుశేన బధ్నీయాన్మత్వా మిందిరియ దన్తినం॥

అనునటుల భగవంతునికి విముఖుడై ఇతరవిషయాభిముఖుడై తిరుగుచుండగా తనయొక్క నిర్హేతుక కృప యను ఖడ్గముచే విషయములను యడవిని ఛేదించి భగవంతుని విషయమై యభిముఖునిగ చేసినవారు వీరేకదా యని తలంచియుండుట.

అయినచో వీరు ఉత్తారకులు గాకుండుటకు కారణమేమి యనగా, ‘‘తెళ్ళియ విమాన వాళే పాల్ వరచెడ్ శెళర్న విలత్తె శెయ్ కారాన్స్వడి కృపైయ్ ... అనునటుల వీరిని దౌర్గత్యనిగ దిద్దుబాటుచేసిరే గాని ఫలపర్యంతముగ దిద్దుబాటు చేసినవారు కాజాలరు. ... అంతేమాత్రము ఉపకారమును చేయుటచే ఉపకారకులైనవారు ఆయాచార్యులుండుటచే ఈ చేతనునకు జ్ఞానానుష్ఠానాతిశయములుగల అర్థపరులగు నాచార్యులు లభించిరి. “వేదాంతి దేశిక కటాక్ష విశ్వస్తబోధం” అనునది ఇందుకు ప్రమాణము అనగా నిలకడైన సంబంధము లభించుటకు ఉపకారకాచార్య కటాక్ష ముండవలెనని తాత్పర్యము.

జ్ఞానానుష్టాన ప్రాబల్యమనగా తమయొక్క జ్ఞానానుష్ఠానములచే ‘‘ఊరుం నాడుం ఉలగ ముమ్దన్నైప్పోల్” అనునటుల సంసారులనుకూడ తమవలెనే దిద్దుబాటు చేయువారైరి అనునటుల తమతో సామ్యాపన్నులగునటులయుండుట. అనగా పరదుఃఖదుఃఖిత్వమున్ను, పరదుఃఖఅసహిష్ణుత్వమున్ను కలిగియుండు ఎంబెరుమానారులవలెను, కూరత్తాళ్వారులవలెను, యుండుట అని భావము.

జ్ఞానానుష్టాన దౌర్బల్యమనగా జ్ఞానానుష్ఠానములు తమవరకు మాత్రమే కలిగియుండుట అనగా తమ ప్రయోజనమును మాత్రమే జూచుకొనుట, అనగా స్వానుభవమునందు మాత్రమే పర్యవసించుటయని తాత్పర్యము.

నదిని దాట శక్తిమంతుడైనవాడు తనయొక్క స్వభావములను ఇవతల గట్టున యుంచి ఆ నావలగట్టును చేరినచో అట్టివానికి పరోత్తారకత్వముండదుగదా.

“స్వయంతీర్ణః పరాన్ తారయతి” అని తానున్ను తనయొక్క భారముతో కూడ నదిని నీది దాటగల శక్తిమంతునికే మాత్రమే పరోత్తారకత్వముండును. గనుక అట్టిశక్తిరహితులకు జ్ఞానానుష్ఠాన దౌర్బల్యముండుటవలన వారు ఉత్తారకులు కాజాలరు. జ్ఞానానుష్ఠాన ప్రాబల్యముండువారలకు మాత్రమే ఉత్తారకత్వముండును.

శిష్యుడు-ఆచార్యుడు అను వీరిద్దరిలోను ఎవరికి జ్ఞానానుష్ఠాన ప్రాబల్యముండునో అట్టివాడే రెండవవానికి ఉత్తారకుడగును. మిగిలినవాడు ఉపకారకుడని తలంచవలెను. అనగా సచ్ఛిష్యునకు తన యాచార్యులకంటెను జ్ఞానానుష్టానముల ప్రాబల్యముండినచో అట్టి సచ్ఛిష్యుడు తన యాచార్యులకు ఉత్తారకుడగుచున్నాడు. తన యాచార్యుల ప్రతిపత్తిచే అట్టి స్థితిలో ఆ యాచార్యుడు తన శిష్యునకు తాను ఉపకారకుడగుచున్నాడు. అట్టిశిష్యునకు అర్థపంచక స్వరూప యాథాత్మ్య జ్ఞానమును అనుష్ఠాన పర్యంతముగ ఉపదేశించిన వాడగుటచే ఉపకారకుడగుచున్నాడు. తాను అనుష్ఠానమునందు అశక్తుడైయున్నచో తాను తనశిష్యుని విషయమైన తన

యాచార్య శిష్యుడను బుద్ధియేటప్ప తన శిష్యుడను భావము లేకుండుటవలన తన కతను ఉత్తారకుడను భావము కలిగియుండవలయును.

శిష్యునకు తాను జ్ఞానోపకారకుడగుటవలన తన విషయమున ఉపకారకత్వబుద్ధి ఉండవలయును. అనగా తనయాచార్యుల విషయమున యని భావము.

జ్ఞానోపకారకత్వమనగా అర్థపంచక స్వరూపమును అనుగ్రహించి సర్వేశ్వరుని తిరువడి ఘళ్లనే "అణెవళ్ అనిన్ పాదమే శరణాక; కైవాయ్ తున్బం కడైయాతొళివాయ్ కళైకణ్ మత్తిలేన్ అని అధ్యవసించి ఉండుమా అని శ్రీమన్నారాయణుని తిరువడిసుళ్ళు ప్రసాదించి యుండుటచే ఉపకారకుడని తలంచియుండవలెను.

దీని పర్యవసితార్థ మేమనగా:- శ్లో॥ తాపః పుండ్రస్తథా నామ మంత్రో యాగశ్చ పంచమః
అమీ పరమసంస్కారాః పరమైకాంత్య హేతవః।

అని గొప్పదైన తిరుమంత్రమును ప్రసాదించిన ఆచార్యులును ఆ మంత్రార్థము ప్రసాదించిన ఆచార్యులును, ఈ ఇద్దరిలోను తాపాది సంస్కారములను ప్రసాదించిన యాచార్యులు ఉత్తారకులు ఆ మంత్రముయొక్క యర్థమును ప్రసాదించిన యాచార్యులు ఉపకారకులు. ఈ యిద్దరిలోను జ్ఞానానుష్ఠాన ప్రాబల్యము గలవారే ఉత్తారకులు. జ్ఞానానుష్ఠాన దౌర్బల్యము గలవారు ఉపకారకులు. శిష్యుడు - ఆచార్యులు అను ఈ యిద్దరిలోను శిష్యుడే గాని ఆచార్యుడేగాని జ్ఞానానుష్ఠాన ప్రాబల్యము గలవాడే ఉత్తారకులని తనకుతాను తెలుసుకొనవలెను. ఈ శ్లోకమునకు ఇదియే యర్థముగ గ్రహించవలెను.

మంత్రార్థమనగా ముముక్షుపడి వ్యాఖ్యానము మొదలైన రహస్యగ్రంథములు వాని వ్యాఖ్యానములును, దీర్ఘశరణాగతియొక్క తాత్పర్యార్థమైన ఈ ముప్పత్తాఱాయిర మానమైన ఈ భగవద్విషయ ఈడు వ్యాఖ్యానమును మిగిలిన ఆళ్వార్లు సాయించిన ప్రబంధములును వాటి వ్యాఖ్యానములును మొదలైనవి.

మంత్రమనగా తిరుమంత్రము. ద్వయమంత్రము. చరమశ్లోకమున్ను ఈడు (భగవద్విషయము) యొక్క చింతనను సాయించినవారి విషయమునను, దానికి సహకరించినవారి విషయములలోను, ఉపకార ప్రతిపత్తియుండవలయును. తాము కాలక్షేపము జేయుచుండునపుడు వారల యొక్క తనియలను అనుసంధించుకొనవలెను. వారలయొక్క తిరునక్షత్ర తిరువధ్యయన పరిపాల నాచరింపవలయును. తీర్థప్రసాద స్వీకార మొనరింపవలయును. గనుకనే మొదట నమః పదమందలి బహువచనమునకే యర్థమందే తాత్పర్యము

శ్లో॥ అర్వాంచో యత్పదసరసిజ ద్వంద్వ మాశ్రిత్య పూర్వే॥

అను శ్లోకము ఈ అర్థమునకు ప్రమాణముగా అనుసంధించుకొనవలయును.

ఒకరు ఒక యాచార్యుల తిరువడి ఘళ్ళను ఆశ్రయించి పిమ్మట మరియొక యాచార్యుల సన్నిధికిపోయి "దాసునకు స్వరూపగ్రంథముల ననుగ్రహింపవలయు" నని అపేక్షించినపుడు వానిని "నీవు ఏఆచార్యుల శ్రీపాదముల నాశ్రయించితివి" అని ప్రశ్నింపవలయును. అందుల కాతడు "ఫలానా యాచార్యుల శ్రీపాదముల నాశ్రయించితిని'' అని తెలుపగా ఆ యాచార్యులు జ్ఞానానుష్ఠాన ప్రాబల్యము కలవారై యున్నచో "ఉయ్యనినైవుణ్డాకిల్ ఉజ్జురుక్కళ్

తంపత త్తే వైయమన్నుత్తెన్! యింకమానిలత్తర్'' అని "స్వామియొక్క యాచార్యుల తిరువడి ఘళ్లే నీకు ఉపాయోపేయములని తలంచియుండుము" అని ఆ గొప్ప శిరమంత్రియొక్క తాత్పర్యమును సాయింపవలయును.

అటులగాక ఆ యాచార్యులు తగుజ్ఞానవంతులైయుండనిచో ఆయాచార్యుల తిరువడిఘళ్లను ఉపాయముగ జూపింపకూడదు. జూపించినచో కంటకావృతమైన యడవిని జూపించినటులను, నది దాటుటకు పడవను జూపింపదలచి చిల్లిపడవను జూపించినటులను, సంసారసముద్రమున ముంచుట యనెడు దోషము సంభవించును. అట్టి స్థితిలో దేనిని జూపవలెనన్నచో "భగవద్రామానుజుల చరణారవింద స్థానీయులైన సదాచార్యులను తిరిగి యాశ్రయించుమూ" అని తెలుపవలయును. ఈ విధముగా తెలుపగా అందులకు సమ్మతించి, దేవరవారే భగవద్రామానుజ చరణారవింద స్థానీయులు, జ్ఞానానుష్ఠానసంపన్నులు "అకిఞ్చనో నన్యగతిశ్శరణ్య! త్వత్పాదమూలం శరణః ప్రపద్యే" అని విన్నవించుచు దేవరవారి శ్రీపాదముల నాశ్రయించుచున్న దాసునికి దేవరవారే రక్షకులుగావలెనని నిర్బంధించినచో "నెఱిశేయనుమ్ తెయ్వర్" అనునటుల తమనిర్హేతుక కృపచే తమపట్ల ఆచార్యపారతంత్ర్యమును జూపి, 'పళ్లిక్కైయు నుఱియ వియన్పుకెన్, ఒణ్ణమిళ్ శఠకోపనరుళైయే' అని స్వాచార్యుల వైభవమును ప్రకాశింపజేయుచు నీవును నేనును మన గురువుల శ్రీపాదసంబంధులము, అని బుద్ధిగలవారై, స్వాచార్య తిరువడి ఘళ్ళను ధ్యానించుకొనుచు, తాను స్వాచార్యైక శరీరభూతులై, స్వాచార్య శ్రీహస్తముచే పంచసంస్కారములనుజేసి స్వరూపగ్రంథములను కూడా కృపజేయవలయును. వీటిని సాయించునపుడు కూడ తనను, శిష్యుని, ఫలమును మార్చుకొని ఆయన తనకు శిష్యుడని తలంచక తన వలెనే వీరుకూడ తమయాచార్య శిష్యులని భావించుచునే సాయింపవలయును.

జ్ఞానానుష్ఠానసంపత్తి యనగా ఇదియే. ఇటులగాక మంత్రార్థము కొరకై తన వద్దకు వచ్చిన వానిని నీ గురువులను విడిచి నన్ను ఆశ్రయించిననే తప్ప మంత్రార్థమును సాయింపను అనినచో తమయందు అహంకార మమకారములున్నవగునుగాన దృఢతరమైన పడవను విడిచి ఓటిపడవను అధిష్ఠించమని తెలిపినచో తటస్థించునట్టి ఆత్మఘాతకత్వమను దోషము అట్టివారికి కలుగును.

ఆవిధముగనే మంత్రార్థము నిమిత్తమై వచ్చినవాడుకూడ జ్ఞానహీనుడైన తనయాచార్యులను విడిచి, తిరిగి సదాచార్యుల నాశ్రయించిననే తప్ప మంత్రార్థమును సాయించను, అని సదాచార్యుల నాశ్రయింపమని తెలుపగా, అందుల కంగీకరింపకున్నచో, ఆవచ్చినవానియొక్క పరమాచార్యులైనను జ్ఞానానుష్ఠానములు గలవారైనచో వారిని విడువమని తెలుపక, ఆపరమాచార్యులనే ఉత్తారకులని తలంచియుండుమూ యని మంత్రార్థమును సాయించవలెను. దృఢతరమైన పడవతో కట్టిన మరివక పడవకూడ వడ్డును చేరునటులనే జ్ఞానానుష్ఠానహీనుడైన ఆచార్యులు కూడ వడ్డును చేరుకొనుటలో సందేహముండదు, అట్టిస్థితిలో పరమాచార్యుల వారియొక్క ప్రాబల్యమే శిష్యాచార్యులిద్దరను ఉజ్జీవించుటకు చాలియుండును. ఇందులకు "పితామహం నాథమునిం విలోక్య" అనుదానిని ప్రమాణముగ గొనవలయును.

ఆచార్యులను, పరమాచార్యులును కూడ దుర్బలులేయైనచో, ప్రాచార్యులైనవారలైనను ప్రబలులైనచో వీరుజ్జీవింపుటకు చాలును. పితృ, పితామహ ప్రపితామహులు యనునటుల

ఇచ్చట ప్రాచార్యులనగా వచ్చినవాని యొక్క పరమాచార్యుల యొక్క యాచార్యులని యర్థము. ఆ ప్రాచార్యులకు కూడ దౌర్బల్యమున్నచో ఆయాచార్య పరంపరను విడిచి సదాచార్యుల నాశ్రయించవలెనని నియమింపవలయును.

"ఆచార్య ప్రాచార్యసన్నిపాతే" అనుస్థలమున పరమాచార్యులకును కూడ ప్రాచార్యులని ఒక తిరనామముండుటచే పరమాచార్యులని ప్రాచార్యులను తెలుపుచున్నది. గనుక యిచ్చట ప్రాచార్యులన్నది ఆరోహక్రమములో మూడవ యాచార్యులను తెలుపుచున్నది.

శ్లో॥ యస్య వేదశ్చవేదీచ విచ్ఛిద్యేతే త్రిపూరుషమ్ ।
సవై దుర్బ్రాహ్మణో జ్ఞేయ స్సర్వకర్మ బహిష్కృతః ॥

అని శరీరసంబంధ విషయమున మూడు తరములలో సంస్కృత వేదాధ్యయనమున్ను, తదనుష్ఠానమున్ను లేనిచో ఆపరంపరను విడవలెనని యున్నటులనే ఆత్మసంబంధములో కూడ ఆచార్య పరమాచార్య ప్రాచార్యులైన మూవ్వురులోను ఉభయ వేదాంతాధ్యయనమును, తదను ష్ఠానమును లేనిచో అట్టియాచార్య పరంపరను విడిచిపెట్టవలయును. ఆ మువ్వురలోను ఏవక్క రైనను ఉభయ వేదాంతాధ్యయనము, తదనుష్ఠానము గలవారైనచో ఆపరంపరను విడిచిపెట్ట కూడదు. అందే ఉద్దేశ్యప్రతిపత్తి జేసి యాశ్రయించవలయును. బ్రాహ్మణుడనగా శ్రీమన్నారా యణుని యొక్క స్వరూప, రూప, గుణ, విభూతులను ఉన్నదున్నటుల తెలుసుకున్నవాడని యర్థము. వీటిని ఉన్నదున్నటుల ప్రతిపాదించినది "తెన్నన్ కూరుగూర్ శడకోవన్ పొయ్యిల్ పాడల్" అని, శ్రీనమ్మాళ్వార్లు సాయించిన 'తిరువాయ్ మొళి' అనుద్రావిడ వేదమేగదా.

కుఱిక్కొళ్ ఆయిరత్తుళ్ళిప్పత్తుం
తిరుక్కురుగ్గుడి యతన్ మేల్
అఱియ క్కత్తవల్లార్
వైట్టణవరాళ్ కడల్ ఞాలత్తుళ్ళే.

అనుసటుల భగవత్స్వరూపాదులను ఉన్నదున్నటుల తేలిపిన తిరువాయ్ మొళిని అర్థముతో గూడ అధికరించిన వైష్ణవులే బ్రాహ్మణులగుచున్నారు. తిరువాయ్ మొళి యధికరించిన వార లకే బ్రాహ్మణ్యమున్నది. బ్రహ్మజ్ఞాన మున్నదియును వీరలకు మాత్రమే. "బ్రహ్మసంబంధీ బ్రాహ్మణః" అని బ్రహ్మసంబంధమును గలవాడు బ్రాహ్మణుడని చెప్పవలెను, బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" అనుచోట 'బ్రహ్మైవ' అను సామానాధికరణ్యమునకు తాత్పర్యము శరీరాత్మ నిబంధనమైనది. బ్రహ్మ శరీరియు ఆత్మశరీరము యగుచున్నది. బ్రహ్మజ్ఞానము గలవానికి తనను బ్రహ్మకు ప్రకారభూతునిగ యెవడు తెలుసుకొనునో అట్టివాడే బ్రాహ్మణుడగుచున్నాడు. ఈ ఆత్మ బ్రహ్మకు ప్రకారభూతమైన దను విషయమును సుస్పష్టముగ ప్రతిపాదించినది తిరువాయ్ మొళియేగదా. ఇట్టి తిరువాయ్ మొళిని అధికరించి వారలకే బ్రహ్మజ్ఞాన ముండునదియును సత్త యుండునదియును బ్రాహ్మణ్యముండునదియును.

అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్
అస్తి బ్రహ్మేతి చేద్వేద సన్తమేనం తతో విదురితి

అనునటుల బ్రహ్మజ్ఞానముండుటయును అదిలేకుండుటయును మాత్రమే సత్ అసత్తుల యొక్క లక్షణమై యున్నది.

బ్రహ్మప్రకారమనగా ఈ ఆత్మకును బ్రహ్మమునకు శరీరశరీరిభావ సంబంధమని అర్థము. ప్రకారశబ్దమున కర్థము అపృథక్సిద్ధవిశేషత్వము. వస్తువునందు దాని విశేషణమునందే గాని వేరే ప్రతీతియుండదు కదా. అనునటుల ప్రకారశబ్దమునకు అపృథక్సిద్ధ విశేషణత్వమని గ్రహింప వలెను. అది శరీరత్వనిబంధనమైనట్టిది. ఇట్టి సంబంధమును గ్రహించినవాడే బ్రాహ్మణుడై యున్నాడు. ఈ సంబంధజ్ఞానము కలుగునదియును తిరువాయ్ మొళితో గల సంబంధముచేతనే ఈ తిరువాయ్‌మొళియును భక్తామృతమై యుండును.

భక్తులనగా:- "న శూద్రాః భగవద్భక్తాః విప్రాః భాగవతాః స్మృతాః |
సర్వవర్ణేషు తే శూద్రాః యేహ్యభక్తా జనార్దనే ||

అనునటుల భగవద్భక్తిగలవారు బ్రాహ్మణులు. అదిలేనివారు అబ్రాహ్మణులే.

చతుర్వేద ధరోవిప్రో వాసుదేవం న విందతి
వేదభారభరాక్రాన్తః సవై బ్రాహ్మణ గర్దభః

అనునటుల నాలుగువేదములను అధికరించి చతుర్వేదులే అయినను భగవచ్ఛేషత్వ జ్ఞానవిహీనులే అయినచో దర్శన-స్పర్శన యోగ్యతలేని తిర్యగ్యోనిజులై పోవుదురు. గనుక నాల్గువేదముల నధ్యయన మొనర్చినవారేయైనను తిరువాయ్ మొళిని నేర్చుకున్నవారుగానిచో అట్టివారలకు బ్రాహ్మణ్యము సిద్ధింపజాలదు. తిరువాయ్ మొళిని నేర్చుకున్నవారలై మరి వేనిని తెలియనివారేయైనను బ్రాహ్మణ్యము సిద్ధించుటలో లోటులేదు. బ్రాహ్మణ్యమునకు గౌరవమును కలిగించునది వేదాధ్యయనాదులు. అట్టి వేదాధ్యయనము భగవల్లాభమున కుపకరించనిచో అప్రయోజనమైనదియేకదా యగును. అనగా బ్రాహ్మణ్యమునకు గౌరవప్రదమైనదగుటయును, భగవల్లాభమును కలిగించునదగుటయును, ద్రావిడ వేదాధ్యయనాదుల ద్వారా మాత్రమే.

ఇటులనే "యస్య వేదశ్చ వేదీచ విచ్ఛిద్యేతే త్రిపూరుషం" అనునటుల ద్రావిడవేదాధ్యయనమున్ను, తదనుగుణానుష్ఠానమున్ను లేనట్టి శరీరసంబంధులతోకూడ సహవాసాదులను కలిగియుండకూడదు. శరీరసంబంధ ముద్దేశమగుటయునుకూడ ఈ ద్రావిడ వేదాధ్యయన సంబంధముచేత మాత్రమే. అటులకానిచో "పితరం మాతరం దారాన్" అనునటుల త్యాజ్యులలో పరిగణింప బడుదురు. శరీరసంబంధోద్దేశ్యములకే ఈ తిరువాయ్‌మొళితో సంబంధ ముండవలెనని చెప్పుచుండగా ఆత్మసంబంధమునకు కూడ ఇది ఉండవలెనని చెప్ప నవసరములేదుకదా.

ముగ్గురిలోను ఉభయవేదాంత ప్రవర్తకత్వమున్నచో అట్టి యాచార్యపరంపరను విశదపరాదు.

గనుక ఆశ్రయమును ప్రసాదించిన యాచార్యులు ఉత్తారకులు - ఉభయవేదాంతములను ప్రసాదించిన యాచార్యులు ఉపకారకులు. వీరిద్దరిలోను జ్ఞానానుష్ఠాన ప్రాబల్యమున్నవారెవరో అట్టివారే ఈ జీవునికి ఉత్తారకులు. రెండవవారు వీనికి ఉపకారకులు.

శిష్యాచార్యులిరువురిలోను జ్ఞానానుష్ఠాన ప్రాబల్యమునుగలవారే. తమకు తామే ఉత్తారకులు ఉపకారకులు నగుచున్నారు. ఈ విషయములో ప్రమాణమేది యనగా

"అర్వాంచో యత్పదసరసిజ ద్వంద్వ మాశ్రిత్య పూర్వే!
మూర్ధ్నా యస్యాన్వయ ముపగతా, దేశికాముక్తిమాపుః
సోయం రామానుజముని రపి, స్వీయముక్తిం కరస్థాం।
యత్సంబంధాదమనుత కథంవర్ణ్యతే కూరనాథః అని

గనుక సచ్ఛిష్య సన్నిధిలోగాని, సదాచార్య సన్నిధిలోగాని భేదములేదు. ఆశ్రియణమును ప్రసాదించిన యాచార్యులు ఎంబెరుమానార్లకు తిరువడి స్థానీయులగుటచే ఉత్తారకులైరి. ఎంబెరుమానార్లకు తిరువడిస్థానీయులగుట యనగా పావనత్వ - భోగ్యత్వములను గలవారై యుండుట యని భావము. ఈడు ముప్పత్తాఱాయిరం ప్రసాదించిన యాచార్యులు మణవాళ మహామునుల తిరువడి స్థానీయులగుటచే ఉపకారకాచార్యులగుదురు.

వాగ కూడ ఉయ్యనినై వృణ్ణాకిల్ ఉజ్గుకక్కళ్ దవదత్తే
వైయ్యుం అన్భుతన్నై ఇన్దామానిలత్తర్.

అని తమమీద నారోపించుకొనకుండగ మీ యొక్క యాచార్యుల తిరువడి ఘళ్లయందే ఉత్తారకత్వ ప్రతిపత్తిని కలిగియుండుడు, అని వారి వారి యాచార్యులను వారి వారికి ప్రసాదించుటచేత మణవాళ మహామునులు సట్ల ఉత్తారకత్వ మున్నను వారును యతీంద్ర ప్రవణులు గనుకను, "రామానుశనడిప్పూ" అనబడుతారు గనుకను తమ యాచార్యులైన ఎంబెరుమానాదులను జూపించిరి.

ఉత్తారకత్వము కంటెను ఉపకారకత్వము మిక్కిలియు భగవదనుగ్రహమునకు కారణమగుటచే ఎంబెరుమానారులు తామే యతీంద్రుల పునరవతారమని చెప్పతగినటుల ఉపకారకులై వచ్చి యతీంద్రప్రవణులుగ యవతరించిరి. ఎంబెరుమానారులు తమ యవతారమునందు ఉత్తారకత్వ విశిష్టమైన ఉపకారకత్వము తప్ప కేవల ఉపకారకత్వము లేదే యని ఆలోచించి, అందు నిమిత్తమై మణవాళమహామునులై యవతరించిరి. ఎంబెరుమానారుల యొక్క యవతారమున భగవద్భాగవతాచార్య శిష్యులందరును, చరమోపాయ నిర్ణయమునందు ఎంబెరుమానారులు సర్వోత్తారకులని నిర్ణయించిరి.

వారే సర్వోత్తారకులని నిర్ణయించినపుడు "రామానుజన్ శరణాగతిం రామస్త్రివాళ్" అని తిరువడికళ్ సర్వోత్తారకములగుటచేత, వారి తిరువడికళ్ల స్థానీయులైన యతీంద్రప్రవణులే ఉత్తారకులన వచ్చును. ఈ యవతారమున ఉపకారకత్వ భోగ్యతయున్ను, యవతారమునందు ఉత్తారకత్వ భోగ్యతయున్ను, యున్నదిగాన ఎంబెరుమానారులే సర్వోత్తారకులగుచున్నారు.

ఉత్తారకులు - మంత్రార్థప్రదులు; ఉపకారకులు, మంత్రార్థప్రదులు; సర్వోపకారకులు, యతీంద్రప్రవణులు; మహోపకారకులు, ఈశ్వరుడు; ఆచార్యులున్నైన భాగవతులందరను. ఉపకారకతములు. ఈ విధముగ ఎంబెరుమానారుల విషయమున ఉత్తారకత్వ ఉపకారకత్వములను రెండును రెండింటి యొక్క ప్రాబల్యమున్ను గలదు

యతీంద్ర ప్రవీణుల విషయమునను ఉపకారకత్వ ప్రధానమైన ఉత్తారకత్వమున్ను గలదు. స్వాచార్యుల విషయమున ఉపకారకత్వ ప్రకాశమైన ఉత్తారకత్వమును గలదు. మంత్రార్థ ప్రదుల విషయమున ఉత్తారకత్వ ప్రకాశకమైన ఉపకారకత్వము గలదు. ఇవన్నియు మన పూర్వాచార్యుల యొక్క సంబంధమును రాజకులమహాత్మ్యముచే కలిగినవి. గనుక ఈ రీతిగా వారి యొక్క సంబంధమును లభించవలసి యున్నది. ఆళ్వారుల సంబంధమున్ను ఎంబెరుమానారుల సంబంధమున్ను మణవాళమహామునులు సంబంధమున్ను అను ఈ మూడువిధములైన సంబంధములను కలుగుటకు విలక్షణులైన జ్ఞానానుష్ఠాన సంపన్నులై "పరిత్యాజ్యభాష్యం శరణాగతశ్రద్ధా" అని ఉభయవేదాంత ప్రవర్తకులైన సదాచార్యులను ఆశ్రయించవలసియున్నది.

---

## కీర్తనము

శ్రీమాన్ ఉ. వే. తె. కం. గోపాలాచార్యులవారు.

ఆపాదమస్తకము పులకాంకురము లుదయించ కంఠము గద్గదము గాగా ఆనందాశ్రువులు జలజలరాలుచుండ హృదయము వికసింప భగవంతుని నామరూపగుణప్రభావాదులను శ్రద్ధాభక్తులతో సిగ్గువిడచి యుచ్చైస్స్వరమున నుచ్చరించుట.

ప్రమాణము:- దీనినే నమ్మాళ్వారు తిరువాయ్ మొళి దివ్యప్రబంధమున

పా- మొయ్మ్మాన్ పూమ్ పొళిల్ పొయ్గై ముదలైచ్చిరై ప్పట్టునిన్ఱ
కైమ్మా తుయర్ కెడుత్త కైమ్మాఱ్ఱరుఙ్గిలై వణ్ణనై కణ్ణన్
ఎమ్మానై చొల్లిప్పాడి యెళిన్దుం పఱన్దుం తుళ్ళాదార్
తమ్మాల్ కరుమమెన్ శొల్లీర్ తణ్ణాడ్డల్వాట్ట తొళ్ళే

గజేంద్రునిగాచిన గరుడధ్వజుని యాలపించి పాడి లేచి పరుగిడి తుళ్లియాడనివారీ భూమండలమున బ్రతుకుటేలా? యని సాయించిరి.

అండాళ్లుతల్లి తమ తిరుప్పావై ప్రథమమునులో పలుమారు లీకీర్తనమే ప్రాప్యమని వర్ణించిరి.

పరమనడిపాడి-2పా.పరాత్పరని పాదములను కూర్చి పాడి ఉత్తమన్ పేర్పాడి-3పా.పదార్థమునకై స్వార్థమును త్యజించు ఉత్తముడగు సర్వేశ్వరుని తిరునామముల ననుసంధించి వాయినాల్ పాడి5పా. నోటారపాడినచో పాపములుహరించును. కేశవనై ప్పాడప్పునీకేట్టికిడత్తియో7పా. కేశవుని పాడుచున్నాను. చట్టున లేచివచ్చి కూడి పాడక వినుచునే పరుండియున్నావా? అని యిల్లన్ని పాశురములలోను భగవత్కీర్తనమే పురుషార్థమని సాయించిరి.

ఈ కీర్తనమును విధించుటలో భగవంతుడు గీతలో 'సతతం కీర్తయన్తో మాం' అనగా 'తతం వీణాధికం వాద్యం' అను కోశానుసారముగా 'తతేన సహితం సతతం' అని క్రియావిశేషణముగా నన్వయించిన వీణాదివాద్యసహాయమునతో పాడుమరని శెలవిచ్చుటచే కీర్తన సవిశేషముగా విధింపబడెను. ప్రహ్లాదుడు తనతోడిబాలురకు హితోపదేశమును గావించుచు

శ్లో॥ నిశమ్య కర్మాణి గుణా నతుల్యాన్ । వీర్యాణి లీలాతనుభిః కృతాని
యదా తిహర్షోత్పులకాశ్రుగద్గదమ్ । ప్రోత్కణ్ఠ ఉద్గాయతి రౌతి నృత్యతి
యదా గ్రహగ్రస్త ఇవ క్వచి ద్ధస । త్యాక్రన్దతే ధ్యాయతి వందతే జనమ్
ముహుః శ్వ్వసన్ వక్తి హరే! జగత్పతే । నారాయణే త్యాత్మమతిర్గత త్రపః॥
భాగ - 7స్కం. 7 అ. 34, 35 శ్లో.

భక్తుడు భగవంతుడవతారములలోగావించిన కర్మలను అతని నిరుపమ గుణములను, వీరచేష్టితములను వినినప్పుడెల్లనపరిమితానందముతోనా పాదమస్తకము పులకాంకురము లుదయింప ఆనందాశ్రుప్రులు రాల డగ్గుత్తిక వాడను గొంతెత్తి పాడును, కేకలువేయును, నర్తనము గావించును. గ్రహముసోకినవానివలె నొకచోనవ్వును, ఒకచో నేడ్చును, ఒకచోట ధ్యానించును, వేరొకచోట కనబడినవారికి హరిభావనతో నమస్కరించును. మాటిమాటికి నిట్టూర్పు నిగుడించుచు పరమాత్మయందు బుద్ధిని లగించి సిగ్గువిడచి 'హరీ! జగత్పతీ! నారాయణా!' యని ప్రలాపించును అని భక్తుని కీర్తనవిధానమును తెలిపెను.

అందరు నీవిధముగ కీర్తనభక్తులు కావలెనను తలంపుతో ప్రహ్లాదునివలె దీనిని ప్రచారము చేయుటయే దీనికి ప్రయోజనము.

దీనిని లభించుటకు సాధనము

ఈ కీర్తన భక్తి లభించవలెననిన భగవంతునియొక్కయు భాగవతులయొక్కయు దయను సంపాదించవలెను. ఆదయ వారి యాజ్ఞల పాలించుటచే కలుగును.

వారియాజ్ఞ - 'శ్రుతిస్మృతిర్మమైవాజ్ఞా' అనినటుల శ్రుతులు స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ధర్మశాస్త్రములు, ఆగమములు, మొదలైనవియేగాన తదుక్తధర్మములను పాలించి అధర్మములను త్యజించవలెను,

ఫలము —

భాగవతమునందలి అజామిళోపాఖ్యానమున దీని ఫలము విస్తరించి చెప్పబడినది.

సీ॥ బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్నికీలలు। హరినామకీర్తనములు।
గురుతల్పకల్మష క్రూరసర్పములకు। కేకులు హరినామకీర్తనములు।
తపనీయచౌర్యాఘ తమసంబునకు। సూర్యకిరణముల్ హరినామకీర్తనములు
మధుపానకిల్బిష మదనాగసమితికి। కేసరుల్ హరినామకీర్తనములు
మహితయోగోగ్రనిత్య సమాధివిధుల। నలరు బ్రహ్మాదిసురులకు నైన రాని।
భూరినిర్వాణ సామ్రాజ్యభోగభాగ్య। ఖేలనంబులు హరినామకీర్తనములు॥

ఈపద్యమున మొదటినాలుగుపాదములచే ననిష్టతమగు పాపనివృత్తియు చివర నాలుగుపాదములచే ఇష్టతరమగు నిర్వాణప్రాప్తియు ఫలముగ [illegible] ఫలమిక నేమిగలదు?

శ్రీకులశేఖరులు నీకీర్తనప్రభావమును నుగ్గడించుచు తమకది [illegible] నందులకు పరితపించిరి. చూడుడు

శ్లో॥ శ్రీమన్నామ ప్రోచ్య నారాయణాఖ్యం । కేన ప్రాపుర్వాంఛితం పాపినోఽపి
హా నః పూర్వం వాక్ప్రవృత్తా న తస్మిన్ । తేన ప్రాప్తం గర్భవాసాది దుఃఖమ్.

ఆహా! భగవన్నామమహిమ యెంతగొప్పది. దాని నుచ్చరింపు చిలుకను శ్రీరామనామము నేర్పిన దోషాకరయగు గుణిక తరించలేదా!

శ్లో॥ వనే చరామో వసు చాహరామో । నదీస్తరామో న భయం స్మరామః
ఇతీరయన్తోఽపి వనే కిరాతాః । ముక్తిం గతా రామపదానుషఙ్గాత్॥

అడవిని తిరుగాడుచు దోచి జీవించు కిరాతులు తమ నిత్యకృత్యముల ననుసంధించుటలో నప్రయత్నముగ రామనామ ముచ్చరింపబడుటచే తరింపలేదా!

అయ్యో! నాపాడునాలుక జన్మాంతరమున సీపాటికైనను నోచుకొనలేదుకదా! కాకున్న నాకీజన్మ యేల వచ్చియుండును? ఈజన్మయందైనను వ్యర్థముగాకుండ కీర్తించుటకై తమనాలుకకు నమస్కరించి ప్రార్థించుచున్నారు.

శ్లో॥ ప్రావర్తయ ప్రాఞ్జలిరస్మి జిహ్వే! నామాని నారాయణగోచరాణి ।

ఓనాలుకా! అమ్మా! తల్లీ! భగవన్నామములను సంధించుచుండుము! నిన్ను నమస్కరింతును.!

ఇదియేగదా యుగములలో కలియుగమునకు గల వైభవాతిశయము. [సశేషము]

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
| --- | --- | --- | --- |
| 93 | వ్యాళః | ......తానాత్మసాత్ ।<br>వ్యాళ ఉక్తః కరోతి యః ॥ | వానికభయమొసంగి తన యధీనము జేసుకొనువాడు. |
| 94 | ప్రత్యయః | యో౽సౌ ప్రత్యాయయతి తాన్ ।<br>ప్రత్యయ స్సముదాహృతః | వారికి తనయందు విశ్వాసమును బలపరచువాడు |
| 95 | సర్వదర్శనః | మహిమానం సర్వసహం ।<br>తేషాం దర్శయతీతి సః ।<br>సర్వదర్శన ఆఖ్యాతో ।<br>సర్వార్థో లోచనప్రదః ॥ | సర్వమును సహించునట్టి తన మహిమనంతను వారికి జూపువాడు.<br>దీనిని 'ఓమ్ సర్వదర్శనాయనమః' అను తొమ్మిదియక్షరముల మంత్రముగ నాదరించినచో నేత్రదృష్టినిచ్చును. |
| 96 | అజః | ప్రత్యర్థిన స్సర్వాన్ సమ్ప్రాప్తాన్<br>ప్రజానాం విపతీ త్యజః ॥ | భక్తులను తన దరిజేరనీయక యాటంక పరచునట్టి ప్రతిబంధకముల నన్నిటిని పారద్రోలువాడు. |
| 97 | సర్వేశ్వరః | అశక్తానాఞ్చ శక్తానాం ।<br>వైరూప్యం శిరసైషిణామ్ ।<br>అశ్నుతే పరిహర్తుం యః ।<br>స సర్వేశ్వర ఈరితః ॥ | సమర్థులైనను అసమర్థులైనను తనను శరణజొచ్చినచో నంతమాత్రముననే వారి యనిష్టముల నన్నిటిని పోగొట్టుటకై వేగముగ వచ్చి చేరువాడు. |
| 98 | సిద్ధః | స్వయామపేక్షైవ భక్తానాం ।<br>సిద్ధత్వాత్సిద్ధ ఉచ్యతే ॥ | అట్టి భక్తులు సాధనాంతరముల నన్వేషించి వారిమూలముగ తనను పొందనవసరము లేకుండగ వారికెల్లప్పుడును సిద్ధముగా నుండువాడు. |
| 99 | సిద్ధిః | అయమేవహ్యుపాయైశ్చ ।<br>సిద్ధిస్స్యాత్సాధ్యతే యతః ॥ | ఈతడే ఇతరోపాయములచేతను కూడ సాధింపదగినటుల నుండువాడు. |
| 100 | సర్వాదిః | సర్వేషాం పురుషార్థానాం ।<br>మూలం సర్వాది రీరితః ॥ | తనభక్తులకు సకలపురుషార్థములను సిద్ధించుట కాదికారణమైనవాడు. |

ప్రథమ శతకం సమాప్తమ్–మొదటిశతకము ముగిసినది.

శ్రీమతే రామానుజాయనమః



# ప్రచార విభాగము

## వరంగల్లు :-

శ్రీ జియ్యరుస్వామివారు వరంగల్లులో శ్రీ వెంకటేశ్వరస్వామివారి సన్నిధిలో మకాము చేసి 13 రోజులు భగవద్గీతోపన్యాసములద్వారా మతప్రచారమును గావించిరి. ఈకార్యక్రమములో స్థానికులగు విద్వాంసులు భక్తులు పెక్కురు, అన్వయించిరి. విశిష్య శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యులుగారు గావించిన ప్రచారప్రయత్నము మెచ్చతగినది.

వీరి అవిరళ, అమోఘకృషిచే ఇచ్చట ప్రతినిత్యము శ్రీవిష్ణుసహస్రనామ పారాయణములో, సుప్రభాత, తిరువీధిగోష్టియు, గీతాధ్యయనము, గీతాపాఠశాల, శుక్రవారపూజా కార్యక్రమము మహావైభవముగా జరుగుచున్నవి. వీరిస్వార్థరహిత నిరంతరకృషి చాలస్తవనీయము. వీరిప్రోత్సాహముచే శ్రీ వెంకటేశ్వరస్వామివారి ఆలయముచాలా వృద్ధిలోనికివచ్చినది. వీరిపుడు వరంగల్లులో 2, 3, లక్షలరూప్యములతో ఒకగీతాభవనము కట్టించుటకై ప్రయత్నించుచున్నారు. ఇందులకై కొంత విరాళసమీకరణముకూడ జరిగినది. అనతికాలములోనే వీరిసత్సంకల్పము తప్పక ఫలించగలదు. వీరిసద్భావన సదనుష్ఠానములచే వరంగల్లులోని ప్రముఖులందఱును వీరికి మిక్కిలి సహాయులుగ నున్నారు. శ్రియఃపతి వీరిద్వారా తన కైంకర్యమును చక్కగా జేయించుకొనుగాక.

## వరదన్నపేట :-

వరంగల్లునుండి శ్రీజియ్యర్‌స్వామివారు శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులవారితోను మరికొంతపరివారముతోను బయలుదేరి 27-5-59 వ తేదీరాత్రికి వరదన్నపేట గ్రామమునకు వేంచేసిరి. వరదన్నపేటలో శ్రీవైష్ణవస్వాములు తదితర భక్తులు శ్రీస్వామివారికి చక్కనిహృదయపూర్వకమైన స్వాగతమిచ్చిరి. ఆరాత్రి ఆలయములో శ్రీస్వామివారున్ను శ్రీకవిగారున్ను అధ్యాత్మిక విషయమునుగురించి యుపన్యసించిరి. మరునాడు ఉదయం గ్రామములో బదరీబిక్షా కార్యక్రమము జరిగెను.

## చెన్నూరు :-

వరదన్నపేటనుండి శ్రీమాన్ కల్లెడజమీందారుగారు శ్రీయర్రమిల్లి వెంకటేశ్వర రావుగారి ప్రత్యేకఆహ్వానముమీద వారు తమమోటారుపంపగా ఆస్వామివారు తమ పరివారముతో 28-5-59 వ తేది ఉదయమునకు చెన్నూరు వేంచేసిరి. అచ్చట అనాదినుండి సుప్రసిద్ధమైన శ్రీ వెంకటేశ్వరస్వామివారి సన్నిధియున్నది.

సన్నిధిలాంఛనములతో స్వామివారికి స్వాగతసత్కారము జరిగినపిదప ఆలయములో గీతలోని మూడవఅధ్యాయమునుగురించి ఉపన్యాసము జరిగెను. పిదప శ్రీమాన్ కల్లెడ జమీందారుగారు శ్రీ వేంకటేశ్వరరావుగారు స్వామివారికి పాదపూజ గావించిరి.

ఈ విషయము మహావిద్వాంసులగు వరంగల్లు శ్రీమాన్ పండితరత్న, ఉపన్యాసకేసరి యగు శ్రీకోకం రంగాచార్యస్వామివారు పత్రికాశ్లాఘనీయముగాని శ్రీ స్వామివారిని చక్కగా ఆదరించిరి.

## ఖమ్మంమెట్టు :-

చెన్నూరునుండి మైలవరంచేరు వరకు తనుపొంత మోటారు కారును శ్రీమాన్ కల్లాక యత్రమల్లి వెంకటేశ్వరదారవారు శ్రీస్వామివారి పర్యటనకై యొసగిరి. రాత్రి గం 8 లకు చెన్నూరు నుండి శ్రీస్వామివారు ఖమ్మంమెట్టునకు వేంచేసిరి. ఖమ్మంమెట్టులోని శ్రీ కృష్ణమస్వాములు తదితర భక్తాగ్రేసరులు పెక్కురు శ్రీస్వామివారిని భద్రాచలమురాది బాణాసంచాలతో గ్రామము లోని శ్రీ వేంకటేశ్వరస్వామి యాలయమునకు వేంచేపు చేయించిరి. రాత్రి 10 గంటలవరకు శ్రీ స్వామివారి కవిగారల ఉపన్యాసములు జరిగెను. మరునాడు ఉదయ ఖమ్మంమెట్టు నందే యుండి సాయంత్రిం లక్ష్మీపూజలుజరిపించి లక్ష్మీవైభవమునుగురించి యుపన్యసించి మరునా డుదయము అనుష్ఠానాంతరము సూర్యాపేటకు వేంచేసిరి.

## సూర్యాపేట

30-5 59 వ తేది పగలు గం. 9 లకు సూర్యాపేటకు వేంచేసి అక్కడ బదరీ భిక్షా కార్య క్రమమును జరిపిరి. ఆలయములో సభజరిపి సాయంత్రం అక్కడనుంచి బయలు దేరిరి. సూర్యా పేటలో స్థానికులగు పెద్దలందరు స్వామివారికి చక్కని స్వాగతమిచ్చిరి.

## నడిగూడెం

సూర్యాపేట నుండి బయలుదేరి సాయంత్రం గం. 5 లకు నడిగూడెం విచ్చేసి అక్కడ రామ మందిరములో సభజరిపి గీతలో నొకఅధ్యాయ సారము నుపన్యసించిరి.

## వేణుగోపాలపురము

రాత్రి గం. 9 లకు నడిగూడెం నుండి వేణుగోపాలపురమునకు విచ్చేసిరి. ఆగ్రామములోని ప్రముఖులందరు శ్రీ స్వామివారికి పరమకౌశలమైన స్వాగతసత్కారము జరిపిరి. పిదప స్వామి వారును కవిగారున్ను వారే రామ నామమహాత్మ్యమును గురించి యుపన్యసించిరి. మరునాడు 31-5-59 వ తేది ఉదయము ఆగ్రామములో శ్రీ స్వామివారు బదరీ భిక్షా కైంకర్యమును జరిపిరి. ఖమ్మంమెట్టునుండి ఇంతవరకు శ్రీ స్వామివారు జరిపిన పర్యటనలో సకల విధముల అన్వయించిన శ్రీమాన్ వ. చ. రఘునాథాచార్యస్వామివారు బదరిలో మనసంఘముద్వారా నిర్మింపబడు చున్న సత్సంగసదనములో ఒకగది కట్టించుటకు వాగ్దానము గావించి అప్పుడే రు 200/ లు సమర్పించిరి.

## కోదాడ

31-5-59 ఉదయము వేణుగోపాలపురమునుండి బయలుదేరి మధ్యమార్గములో కోదాడ గ్రామములో ఒకగంటకాలము ఆగి శ్రీ నాగబండ రత్తయ్య శ్రేష్ఠి మొదలైనవారితో బదరీ విషయములనుగురించి ముచ్చటించి మధ్యాహ్నం గం. 1 లకు మైలవరం విచ్చేసిరి.

## మైలవరం

శ్రీ జియ్యర్ స్వామివారికి మైలవరమందలి శ్రీ వెంకటేశ్వరస్వామి వారియందును శ్రీ మైలవరం రాణిగారగు శ్రీ సూరనేని శ్రీవరమంగయమ్మారావు రాణిగారి యందలి శిష్య శ్రద్ధకలిగియుండుటచేత అక్కడ 3 రోజులు మకాం చేసిరి. అమూడు దినములు ఆ రాణిగారు శ్రీస్వామివారికి హృదయ పూర్వకముగా ఆతిథ్యమిచ్చిరి.

## విజయవాడ

3-6-59 తేది ఉదయము మైలవరంనుండి శ్రీ స్వామివారు బయలుదేరి విజయవాడకు విచ్చేసిరి. విజయవాడ స్థానికులైన భక్తులందరు ఆస్వామివారికి అఖండ స్వాగత సత్కారములు గావించిరి. ఆ స్వామివారు శ్రీ కోదండరామస్వామివారిని, శ్రీ వెంకటేశ్వరస్వామివారిని సేవించుకొని పిమ్మట అచట శ్రీ వైశ్యకళ్యాణమంటపమును జూచి సుమారు 2 గంటలకాలము వరకు మాత్రము ఉండిరి.

## శ్రీ వాసుదాసాశ్రమం

3-6-59 వ తేది మధ్యాహ్నం. గం. 3 లకు బెజవాడనుండి శ్రీ స్వామివారు తమ పరివారముతో శ్రీ వాసుదాసాశ్రమమున సుమారు 10 దినములు విశ్రాంతిగ యుండదలచి విచ్చేసిరి.

## శ్రీ వాసుదాస ఆశ్రమవార్తలు

ఆశ్రమములో దివారాత్రములు, అఖండ హరేరామ నామసంకీర్తన జరుచున్నది. శ్రీ కోదండరామస్వామివారి సన్నిధిలో శ్రీ ఆండాళ్ ప్రతిష్ఠ నూతనముగా ఏర్పాటుచేయుట మైనది. శ్రీ ఆండాళ్ విగ్రహ నిర్మాణ కైంకర్యమును శ్రీ కావూరు సీతారామమ్మగారు (గుంటూరు) వహించిరి. శ్రీ ఆండాళ్ ప్రతిష్ఠా మహోత్సవమును శ్రీ గుదేటి సుబ్బారెడ్డి, సీతారామమ్మ దంపతులు (నందూరు) వహించి తదీయారాధన కైంకర్యమును శ్రీ కూనంనేని బాపయ్యగారు వహించిరి.

శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ జ్యేష్ఠమాస పండిత మహాసభలు

తెనాలితాలూకా నడిగడ్డపాలెం శ్రీ వాసుదాసాశ్రమమున శ్రీ కోదండరామస్వామివారి సన్నిధిలో శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ జ్యేష్ఠమాస పండితసభలు శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి అధ్యక్షతక్రింద 24-6-59 మొదలు 26-6-59 వ తేదీవరకు పరమ విలక్షణముగా జరిగినవి. ఈ సభకు మైలవరం, బందరు, పెద్దవరం ఇత్యాది గ్రామములనుండి పండితులు విచ్చేసిరి. పెక్కుమంది శ్రోతలు పరిసరగ్రామాదులనుండి విచ్చేసిరి. 27-6-59 వ తేది ఉదయం శ్రీ జియ్యర్‌స్వామివారు శ్రీరంగయాత్రకు బయలుదేరిరి. దారిలో కొర్నిపాడు, ఒంగోలు, మద్రాసులగుండా అగుచు, శ్రీరంగనాథుని ప్రతిష్ఠ జరుగునాటికి శ్రీరంగమునకు వేంచేసి అక్కడ ప్రతిష్ఠ పూర్తిఅయినపిమ్మట బదరీప్రయాణము గావింతురు.

## విజయవాడలో

శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘమువారు నిర్వహించుచున్న శ్రీ సీతారామమందిరంతాలూకు

## జమా ఖర్చులు

[ 14-2-1952 మొదలు 11-9-1958 వరకు ]

| | | |
|---|---|---|
| 812-1-0 | శాశ్వత విరాళాలు | |
| 861-6-0 | ఇతర విరాళాలు | |
| 4,729-9-3 | చేబదుళ్లద్వారా జమ | |
| 9,597-7-3 | మందిరంతాలూకు అద్దెలు | |
| | శ్రీ గోపు శేషావతారంగారి ప్రోనోటు | 116- 0-0 |
| | మందిరంతాలూకు పన్నులకు ఖర్చులు | 1,460- 4-9 |
| | లౌడ్ స్పీకరు | 956- 1-0 |
| | భక్తినివేదనలో ఫోటోలు, రిపోర్టులు ప్రచురించినందుకు ఖర్చు | 116- 0-0 |
| | గ్రంథాలయములో కొన్ని పుస్తకాలు | 140- 9-0 |
| | సాదర ఖర్చు | 23- 8-6 |
| | వడ్డీలద్వారా జమ | 622- 4-0 |
| | కోర్టు ఖర్చులు | 124- 8-0 |
| | మందిరం రిపేరు ఖర్చులు శ్రీ గోపు శేషావతారంగారిద్వారా | 7,335- 0-6 |
| | ప్రాపగాండా ఖర్చులు | 2000-11-9 |
| | రెంట్ రిటర్న్మెంట్ | 300- 0-0 |
| | చేబదుళ్ళ తీర్మానం | 2763- 9-3 |
| | నిల్వ | 41-15-0 |
| 16,000-7-9 | | 16,000- 7-9 |

## బదరీ వార్తలు

మన సంఘ ప్రధాన కార్యదర్శులగు శ్రీమాన్, విద్వాన్, తె. కం. గోపాలాచార్యస్వామి వారు కులాసాగా బదరికి వేంచేసిరి. అక్కడ మన సత్సంగసదన నిర్మాణముపని చాలా వేగముగా కట్టడమును గావించుచున్నారు. చలి చాలా మిక్కుటముగా నున్నదట. ఇటీవల బదరిలో జరిగిన మంచు దెబ్బకు మన మందిరముల కేమాత్రము ప్రమాదము కలుగలేదని వ్రాసిరి. మద్రాసులో భక్తులు సమర్పించిన షుమారు రు. 500 ల ఖరీదుగల పాత్రసామగ్రియు, షుమారు రు. 200 ల ఖరీదుగల తివాసీలున్నూ మద్రాసునుండి పంపబడినవి. వరంగల్లునుండి షుమారు రు. 2000 లు ఖరీదుచేయు తివాచీలు తయారగుచున్నవి. అవికూడ బదరికి పంపబడును.

మన సంఘానుమతితో వేయబడిన స్పెషలు రైలుబండ్లు వీటి కిన్ని యాత్రికులు తమ తమ టిక్కెట్లను ఉత్సాహముతో బుక్ చేయిచున్నారు.

మన శ్రీ జియ్యరుస్వామివారు శ్రీరంగములో 12-7-59 వ తేదీని శ్రీరంగనాథుని పవిత్రోత్సవమును సేవించుకొని నేరుగా బదరికి వేంచేయుచున్నారు.

## సత్సంగసదనం కొత్తా

శ్రీ రాచర్ల గురుపాదంగారు వరంగల్ 16/-
,, కుక్కడపు సీతారత్నంగారు ,, 16/-
,, అందలపు కనకమ్మగారు ,, 16/-
,, జవ్వాది బియ్యమ్మగారు ,, 16/-
,, గుండె సులోచనగారు ,, 16/-
,, గోమఠం తిరువెంగళమ్మగారు ,, 16/-
,, కొమండూరి లక్ష్మిగారు పెంజెర్ల 16/-
,, అక్కినెపల్లి జగన్నాథంగారు వరంగల్లు 48/-
,, యాదా మల్లికాంబగారు వరంగల్ 16/-
,, నత్ మల్ జాజోటియా వరంగల్ 16/-
,, ఘాగీరాంజాటియా వరంగల్లు 160/-
,, పిన్నాల లితాంబగారు ,, 16/-
,, రంగి వరమ్మగారు 16/-
,, అక్కినపల్లి వెంకటేశంగారు ,, 16/-
,, బెల్లి అగమ్మగారు వరంగల్లు 16/-
,, జనపాటి శేషమ్మగారు పెద్దపల్లి 16/-
,, కందాళ శఠకోప రామానుజాచార్యులుగారు హనుమకొండ 16/-
,, ఘాలువంట సుభద్రమ్మగారు వరంగల్ 16/-
,, గుమ్మడపల్లి నాగలచ్చమ్మగారు వరంగల్లు 16/-
,, గంటె రామన్నగారు ,, 16/-
,, మద్ది మునెమ్మగారు ,, 32/-
,, రాయపూడి రంగయ్యగారు ,, 16/-
,, అందనం రాజలక్ష్మిగారు 16/-
,, మేళచెరువు దమయంతిగారు ,, 16/-
,, సుద్దల శేషారత్నంగారు ,, 16/-
,, ఎల్లా జగ్గమ్మగారు 16/-
,, అకుల లక్ష్మీనరసమ్మగారు ,, 16/-
,, మద్ది కనకరత్నంగారు ,, 16/-
,, మహిళామండలివారు ,, 16/-
,, పేర్ల నాగరత్నమ్మగారు విజయవాడ 16/-
,, చెరుది పుల్లమ్మగారు ,, 16/-

శ్రీమతిరుమల గుదిమెళ్ళ శ్రీనివాస రంగాచార్యులుగారు చినశ్రీరంగపురం సత్సంగసదన విరాళముకలో గతజ్మ 400 గాక ఇవ్వడిచ్చినది 900/-

## శాశ్వతపూజా విరాళాలు

శ్రీ దాశరథ వెంకటమ్మగారు 29-0-0
,, కొల్లు రామచంద్రయ్యగారు(వేణుగోపాలపురం) 29/-
,, కొల్లు వెంకట్రామనరసయ్యగారు 275/-
,, కొవ్వూరి చినఅంకిరెడ్డిగారు 29/-
,, మాడభూషి రామానుజాచార్యులుగారు పొన్నూరు 29/-
,, సామవేథం లక్షమ్మ గారు పొన్నూరు 29/-
,, సామవేదం మంగతాయారమ్మగారు పొన్నూరు 29/-
,, మరింగంటి లక్ష్మణాచార్యులుగారు నరసింహపురం 29/-
,, గుడిమెట్ల సత్యనారాయణాచారులుగారు (తాత్కాలికం) హైదాబాద్ 11-/
శ్రీమాన్ వంగిపురం అప్పలాచారులుగారు పంకిన శాశ్వతపూజ కాకినాడ 29/-
,, బండారు చంద్రయ్యగారు వేణుగోపాలపురం 29/-
,, కొల్లు పెదరామస్వామి, చినరామస్వామి వెంకటేశ్వరరావుగార్లు వేణుగోపాలపురం 275/-
,, ముడుంబై లక్ష్మణాచార్యులు గారు వీరిభార్య సీత వేణుగోపాలపురం వాగ్దానం 29/ లో అడ్వాన్సు 10/-

## సత్సంగసదన విరాళం

శ్రీ నూరపనేని సీతారామమ్మగారు అనే రామానుజమ్మగారు బదరీ సత్సంగసదన నిర్మాణమునకు లోగడ 800/- లు గాక ఇప్పుడు మరల 800/- లు సమర్పించిరి,

## సత్సంగసదన విరాళము

కృష్ణాజిల్లా వేణుగోపాలపుర వాస్తవ్యులగు శ్రీమాన్ నల్లాని చక్రవర్తుల రఘునాథాచార్యులుగారు బదరిలో మన సంఘమువారిచే నిర్మింపబడుచున్న సత్సంగసదనములో ఒకగదిని కట్టించుటకు 1600/- లు వాగ్దానము గావించి అడ్వాన్సుగా 800/- లు సమర్పించిరి, శ్రియఃపతి వారి కుటుంబమునకు సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక!

## శాశ్వత పూజలు

శ్రీ బావిశెట్టి నారాయణగారు, హైదాబాద్ 29/-
„ కవిగిరి నరసమ్మగారు. గూడూరు 29/-
„ లక్ష్మీకాంతరావుగారు పట్వారి 29/-
„ మాడమరాజు రత్తమ్మగారు పెంజర్ల వాగ్దానం 29/ లో - అడ్వాన్సు - 2/-
„ కేతిరెడ్డిపల్లె కోదండరామారావుగారు గంగారెడ్డిగూడెం, వాగ్దానం 116/ లో అడ్వాన్సు 16/-
„ గోమఠం రామానుజాచార్యులుగారు హనుమకొండ 29/-
„ రంగరాజు అనంతమ్మగారు శ్రీకూర్మం తదీయారాధన నిధికిపంపినది 32/-50
„ మడపు జానకమ్మగారు అల్లాబాద్ 29/-
„ కుక్కడపు లక్ష్మీనారాయణగారు వరంగల్ 58/-
„ నల్ మల్ జాకోటియా వరంగల్లు 29/-
„ ఘాశీ రాంజాకోటయ్యా వరంగల్లు 275/-
„ కొడిమాల హనుమంతరావుగారు 29/-
„ న. చ. రఘునాథాచార్యులుగారు 29/-
„ శంకరభాయిగారు 29/-
సూర్యదేవర పట్టాభిరామయ్యగారు పెదకోడి పాక 29/-
„ కందాళ శేషమ్మగారు హనుమకొండ 29/-
శ్రీ అందలం కనకమ్మగారు, వరంగల్లు 29/-
„ రాచర్ల రాజలింగయ్యగారు „ 29/-
„ తక్కళ్లపల్లి వీరరాఘవరావుగారు ల్యాబర్తి 29/-
శ్రీమాన్ శేషబట్టరు మత్స్యాచార్యులుగారు వరదన్నపేట 29/-
„ యామసాని బలరామయ్యగారు „ 29/-
„ తోట పెదచంద్రయ్య గుప్తగారు „ 29/-
„ పొదారపు నారాయణ గుప్తగారు „ 29/-
„ ఆత్మకూరు చంద్రయ్య గుప్తగారు „ 29/-
„ మాగంటి ఇంద్రాపతిగారు „ 29/-
„ వేదాంతం రామమాడమ్మగారు ఖమ్మంమెట్టు 29/-
„ వేదాల పాపయ్యగారు „ 29/-
„ అరవపల్లి దుర్గయ్యగారు „ 29/-
„ వెంపటి బుచ్చయ్యగారు „ 29/-

శ్రీరసు వెంకట్రామయ్య, రంగయ్య శ్రీనివాసా గార్లు నడిగూడెం వాగ్దానం 275/- లో జమ 137-8
శ్రీ భవిరిశెట్టి బాపయ్యగారు నడిగూడెం వాగ్దానం 275/-లో లోగడ జమ 174/- గాక ఇప్పుడు ఇచ్చినది. 58/-

## కట్నములు

శ్రీ పి. వస్. దొరస్వామి నాయుడుగారు
„ కూర్మం తమకుమార్తె వివాహకట్నంగా పంపినది 2/-
„ అరంగి అప్పారావుగారు, కొత్తగ్రాహం
„ రామలీల మహోత్సవంనుండి పంపిన కట్నం 2/-
„ సంపన్నుడుం శ్రీ సీతారామానుజా చార్యులు గారు (చూరుగొండ) తమ కుమారుని ఉపనయన సందర్భమున సంఘమున కిచ్చినకట్నం 2/-
„ దేశింశెట్టి ఆళ్వందారయ్యగారు తమ కుమారుని వివాహ సంధర్భములో సంఘమునకిచ్చిన కట్నం 10/-
„ జియ్యర్ స్వామివారికి చెన్నూరులో అడ్వకేటు శ్రీ రాజేశ్వరరావుగారు సమర్పించినది 50/-
„ చెన్నూరులో శ్రీకన్నెడ జమీందారుగారు శ్రీ జియ్యర్ వారికి సమర్పించినది 100/-
„ సుదూరు పొదుగుల వెంకటరెడ్డిగారు తమ రెండవకుమారుని వివాహసంధర్భములో సంఘమున కిచ్చినకట్నం 2/-
శ్రీమాన్ తి. వె. కూర్మాచార్యులుగారు తమ చెల్లెలి వివాహకట్నంగా పంపినది. 2/-
శ్రీమాన్ భావ్యం తిరువెంగళ రామానుజాచార్యులు గారు తమకుమారుని వివాహకట్నంగా పంపినది 2/-
శ్రీ మునకరి వెంకటప్పాచార్యులుగారు ఖిల్లాం తమ కుమారుని ఉపనయన కట్నంగా పంపినది 2/-

బరంపురం శ్రీయతిరాజ సేవా మహిళామండలి వారు శ్రీ వెంకటేశ్వరస్వామివారి సన్నిధిలో శ్రీ ఉడయవరుల తిరునక్షత్రమహోత్సవమును పరమ విలక్షణముగా జరిపిసంఘకట్నంగా శ్రీవక్కలంక సుగుణమ్మగారి ద్వారా పంపినది 16/-

శ్రీమతే రామానుజాయనమః



శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారి

# పంచమ వార్షిక శ్రీ హరినామ సంకీర్తన మహాక్రతువు

ప్రారంభము:- శ్రీ వికారినామ సంవత్సర ఆషాఢశుద్ధ ద్వాదశి శుక్రవారము (17-7-59)

సమాప్తి:- శ్రీ వికారినామ సంవత్సర కార్తీక శుద్ధద్వాదశి గురువారము (12-11-59)

అర్హత:- భగవంతునియందు భక్తిగల మానవమాత్రులందరును అన్నివర్ణముల వారును, అన్ని ఆశ్రమములలో నున్నవారును, అను స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులును ఇందు పాల్గొన నర్హత కలిగియున్నారు.

ఉద్దేశ్యము:- లోకకళ్యాణము  స్థలము:- భక్తులందరి గృహములలోను

రుసుము, లేక దక్షిణ } ప్రతిదినము, దినమునకు 108 పర్యాయములకు తక్కువ గాకుండగ తమశక్తి ఉత్సాహావకాశముల ననుసరించి చేయగలిగినంత హెచ్చుగ నిష్కామముగా భగవదర్పణ బుద్ధితో భగవత్ప్రీతి కొరకై

హరేరామ, హరేరామ, రామ, రామ, హరేహరే హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే అను 32 అక్షరములు గల మంత్రమును జపించి చివర "శ్రీకృష్ణార్పణమస్తు" అని భగవంతుని కర్పణ చేయుటయే

ఫలితము:- భగవత్కటాక్ష పాత్రులగుటయే.

ప్రియ భక్తులారా !

దుర్లభమైన మానవ జన్మ మెత్తినందులకు ఫలితము భగవంతుని గుణసంకీర్తన మొనరించుచుండుటయే కదా. ఇది భుక్తిముక్తిదాయకము. సర్వపాపహరము సర్వసంపత్సిద్ధికరము. అనంతములగు భగవంతుని కళ్యాణ గుణగణములలో

"హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే"

అను నామ సంకీర్తనము అత్యంత వైభవోపేతమైనది. మరియు కలియుగమున ప్రత్యేకము దీనియొక్క ప్రభావము వర్ణించ శక్యముకానిది.

కాన బుభుక్షువులుగాని ముముక్షువులుగాని దీనిని సదాజపించు చుండుట సర్వశ్రేయోదాయకమైయున్నది.

సంవత్సరములో నతిపవిత్రమై పుణ్యవంతమై శ్రీహరికతి ప్రీతికరమైన మాసము చాతుర్మాస్యము. చాతుర్మాస్యమనగా, ఆషాఢ శుద్ధ ద్వాదశి మొదలు కార్తీక శుద్ధ ద్వాదశి వరకు గల నాలుగు మాసములున్ను. ఈ 120 రోజులున్ను తప్పక ప్రతి మానవుడున్ను, నిష్ఠలో శ్రీవారి నామములను స్మరించు చుండవలెను. ఇదియే చాతుర్మాస్య వ్రతము. వ్రతము లన్నింటిలోను, సార్వత్రికమై శాశ్వత పదవినీయగల వ్రతరాజమీ చాతుర్మాస్యమే. దీనిని మానవ మాత్రులందరు చేయవచ్చును. చేయవలెను.

భక్తాగ్రేసరులారా !

మీరుకూడ యీ వ్రత దీక్షను వహించి 120 దినములు శ్రీ హరినామ సంకీర్తన మొనరించి, యీ క్రతువున

పాల్గొని ధన్యులు కావలెను. మీ బంధు మిత్రులను పరచితులను యిందులకు ప్రోత్సహించవలెను.

ఈ క్రతువున పాల్గొని యీ మంత్రమును జపించుచుండు నంతమాత్రమున మీరిదివరలో అనుష్ఠించుచుండు మంత్ర జపముల నేటిని వదలనవసరము లేదు. వాటితో పాటుగ దీనిని గూడ భగవద్గుణాను భవరూపముగ జపించు చుండవలెను.

ఈ క్రతువున పాల్గొన దలచినవారు అనుసరించ వలసిన నియమములు.

## వి శే ష వి ధి

హెచ్చునిష్ఠతో విశేషవిధిని అనుసరించ దలచినవారు

(1) శ్రీనారాయణ అష్టాక్షరీ మంత్రోపదేశమును బడయనివారు యీ మంత్రమును మంత్రసిద్ధిగల బ్రాహ్మణుని వలన యుపదేశము పొందవలెను. (ఇదివరలోనే సక్రమముగ ఉపదేశమును పొందియున్నగాని, నారాయణాక్షరీ ఉపదేశమును పొందియున్నగాని తిరిగి యుపదేశమును పొందనవసరము లేదు.

(2) ప్రతి దినము ఉదయముననే స్నానమాచరించి నాసీనులైనచో పర్వదినములు కానప్పుడు జుట్టు ముడివిప్పి పసుపు చల్లుకొని కంఠస్నానమాచరించిన చాలును. పర్వదినములలో శిరస్నానము చేయవలెను.) ఆరవైచిన మడిబట్టలను ధరించి తమ సాంప్రదాయానుగుణమైన బొట్టును పెట్టుకొని తమ తమ నిత్యకర్మానుష్ఠాన నంతయు క్రమప్రకారముగా చేసుకొని తమ అవకాశము ననుసరించి ఏకాంత స్థలమున మౌనముగ కూర్చుండి కళ్లుమూసుకొని మనస్సున శ్రీమన్నారాయణుని ధ్యానించుచు దినము ఒక్కంటికి 108 పర్యాయములు తక్కువగాకుండగ (ఇంతకంటె హెచ్చైనను మంచిదియే) దీనిని జపించవలెను. 1008 పర్యాయములు చేయుచుండుట విశేషము.

మధ్యలో విఘ్నము కలిగినచో ఆ లోటుమిగతా కాలములో పూర్తి చేసుకొనవచ్చును.

(3) సాత్వికాహారము, సత్సహవాసము, సద్గ్రంథపఠనము, భగవద్భాగవత సేవ, బ్రహ్మచర్యము, వీటిని పాటించవలెను.

(4) అవకాశమున్నచో ప్రతిదినము జపాంతమున ఒక గుప్పెడు బియ్యమును ఒక కానిడబ్బును తీసి, కృష్ణార్పణమని వేరేయుంచి జాగ్రత్త పెట్టుచుండవలెను. వ్రతసమాప్తమున ఈ బియ్యము డబ్బులతో తదీయారాధనమును ఇంకను శక్తికొలది బీదలకు అన్నదానము, గోపూజ సలుపవలసినది.

స్త్రీలుగాని పురుషులుగాని తమ ఆశౌచ కాలములందు మానసిక ధ్యానమే గాని పైకి ఉచ్చరించరాదు, మానసికానుసంధానమును జేసుగొనవచ్చును.

పై సమయములందలి జపసంఖ్యను దీక్షానిర్ణీత సంఖ్యలో గణించరాదు.

ఇంటిలో ఎంత మందియున్న అంతమందియు ఈ జపమును చేయవచ్చును. విద్యార్థులు, ఉద్యోగస్థులు, రైతులు, వర్తకులు అందరు చేయవచ్చును.

దీనికి హోమముగాని, తర్పణముగాని లేదు. కాని జపమంతయు పూర్తియయిన పిమ్మట తులసితో గాని, పుష్పములతోగాని భగవంతునికి సహస్రనామార్చనము చేయవలసినది. ఇదిగాక తమశక్తి, ఉత్సాహ, అవకాశముల ననుసరించి బీదలకు అన్న సంతర్పణము భూతబలియు (పశువులకు, పక్షులకు, జంతువులకు ఆహారమిడుట) జరిపించ వలసినది.

ఆఖరిదినమున జపము పూర్తియయిన పిమ్మట బంధుమిత్రాదులతో కలిసి గోపూజను గావించి సమిష్టి భజనను, అవబృథోత్సవమును జరిపించవలసినది.

ఇట్లు

శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ
రామానుజజీయర్ స్వామివారు
శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ అధ్యక్షులు.

ప్రధాన కార్యదర్శి :

తె. కం. గోపాలాచార్యులు

కవిరత్న గు. రామానుజాచార్యులు (సహాయ కార్యదర్శి)

కార్యాలయము: శ్రీ వాసుదాసాశ్రమము
నడిగడ్డపాలెం, (పో) గుంటూరు(జి)

ఈ కాగితమును మీ బంధుమిత్రాదులకు కూడ అందచేయుడు. మీ గ్రామములో శ్రీ హరినామ సంకీర్తన మహామండలిని స్థాపించి ప్రతి సంవత్సరమున ఈ కార్యక్రమమును శాశ్వతముగ జరుగు నేర్పాటు గావింపుడు మీకు ఇట్టి కాగితములు కావలసియున్నచో మీరే స్వయముగా నచ్చు వేయించుకొనవలసినది.

# గోపికాగీతలు 2 శ్లోకము

అవతారిక :- మరొక గోపిక శ్రీకృష్ణుని దర్శనమునకై ప్రార్థించుచున్నది.

2 శ్లో॥ శరదుదాశయే సాధుజాత సత్
సరసిజోదర - శ్రీముషా దృశా!
సురతనాథ తే౽శుల్కదాసికా
వరద నిఘ్నతో నేహ కిం వధః

## అర్థము

శరదుదాశయె = శరత్కాలమందు సరస్సులో; సాధుజాత సత్సరసిజోదర శ్రీముషా; సాధు = చక్కగా; జాత = ఉద్భవించిన; సత్ = బలిష్ఠమై - సూర్యకిరణములచే వికసించిన, సరసిజ = పద్మములయొక్క; ఉదర = గర్భమందలి శ్రీ = శోభను; ముషా = దొంగిలించుచున్న; దృశా = చూపుచేత; హే సురతనాథ = ఆనందదాయకుడవగు ఓ కృష్ణా; అశుల్కదాసికాః = జీతభత్యములైనను కోరని దాసీలమైన మమ్ములను, నిఘ్నతః = బాధించుచున్నట్టి నీకు, హే వరద = వరములనిచ్చి కాపాడు ఓ కృష్ణా; ఇహ = ఈలోకమున; వధః = చంపుట; న కిం = అగుటలేదా?

## తాత్పర్యము

కృష్ణా నీకై శరత్కాలపు అర్ధరాత్రియందు అఖిలము ఆలమటించుచు తిరుగుచున్నాము. అలసిపోతిమి. యిక ప్రాణములు నిలుచునట్లులేదు. శరత్కాలీయగంభీరాంభస్సముద్భూత సుస్పష్ట నాళ రవికరవికసిత పద్మదళాయతలోచనాలోకనముచే మేము ప్రాణావశిష్టులమగుచున్నాము. ప్రబలులగు వారికి నీ శంఖచక్రాద్యాయుధములుగాని అబలలగు మాకు నీ తూతుశేయ్ నేత్రప్రసారాదులు చాలును చంపుటకు. కద్రుష్టుల దృష్టి తగిలినచో నీకు మంగళమగునను భ్రమచే యింతవరకు మంగళాశాసనముల పాడిన మాకే నీ కప్యాసపుండరీకాక్షులే కాలసన్నిభములై కృష్ణదర్శన లాలసాలాపముల నాలాపింపజేయుచున్నవి. నీ కళ్లు మాపై పడినవి. అంతియె. మా కళ్లు మూత పడినవి. నీ కళ్లలో మేము పడితిమి. మా ఆత్మాత్మీయములు నీ కాళ్లపై పడినవి. ఆనందమను కొని యనుభవింప మొదలుపెట్టి యనుభవము ఆత్మవినాశమునకు దారిదీయుచున్నది. మనమడగు శివునిదృష్టి దహించునదగుటకు కారణము నివాసమునకు తాతవగుటయే కాబోలును. సూర్యుడు నీటినిమాత్రమే హరించునుగాని, తన్మండలాంతర్గతుడవగు నీవు జలాప్యాయకమగు ప్రాణమును, తేజస్సుతోపాటుగ మా స్వాతంత్ర్యమును, స్వాత్మరక్షణములనుగూడ హరించి, మమ్ములను నీకు జీతబత్తెములులేని దాసీలక్రింద, దాసానుదాసులక్రింద జేసివైచితివి. పృథ్వీతత్త్వమగు ఈ శరీరమునుగూడ హరించితివేని పీసవదలెడిగదా!

దానమేగాని ప్రతిగ్రహము లేదను నీ రామావతారవాక్యమును నమ్మి ఎవరో "వరద" యను బిరుదము నిచ్చిరి. గాని వారు రామావతారముతోపాటుగ ఆ గుణము లోపించి మా ప్రాణప్రతిగ్రహమునకు పాల్పడిన నీకు ఆ బిరుదులోని రకారమును లోపించినదని వారు గ్రహించలేకపోయిరే.

శ్రీమతే రామానుజాయ నమః

    

శ్లో॥ శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే। భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా.

# భక్తినివేదన

## [ వేదాంత మాసపత్రిక ]

సంపుటి ౧౨ ‖ వికారి - ఆషాఢము ‖ సంచిక ౮

## శ్రీరంగవైభవము

శ్లో॥ కావేరీ విరజా సేయం। వైకుంఠ రంగమందిరం
సవాసుదేవో రంగేశః। ప్రత్యక్షం పరమంపదం ॥

శ్లో॥ కావేరీ వర్ధతాంకాలే। కాలే వర్షతు వాసవః।
శ్రీరంగనాథో జయతు। శ్రీరంగ శ్రీశ్చ వర్ధతాం॥

శ్లో॥ శ్రీరంగ రాజకరసన్నమిత శాఖికాభ్యః। లక్ష్మ్యా స్వహస్తకలిత శ్రవణావతంసం
పున్నాగతల్లజ మజస్ర సహస్రగీతి। సేకోద్ధ దివ్యనిజసౌరభ మామనామః॥

తాత్పర్యము

శ్రీరంగములో చంద్రపుష్కరిణి చెంత యొక్క పొగడవృక్షమున్నది. ఆవృక్షవైభవమును శ్రీభట్టరు వారు పరమభోగ్యముగా నిట్లువర్ణించియున్నారు. ఈ పొగడచెట్టుమొదట శ్రీరంగనాథుడు, శ్రీదేవి వేంచేసెడివారట. అప్పుడు రంగనాథుడు ఎత్తుగానున్న పొగడవృక్షపుగొమ్మలను తమతిరుహస్తముతో క్రిందికివంచగా శ్రీదేవి ఆకొమ్మలచివరనున్న చిగురుటాకులను తమ సుకుమారహస్తముతో కోసి శ్రవణావతంసముగా ధరించియుండెడిదట. శ్రియఃపతిత్వమునకు ఇంతకన్న యసాధారణచిహ్నమేమున్నది. ఈ పొగడచెట్టుమూలమందు మనపూర్వాచార్యులందరు వేంచేసి తిరువాయిమొళిని యనుసంధానము చేయుచుండగా ఆ యనుసంధానమే సుధాసేకముగా అభివృద్ధిచెందుచుండెడిదట. ఆ పొగడచెట్టుకున్న సౌరభము దివ్యమట. ఇట్టిపరమవిలక్షణమైన ఆ పున్నాగతల్లజమును మొన్న 12-7-59 వ తేది శ్రీరంగములో జరిగిన పెరియపెరుమాళ్ మహాసంప్రోక్షణోత్సవమును సేవించుటకు వెళ్లినప్పుడు మనసార సేవించుభాగ్యము లభించినది.

సంపాదకులు: విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు: కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులు

1959 - ఆగష్టు

శ్రీ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్య ప్రణీతంబైన

# ధనుర్ధాన కావ్యమందలి - ఒక ఘట్టము

## ప్రథమసర్గలో - శ్రీ రామానుజులవారి శ్రీరంగ ప్రవేశము

గీ॥ యత్కృతంబగు శ్రీభాష్యమాలకించి, భారతియొసంగె శ్రీ భాష్యకారబిరుదు
నిత్యలీలా విభూతుల నీడయెవ్వఁ, డట్టి రామానుజార్య మహామహుండు.

... ... ... ...

గీ॥ రెక్కలూడిన పక్షులరీతినుండు, బద్ధచేతనకోటిని బరమకరుణ
నుద్ధరింపంగ నూహించి యొక్కనాడు రాకవలె వచ్చె స్వామి శ్రీరంగమునకు.
గీ॥ ప్రణవాకృతి విమానవైభవ మ్మతిదూరమందె సేవించి " దాసోహ " మంచి
అలనాడు, శ్రీయామునార్యుని దుదియాత్రఁ గనిన కావేరిసైకతము దాటి
సిరులొల్కుస్వాముల " తిరుమాళిగలు " గుల్కు ప్రాకారసప్తకమ్మధిగమించి
" అడియే" నన [illegible] గొందఱుం [illegible] బద్ధులై, నిర్మమేపస్థితి నిలచిచూడ
గీ॥ మోహనంబున్న తెల్లనిపుండ్రకాంతి, జ్ఞానవైనద్య[illegible]ని బహిర్గతముసేయఁ
బురికి నేతెంచి తిరువీధిఁ దిరుగుచుండ నందఱుఁ [illegible]గిరి రామానుజార్యులనుచు.
ఉ॥ పున్నమరాకచే జలధిపొంగినవైఖరిగాఁ దదాగమా
భ్యున్నతికెల్లవారలు నమోనమయంచుఁ దదీయపాదుకా
సన్నిధిలో నమాంతముగసాగి నమస్కృతిసేయసాగిరా
కన్నులకీయతీంద్రుఁడు కల్పకమై కనుపించె నెంతయున్.
ఆ. వె॥ లక్ష్మణార్యులనుచు రామానుజుండని, భాష్యకారు లుభయ వరులటంచు
సంయమీంద్రుడనుచు జగదేకగురువంచు గనులుగట్టి ప్రజలు గ్రమ్ముకొనిరి.
ఉ. అతిథిసన్నిధియందు నడయాడుచు నుండె యతీశ్వరుండ హా
యూతము రంపు రంపను ఘోద్యముగాఁ బురవాసులందఱున్
ప్రీతిగఁ జుట్టుముట్టి చిరవిడను బాసనరేగ షట్పద
వ్రాతము మూగినట్లు నలుపక్కల నెంతవిశేషమున్నదే.
ఆ. వె. ఇసుకచల్లిన రాలనట్టిరికి నారు । పరిజలు కనుమూపుమేర నావంతగూడ
సందుకనరాని యతికుల చక్రవర్తి । చేయునదిలేక యచట వేంచేసియుండె
ఉ. వచ్చుట కడ్డులుంట గని వాకిట మూలలనిల్చి లోచన
ప్రోచ్చల దీక్షణప్రభవ పుష్పులదండలటన్న కాన్కగా
నిచ్చి పురాంగనా తతి యతీంద్రుని దివ్య కథానుభూతులన్
మెచ్చుచుఁ బల్కసాగె శ్రుతిమేళన సేసిన వీణవైఖరిన్.

(తరువాయి పైటిల్ 3-వ పేజీ చూడుడు)

## నవమాధ్యాయార్థ సంగ్రహము

శ్లో. స్వమాహాత్మ్యం, మనుష్యత్వే ।
పరత్వం చ, మహాత్మనామ్ ।
విశేషో, నవమే, యోగో ।
భక్తిరూపః, ప్రకీర్తితః॥

అర్థము :- స్వమాహాత్మ్యం = తనమాహాత్మ్యము, మనుష్యత్వే = మనుష్యభావమునందును, పరత్వం = పరత్వము, మహాత్మనాం = భక్తులయొక్క. విశేషః = అతిశయము, భక్తిరూపఃయోగః = భక్తియోగము (అనునివి) నవమే = తొమ్మిదవ అధ్యాయమున, ప్రకీర్తితః = చెప్పబడెను.

తా॥ తొమ్మిదవ అధ్యాయమున భగవంతుని మహిమయు, మనుష్యుడుగా నవతరించినను తన సర్వాతిశయము చెడకుండుటయు, భక్తులయొక్క గొప్పతనమున్ను, భక్తి యోగముయొక్క స్వరూపమున్ను చెప్పబడినవి.



రామానుజ కూటమును
నిర్మింపదలచి యున్నారనియు, సన్నిధిని దివ్యస్థలముగా చేయ సంకల్పించియున్నారని తెలిసికొని శ్రీ స్వామివారు ఒంగోలుకు వేంచేసిరి. వారుచేయు సత్కార్యమునకు మంగళాశాసనము చేసి యీ మహా కైంకర్యమునకు అందరు

# శ్రీ భగవద్గీతా - నవమాధ్యాయము

# విషయసూచిక

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ భగవద్గీతా - నవమోఽధ్యాయః

# రాజవిద్యా రాజగుహ్యా యోగః

అవ. భగవానుడు తానీయధ్యాయమున చెప్పదలంచిన విషయమును ఫల
మతో ప్రతిజ్ఞ చేయుచున్నాడు.

1. శ్లో. ఇదం తు తే గుహ్యతమం । ప్రవక్ష్యా మ్యనసూయవే
జ్ఞానం విజ్ఞాన సహితం । యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥

అర్థము :– గుహ్యతమం = మిక్కిలి రహస్యమైన, విజ్ఞానసహితం = విశేష జ్ఞాన
ముతోకూడిన, ఇదం జ్ఞానం = ఈ ఉపాసనయనబడు జ్ఞానమును, అన
సూయవే = అసూయలేని, తే = నీ కొఱకు, వక్ష్యామి = చెప్పగలను,
యత్ = ఏజ్ఞానమును, జ్ఞాత్వా = తెలుసుకొని, అశుభాత్ = సమస్త పాప
సముదాయమునుండి, మోక్ష్యసే = విడువబడుదువు.

తా॥ మిక్కిలి రహస్యమైన భక్తియోగమును ఉపాసనా విశేష జ్ఞాన
ముతోసహా - నా మాహాత్మ్యమును విని యసూయ జెందని
నీకు చెప్పెదను. దాని నెఱింగి యనుష్ఠించినచో నన్ను పొందు
టకు ప్రతిబంధకములగు పాపములన్నియు పోవును.

జ్ఞానమనగా – భక్తియనబడు ఉపాసనరూపమైన జ్ఞానము.

విజ్ఞానమనగా – ఉపాస్యుని అతిశయము, ఉపాసన పద్ధతి, ఉపాసన
లోని విశేషములను గూర్చిన జ్ఞానము.

అవ. తానుపదేశింపబోవునట్టి భక్తియోగమును ప్రశంసించుచున్నాడు.

2. శ్లో. రాజవిద్యా రాజగుహ్యం । పవిత్ర మిద ముత్తమమ్
ప్రత్యక్షావగమం ధర్మ్యం । సుసుఖం కర్తు మవ్యయమ్॥

అర్థము :– ఇదం = ఇది. రాజవిద్యా = విద్యలకు రాజైనది. రాజగుహ్యం = రహస్యములకు రాజైనది. ఉత్తమం = శ్రేష్ఠమైనది. పవిత్రం = శుద్ధికరమైనది. ప్రత్యక్షావగమం = ప్రత్యక్షమైన విషయముకలది. ధర్మ్యం = ధర్మమును తప్పనిది. కర్తుం = చేయుటకు. సుసుఖం = మిక్కిలి సుఖమైనది. అవ్యయం = నశించనిది.

తా॥ ఈ భక్తి విద్యలకు రాజు. రహస్యములకు రాజు. అన్నిటికంటెను మిన్న. నన్ను పొందుట కాటంకపరచు పాపముల నన్నిటిని పోగొట్టునది. నన్ను ప్రత్యక్షముగ జూపునది. ధర్మమును తప్పనిది. మిక్కిలి ప్రియముగ పరిగ్రహించదగినది. ఫలమును పొందించియు తాను నశించనిది.

అవ. ఇట్టి మహత్తరమగు నీ యుపాసన నెఱుంగకున్నను, ఆచరించకున్నను మోక్షమునకు దూరులగుదురని నిందించుచున్నాడు.

3. శ్లో. అశ్రద్దధానాః పురుషాః । ధర్మస్యాస్య పరన్తప !
అప్రాప్య మాం నివర్తన్తే । మృత్యుసంసారవర్త్మని॥

అర్థము :– పరన్తప ! = అర్జునా ! అస్య = ఈ. ధర్మస్య = ఉపాసనకు. అశ్రద్ధధానాః = నమ్మకముతోడి తొందరలేనివారగు. పురుషాః = పురుషులు. మాం = నన్ను. అప్రాప్య = పొందక. మృత్యుసంసారవర్త్మని = మృత్యురూపమగు సంసారసరణిలో. నివర్తన్తే = నిత్యముగా నుండిపోవుచున్నారు.

తా॥ అర్జునా ! ఈ ధర్మము ననుష్ఠించుటకు యోగ్యతయున్నను దీనియందు విశ్వాసముతో దీని నాచరించవలె ననెడు తొందరలేక యుండు పురుషులు నన్ను చేరనేరరు. వారీ సంసారమునందే నిరంతరము నిలచి పోవుదురు.

అవ. భక్తిరూప ఉపాసనచే పొందదగిన భగవంతునియొక్క అత్యద్భుత మహిమను వర్ణించుచున్నాడు.

4. శ్లో. మయా తత మిదం సర్వం । జగ దవ్యక్తమూర్తినా
మత్థ్సాని సర్వభూతాని । న చాహం తేష్వవస్థితః॥

అర్థము :- అవ్యక్తమూర్తినా = ఇంద్రియములకు గోచరించని స్వరూపముగల, మయా = నాచేత, ఇదం = ఈ, సర్వం = సమస్తమైన, జగత్ = ప్రపంచము, తతం = వ్యాపించబడియున్నది, సర్వభూతాని = సమస్త ప్రాణులున్ను, మత్థ్సాని = నాయందున్నవి, అహం చ = నేనైతే, తేషు = వాటియందు, న అవస్థితః = ఆధారపడియున్నవాడనుకాను.

తా॥ నేను నా స్వరూపమునందరకును గోచరింపజేయక యే అంతర్యామిగానుండి జగత్ప్రపంచంతటను వ్యాపించియుందును. కావున, నాయందే సమస్త భూతములున్ను ఆధారపడియున్నవి. కాని, నేను మాత్రము దేనియందును ఆధారపడి యుండలేదు.

5. శ్లో. న చ మత్థ్సాని భూతాని । పశ్య మే యోగమైశ్వరమ్
భూతభృన్నచ భూతస్థః । మమాత్మా భూతభావనః॥

అర్థము :- భూతాని = భూతములు, మత్థ్సాని = నాయందున్నవి, నచ = కావు, మే = నాయొక్క, ఐశ్వరం = ఈశ్వరసంబంధమైన, యోగం = సంకల్పమును, పశ్య = చూడుము, భూతభృత్ = సకలభూతములను భరించువాడను, భూతస్థః = భూతములయం దాధారపడియుండువాడను, నచ = కాను, మమ = నాయొక్క, ఆత్మా = మనోమయమగు సంకల్పము, భూతభావనః = భూతములను పుట్టించునది.

తా॥ నేను సమస్త భూతములను నా సంకల్పముచే మాత్రమే ధరించియుందును. ఇట్లు నేను భూతములను భరించుచున్నను వాటిచే నా కుపకారమేమియు లేదు. నా సంకల్పమే వాటిని పుట్టించి ధరించి నియమించుచున్నది.

అవ. సకల జగత్తుయొక్క స్థితి-ప్రవృత్తులు భగవంతుని సంకల్పాధీనములే
యని దృష్టాంతముతో తెలుపుచున్నాడు.

6. శ్లో. యథాకాశస్థితో నిత్యం । వాయు స్సర్వత్రగో మహాన్
తథా సర్వాణి భూతాని । మత్థ్సానీ త్యుపధారయ॥

అర్థము :- నిత్యం = ఎల్లప్పుడును. ఆకాశస్థితః = ఆకాశమునందుండునట్టియు, సర్వత్రగః = అంతటను సంచరించుచుండునట్టిదియునగు, మహాన్ = గొప్పదైన, వాయుః = గాలి, యథా = ఏ విధముగానో, తథా = ఆ విధముగా, సర్వాః = సమస్తములైన, భూతాని = భూతములు, మత్థ్సాని ఇతి = నాయందున్నవని, ఉపధారయ = నమ్ముము.

తా॥ గొప్పదైన గాలి పట్టులేని ఆకసమునందు నెలకొని యంతటను తిరుగుచున్నది. దానికి నేనేగదా యాధారము. అట్లే ప్రాణులన్నియు నా యందుండి నా చేతనే ధరింపబడి యున్నవని నిశ్చయించుకొనుము.

అవ. అట్లే జగత్తుయొక్క ఉత్పత్తిప్రళయములున్ను భగవంతుని సంకల్పాధీనములేయని చెప్పుచున్నాడు.

7. శ్లో. సర్వభూతాని కౌన్తేయ ! । ప్రకృతిం యాన్తి మామికామ్
కల్పక్షయే, పునస్తాని । కల్పాదౌ విసృజామ్యహమ్॥

అర్థము :- కౌన్తేయ ! = అర్జునా ! సర్వభూతాని = సమస్తపదార్థములున్ను, కల్పక్షయే = కల్పాంతమున, మామికాం = నా సంబంధమైన, ప్రకృతిం = ప్రకృతిని, యాన్తి = పొందుచున్నవి, కల్పాదౌ = కల్పారంభమున, పునః = తిరిగి, తాని = ఆభూతములనే, అహం = నేను, విసృజామి = సృజించుచున్నాను.

తా॥ అర్జునా! కల్పాంతమున భూతములన్నియు నా సంకల్పముచే నా శరీరమగు ప్రకృతిని పొందుచుండును. వాటినే కల్పారంభమున తిరిగి నేను నా సంకల్పముచే సృజింతును.

8. శ్లో. ప్రకృతిం స్వా మవష్టభ్య । విసృజామి పునః పునః
భూతగ్రామ మిమం కృత్స్న । మవశం ప్రకృతే ర్వశాత్॥

అర్థము :– స్వాం = నా సంబంధమైన, ప్రకృతిం = ప్రకృతిని, అవష్టభ్య = ఎనిమిది విధములుగా పరిణమింపజేసి, ప్రకృతేః = ప్రకృతియొక్క, వశాత్ = ఆధీనతవలన, అవశం = స్వాతంత్ర్యములేని, కృత్స్నం = సమస్తమైన, ఇమం = ఈ, భూతగ్రామం = ప్రాణిసమూహమును, పునః పునః = మాటిమాటికి, విసృజామి = అనేకరీతుల పుట్టించుచున్నాను.

తా॥ నా ప్రకృతి విచిత్రముగా పరిణమించునది. దానిని నేను ఎనిమిది విధములుగా పరిణమింప జేయుదును. ఇట్టి నా ప్రకృతికి యధీనమై పరవశమైన ప్రాణుల నన్నిటిని ఆ యా కాలములయందు అనేక రీతులుగా పుట్టించుచుందును.

అవ. సృష్టిలోని హెచ్చుతగ్గులవలన భగవంతునకు నిర్దయత్వముగాని పక్షపాతముగాని లేవని చెప్పుచున్నాడు.

9. శ్లో. న చ మాం తాని కర్మాణి । నిబధ్నన్తి ధనఞ్జయ !
ఉదాసీనవ దాసీన । మసక్తం తేషు కర్మసు॥

అర్థము :– ధనఞ్జయ ! = అర్జునా ! తాని = ఆ విషమసృష్టి మొదలగు, కర్మాణి = కర్మలు, తేషు = ఆ, కర్మసు = కర్మలయందు, అసక్తః = సంబంధము లేనివాడనై, ఉదాసీనవత్ = తటస్థునివలె, ఆసీనం = ఉన్నట్టి, మాం = నన్ను, న నిబధ్నన్తి = బంధింపవు.

తా॥ అర్జునా ! హెచ్చుతగ్గులుగానుండు ఆ సృష్టి మొదలగు కర్మలు నాకు దోషముల నాపాదించవు. ఏలనన ఆ హెచ్చుతగ్గులకు కారణము వారివారి పుణ్యాపాపములే గాన నే నందు సంబంధము లేక ఉదాసీనుడనై యుందును.

10. శ్లో. మయాఽధ్యక్షేణ ప్రకృతి । స్సూయతే సచరాచరమ్
హేతునాఽనేన కౌన్తేయ । జగద్ధి పరివర్తతే॥

అర్థము :– కౌన్తేయ = అర్జునా! అధ్యక్షేణ = అధికారినగు, మయా = నాచేత, ప్రకృతిః = ప్రకృతి, సచరాచరం = జంగమస్థావరములతో గూడిన జగత్తును, సూయతే = కనుచున్నది. అనేన = ఈ, హేతునా = కారణము చేత. జగత్ = ప్రపంచము, పరివర్తతేహి = ప్రవర్తించుచున్నదిగదా!

తా॥ అర్జునా! నేను ప్రకృతికి అధికారిని. నేను నా సంకల్పముతో జీవుల కర్మానుగుణముగా చూచుచుందును. దానిననుసరించి ప్రకృతి సమస్త చరాచరాత్మకమగు జగత్తును కనుచున్నది. నేనట్లు చూచుచుండుటచేతనే జగత్తు ప్రవర్తించుచున్నది.

అవ. మహాత్ముల వైభవమును చెప్పుటకుముందు మూఢుల స్వభావమును తెలుపుచున్నాడు.

11. శ్లో. అవజానన్తి మాం మూఢాః । మానుషీం తను మాశ్రితమ్
పరంభావ మజానన్తః । మమ భూత మహేశ్వరమ్॥

అర్థము :– మమ = నాయొక్క, పరంభావం = పరత్వస్వభావమును, అజానన్తః = ఎఱుంగనివారై. మూఢాః = అవివేకులు. భూతమహేశ్వరం = సకల భూతములయొక్క ఈశ్వరులకు ఈశ్వరుడనై, మానుషీం = మనుష్య సంబంధమైన, తనుం = శరీరమును, ఆశ్రితం = ఆశ్రయించిన, మాం = నన్ను, అవజానన్తి = అనాదరము చేయుచున్నారు.

తా॥ కొందరు అవివేకులు నాపరత్వము నెఱుంగరు. వారు నన్ను తక్కిన మనుష్యులతో సాటివానినిగా జూచుచు సకలభూతములకును అధిపతులైన బ్రహ్మరుద్రేంద్రాదులకుకూడ నేను అధిపతిననియు కేవలము కరుణచే మానవశరీరమును ధరించితిననియు వారెఱుంగరు.

అవ. ఇట్లెఱుంగకుండుటకు కారణమును దానికి ఫలమును చెప్పుచున్నాడు.

12. శ్లో. మోఘాశా మోఘకర్మాణో । మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురీం చైవ । ప్రకృతిం మోహినీం శ్రితాః॥

అర్థము :— రాక్షసీం = తామసస్వభావముకలదియు, ఆసురీం = రాజసస్వభావము కలదియు, మోహినీం = మోహింపజేయునదియునగు, ప్రకృతిం ఏవ = ప్రకృతినే, శ్రితాః = ఆశ్రయించినవారగుటచే, విచేతసః = యదార్థ జ్ఞానములేనివారును, మోఘాశాః = నిష్ఫలమైన కోరికలుకలవారును, మోఘకర్మాణః = నిరర్థకమైన పనులు కలవారును, మోఘజ్ఞానాః = నిష్ఫలజ్ఞానము కలవారును (భవన్తి = అగుచున్నారు).

తా॥ ప్రకృతి తామసస్వభావము రాజస స్వభావము మోహింపజేయు స్వభావమును కలదిగా నుండును. అది నామహిమను మఱుగు పరచును. దానికి వశమైనవారికి నన్నుగూర్చిన నిజమైనజ్ఞాన ముండదు. కావున వారి జ్ఞానము, వారి కోరికలు, వారికర్మలు, అన్నియు నిరర్థకములే యగుచున్నవి

అవ. భగవదవతారమును సఫలపరచు మహాత్ములయొక్క వ్యాపారమును తెలుపు నెపమున భక్తిస్వరూపము నెఱింగించుట.

13. శ్లో. మహాత్మానస్తు మాంపార్థ ! దైవీం ప్రకృతి మాస్థితాః
భజన్త్య నన్యమనసో । జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥

అర్థము :— పార్థ ! = అర్జునా ! (యేతు = ఎవరైతే) దైవీం = సాత్వికమగు, ప్రకృతిం = ప్రకృతిని, ఆశ్రితాః = ఆశ్రయించినవారైన, మహాత్మానః = మహాత్ములో, (తే = వారు) భూతాదిం = భూతములకు ఆదియైనవాడును, అవ్యయం = నాశనములేనివాడను అగు, మాం = నన్ను, జ్ఞాత్వా = తెలిసికొని, అనన్యమనసః = ఇతరచింతలులేని మనస్సుకలవారై, భజన్తి = ఉపాసించుచున్నారు.

తా॥ అర్జునా ! సాత్విక ప్రకృతిగల మహాత్ములు నన్ను భూతముల కన్నిటికిని ఆదికారణమైనవానినిగాను నాశరహితునిగాను తెలుసుకొని, ఇతరచింతల నన్నిటినివిడిచి భజించుటయే ప్రయోజనముగా నన్ను భజింంతురు.

14. శ్లో. సతతం కీర్తయన్తో మాం । యతన్తశ్చ దృఢవ్రతాః
నమస్యన్తశ్చమాం భక్త్యా । నిత్యయుక్తా ఉపాసతే॥

అర్థము :- మాం = నన్ను. సతతం = ఎల్లప్పుడును. భక్త్యా = భక్తితో. కీర్తయన్తః = పాడుచున్నవారును. దృఢవ్రతాః = స్థిరమైన సంకల్పము కలవారును. యతన్తః చ = నా పనులయందు ప్రయత్నించువారును. నమస్యన్తః చ = సాష్టాంగ నమస్కారము చేయువారును. నిత్యయుక్తాః = నాతో నిత్యసంబంధమును కోరువారును అయి. మాం = నన్ను. ఉపాసతే = ఉపాసించుచున్నారు.

తా॥ వారు నాయందలి ప్రీతిపారవశ్యమున నన్నుగూర్చి ప్రేమతో పాడుచు, నాకు సంబంధించిన పనులకై దృఢసంకల్పముతో యత్నించుచు నాకు నమస్కరించుచు నాతో నెల్లప్పుడును కూడి యుండవలెనని కోరుచు నాత్మయున్నంతవరకు నాదాస్యమునే యభిలషించి నన్నుపాసింతురు.

15. శ్లో. జ్ఞాన యజ్ఞేన చాప్యన్యే । యజన్తోమా ముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన । బహుధా విశ్వతోముఖమ్॥

అర్థము : అన్యే అపి = కొందరు మహాత్ములు. జ్ఞానయజ్ఞేన = జ్ఞానమనెడు యజ్ఞము చేత. యజన్తః = పూజించుచున్నవారై. బహుధా = అనేకవిధములుగా. పృథక్త్వేన = వేఱు వేఱుగా. విశ్వతోముఖం = అన్నిటిని విశేషణములుగా కలిగియున్న. మాం = నన్ను. ఏకత్వేన = ఒక్కడనేయను భావముతో. ఉపాసతే = ఉపాసింతురు.

తా॥ మరికొందరు మహాత్ములు జగత్తుయొక్క ఆకారములనుబట్టి నానావిధములుగ నున్ననన్ను ఒక్కనిగనే యెఱింగి ఉపాసింతురు. దీనికే జ్ఞానయజ్ఞమని పేరు.

అవ. భగవంతుడే విశ్వశరీరుడని తెలుపుట

16. శ్లో. అహంక్రతు రహంయజ్ఞః । స్వధాహమహమౌషధమ్।
మన్త్రోఽహమహమేవాజ్య । మహ మగ్ని రహం హుతమ్॥

అర్థము :- అహం ఏవ = నేనే, క్రతుః = జ్యోతిష్టోమాదిక్రతువును, అహం ఏవ = నేనే, యజ్ఞః = పంచమహాయజ్ఞమును, అహం ఏవ = నేనే, స్వధా = పితరులకిడెడు స్వధను, అహం ఏవ = నేనే ఔషధం = హవిస్సును, అహం ఏవ = నేనే, మంత్రః = మంత్రము, అహం ఏవ = నేనే, ఆజ్యం = నేయి, అహం ఏవ = నేనే, అగ్నిః = అగ్నిహోత్రము, అహం ఏవ = నేనే, హుతం = హోమమును (అహం ఏవ = నేనే).

తా॥ జ్యోతిష్టోమాదిక్రతువులు, పంచమహాయజ్ఞములు, పితరుల కిష్టమైన స్వధ-ఓషధి వికారమైన హవిస్సు మంత్రము నేయి మొదలగు హవిస్సు ఆహవనీయాది అగ్ని హోమము ఇవి యన్నియు నేనే యగుచున్నాను.

17. శ్లో. పితాఽహ మస్య జగతో । మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్రమోఙ్కార ఋక్సామయజురేవ చ॥

అర్థము : అస్య = ఈ, జగతః = ప్రపంచమునకు, పితా = తండ్రియు, మాతా = తల్లియు, పితామహః = తాతయు, ధాతా = వంశ మూలపురుషుడు, వేద్యం = తెలియదగిన, పవిత్రం = పావనమైన, ఓంకారః = ప్రణవము, ఋక్, సామ, యజుః చ = ఋక్ సామ యజుర్వేదములును, అహం ఏవ = నేనే, (అస్మి = అగుచున్నాను).

తా॥ జగత్తునందలి చరాచరములకు, తండ్రిగాను తల్లిగాను తాతముత్తాతలు మొదలగు వంశముల మూలపురుషులు వేదము తెలియదగిన పావనవస్తువులు, వేదబీజమగు ఓంకారము ఋక్ సామ యజుర్వేదములు ఇవి యన్నియు నేనే యగుచున్నాను.

18. శ్లో. గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ । నివాస శ్శరణం సుహృత్
ప్రభవః ప్రళయస్థానం । నిధానం బీజ మవ్యయమ్॥

అర్థము :— గతిః = పొందవలసిన స్థానము, భర్తా = భరించువాడు, ప్రభుః = శాసించువాడు. సాక్షీ = చూచువాడు, నివాసః = నివసించుస్థానము, శరణం = రక్షకుడు. సుహృత్ = హితైషియు, ప్రభవః ప్రళయస్థానం = పుట్టుచోటును లయించుచోటును, నిధానం = పుట్టుచు గిట్టుచునుండు పదార్థమున్ను, అవ్యయం = నాశరహితమైన, బీజం = కారణమున్ను, (అహం ఏవ = నేనే)

తా॥ పొందవలసిన చోటున్ను, ధరించు వాడను, నియమించు వాడును, సాక్షియై చూచు వాడను, ఇల్లు మొదలగు నివాసస్థానమున్ను, రక్షకమున్ను, మేలుకోరు వాడను, పుట్టుచోటున్ను, లయించు చోటున్ను, పుట్టుచు గిట్టుచునుండు పదార్థమున్ను, నశించని కారణమున్ను నేనే.

19. శ్లో. తపామ్యహ మహం వర్షం । నిగృహ్ణా మ్యుత్సృజామి చ
అమృతం చైవ మృత్యు శ్చ । స దసచ్చాహ మర్జున ॥

అర్థము :— అర్జున ! = అర్జునా ! అహం = నేను, తపామి = తపింపజేయుచున్నాను, అహం = నేను, వర్షం = వర్షమును, నిగృహ్ణామి = నిలుపుచున్నాను, ఉత్సృజామి చ = విడుచుచున్నాను, అమృతం = లోకముజీవించుకారణమున్ను, సత్ = ఇప్పుడున్నదియు, అసత్ = ఇప్పుడులేనిదియు, అహం ఏవ = నేనే.

తా॥ నేనే జగత్తును తపింపజేయుచున్నాను, నేనే వర్షము నరికట్టుచున్నాను, నేనే వర్షము నొసంగుచున్నాను. లోకమునకు బ్రతుకు తెరువును మరణనిమిత్తమును నేనే. వర్తమాన భూత భవిష్యత్తులలో నుండెడు వస్తువులన్నియు నేనే.

అవ. కర్మఠులయొక్క వ్యాపారమును వారికి లభించు ఫలమును తెలుపుచున్నాడు.

20. శ్లో. త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః ।
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।
తే పుణ్య మాసాద్య సురేన్ద్రలోక ।
మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్॥

అర్థము :- త్రైవిద్యాః = మూడువేదములయందు మాత్రమే నిష్ఠకలవారై, సోమపాః = సోమపానముచేసినవారై, పూతపాపాః = పవిత్రముచేయబడిన పాపములుకలవారై, యజ్ఞైః = యాగములచేత, మాం = నన్ను, ఇష్ట్వా = యజించి, స్వర్గతిం = స్వర్గప్రాప్తిని, ప్రార్థయన్తే = ప్రార్థించుచున్నారు. తే = వారు, పుణ్యం = పుణ్యఫలమైన, సురేన్ద్రలోకం = స్వర్గమును ఆసాద్య = పొంది, దివి = స్వర్గమునందు, దివ్యాన్ = స్వర్గమునకుచెందిన, దేవభోగాన్ = దేవతల భోగమును, అశ్నన్తి = అనుభవించుచున్నారు.

తా॥ మూడువేదములలోని కర్మకాండయందు మాత్రమే నిష్ఠకలవారు ఇంద్రాదిరూపముగానున్న నా శరీరములను పూజించి సోమపానముచేసి పాపములను పోగొట్టుకొని స్వర్గసుఖములను వాంఛింతురు. వారా పుణ్యఫలమగు స్వర్గమును పొంది అచ్చట తత్సంబంధమైన దేవభోగముల ననుభవింతురు.

21.శ్లో. తేతంభుక్త్వాస్వర్గలోకంవిశాలం।క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశన్తి
ఏవంత్రయీధర్మమనుప్రపన్నాః।గతాగతం కామకామా లభన్తే॥

అర్థము :- తే = వారు, విశాలం = విశాలమైన, తం = ఆ, స్వర్గలోకం = స్వర్గలోకమును, భుక్త్వా = అనుభవించి, పుణ్యే = పుణ్యము, క్షీణే = తరిగిపోగా, మర్త్యలోకం = భూలోకమును, విశన్తి = ప్రవేశించుచున్నారు. ఏవం = ఇట్లు, త్రయీధర్మం = మూడువేదములయందలి కర్మకలాపమును, అనుప్రపన్నాః = ఆశ్రయించినవారగు, కామకామాః = ఫలములనే కోరువారు, గతాగతం = రాకపోకలను, లభన్తే = పొందుచున్నారు.

తా॥ అట్టి కర్మఠులు విశాలమైన స్వర్గలోకమును అనుభవించి అందులకు మూలభూతమైన పుణ్యము క్షీణింపగా తిరిగి మనుష్యలోకమును ప్రవేశించుచున్నారు. ఇట్లు కేవలము త్రయీధర్మమును ఆశ్రయించినవారు అస్థిరములగు స్వర్గాదులనే మాటిమాటికి అనుభవించుచు చచ్చుచు పుట్టుచు నుందురు.

అవ. మహాత్ములగు భక్తుల విశేషమును వివరించుచున్నాడు.

22. శ్లో. అనన్యాశ్చిన్తయన్తో మాం । యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం । యోగక్షేమం వహామ్యహమ్॥

అర్థము :- యే జనాః = ఏ జనులు, అనన్యాః = ఇతరప్రయోజనములు లేనివారై, మాం = నన్ను, చిన్తయన్తః = ధ్యానించుచున్నవారై, పర్యుపాసతే = పూర్ణముగా ఉపాసన చేయుచున్నారో, తేషాం = అట్టి, నిత్యయుక్తానాం = నాతో నిత్యసంబంధమును కోరెడివారియొక్క, యోగక్షేమం = యోగమును క్షేమమును, అహం = నేను, వహామి = నిర్వహించుచున్నాను.

తా॥ ఏ ప్రయోజనమును కోరక నన్నే ధ్యానించుచు పూర్తిగా ఉపాసించుచు నాతో నిత్యసంబంధమును కోరువట్టి నా భక్తులయొక్క యోగక్షేమములను నేనే వహింతును.
(నన్ను పొందుట 'యోగము'; తిరిగి భూమిలో జన్మించకుండుట 'క్షేమము').

అవ. దేవతలందరును భగవంతునకు శరీరభూతులేగాన వారి యారాధన పర్యవసానమునకు తన యారాధనయేయని భగవంతుడెఱుం గునుగదా! అట్టితరి వారికిని మోక్ష మేలయొసంగడను ప్రశ్న కుత్తరమొసంగుచున్నాడు.

23. శ్లో. యే త్వన్యదేవతాభక్తా । యజన్తే శ్రద్ధయాఽన్వితాః
తేఽపి మామేవ కౌన్తేయ! యజన్త్యవిధిపూర్వకమ్॥

అర్థము :— కౌన్తేయ! = అర్జునా! యేతు = ఎవరైతే, అన్యదేవతాభక్తాః = ఇతర దేవతలయందు భక్తికలవారై, శ్రద్ధయా = శ్రద్ధతో, అన్వితాః = కూడిన వారై, యజన్తే = పూజించుచున్నారో, తే అపి = వారున్ను, అవిధి పూర్వకం = వేదాంతవిధులను ముందుంచుకొనక, మాం ఏవ = నన్నే, యజన్తి = పూజించుచున్నారు.

**తా॥ అర్జునా! కేవల ఇంద్రాది దేవతలయందు మాత్రమే భక్తికల వారై శ్రద్ధతో వారినేపూజించు వారుకూడ నిజమునకు అంత ర్యామినగు నన్ను పూజించువారలే యగుచున్నారు. కాని ఈ విధానము వేదాంతవిధులకు విరుద్ధమైనది.**

అవ. కర్మఠులు తాముచేయు కర్మలన్నియు నిజమునకు ఇంద్రాదుల కంతర్యా మిగానుండు భగవంతుని యారాధనలేయనియు, ఆరాధింపబడువాడు భగ వానుదేయనియు నెఱుంగరు. కావున వా రల్పఫలభాక్కులును, పునరా వృత్తికలవారును అగుచున్నారని తెలుపుచున్నారు.

24. శ్లో. అహం హి సర్వయజ్ఞానాం । భోక్తా చ ప్రభు రేవ చ
న తు మా మభిజానన్తి । తత్త్వేనా తశ్చ్యవన్తి తే॥

అర్థము :— సర్వయజ్ఞానాం = యజ్ఞములన్నింటికిని, భోక్తా చ = అనుభవించువాడ నున్ను, ప్రభుః ఏవ చ = ఫలమునొసంగు యజమానియున్ను, అహం హి = నేనేకదా! (ఇట్లు) మాం = నన్ను, తత్త్వేన = నిజముగా, నఅభి జానన్తి = ఎఱుంగరు, అతః = కాబట్టి, తే = వారు, చ్యవన్తి = జారి పోవుచున్నారు.

**తా॥ నిజమూరయ సకలయజ్ఞములచే నారాధింపబడు వాడనున్ను వాటికి ఫలము లొసంగువాడనున్ను నేనే. ఇట్లే నిజమును కరుకు లెఱుంగరు గాన వారు పురుషారపరిభ్రమలగుచున్నారు.**

అవ. ఆచరించు కర్మ ఒక్కటేయైనను సంకల్పభేదముచే కొందరత్యల్ప ఫలములనే బడసి యవి తరుగగనే తిరిగి సంసారమున కూలుచున్నారు. మరికొందఱు నిరతిశయానంద స్వరూపుడగు భగవంతుని బడసి తరుగుటగాని తిరిగి పుట్టుటగానియెఱుంగక సుఖించుచున్నారు. ఇది యెంత చిత్రమో ! యనుచున్నాడు.

25. శ్లో. యాన్తి దేవవ్రతా దేవాన్ । పితౄన్యాన్తి పితృవ్రతాః
భూతాని యాన్తి భూతేజ్యాః । యాన్తి మద్యాజినోఽపి మామ్॥

అర్థము :- దేవవ్రతాః = ఇంద్రాదులనర్చించు సంకల్పముకలవారు, దేవాన్ = ఇంద్రాది దేవతలనే, యాన్తి = పొందుచున్నారు, పితృవ్రతాః = పితురుల నారాధింతుమని సంకల్పించువారు, పితౄన్ = పితరులనే, యాన్తి = పొందుచున్నారు, భూతేజ్యాః = యక్షరక్షస్సుల నారాధించువారు, భూతాని = యక్షరక్షస్సులనే. యాన్తి = పొందుచున్నారు. మద్యాజినః అపి = వారందరకు నంతరాత్మభూతుడగు నన్నర్చించువారున్ను, మాం = నన్నే, యాన్తి = పొందుచున్నారు.

తా॥ ఇంద్రాది దేవతల నారాధించు సంకల్పముతో వారి నారాధించువారు ఇంద్రాదిసాయుజ్యమునేబడసి వారితోపాటు వారి లోకములయందు పరిమిత భోగములననుభవించి వారు నశించునపుడు వారితోపాటు వీరును నశించుచున్నారు. కాని భగవంతు నారాధించువారు ఆతని సాయుజ్యమునుబడసి ఆతనితో సమానభోగముల ననుభవించుచు వాటికిగాని యాతనికిగాని నాశములేనందున తాముకూడ నాశములేకయే తిరిగి సంసారమున బుట్టక శాశ్వతముగ నట్లే యనుభవించుచుందురు.

అవ. ఉభయులకును ఆయాసమొక్కటేయైనను ఫలభేదమిట్లు చెప్పబడెను. ఇకనీ శ్లోకమున ఆరాధనలోగల తారతమ్యమును జెప్పుచున్నాడు.

26. శ్లో. పత్రం పుష్పం ఫలం తోయం । యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత । మశ్నామి ప్రయతాత్మనః॥

అర్థము :— యః = ఏ భక్తుడు, మే = నాకు, పత్రం = ఆకునుగాని, పుష్పం = పువ్వునుగాని, ఫలం = పండునుగాని, తోయం = నీటినిగాని, భక్త్యా = భక్తితో ప్రయచ్ఛతి = యిచ్చుచున్నాడో, ప్రయతాత్మనః = దానినిచ్చుటయే ప్రయోజనముగా తలంచుట యనెడు మనఃపారిశుద్ధ్యముగల ఆ భక్తునియొక్క, భక్త్యుపహృతం = భక్తితో సమర్పింపబడిన, తత్ = ఆ పదార్థమును, అశ్నామి = అనుభవించుచున్నాను

తా॥ నా భక్తుడు నాకు భక్తితో ఇతర ఫలములను గోరక నాకిచ్చుటయే ఫలమని తలంచి ఆకునో, పువ్వునో, పండునో, నీటినో యిచ్చినచో, నట్టిభక్తితో సమర్పించిన ఆపదార్థమును కరువు తీరిన వస్తువు లభించినట్లు ఒడలెఱుంగని యానందముతో నారగింతును.

అవ. ఇట్లు భక్తుల వైభవము లోకాతీతమైనది గాన నీవు భక్తుడవై లౌకిక వైదిక నిత్యనైమిత్తిక కర్మల నీ విధముగా నాచరింపుమని యుపదేశించుచున్నాడు.

27. శ్లో. యత్కరోషి యదశ్నాసి । యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌన్తేయ । తత్కురుష్వ మదర్పణమ్॥

అర్థము :— కౌన్తేయ । అర్జునా । యత్ = దేహధారణకై యే లౌకిక వ్యాపారమును, కరోషి = చేయుచున్నావో, యత్ = దేనిని, అశ్నాసి = తినుచున్నావో, యత్ జుహోషి = యే హోమమును చేయుచున్నావో, యత్ దదాసి = యే దానమును చేయుచున్నావో, తత్ = దానినంతను, మదర్పణం = నాకర్పితమగువట్లుగా, కురుష్వ = చేయుము.

తా॥ అర్జునా! నీవు దేహధారణకై చేయు లౌకిక వ్యాపారములను, శాస్త్రోక్తములగుటచే చేయునట్టి యజ్ఞదానతపః ప్రభృతివైదిక కర్మలను నీకు శేషినగు నాయందర్పణబుద్ధితో ప్రేమతో నాచరింపుము.

అవ. ఇట్లాచరించుటచే కలుగు ఫలము నుపదేశించుచున్నాడు.

28. శ్లో. శుభాశుభఫలై రేవం । మోక్ష్యసే కర్మబన్ధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా । విముక్తో మా ముపైష్యసి॥

అర్థము :— ఏవం = ఇట్లు, సన్న్యాసయోగయుక్తాత్మా = నీవుచేయు లౌకిక వైదిక కర్మమంతయు నా యారాధనయని భావించు మనస్సుకలవాడవై, శుభాశుభఫలైః = సుఖదుఃఖములనొసంగునట్టి, కర్మబన్ధనైః = బన్ధహేతువులగు కర్మలన్నిటిచేతను, మోక్ష్యసే = విడువబడుదువు, విముక్తః = ఇట్లు విడువబడినవాడవై, మాం = నన్ను, ఉపైష్యసి = పొందుదువు.

తా॥ నిన్ను నాకు కింకరునిగాను నీవుచేయు కర్మలన్నియు నా యారాధనగాను తలంచుచు లౌకిక వైదికకర్మలను చేయుము. ఇట్లు చేసినచో సుఖదుఃఖముల నొసంగనివి యగుటచే నన్ను పొందుట కాటంకపడునట్టి సమస్త ప్రాచీన కర్మలనుండియు విడువబడి నన్నే పొందుదువు.

అవ. 'పత్రం పుష్పం' అనెడు శ్లోకముచే సౌలభ్యమును చెప్పి 'యత్కరోషి' యను శ్లోకముచే దానిని బలపరచి, యీ శ్లోకముచే సౌశీల్యమును చెప్పుచున్నాడు.

29. శ్లో. సమోఽహం సర్వభూతేషు । నమే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజన్తి తు మాం భక్త్యా । మయి తే తేషు చాప్యహమ్॥

అర్థము :— అహం = నేను, సర్వేషు భూతేషు = అన్నిప్రాణులపట్లను, సమః = సమానుడను, మే = నాకు, ద్వేష్యః = ద్వేషించదగినవాడు, నాస్తి = లేడు, ప్రియః = ఇష్టుడును, న = లేడు, యే తు = ఎవరైతే, మాం = నన్ను, భక్త్యా = భక్తితో, భజన్తి = ఉపాసించుచున్నారో, తే = వారు, మయి = నాయందున్ను, తేషు చ = వారియందు, అహమపి = నేనున్ను (వర్తామహే = ఉంటున్నాము).

తా॥ జాతి ఆకారము స్వభావము జ్ఞానము మొదలగు వాటిచే గొప్పవారైనను తక్కువవారైనను నన్నాశ్రయించుటలో సమానులే. గొప్పవారని గౌరవించను. తక్కువవారని తిరస్కరించను. కాని నన్ను భజించక నిలువలేని నాభక్తులు మాత్రము నాపట్ల నాతో సాటివారు వర్తించునట్లే వర్తింతురు. నేను వారిపట్ల నాకంటె గొప్పవారిపట్ల వర్తించినట్లు వర్తింతును.

అవ. జాత్యాదులచేతనేకాదు, ఆచారముచే నికృష్టులైనను నే ననాదరించు చున్నాననుచున్నాడు.

30. శ్లో. అపి చే త్సుదురాచారో । భజతే మామనన్యభాక్
సాధురేవ స మన్తవ్య । స్సమ్యగ్వ్యవసితో హి సః॥

అర్థము :— సుదురాచారః అపి = మిక్కిలి దురాచారములు కలవాడైనను, మాం = నన్ను, అనన్యభాక్ = నన్నొక్కనిమాత్రమే కేవలము భజించుటయే ఫలముగా కలవాడై, భజతే చేత్ = భజించినచో, సః = అట్టివాడు, సాధుః ఏవ = సజ్జనుడనియే, మన్తవ్యః = ఆదరించదగినవాడు. హి = ఎందువల్లననగా, సః = వాడు, సమ్యక్ = లెస్సగా, వ్యవసితః = నిశ్చయించుకొనినవాడు.

తా॥ చేయవలసినవి మానుటయేగాక చేయరానివికూడా చేయువాడు సుదురాచారి. అట్టివాడైనను ఫలాశలన్నిటినివిడిచి నన్ను భజించనిదే నిలువలేక భజించుటయే ఫలముగా భజించుచో వానిని వైష్ణవాగ్రేసరుడనియే ఆదరింపవలెను. ఎందుకనగా వాడు నన్నే తనకు స్వామినిగాను, గురువునుగాను, స్నేహితునిగాను, అన్నివిధముల బంధువునిగాను నమ్మియుండును.

అవ. దురాచారము భక్తిధార నరికట్టునుగదా ! ఇట్టివాడెట్లు భక్తుడగును ? అను ప్రశ్నకుత్తరమొసంగుచున్నాడు.

31. శ్లో. క్షిప్రం భవతి ధర్మాత్మా । శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి
కౌన్తేయ ! ప్రతిజానీహి । న మే భక్తః ప్రణశ్యతి॥

అర్థము :— క్షిప్రం = వెంటనే, ధర్మాత్మా = భజనతత్పరుడు, భవతి = అగుచున్నాడు, శశ్వత్ శాన్తిం = పునరావృత్తిని రానీయని దురాచారనివృత్తిని, నిగచ్ఛతి పొందుచున్నాడు, కౌన్తేయ ! = అర్జునా ! మే = నాయొక్క, భక్తః = భక్తుడు, న ప్రణశ్యతి = నాశమునొందడు (ఇతి = అని), ప్రతిజానీహి = ప్రతిజ్ఞచేయుము.

తా॥ అట్టి దురాచారుడైనను నాయందలి భక్తిమహిమచే వెంటనే భజనతత్పరుడగుచున్నాడు. ఇక నన్ను పొందనీయక ఆటంకపరచు దురాచార మడుగంటిపోవును. ఇట్లు నాభక్తి నారంభించు నరుడెన్నటికిని చెడడని నీవు నిర్భయముగ ప్రతిజ్ఞ చేయుము.

అవ. ఆగంతుక పాపశీలులగు భక్తుల స్థితిని చెప్పి నీచులగు సహజపాపశీలురే తరించుచుండగ, జాత్యాదులచే నధికులును పుష్కలభక్తియుతులును నగు మానవులు తరించుటకేమి యాటంకమనుచున్నాడు.

32. శ్లో. మాం హి పార్థ! వ్యపాశ్రిత్య । యేఽపిస్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా । స్తేఽపియాన్తి పరాంగతిమ్॥

అర్థము :– పార్థ = అర్జునా ; యే = ఎవరు, పాపయోనయఃఅపి = పాపజన్ములును, స్యుః = అగుదురో, (తే = ఆ), స్త్రియః = స్త్రీలు, వైశ్యాః = వైశ్యులు, తథా = అట్లే, శూద్రాఃఅపి = శూద్రులున్ను, మాం = నన్ను, వ్యపాశ్రిత్య = ఆశ్రయించి, పరాంగతిం = ఉత్తమమగు మోక్షపదవిని, యాన్తిహి = పొందుచున్నారుగదా ;

తా॥ కర్మకు యోగ్యతలేని స్త్రీలు, యాగమున కర్హతలేని వైశ్యులు, వేదాధ్యయమున కనర్హులగు శూద్రులు సహజమగు నీచజన్మ కలవారైనను నాభక్తులగుదురేని ఉత్తమమైన మోక్షసౌధము నధిరోహింతురనగా,

33. శ్లో. కింపున ర్బ్రాహ్మణాః పుణ్యాః, భక్తా రాజర్షయ స్తథా
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్॥

అర్థము :– పుణ్యాః = పుణ్యజన్ములును, భక్తాః = భక్తులుననగు, బ్రాహ్మణాః = బ్రాహ్మణులును, రాజర్షయః = ఋషులవంటి క్షత్రియులును, తథా = అట్లు ఉత్తమగతిని పొందుదురని, కింపునః = చెప్పవలయునా ? అనిత్యం = అస్థిరమున్ను, అసుఖం = సుఖశూన్యమున్ను అగు, ఇమం = ఈ, లోకం = లోకమును, ప్రాప్య = పొంది (నీవు), మాం = నన్ను, భజస్వ = భజించుము.

తా॥ పుణ్యజన్మముకలిగి నాయందు భక్తిగల బ్రాహ్మణులును, ఋషులవంటి రాజులును ముక్తిని బడయగలరని వేరుగ జెప్పవలెనా ? కావున నీవును రాజర్షితుల్యుడవై అస్థిరమైన తాపత్రయ తప్తమగు నీ లోకమున వర్తించుచున్నావు గాన నన్ను భజింపుము.

అవ. భక్తి స్వరూపమును నిష్కర్షించుచున్నాడు.

34. శ్లో. మన్మనా భవ మద్భక్తో । మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి యుక్త్వైవ । మాత్మానం మత్పరాయణః॥

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే రాజవిద్యారాజగుహ్య యోగోనామ నవమోఽధ్యాయః

అర్థము:- మన్మనాః = నాయందుంచబడిన మనస్సుకలవాడవు. భవ = అగుము. మద్భక్తః = నాయందత్యంతప్రీతికలవాడవు. (భవ = అగుము) మద్యాజీ = నన్ను పూజించువాడవు. (భవ = అగుము) మాం = నన్ను. నమస్కురు = నమస్కరించుము. మత్పరాయణః = నన్నే ముఖ్యమైన స్థానముగా గలవాడవై. ఏవం = ఇట్లు. ఆత్మానం = మనస్సును (ప్రాప్య = పొంది) మాం ఏవ = నన్నే. ఏష్యసి = పొందగలవు.

తా॥ నన్ను ధ్యానింపుము. ఆ ధ్యానమును అత్యంత ప్రేమతో చేయుము. దానికి అంగముగా నా పూజలు సల్పుము. నాకు నమస్కరింపుము. నన్నే ఆశ్రయముగా కలవాడవై నన్ననుభవించుటకు సమర్థమగు మనస్సును పొంది నన్ను పొందగలవు.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన శ్రీభగవద్గీత యందలి రాజవిద్యా రాజగుహ్య యోగమనెడు తొమ్మిదవ అధ్యాయము.

ఈ అధ్యాయమందలి శ్లోకముల సంఖ్య 34.
ఇప్పటికి మొత్తము అయిన శ్లోకముల సంఖ్య 371.

## దశమాధ్యాయార్థ సంగ్రహము

శ్లో. స్వకల్యాణ గుణానన్త్య । కృత్స్నస్వాధీనతామతిః
భక్త్యుత్పత్తి వివృత్త్యర్థా । విస్తీర్ణా దశమోదితా॥

అర్థము :- భక్త్యుత్పత్తి వివృద్ధ్యర్థా = భక్తిజనించి వృద్ధిపొందుటకైన, స్వకల్యాణ గుణానన్త్యకృత్స్న స్వాధీనతామతిః — స్వకల్యాణ గుణానన్త్య = భగవంతుని కల్యాణగుణములు అనంతములుగాను, కృత్స్నస్వాధీనతా మతిః = సమస్త జగత్తుయొక్క స్వరూపస్థితి ప్రవృత్తులు భగవంతున కధీనమైన విగాను ఉన్నవనెడుబుద్ధి, విస్తీర్ణ = సవిస్తరముగ, దశమోదితా = పదియవ యధ్యాయమున చెప్పబడినది.

శ్రీ భగవద్గీత - దశమాధ్యాయము

# విషయసూచిక



శ్లోక సంఖ్య.





శ్రీ హయగ్రీవాయ నమః



# ప్రచారవిభాగము

# శ్రీ జియ్యరుస్వామివారి - శ్రీరంగయాత్ర

## శ్రీ వాసుదాసాశ్రమము

శ్రీ జియ్యరు స్వామివారు 27-6-59 వ తేది ఉదయము శ్రీవాసుదాసాశ్రమమునుండి శిష్యగణముతోను మరికొంత పరివారముతోను శ్రీరంగయాత్రకుగా బయలుదేరిరి.

ఇటీవల శ్రీరంగములో పెరియపెరుమాళ్లకు సంభవించిన ఆపదకు శ్రీస్వామివారి హృదయము ఆవేదనతో నిండిపోయినది. ఈ వార్త హైదరాబాదులో ఉండగా తెలిసికొనుట తటాది శ్రీస్వామివారికి శ్రీరంగనాథుని ఎప్పుడెప్పుడు పోయి సేవింతుమాయని మహా ఆరాటపడుచుండెడివారు. అప్పటికే యింతకాలము క్రమించిపోయినను శ్రీరంగములో పెరియపెరుమాళ్ల సేవ లభించుటలేదని తెలిసినది. ఇంతలో శ్రీరంగనాథుని మహాసంప్రోక్షణోత్సవము 12-7-59 వ తేదియని తెలిసినది. హైదరాబాద్ నుండి బొంబాయి మీదుగా బదరికి బయలుదేరవలసిన వారు శ్రీరంగయాత్రకుగా మరల మద్రాసు వైపునకు వేంచేయసాగిరి. నైజాం ప్రాంతములో గ్రామైకరాత్రముగా పర్యటించి శ్రీవాసుదాసాశ్రమమునకు వేంచేసి అచ్చట జ్యేష్ఠమాస పండిత సభలు జరిపి క్రొత్తగా కోదండరామస్వామివారి సన్నిధిలో శ్రీగోదాదేవిని ప్రతిష్ఠించి ఆశ్రమమునుండి బయలుదేరిరి.

### చుండూరు

చుండూరు గ్రామమునకు వేంచేయగానే అచ్చట గ్రామప్రముఖులు, భక్తులు, స్త్రీలు, పురుషులు అందరు అత్యంతభక్తి విశ్వాసములతో స్వాగతమిచ్చి పాదపూజలు గావించిరి ఒకగంటమాత్రమే యచ్చుండి మరల బయలుదేరి మధ్యాహ్నము 11 గంటలకు

### కొర్నిపాడు

కొర్నిపాడు గ్రామమునకు వేంచేసిరి. అచ్చట శ్రీమాన్ అకలంకం వెంకటరంగాచార్యస్వామివారు, శ్రీ రామానుజదాసుగారు ఇత్యాది మరికొంతమంది భక్తులు శ్రీస్వామివారికి భజంత్రీమేళములతోను, స్వస్తివాచకములతోను, హరేరామ నామానుసంధానములతోను, గొప్పస్వాగతమిచ్చిరి. ఆనాడు సాయంత్రము, ఆలయమున గొప్పసభ జరిగెను. ఆసభకు గ్రామములోనున్న ఆబాలగోపాలము స్త్రీలు, పురుషులు అందరు విచ్చేసిరి. ఆనాడు శ్రీస్వామివారు అర్థపంచకమునుగురించి చాలా సులభశైలిలో ఉపన్యసించిరి. మరునాడు ఉదయము గ్రామములో బదరీభిక్షా కార్యక్రమము మహావైభవముగా జరిగినది. మధ్యాహ్నం అక్కడనుండి శ్రీస్వామివారు బయలుదేరిరి. 2 మైళ్లవరకు కొర్నిపాడు గ్రామ ప్రముఖులందరు శ్రీస్వామివారిని సాగనంపిరి. వారి భక్తివిశ్వాసములు మనసున కెంతయో ఆనందము కలిగించినవి. కొర్నిపాడునుండి బయలుదేరి రాత్రి గం. 9 లకు

### ఒంగోలు

ఒంగోలు గ్రామమునకు వేంచేసిరి. ఇచ్చట స్థానికులగు భక్తులందరు క్రొత్తగా శ్రీరామానుజ కూటమును నిర్మింపదలచి యున్నారనియు, సన్నిధిని దివ్యస్థలముగా చేయ సంకల్పించియున్నారని తెలిసికొని శ్రీ స్వామివారు ఒంగోలుకు వేంచేసిరి. వారు చేయు సత్కార్యమునకు మంగళాశాసనము చేసి యీ మహా కైంకర్యమునకు అందరు

తోడ్పడవలసినదిగా సలహానిచ్చిరి. ఇక్కడయున్న 3 రోజులు శ్రీ కవిగారున్ను, శ్రీ స్వామివారున్ను ఆధ్యాత్మిక విషయములను గురించి యుపన్యసించిరి. ఒకనాడు శ్రీ కవిగారు (శ్రీ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులు వారు) క్రొత్తపట్నం వేంచేసి అక్కడ శ్రీ రాజగోపాలస్వామివారి సన్నిధిలో ప్రపత్తివైభవమునుగురించి యుపన్యసించిరి. ఒకనాడు శ్రీ స్వామివారు తమపరివారముతో త్రోవగుంట వేంచేయగా అచట శ్రీమాన్ ఉత్పల వెంకట అప్పలాచార్యులుగారు శ్రీ స్వామివారిని సగౌరవముగా సత్కరించిరి. ఒంగోలునుండి మధ్యాహ్నము బయలుదేరి రాత్రి గం. 9 లకు

## మద్రాసు

మద్రాసు గీతామందిరమునకు వేంచేసిరి. అంతవరకు శ్రీ స్వామివారి రాకకు నిరీక్షించుచు శ్రీ మహిళా మండలివారు స్థానికులగు వర్తకప్రముఖులు వేంచేసిన పిమ్మట పూర్ణకుంభములో స్వాగత సత్కారములు గావించిరి. మద్రాసులో 4 దినములుండి తిరువాయ్‌మొళ్ళిలో 7 వ పత్తు కాలక్షేపము సాయించిరి. ఇంతలో శ్రీరంగమున మహా సంప్రోక్షణము 6-7-59 వ తేది ప్రారంభము కానున్నదని 5 తేది సాయంకాలము మద్రాసులో బయలుదేరి రాత్రికి 8 గంటలకు

## మధురాంతకం

మధురాంతకమను దివ్యసన్నిధి వేంచేసిరి. మధురాంతక గ్రామములో పరమ విలక్షణమైన సన్నిధి యున్నది. ఆసన్నిధిలో మూలవరులు సీతారాములు. ఆ మిథునసేవ మిక్కిలి భోగ్యముగానున్నది. శ్రీ సీతాపిరాట్టి తమ తిరుహస్తముతో శ్రీ చక్రవర్తి తీరుమషున్ యొక్క శ్రీహస్తమును సుకుమారముగా పట్టుకొనియుండెను. ఉత్సవమూర్తులు శ్రీ కరుణాకరస్వామి అచట పిదప ఆడయవరుల సన్నిధిని సేవించితిమి. అచ్చట శ్రీ రామానుజులు గృహస్థాశ్రమములో నుండగా యాగ్రామమునకు వేంచేసి ఈ గ్రామ చెరువుగట్టుపై మహాపూర్ణులవలన తప్తచక్రాంకనపరులైరి. గనుక ఆస్వేత వస్త్రములలోనే ఇచ్చట సేవ సాయించుచున్నారు. ఆ మహాపూర్ణుల వారి తిరువారాధన దైవమగు శ్రీకణ్ణన్ మరియు వారు సాయించిన శంఖచక్రములు యిపుడచ్చట సేవ సాయించుచున్నారు. ఆ సేవను మనసార అనుభవించి అప్పుడే అక్కడనుండి బయలుదేరి మరునాడుదయం 9 గంటలకు

## శ్రీరంగము

శ్రీరంగమునకు చేరుకొంటిమి. అక్కడ విజయవాడ వాస్తవ్యులగు శ్రీమాన్ శివకోటి లక్ష్మీనరసింహం గారనెడు యొకవైశ్యశిఖామణి తూర్పు ఉత్తర వీధిలో ఒక రామానుజకూటమును నిర్మించెను. అందే మనజీయ్యరు స్వామివారు బసచేసిరి. 5 వ తేదీనాటికే మహాసంప్రోక్షణ కార్యక్రమ మారంభమైనది. దేశదేశములనుండి విద్వాంసులు, ఉభయవేదాంత పండితులు నారాయణ ప్రబంధవేత్తలు, కవులు, గాయకులు, అరియర్లు ఇత్యాది మహాభక్తులందరు స్త్రీలు, పురుషులు, బాలురు అందరు శ్రీరంగమునిండ నిండిపోయిరి. ఇందులో ఆశ్చర్యమేమున్నది. ఇటీవల శ్రీరంగములో పెరియ పెరుమాళ్ళకు జరిగిన విపత్తు సామాన్యమా! హృదయమున్న ప్రతివ్యక్తికి యీ విపద్వార్త విన్నచో మనస్థిమితముండునా? లోకమున ఒక సామాన్యుడైన దేహబంధువునకు ఎక్కడో కాలిలో ముల్లుగ్రుచ్చుకొన్నదన్నవార్త చెవిసోకగానే ఎక్కడివక్కడ పారవైచి డబ్బులేకున్న మాంగల్యమైనను తనకాపెట్టి పరువులెత్తమా? అంతశ్రమ ఎందుకొరకు? ప్రాకృత స్వల్పవిషయములోనే యిట్లుండగా సాక్షాత్తు బ్రహ్మచేత నారాధింపబడి ఇక్ష్వాకులనాటినుండి రాజర్షులచే పూజింపబడి రామావతారమున తనచేతనే ఆరాధితుడై మనకాత్మబంధువు శ్రియఃపతి శ్రీరంగనాథుడు, తల్లి, తండ్రి, గురువు, దైవము, తోడు, నీడ, రక్షకుడు, జ్ఞేయుడు, జ్ఞాత, మన ఆళ్వారాచార్యులందఱు ఈడుపడిపల్లాండు పాడిన దివ్యమంగళ విగ్రహముగల స్వామి సర్వేశ్వరుడు. సర్వనియంత ఇంతఘోరమైన అగ్నిపాలయ్యెనే ఎంతఆర్తితో ఈవార్తవిన్న పరువులెత్తవలెను. మన మనసు పాషాణముకనుక కరగలేదు.

ఇంతఆపదరేని తనకాత్మస్థానీయుడైన జ్ఞానికిసంభవించిన ఆ శ్రియఃపతి వినియూరకుండునా గజేంద్రాళ్వార్ కుగలిగిన ఆపదకు అల్లాడిపోయి సిరికిచెప్పక, శంఖుచక్రములుధరింపక గరుడాళ్వార్ వేగముచాలదని తనంతతానుగా పరుగుపరుగునవేంచేసి "భగవత్స్వరాయైనమః అనునటుల వేంచేసి ఆరొయ్యా మొసలి నిన్నంతబాధ

పెట్టినాయని గజేంద్రుని పాదమును తనతిరుహస్తములతో నెత్తిపట్టుకొని తనపీతాంబరమును ప్రసరించి అపాటి మునకు చుట్టికోటిపెగతో అవిరిపట్టుచు ఎంత యుపచారము చేసెను. మనము కృతఘ్నులము శ్రియఃపతి మనకు చేయుచున్న యుపకారమును ఒక్కటికూడ స్మృతికి తెచ్చుకొనము. భగవంతుడు ప్రత్యక్షమైనను నీవుమావంటి మనుష్యుడవేగదాయని యవమానింతుము. ఔరాబద్ధాత్ములకున్న ప్రారబ్ధకర్మము అందరికుండదు. మనుష్యాణాం సహస్రేషు ఎవడో ఒకమహానుభావుడుండును. ఒకదివ్యదేశములో పూర్వము మతకలహములచే ఆలయమునకు అగ్నితగిలించిరి. ఆ అగ్నిక్రమక్రమముగా పెరుమాళ్ళకు తాయారుకుసోకి భగభగమండసాగెను. ఇంతలో అభయానక దృశ్యమునుచూచి భరించజాలక ఒకస్వామి అయ్యోయని ఏడ్చుచు ఆ అర్చామూర్తికి అగ్నిసోకకుండగ కౌగలించు కొనెనట. అదిచూచి ఆయనభార్యయు అవిగ్రహమును కవుగలించుకొనెను, ఇదిచూచి వారికుమార్తె పదియేండ్ల ఈడుగలపిల్ల ఆవిగ్రమువొకచో కవులగించుకొనెను. కానిపాపమాపిల్ల ఆఅగ్నితాపమునకు తట్టుకొనలేకనాన్నా! మంటగానున్నదని కేకవేసెను. అమ్మా! ఒక్కక్షణమువోర్చుకొనుము. నీకు చల్లనినీటిలో (అనగా విరజానదిలో) స్నానము లభించునని తండ్రిసమాధానముచెప్పెను. అంతేపెరుమాళ్ళనిమిత్తమై ఆకుటుంబ మాహుతి యయ్యెను. తనకైంకర్యములో దెబ్బతిన్నదనియేగదా శ్రీరామచంద్రమూర్తి జటాయువునకు తనచేతులమీద అగ్నిసంస్కా-రమును బహ్మమెధవిధిచే నాచరించి ఉత్తమలోకమునకుపొమ్మని అజ్ఞనిచ్చెను. కర్మజ్ఞాననిష్ఠాగరిష్ఠులు ఎంత గిలగిల కొట్టుకొన్నను కైంకర్యపరులకుసాటిగారు. కనుకనే మనసంప్రదాయములో కర్మలన్నియు కైంకర్యపరంగా అన్వయించిరి. ఒకరాత్రిలేదుపగలులేదుఎప్పుడుస్నానపానములు చేయుచుకోప్రజలందరుఎప్పుడుచూచినసన్నిధిప్రాకారములో కిటకిటలాడుచు నిండియుండిరి. మహాసంప్రోక్షణోత్సవ కార్యక్రమము అగ్నిప్రతిష్ఠాపన, తిరుమంజనోత్సవములు, ప్రతిదినముప్రాతస్సాయములందు జరుగుచుండెడివి. ప్రతిదినము పండితులఉపన్యాసములు అవకాశమునుపట్టి జరుగుచుండెడివి. 10-7-59 వ తేదీనాడు సహస్రకలశాభిషేకోత్సవము పరమవిలక్షణముగా జరిగినది. 12 వ తేదీ నాడు విమానసంప్రోక్షణయు, మూలవరులసంప్రోక్షణయు, కుంభాభిషేక కళావాహనమున్ను మహావైభవముగా జరిగినది. ఆనాటినుండి మూలవరులసేవకు ప్రజలనువిడిచిపెట్టిరి. సాయంకాలము నాలాయిర పారాయణపరులకు సన్మానములుజరిగెను. వీరిలో 80 మందికి మాత్రమే దేవస్థానంవారు సన్మానించిరి. మిగతావారికి నామకమాత్రమే సత్కరించగా శ్రీమాన్ మహావిద్వాన్ప్ర అణ్ణంగరాచార్యస్వామివారు మన శ్రీజియ్యర్ స్వామివారు స్వహస్త పరహస్తములద్వారా విరాళములసేకరించి పైవారినందరిని చక్కగాసన్మానించిరి.

కొన్నివేలసంవత్సరములనుండియు వరుసగా చేయబడియున్న ఎణ్ణెక్కాప్పయంతయు పూర్తిగాపోవుటచే పెరియపెరుమాళ్లుయిపుడు పరిపూర్ణ యవయవసౌష్ఠవముతో మహాతేజోవంతులై విరాజిల్లుచు సేవసాయించుచున్నారు. ఆదిశేషులకు సువర్ణశిరస్సులు, తిరుమేనకంతకును రజితకవచము తయారుచేసి యలంకరించిరి. మొత్తము ఈదేవస్థానమునగల మంటపములన్నియును మరమ్మత్తులుచేయబడి శుభ్రపరచబడెను. పాత్రలు - సామగ్రులు యన్నియునుకూడ శుభ్రపరచి మెరుగులుపెట్టబడినవి. ఈవిషాదసంఘటన మోవిధముగా సుఖాంతముగా సంభవించి, తిర్గి పెరియపెరుమాళ్లను భాగవతగోష్ఠీపురస్సరముగా సందర్శించుకొనగల భాగ్యము మనకు గలిగినది.

“నతేరూపం నచాకారో నాయుధాని నచాస్పదం” అను సర్వేశ్వరునికేయర్చారూపము - ఈయలంకారములు ఇత్యాదులన్నియు మనభక్తిశ్రద్ధాకార్యము లేకదా. తమరుగందదు ఎవ్వురువం అవ్వురువం తానేఆయ్. అనినటుల మన మొకరూపమునుకోరిన ఆరూపమునే తానుధరించును. మనము ముత్యాలంగి,సువర్ణాంగుల సమర్పించినచో వానినే ఆయన భక్త్యుపహృతం అని ధరించును. ఇపుడు అస్మదాదులు, అధర్మము- అవినీతి- అనాచారము అను పాపాగ్నిని సమర్పించుటచే అపారకృపాపారీణుడగు పెరియపెరుమాళ్లు వానినే ఈసంఘటనద్వారా స్వీకరించెను కాబోలు-స్వామీ ఇకనైనను మమ్ములను పునీతులుగజేసి నీపరమ కృపాకటాక్షపాత్రులుగ జేయుమాయని శ్రీరంగనాయకి పురుషకారపురస్సరముగ ఎంబెరుమానార్ ఘటకత్వపురస్సరముగ పెరియపెరుమాళ్ళను క్షమార్పణవేడుకొని తనివితీర సేవించుకొంటిమి.

## తిరుమాలిరం శోలైమలై క్షేత్రము

శ్రీరంగమునుండి మనశ్రీజియ్యర్ స్వామివారు తమపరివారముతో బయలుదేరి సాయంకాలమునకు తిరుమాలిరం శోలైమలై క్షేత్రమునకు చేరుకొనిరి. ఈసన్నిధివైభవము వాచామగోచరము. ఇచ్చట శ్రీసుందరస్వామి పరమవిలక్షణముగా వేంచేసి యున్నారు. శ్రీకూరత్తాళ్వార్ ఈ సన్నిధిలో కొన్నిదినములు వేంచేసియుండి శ్రీ సుందరబాహుస్వామినిగురించి సుందరముగా నొకస్తోత్రమును రచించియున్నారు. ఇచ్చట పెరుమాళ్ళకు ప్రతి

నిత్యము కొండమీద రెండుమైళ్ళదూరమునుండి గంగతీర్థము తెచ్చి నిత్యస్నానగావింతురు. మేమారాత్రి పెరుమాళ్ళనుసేవించి తృప్తితీరక యారాత్రియందేయుండి మరునాడుప్రాతఃకాలము రెండుమైళ్ళుకొండపైకెక్కి గంగధారలోస్నానమాడితిమి. శ్రీ జియ్యరుస్వామివారు అందే అనుష్ఠానము గావించుకొని సహస్రనామపారాయణతో కొండదిగివచ్చి మరలమరియొకసారి మనసార సుందరబాహుస్వామిని సేవించుకొని రాత్రి 8 లకు

## వానమామలై

శ్రీవానమామలై దివ్యదేశమునకు వేంచేసిరి. ఆనాటిరాత్రి శ్రీశ్రీశ్రీ తోతాద్రిరామానుజ జీయరుస్వామిని సేవించిరి వారితో బదరీలో మనఅష్టాక్షరీక్షేత్ర సంస్థకు శాశ్వతధర్మాధ్యక్ష పదవికి వంశపరాధర్మకర్త పదవిని నిర్వహించవలసినదని మనశ్రీజియ్యరుస్వామివారు కోరగా వారు మహోత్సాహముతో స్వహస్తలిఖిత పూర్వకముగా ఆమోదపత్రము నొసంగిరి మరునాడుదయము సన్నిధిలో స్వామిని సేవించితిమి. సన్నిధి సమావేశము సాక్షాత్పరమపదమువలె నున్నది. ఇచ్చట మూలవరులు శ్రీ తోతాద్రి స్వామివారు ఉభయదేవులతో పరమ భోగ్యముగా సేవసాయించుచున్నారు. ఉత్సవములు శ్రీదేవనాయక స్వామివారు ఇచ్చట శ్రీదేవి తిరునామము శ్రీ వరమంగై యని వ్యవహరింతురు ఇచ్చట ప్రతినిత్యము నూనెపరులకు తైలముతో తిరుమంజనము జరుగును. ఈ సేవనంతయు సేవించుకొని మధ్యాహ్నము బయలుదేరి

## తిరుక్కురుంగుడి

తిరుక్కురుంగుడి దివ్యదేశమును సేవించితిమి. ఇచ్చటనే కైశికమంటపమున్నది. సన్నిధిలో తిరుక్కురుంగుడి నంబి సేవచేసుకొని సన్నిధికి ఒక మైలుదూరములోనున్న సావేరులో స్నానమాడి మన శ్రీ జియ్యర్ స్వామివారు అందే యనుష్ఠానము గావించుకొనిరి. పూర్వమిదే శ్రీ భగవద్రామానుజులువారు అనుష్ఠానము గావించుకొన్న స్థలమని తెలియజేసిరి. సన్నిధియొద్ద శ్రీ జియ్యరు స్వామివారొకరు వేంచేసియుండిరి. వారిని సేవించుకొని మరునాడు ఉదయం 8 గంటలకు

## ఆళ్వార్ తిరునగరి

ఆళ్వార్ తిరునగరి యను దివ్యదేశమును సేవించితిమి. ఇచ్చట తామ్రపర్ణినది శ్రీహరిపదతీ దయాప్రవాహము వలె ప్రవహించుచున్నది. శ్రీ జియ్యరు స్వామివారీనదిలో స్నానమాడి అనుష్ఠానము గావించుకొని తొలుత శ్రీ నమ్మాళ్వార్లను సేవించి పిదప శ్రీ ఆదినారాయణ స్వామివారిని సేవించిరి. ఆనాడు శ్రీ నమ్మాళ్వార్లు వేంచేసిన తింత్రిణీ వృక్షమీనాటివరకు సేవ సాయించుచు నేయున్నది. ఇచ్చటయున్న ఉడయవరుల సన్నిధిని సేవించితిమి. ఇచ్చటున్న శ్రీ రామానుజులువారు భవిష్యదాచార్యులని చెప్పిరి. వారు ధరించినవి శ్వేతవస్త్రములే. కాని త్రిదండమున్నది. ఇచ్చటయొక జియ్యరుస్వామివారుండిరి వారిని సేవించి సాయంకాలము 5 గంటలకు

## శ్రీవిల్లిపుత్తూర్

శ్రీ విల్లిపుత్తూర్ దివ్యదేశమునకు చేరితిమి. మన జియ్యరుస్వామివారు ఆండాళ్ తల్లి యవతరించిన శ్రీ తులసీవనమందు స్నాన సంధ్యావందనానుష్ఠానములు గావించుకొని శ్రీ వటపత్రశాయి సన్నిధి పెరుమాళ్ళను శ్రీ గోదారంగమన్నారుల సన్నిధిని శ్రీ పెరియాళ్వార్ల సన్నిధిని సేవించిరి. ఆనాడు పెరియాళ్వార్ తిరునక్షత్రము జరుగుసందర్భమగుట వీధిలో పురప్పాట్టు జరుగుచున్నది. ఆ విలక్షణ గోష్ఠిలో గంటన్నరకాలము మన స్వామివారు అన్వయించిరి. ఆరాత్రి యిచ్చట సన్నిధిలో భగవత్ప్రసాదమును స్వీకరించి మరునాడుదయమునకు

## తిరుక్కోటియూర్

తిరుక్కోటియూర్ అను దివ్యదేశమున కేగిరి. ఇచ్చట సన్నిధిలో శ్రీ సౌమ్యనారాయణస్వామిని ఉపేంద్ర స్వామిని పరవాసుదేవస్వామిని తాయార్లను సేవించుకొని తిరుక్కోటియూరు నంబిసన్నిధిని సేవించిరి. ఈ సన్నిధి గోపురమందేనిలచి శ్రీ భగవద్రామానుజులు మంత్రార్థమును వెదజల్లిరి. తదర్థసూచకముగా సన్నిధి గోపురమందు శ్రీ రామానుజులు వేంచేసియుండిరి. ఇచ్చట మధ్యాహ్నిక తిరువారాధన ముగించుకొని మరునాడుదయమునకు శ్రీరంగమునకు చేరుకొంటిమి. శ్రీరంగములో మరల శ్రీరంగనాథుని సేవించుకొని మూడవనాటిరాత్రికి

## మద్రాసు

మద్రాసు చేరుకొంటిమి. మద్రాసుచేరిన మరునాడు శ్రీ స్వామివారు విమానములో ఢిల్లీకి వేంచేసిరి.

నిత్యము కొండమీద రెండుమైళ్ళదూరమునుండి గంగతీర్థము తెచ్చి నిత్యార్చనగావింతురు. మేమారాత్రి పెరుమాళ్ళనుసేవించి తృప్తితీరక యారాత్రియందేయుండి మరునాడుప్రాతఃకాలము రెండుమైళ్లుకొండపైకెక్కి గంగధారలోస్నానమాడితిమి. శ్రీ జియ్యరుస్వామివారు అందే అనుష్ఠానము గావించుకొని సహస్రనామపారాయణతో కొండదిగివచ్చి మరలమరియొకసారి మనసార సుందరాబాహుస్వామిని సేవించుకొని రాత్రి 8 లకు

## వానమామలై!

శ్రీవానమామలై దివ్యదేశమునకు వేంచేసిరి. ఆనాటిరాత్రి శ్రీశ్రీ తోతాద్రిరామానుజ జీయరుస్వామిని సేవించిరి వారితో బదరీలో మనఅష్టాక్షరీక్షేత్ర సంస్థకు శాశ్వతధర్మాధ్యక్ష పదవికి వంశపరాధర్మకర్త పదవిని నిర్వహించ వలసినదని మనశ్రీజియ్యరుస్వామివారు కోరగా వారు మహానందముతో స్వహస్తలిఖిత పూర్వకముగా ఆమోదపత్రిము నొసంగిరి మరునా డుదయము సన్నిధిలో స్వామిని సేవించితిమి. సన్నిధి సమావేశము సాక్షాత్పరమపదమువలె నున్నది. ఇచ్చట మూలవరులు శ్రీ తోతాద్రి స్వామివారు ఆభూదేవులతో పరమ భోగ్యముగా సేవసాయించుచున్నారు. ఉత్సవములు శ్రీదేవనాయక స్వామివారు ఇచ్చట శ్రీదేవి తిరునామము శ్రీ వరమంగై యని వ్యవహరింతురు ఇచ్చట ప్రతినిత్యము మూలవరులకు తైలముతో తిరువంజనము జరుగును. ఈ సేవనంతయు సేవించుకొని మధ్యాహ్నము బయలుదేరి

## తిరుక్కురుంగుడి

తిరుక్కురుంగుడి దివ్యదేశమును సేవించితిమి. ఇచ్చటనే కైశికమంటపమున్నది. సన్నిధిలో తిరుక్కురుంగుడి నంబి సేవచేసుకొని సన్నిధికి ఒక మైలుదూరములోనున్న పాలేరులో స్నానమాడి మన శ్రీ జియ్యర్ స్వామివారు అందే యనుష్ఠానము గావించుకొనిరి. పూర్వమిదే శ్రీ భగవద్రామానుజులువారు అనుష్ఠానము గావించుకొన్న స్థలమని తెలియజేసిరి. సన్నిధియొద్ద శ్రీ జియ్యరు స్వామివారొకరు వేంచేసియుండిరి. వారిని సేవించుకొని మరునాడు ఉదయం 8 గంటలకు

## ఆళ్వార్ తిరునగరి

ఆళ్వార్ తిరునగరి యను దివ్యదేశమును సేవించితిమి. ఇచ్చట తామ్రపర్ణీనది శ్రియఃపతి దయాప్రవాహము వలె ప్రవహించుచున్నది. శ్రీ జియ్యరు స్వామివారీనదిలో స్నానమాడి అనుష్ఠానము గావించుకొని తొలుత శ్రీ నమ్మాళ్వార్లను సేవించి పిదప శ్రీ ఆదినారాయణ స్వామివారిని సేవించిరి. ఆనాడు శ్రీ నమ్మాళ్వార్లు వేంచేసిన తింత్రిణీ వృక్షమీనాటివరకు సేవ సాయించుచున్నది. ఇచ్చటయున్న ఉడయవరుల సన్నిధిని సేవించితిమి. అచ్చటున్న శ్రీ రామానుజులువారు భవిష్యదాచార్యులని చెప్పిరి. వారు ధరించినవి శ్వేతవస్త్రములే. కాని త్రిదండమున్నది. ఇచ్చటయొక జియ్యరుస్వామివారుండిరి. వారిని సేవించి సాయంకాలము 5 గంటలకు

## శ్రీవిల్లిభుత్తూర్

శ్రీ విల్లిభుత్తూర్ దివ్యదేశమునకు చేరితిమి. మన జియ్యరుస్వామివారు ఆండాళ్ తల్లి యవతరించిన శ్రీ తులసీవనమందు స్నాన సంధ్యావందనానుష్ఠానములు గావించుకొని శ్రీ వటపత్రశాయి సన్నిధి పెరుమాళ్ళను శ్రీ గోదారంగమన్నారుల సన్నిధిని శ్రీ పెరియాళ్వార్ల సన్నిధిని సేవించిరి. ఆనాడు పెరియాళ్వార్ తిరునక్షత్రము జరుగుసందర్భమగుట వీధిలో పురప్పాట్టు జరుగుచున్నది. ఆ విలక్షణ గోష్ఠిలో గంటన్నరకాలము మన స్వామివారు అన్వయించిరి. ఆరాత్రి యిచ్చట సన్నిధిలో భగవత్ప్రసాదము స్వీకరించి మరునాడుదయమునకు

## తిరుక్కోటియూర్

తిరుక్కోటియూర్ అను దివ్యదేశమున కేగిరి. ఇచ్చట సన్నిధిలో శ్రీ సౌమ్యనారాయణస్వామిని ఉపేంద్ర స్వామిని పరవాసుదేవస్వామిని తాయార్లను సేవించుకొని తిరుక్కోటియూరు నంబిసన్నిధిని సేవించిరి. ఈ సన్నిధి గోపురమందేనిలచి శ్రీ భగవద్రామానుజులు మంత్రార్థమును వెదజల్లిరి. తదర్థసూచకముగా సన్నిధి గోపురమందు శ్రీ రామానుజులు వేంచేసియుండిరి. ఇచ్చట మధ్యాహ్నిక తిరువారాధన ముగించుకొని మరునాడుదయమునకు శ్రీరంగమునకు చేరుకొంటిమి. శ్రీరంగములో మరల శ్రీరంగనాథుని సేవించుకొని మూడవనాటిరాత్రికి

## మద్రాసు

మద్రాసు చేరుకొంటిమి. మద్రాసుచేరిన మరునాడు శ్రీ స్వామివారు విమానములో ఢిల్లీకి వేంచేసిరి.

## బదరీ శ్రీనివాస, రామానుజ స్వామివారల కైంకర్య కాత్యానిక.

## పూజా విరాళములు.

శ్రీ కాకినాడ వాస్తవ్యురాలగు శ్రీమతి దామెర భావాయమ్మగారు బదరీ అష్టాక్షరీ క్షేత్రరామానుజ కూటములో ఒక గది కట్టించుటకు గాను లోగడ రు 2000/లుగాక మరల పంపిన విరాళం - రు 1500

శ్రీ మద్రాసు వాస్తవ్యులగు శ్రీ కోటా శ్రీనివాసయ్య గారు బదరీ అష్టాక్షరీ రామానుజ కూటములో ఒక గది కట్టించుటకు గాను మరల పంపిన విరాళం - రు 700

కోరుకొండ వాస్తవ్యులగు శ్రీమాన్ మరింగంటి వెంకటాచార్యులుగారు బదరీ అష్టాక్షరీ క్షేత్ర రామానుజ కూటములో గదికట్టించుటకుప్రస్తుతం రు2000/- పంపిరి

పాలకొల్లు వాస్తవ్యురాలగు శ్రీ చక్కా నరసమ్మ గారు బదరీ అష్టాక్షరీ క్షేత్ర రామానుజ కూటములో ఒక గది కట్టించుటకు గాను లోగడ పంపిన రు 1000లు లో గాక మరల పంపిన విరాళం - రు 1000

మద్రాసు వాస్తవ్యురాలగు శ్రీ ఉప్పటూరి శ్రీ దేవమ్మగారు బదరీ అష్టాక్షరీ క్షేత్ర రామానుజ కూటమునకు లోగడ సమర్పించిన రు 2000/లు గాక మరల సమర్పణ రు 500

శ్రీజంబు రెడ్డిరంగారెడ్డి,యతిరాజరెడ్డిగార్లు,కల్వకుర్తి - 29

శ్రీ జి. వెంకయ్యగారు, బల్లవరం 5.

శ్రీ ఈమని అంజిరెడ్డిగారు మరల జమ ఇచ్చినది (చుండూరు)- రు 29/-

శ్రీ రామినేని కృష్ణవేణమ్మగారు. బ్రాహ్మణ కోడూరు 116/-

శ్రీ మన్నవ చిన వెంకయ్యగారు, పుల్లడిగుంట-రు 116/-

శ్రీ వెంపరాల రత్నమ్మగారు. పుల్లడిగుంట- 25/-

శ్రీ మన్నవ ధర్మయ్యగారు. కొర్నెపాడు- 14/-

శ్రీ మన్నవ కృష్ణయ్యగారు కొర్నెపాడు- 29/-

శ్రీ పల్లపోతు గోపయ్యగారి భార్య అంజమ్మ గారు- కొప్పోలు- 29/-

శ్రీ కూరపాటి వెంకటస్వామి దత్తకుమారుడు వీరరాఘవులుగారు- కొప్పోలు 29/-

శ్రీ బెజవాడ రంగయ్యగారి భార్య మంగమ్మ గారు. కొప్పోలు- 29/-

శ్రీ వీరగంధం సుబ్బయ్యగారి భార్య అచ్చమ్మ గారు కొప్పోలు 29/-

శ్రీ రఘురామ అప్పారావుగారు. మద్రాసు- 58/-

శ్రీ చిన్నం అదెమ్మగారు, అత్తమూరు- 5/-

శ్రీ రఘురాం, మద్రాసు- 11/-

శ్రీ కటికేశ్వరపురం వమింపాడుగారు, కీ శే. పార్థసారథికి బదరీలో పిండప్రదానం చేయుటకు పంపినది- 80/-

మద్రాసు వాస్తవ్యులగు శ్రీమాన్ గున్నిలం ఆదినారాయణ,చెంచమ్మగార్లు బదరీ సత్సంగ సదనమునకు రు 1600/లో జమ ఇచ్చినది- 1000/-

శ్రీ మాన్ వ. చ. రఘునాథాచార్యులుగారు, వేణుగోపాల పురం. మరల సత్సంగ సదన నిర్మాణమునకు సమర్పించినది - 400/-

## జీయర్ స్వామివారి సూచన

### శ్రీ యతిరాజ సేవామహిళామండలి శాఖాధ్యక్ష కార్యదర్శినులకు

అమ్మా!

శ్రావణమాసము శ్రీలక్ష్మిపిరాట్టికి చాల ప్రీతికరమైనది- మరియు ఈ మాసము మీప్రచారమును విస్తృతము గావించుటకు అనుకూలమైనకాలము. గాన మీమీ ప్రాంతములో సభ్యురాండ్రందరు జట్టుజట్టులుగ బయలుదేరి యింటింటికివెళ్ళి శ్రీ లక్ష్మీనారాయణ పూజలను చేసుకొనునటులను, శుక్రవారమున అందరు తప్పక ఏకత్రసమావేశమగునటులను స్వయముగ ప్రోత్సహించి, పిలిచి రావలసినది. ప్రతిశాఖాసంఘము - కనీసము ఈ శ్రావణమాసాంతమునకు రెట్టింపు సభ్యురాండ్రతో వైభవముగా కార్యక్రమమును జరుపుకొనుచున్నటుల విని ఆనందింప గోరుచున్నాము. అనేక మంగళాశాసనములు.

శ్రీమన్నారాయణ రామానుజ జీయర్.

విశేషము:-

శ్రీ జీయర్ స్వామివారి సలహానసరించి ఈ శ్రావణమాసాంతములలోపుగ కోరినవారికి శుక్రవారోత్సవ పుస్తకములు, శ్రీలక్ష్మీపతకములు సగము వెలకే ఈయబడును. అనగా శుక్రవారోత్సవ పుస్తకము ఒక్కంటికి ఒక అణాచొప్పునను, శ్రీలక్ష్మీపతకము ఒక్కంటికి నాలుగణాలు మాత్రము చొప్పున ఈయబడును. పోస్టుఖర్చులు తెప్పించుకొనువారే భరించవలెను. ముందుగనే పోస్టుఖర్చులతో సహా సొమ్మును మాకు పంపవలసినది.

మేనేజరు: పుస్తకప్రచురణశాఖ- వాసుదాసాశ్రమం-నడిగడ్డపాలెము. (వయా) చుండూరు, గుంటూరుజిల్లా.

# సాంఘిక వార్తలు

1. మన శ్రీ జియ్యర్ స్వామివారు దక్షిణ దేశయాత్రలు గావించి శ్రీరంగములో శ్రీ రంగనాథుని మహాసంప్రోక్షణోత్సవమును సేవించుకొని తిరిగి మద్రాసు వేంచేసి 15-7-59 వ తేది రాత్రి గం 10-30 నిమిషములకు విమానములో ఢిల్లీకి వేంచేసిరి. అక్కడ ఒకరోజు మాత్రమే ఉండి తరువాత హృషీకేశము మీదుగా బదరీ నారాయణ మునకు వేంచేసిరి.

2. బదరీ నారాయణములో మన సంఘ ప్రధాన కార్యదర్శులగు శ్రీమాన్. తె. కం. గోపాలాచార్య స్వామి వారు త్వరత్వరగా సత్సంగ సదన నిర్మాణమును గావించుచున్నారు. మరియు ఉత్తరదేశీయ విద్యార్థులకు శ్రీ భాష్యం. న్యాయము, పాఠ ప్రవచన గావించుచున్నారు.

3. బదరీ క్షేత్రములో మన సత్సంగ సదన, రామానుజ కూటముల గృహప్రవేశ మహోత్సవము 8-8-59 తేది జరుగనున్నది. అందు నిమిత్తమై 17-7-59 తేదినాడు మనసంఘము తరపున ఒక ల్యారేజి యాత్రికులను తీసుకొని వెళ్లినది. మరల రెండు, మూడు క్యారేజీలు 30-7-59వ తేది బయులు దేరుచున్నవి. మూడవ బండిలో మన సంఘ కవిగారైన శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యుల వారు ప్రతిష్ఠకు కావలసిన పరికరములు తీసుకొని బదరికి బయలు దేరిరి.

## ఏలూరు

ఏలూరులో శ్రీ అండాళ్ సేవాసమితివారు తమసంఘపు ప్రథమవార్షికోత్సవమును వైభవముగా జరిపిరి. ఈ సందర్భములో శ్రీమతి సంకా సీతామహాలక్ష్మమ్మగారు తాము రచించిన శ్రీరామానుజ చరిత్ర కృతిని విన్పించిరి. ఈ సందర్భములో సంఘమునకు రు 5/- లు కట్నముగా సమర్పించిరి.

## మద్రాసు

మద్రాసు గీతామందిరములో శ్రీ యతిరాజ మహిళామండలివారు శ్రీ జియ్యరు స్వామివారికి పాదపూజ గావించి సమర్పించినది. రు 116/-

## శ్రీ రామతీర్థము

ఇచ్చట శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు తమసంఘ ద్వితీయవార్షికోత్సవమును జరిపి మనపత్రికకు రు 3/- లు కట్నము సమర్పించిరి. శ్రీమాన్ ఉ. వే. పండిత తి. ప. రామానుజస్వామివారు లక్ష్మీపూజావైభవమును గురించి యుపన్యసించిరి.

## సంభావనలు

శ్రీ ముడుంబై శింగరాచార్యులుగారు తమకుమారుడు రామలక్ష్మణాచార్యులు పరమపదించినప్పుడు పంపిన సంభావన రు 5/-

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 109 | సమ్మితః | మితత్వాచ్చ తథాభక్తైః ।<br>సమ్మితః పరికీర్తితః । | తన భక్తులచే తాను "మా కేతిలోనివాడే"యని హద్దు పెట్టబడువాడు. |
| 110 | సమః | జ్ఞాతేఽపరిచితే చాపి.<br>సమత్వాత్సమ ఉచ్యతే । | పరిచితులు అపరిచితులను భేదములేక అందరియందును సమముగ నుండువాడు. |
| 111 | అమోఘః | వితథస్పర్శ రహితః ।<br>సహ్యామోఘః ప్రకీర్తితః॥ | 'తననాశ్రయించుట వ్యర్థము' అనెడు గంధమునైనను సహించనివాడు. |
| 112 | పుణ్డరీకాక్షః | పుణ్డరీకం పరం ధామ<br>నిత్యమక్షర మవ్యయమ్ ।<br>తద్గతానా మక్షి భూతః ।<br>పుణ్డరీకాక్ష ఈరితః । | పుండరీకమనగా నాశరహితమై నిత్యమై వికారశూన్యమైయొప్పు పరమపదము, అందున్నవారిని కన్నును రెప్పవలె కాపాడువాడు. |
| 113 | వృషకర్మా | శ్రేయస్కరం ధర్మరూపం ।<br>కర్మయస్య ప్రచక్షతే ।<br>వృషకర్మేతి విఖ్యాతః ।<br>శుభకర్మప్రదో మనుః॥ | భక్తులకు శ్రేయోదాయకమైన ధర్మమనబడు కర్మ కలవాడు. దీనిని 'ఓమ్ వృషకర్మణేనమః' అని మంత్రముగా నాదరించినచో నిది శుభకర్మల నొసంగును. |
| 114 | వృషాకృతిః | ధర్మరూపా కృతిర్యస్య<br>సవృషాకృతి రుచ్యతే ।<br>తాపత్రయాగ్ని దగ్ధానాం<br>సుధేవాత్యన్త శీతలమ్ ।<br>రూపం కర్మచయస్యాస్తి ।<br>వృషకర్మా, వృషాకృతిః । | ధర్మస్వరూపమైన ఆకారము గలవాడు.<br>ఆధ్యాత్మికాధి భౌతికాధి దైవికములనబడు తాపత్రయములచే తపించునట్టి తనభక్తులకమృతమువలె మిక్కిలి చల్లనైన రూపమును, అట్టికర్మలును కలవాడగుటచే వృషకర్మా - వృషాకృతియని చెప్పబడుచున్నాడు. |

| | | | |
|---|---|---|---|
| 115 | రుద్రః । | ఈదృగ్రూపై శ్చేష్టితైశ్చ । భక్తా నానన్దభాష్పయన్ । రోదయన్ రుద్ర ఉద్దిష్టః సర్వసన్తోషదో మతః । | ఇట్టి రూపములచేతను, చేష్టలచేతను తన భక్తులు ఆనంద పరవశులను గావించి కంఠమునుండి ఆనంద బాష్పములు రాలించి ఏడిపించువాడు. దీనిని "ఓమ్ రుద్రాయనమః" అని మంత్రముగా సంస్మరించినచో సకలసంతోషములు నొనగూర్చును. |
| 116 | బహుశిరాః | ఫణాశ్చ బహవోయస్య సవై బహు శిరామతః । | సహస్ర శిరస్సులు కలవాడు. |
| 117 | బభ్రుః | అనన్తరూపో యోధత్తే । పృథ్వీం బభ్రుస్స ఈరితః । | అనంతరూపములను ధరించి భూమినంతయు ధరించువాడు. (ఆదిశేషుని రూపమును ధరించి భూమిని మోయుచుండువాడు. |
| 118 | విశ్వయోనిః | విశ్వేషాం భజతాం స్వేన । విశ్వయోనిస్తు మిశ్రనోత్ । | తనను ఆశ్రయించిన వారినందఱను తనతో సమానమైన రూపమునిచ్చి తనలో చేర్చుకొనువాడు. |
| 119 | శుచిశ్రవాః | భక్తైరుక్తా న్యవశ్యంయ । శృణోతి సశుచిశ్రవాః॥ | భక్తులు భక్తితో విన్నవించుకొను విన్నపములన్నియు తప్పక వినువాడు. |
| 120 | అమృతః | జరామృత్యో ర్వారణేన । హ్యతృప్తే ర్వాపి సేవనాత్ । అమృతస్స్యాన్నిరతిశయ । మాధుర్యేతిచ సర్వదా॥ | తనభక్తులకు ముసలితనమును మృత్యువును బాపి సర్వదా అనుభవించబడుచున్నను తనివితీరక అమృతమువలె నిరతిశయ మాధుర్యముతో నుండువాడు. |
| 121 | శాశ్వత స్థాణుః | భోగ్యో హ్యపునరావృత్త్యా । భోక్తృభ్యో రోచతే యతః । స్వయం నిత్యస్సదా యోஉసౌ. శాశ్వతసాణు రుచ్యతే॥ | శాశ్వతముగా నిత్యముగా నుండువాడుగాన భోక్తలగు నిత్యముక్తులకు అనుభవానంతరము తిరిగి సంసారమునకు రానవసరములేని భోగ్యవస్తువైనవాడు. |

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీ వాసుదాస దేశిక స్వామివారి
## పరమపదోత్సవ ఆహ్వాన పత్రిక

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్‌స్వామివారు అభ్యనుజ్ఞతో స్వస్తిశ్రీ వికారినామ సంవత్సర శ్రావణశుద్ధ ద్వాదశి (15-8-59)శనివారము మొదలు 15, 16, 17 యీమూడు తేదీలలోను (17-8-59 వరకు) వరుసగా శ్రీ వాసుదాస దేశిక స్వామివారి పరమపదోత్సవము తెనాలితాలూకా నడిగడ్డపాలెం శ్రీ వాసుదాసాశ్రమమందు జరుగును గనుక అభిమానులు, శ్రీవారి శిష్యులు అందరు వేంచేయ గోరుచున్నాము.

మరియు పైమూడు రోజులలో శ్రీ వాసుదాసాశ్రమమందలి శ్రీ కోదండ రామ స్వామివారి సన్నిధిలో పవిత్రోత్సవములు జరుగును. కాన ఎల్లరువిచ్చేయ గోరుచున్నాము.

శ్రీ వాసుదాసాశ్రమము
నడిగడ్డపాలెం, తెనాలి తాలూకా.
30—7—59

ఇట్లు
కూనంనేని వెంకటప్పదాసు

---

శ్రీమతే రామానుజాయనమః

## శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజియ్యరుస్వామివారి జయంతి మహోత్సవ
## ఆహ్వాన పత్రిక

స్వస్తిశ్రీ వికారినామ సంవత్సర శ్రావణబహుళ తదియా శుక్రవారం ఉత్తరాభాద్ర నక్షత్రమున శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ శాశ్వతాధ్యక్షులగు శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్‌స్వామివారి జయంతి మహోత్సవములు 21-8-59 ఉదయం గం. 8 లు మొదలు శ్రీ వాసుదాసాశ్రమములో శ్రీ కవిగారి ఆధ్వర్యమున జరుగునుగాన శ్రీవారి శిష్యులు అభిమానులు అందరు విచ్చేయ గోరుచున్నాము.

శ్రీ వాసుదాసాశ్రమము.
నడిగడ్డపాలెం, తెనాలితాలూకా.
30—7—59

ఇట్లు
కూనంనేని వెంకటప్పదాసు

# కీర్తనము (సశేషము)

శ్రీమాన్ ఉ. వే. తే. కం. గోపాలాచార్యులవారు.

శ్లో॥ కలే ర్దోషనిధే రాజ న్నస్తి హ్యేకో మహాన్ గుణః ।
కీర్తనాదేవ కృష్ణస్య ముక్తసఙ్గః పరం వ్రజేత్ ॥
భాగ - 12 - 3 - 51

ఓ రాజా! కలియుగము దోషాకరమైనను దీనియందొక మహా గుణవిశేషము కలదు ఎట్టివాడైనను భక్తితో నోటార కృష్ణా! యన్నచో సంసారబంధము తొలంగి ముక్తిం బొందును. కావుననే నారదపురాణమున -

శ్లో॥ హరే ర్నామ హరే ర్నామ హరే ర్నామైవ కేవలం
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా ॥

కలియుగమున శ్రియఃపతినామమునకు మించిన రక్షణోపాయము లేదు. ఇది ముమ్మాటికిని సత్యము అని చెప్పబడును.

సూ:- ద్రౌపతిక్కు ఆపత్తిలే పుడవై శురన్దదు తిరునామమిరే (శ్రీ వచన భూషణం)

శ్లో॥ 'మహాత్యాపది సమ్ప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరిః ॥

గొప్ప యాపద సంభవించినపుడు భగవంతుని భక్తితో తలంచవలెననుడు వశిష్ఠసూక్తిని స్మరించి సభలో మానభంగముకంటె స్త్రీకి వేరొక గొప్ప యాపద లేదుగాన -

శ్లో॥ శంఖచక్ర గదాపాణే ద్వారకానిలయాచ్యుత ।
గోవిన్ద! పుండరీకాక్ష'

యని యెలుగెత్తి కీర్తించుసరికి వస్త్రములక్షయమై మానసంరక్షణ కలుగలేదా? ఇట్లెన్నియో ఉదాహరణములు గలవు. నారదుడు, వాల్మీకి, శ్రీ శుకులు, ఆళ్వారాదులు అందరు నీ కీర్తనభక్తి కుదాహరణమగుచున్నారు.

## స్మరణము

తాను వినిన భగవంతుని నామరూపగుణ, ప్రభావ, లీలాదుల నొడలెఱుంగని భక్తిపారవశ్యముతో ధృవ, ప్రహ్లాదాదులవలె నందుతన్మయమై నిరంతరము మననముగావించుటయే 'స్మరణ భక్తి' యనబడును.

ఈ స్మరణమును గావించుటకు వీలైనంతవరకు భగవద్గీత 6వ అధ్యాయమున 'శుచౌ దేశే ప్రతిష్ఠాప్య' ఇత్యాది శ్లోకములలో చెప్పబడినటుల ఏకాంతమగు పవిత్రస్థానమున (రాజస, తామస పురుషపదార్థాది సంబంధ మొకింతయును లేని స్థానమున) సుఖముగ మిక్కిలి కురుచగాని, యెత్తుగాని లేని పీట మొదలగు ఆసనముపై కొలదిగ చేరబడి కూర్చుండి ఇంద్రియములను విష

యములపై పరుగిడనీక పట్టియుంచి కోరికలనెల్ల పారద్రోలి వైరాగ్యముచే ప్రశాంతమగు చిత్తముతో శ్రీమద్భాగవతమునందలి ఏకాదశస్కంధమున పదునాల్గవ అధ్యాయమున 39వ శ్లోకము నుండి 41వ శ్లోకమువరకు వివరించిన భగవత్స్వరూపము నాపాదమస్తక మీ క్రిందివిధముగ ధ్యానించవలెను.

శ్లో॥ సమం ప్రశాంతం సుముఖం, దీర్ఘచారు చతుర్భుజమ్ ।
సుచారు సున్దర గ్రీవం సుకపోలం శుచి స్మితమ్ ॥
సమానకర్ణవిన్యస్త స్ఫురన్మకర కుణ్డలమ్ ।
హేమామ్బరం ఘనశ్యామం శ్రీవత్స శ్రీ నికేతనమ్ ॥
శఙ్ఖ చక్ర గదా పద్మ వనమాలా విభూషితమ్
నూపురై ర్విలసత్పాదం కౌస్తుభ ప్రభయా యుతమ్ ।
ద్యుమత్కిరీటకటక కటిసూత్రాఙ్గదా యుతమ్ ।
సర్వాంగసుందరం హృద్యం ప్రసాదసుముఖేక్షణమ్ ।
సుకుమార మభిధ్యాయేత్ సర్వాఙ్గేషు మనో దధత్ ॥

సర్వసముడును ఊర్మిషట్కరహితుడును (శోక, మోహ, క్షుత్పిపాస జరామరణములు ఊర్ములు).

సుందరముఖారవిందుడును, ఆజానులంబి సుందరచతుర్భుజుడును, మిక్కిలి యందమైన కంఠము కలవాడును, అందమైన చెక్కిళ్లు కలిగి చిరునవ్వు ముఖమున తలుక్కెత్తుచుండువాడును, చెవుల కలంకరింపబడి చకచక మెరయుచున్న నొకేవిధమగు మకరకుండలములు కలవాడును, పీతాంబరధారియు, మేఘవర్ణుడును, శ్రీవత్సమునకును శ్రీదేవికిని నివాసమైనవాడును శంఖము, చక్రము, గద, పద్మము, వనమాలలచే నలంకరింపబడినవాడును, అందెలతో నలరారు పాద పద్మములు కలవాడును, కౌస్తుభ మాణిక్యకాంతులచే గప్పబడియుండువాడును, ప్రకాశించుచున్న కిరీటము, వలయము, మొలనూలు, భుజకీర్తులతో కూడియుండువాడును, సర్వాంగసుందరుడును, హృదయాకర్షకుడును, ప్రశాంతమైన సుందర నేత్రములతోనొప్పు ముఖపంకజము కలవాడును నగు సర్వేశ్వరుని ప్రత్యేకావయవమునందును మనస్సును నిలిపి ధ్యానించవలెను. ఈ సంస్కారము దృఢపడుటకై ధ్యానమునుండి లేచి దేహధారణకృత్యములలో నన్వయించినప్పుడును ప్రహ్లాదునివలె –

వ. పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాస లీ
లా నిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతస్వాద సం
ధానుండై..................................॥ యుండవలెను.

ఈ స్మృతియొక్క దార్ఢ్యము నొక కవి చమత్కారముగ వర్ణించెను.

శ్లో. హస్త మాక్షిప్య యాతోఽసి బలా త్కృష్ణ కి మద్భుతం
హృదయా ద్యది నిర్యాసి పౌరుషం గణయామి తే॥

అంధుడగు లీలాశుకుడు మాటలాడకయే వచ్చి తనకు దధ్యోదనమును పెట్టి పోవుచున్న శ్రీకృష్ణుని చేయి గట్టిగ పట్టుకొనగ నాతడు పెనిగి విడిపించుకొనెను. ఆస్పర్శసుఖము, ఆ యాహారభోగ్యతాతిశయమును బట్టి యాతడు శ్రీకృష్ణుడే యని నిశ్చయించి యాతనితో నిట్లనుచున్నాడు. శ్రీకృష్ణా! బలత్కారముగ చేతి పట్టును విడిపించుకొని పోవుట అంత పౌరుషకార్యము కాదు. నాహృదయమునుండి నీవు పోగలిగినచో నీ మగతనము చూతును అనెను. అంతదృఢముగ హృదయమున నామూర్తి హత్తుకొనవలయును. ప్రమాణము - శ్రుతిస్మృతేతిహాసపురాణాగమాది ధార్మిక గ్రంథములన్నియు నీస్మరణభక్తిని పెక్కురీతుల విధించుచున్నవి.

స్రుతి:- ఆత్మానమేవలోకముపాసీత విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత।

స్మృతి:- తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర। మన్మనాభవమద్భక్తో మద్యాజీ... 

శ్లో॥ అయాసః స్మరణే కోఽస్య స్మృతో యచ్ఛతి శోభనం
పాపక్షయః భవతి స్మరతాం త మహర్నిశం॥

ప్రహ్లాదుడు తోటిబాలురతో మిత్రులారా! భగవంతుని ధ్యానించుట కేమి శ్రమకలదు. స్మరించినచో పాపములు పోవును. శుభములు చేకూరును. కావున రాత్రింబవళ్లు సర్వేశ్వరుని స్మరించుడని యుపదేశించెను.

పాపరాశియంతయు నిప్పునపడిన దూదివలె నశించి సత్వగుణము వృద్ధియై భగవంతుని యందనన్యప్రేమకలిగి యాతని లభించుటయే దీనికి ప్రయోజనము. ఇట్లు నిరంతము స్మరించు తానే గాక తన పరిసరములయందుండు ప్రాణులన్నియు సాత్విక ప్రచురములై యలరారుట మనము గ్రంథములలో నాశ్రమవర్ణనలయందు గాంచుచున్నాము. ఇప్పటికి నట్టి మహాత్ములు లేకపోలేదు. అట్టివారు మనభాగ్యవిశేషముచే లభింతురు.

సాధనము :—

ఇది సత్వగుణమువలన బుట్టు మానసికవ్యాపారము. మనఃపరిణామము 'అన్నమయం హి సౌమ్య మనః' ఓ శ్వేతకేతూ! అన్నముయొక్క సూక్ష్మాంశచే నాప్యాయితమై మనస్సు తన కళలతో వెలుంగుచుండుననెడు ఛాందోగ్య శ్రుతివాక్యమునననుసరించి ఆహారాధీనము కావున సాత్వికాహారము, సాత్వికసహవాసము, సద్గ్రంథపఠనము సత్కథాశ్రవణము, సాత్విక దృశ్య దర్శనము మొదలగునవి స్మరణభక్తికి సహకారులు.



శ్రీమతే రామానుజాయ నమః

# అనుష్ఠాన విశేషములు

ప్రపన్నునకు ప్రధానతయాకావలశినవి భగవత్ భాగవత ఆచార్యకైంకర్యములు మూడు మాత్రమే. భగవత్కైంకర్యమును జేయుటవలనమాత్రమే యాచార్యులు సంతోషింతురు. గాన ఆచార్యులయొక్క యానందమునకై జేయు భగవత్కైంకర్యము యాచార్యకైంకర్యమే యగుచున్నది. గావున యాచార్యులముఖోల్లాసార్థమై భగవత్కైంకర్యమును జేయవలయును. భగవత్కైంకర్యమునకు ఆఖరిహద్దు భాగవతకైంకర్యము. గావున ఆచార్యముఖోల్లాసమునకు సీమాభూమిగా దలంచి భాగవతకైంకర్యమును జేయవలయును. అట్టిభాగవతముఖోల్లాసము కలుగుటకును, తనస్వరూపోజ్జీవనమునకును స్వరూపప్రయుక్తముగను, స్వోద్దేశభూతముగను స్వాచార్యకైంకర్యమును జేయవలయును. కైంకర్యమనగా స్వోద్దేశ్యులముఖోల్లాసకరమైన మనోవాక్-కాయకమైన క్రియావిశేము

భగవద్భాగవత కైంకర్యమును ఆచార్యోద్దేశ్యముగను స్వాచార్యులకైంకర్యమును స్వోద్దేశ్యరూపముగను జేయవలెను స్వాచార్యులుప్రసాదించిన తిరువడిఘళ్లనే తిరువారాధన స్థానీయముగ బెట్టుకొలవలెను. అవకాశానుసారముగవారికి యాచార్యులను యెంబెరుమన్నార్లను వారికియాచార్యులగు నమ్మాళ్వారులను-వారికి యాచార్యులగు విష్వక్సేనులను-వారికి యాచార్యులగు అనంత, గరుడ, పిరాట్టిమారులతో విరాజిల్లు శ్రీమన్నారాయణుని యథానుకూలముగ వేంచేప్ప చేసుకొని నిత్యతిరువారాధన మాచరించుకొనుచుండవలయును.

స్వాచార్యుల శ్రీపాదుకలనుగాని లేక తిరువడి ఘళ్లనేగాని తిరువారాధనముగ నుంచుకొనినను చరమపర్వనిష్ఠులకుచాలును శ్రీభరతాళ్వానులయొక్క నిష్ఠయే యిందులకుప్రమాణము.

పూర్వాచార్యులవలెనుండు మంత్రప్రదాతలకు యాచార్యులకుముందుగ అరగింపును సమర్పించి, పిమ్మట అర్థప్రదాతలునున్నగు ఉపకారకాచార్యులకందరకును అరగింపును సమర్పింపవలెను. అర్థప్రదాచార్యులకు మంత్రప్రదాతాచార్యులవిషయమున ఉపకారస్మృతియుండును గాన వీరిసంతోషమునిమిత్తమై ముందుగమంత్రప్రదాతాచార్యులకు అరగింపును సమర్పింపవలెను.

ఉపకారస్మృతియనగా ఈ చేతనునితీర్చి దిద్దుబాటొనర్చి భగద్విషయమున కుపయోగించునటుల జేసినవారు ఈ మహానుభావులుగదాయను ఉపకారస్మృతియుండుటగావున అట్టివారి తిరుత్తళిగైప్రసాదస్వీకారమున వీరికివాంచయుండును. అర్థప్రదాతాచార్యులు వీరియొక్క పూర్వాచార్యవైలక్షణ్యమునుజూచియేగదా దీనికిఅర్థవిశేషమునను గ్రహించినది. ఇటులగాక మరొకవిధముగతలంచినచో యిద్దరియొక్క స్వరూపమునకును హానిఘటిల్లును.

ఎంబెరుమాన్నార్లకు ఆచార్యులైనవారిలో మిగిలిననలుగురునకున్ను పెరియనంబిగారి విషయమున ఉపకారస్మృతియుండుట వలననేకదా మిక్కిలిప్రేమతో ఎంబెరుమన్నార్లకు వారు

ఆ మూలార్థవిశేషములు ప్రసాదింపనది. పంచసంబులలోను మంత్రప్రదాతలగు పూర్వాచార్యులకు పెరియనంబిగారు తిరునామము వహింపజేసెదరు గదా కారణము-తిరుమాలైయాండాన్ మున్నగు నలుగురును. పెరియనంబిగారి సంబంధముచే రాజకులమహాత్మ్యమునుజూచియే యెంబెరుమానారులకు భగవద్విషయము మొదలైన అర్థవిశేషములను ప్రసాదించిరి. ఎంబెరుమానారులుకూడ 'అరుళియ మణవాళప్పెరుమాళ్' తమకు ఉభయ విభూతినాయకత్వము ననుగ్రహించి "ఉదయవర్" అని తిరునామము ననుగ్రహించిన పిమ్మట ఎంబెరుమానారులు పెరియనంబిగారి గోష్ఠిలోనికి వేంచేసి "పెద్దల శ్రీపాదముల నాశ్రయించుటవలన" "అఘటితమైనఫలసంఘటన యిటులఘటించినది" అని విన్నవించిరట. అనగా పెరియనంబిగారి తిరుముఖమండలము నవలోకించుచు దేవరవారి తిరువడిసంబంధమునకు రాజకులమహాత్మ్యముచే 'నమ్పెరుమాళ్లుదాసునికి ఈ మహైశ్వర్యముగ ప్రసాదింపబడిన' విన్నవించిరట. ఈ విధముగ పూర్వాచార్యులవిషయమున ఉపకారస్మృతి లేనిచో వారితిరువడిసంబంధము నాశ్రయించినఫలముండదు. రెండుగట్టులను పట్టుకున్నవానివలెనే సముద్రముపాలగును. అనగా ఆత్మస్వరూపహానికలుగునని తాత్పర్యము. గావున మంత్రప్రదుల విషయమున ఉపకారస్మృతి యుండవలెయును.

మంగళ పెరుమాళ్లకు పిరాట్టియారులకు ద్వయమంత్రముచేతను పిమ్మట అనంతగరుడ విష్వక్సేనులకు వారివారి తిరునామములచేతను శఠగోపులకు ఉదయవరులకు మణవాళమామునులకు వారివారి ద్వయమంత్రములేగాని దాని వారి వారి తిరునామములచేగాని అరగింపు సమర్పించవలెను. పిమ్మట మంత్రప్రదాచార్యులకును పిమ్మట అర్థప్రదాచార్యులకును గురుపరంపరలోని అవరోహణ క్రమము మొదలు వాక్యత్రయము చేతను మరియు భగవద్విషయము అష్టాదశ రహస్యములు స్వరూపగ్రంథములు (అష్టశ్లోక వ్యాఖ్యానము రామానుజ నూత్తందాది వ్యాఖ్యానము ఇత్యాదులు) సాయించిన యాచార్యులకును వారివారి తిరునామముల చేతను అరగింపును సమర్పింపవలెను.

గాయత్రి జపము బ్రాహ్మణ్యమునకు ప్రధానమగునటులనే తిరువరంగత్తమదనార్ సాయించిన రామానుజ నూత్తందాది శ్రీవైష్ణవత్వసిద్ధికి ప్రధానమైనది-గావుననే రామానుజనూత్తందాదిని ప్రపన్నగాయత్రి యని వ్యవహరించుట కలిగినది-గాన ప్రపన్నులందరును రామానుజ నూత్తందాదిని ప్రతినిత్యమును తప్పక యనుసంధించుకొనవలయును.

ఒక తిరుమాళిగలో బ్రహ్మనేత్తలైన యజమానులు తిరునాడునకు వేంచేసినచో వారికి తిరువధ్యయనోత్సవమును జరిపించువరకును తిరువాయ్మొళిని-రామానుజ నూత్తందాదిని యనుసంధించకూడదు. ఆ కాలము తిరుక్కార్త్తివలె అనధ్యయనకాలము. రామానుజోత్తరవాక్యము ననుసంధించుకొని ప్రసాదస్వీకార మాచరింపవలెను. తిరువధ్యయనోత్సవాననంతరమున మామూలుగ ప్రతినిత్యమును రామానుజనూత్తందాదిని యనుసంధించుకొనవలసినది.

క. తిరుమంత్రద్వయము చరమ - స్మరణానందమ్మె మీకు సద్గతికూర్చున్
బరమోపదేశ మిదియే - పరికింపగ సత్యమైన వార్తయు నిదే.

సీ. గ్రహియింపరే! శ్రుతిత్రయ సమామ్నాతవర్ణ భాసురాష్టాక్షరీ వైభవమ్ము
స్మరియింపరే! భవమహాభోగ తాగత శ్రమ నివారక మంత్ర రత్నమహిమ
పరికింపరే! ప్రాణిపాపాంధకార నిర్వాపక చరమార్థ దీపకళిక
చరియింపరే! సర్వజనతా సుఖంగమాచార్య నిష్ఠైక కైంకర్యపదవి.

గీ. పారద్రోలరే దేహసంబంధులందు మమ్యమని యెడు భూత మామడల వలను
వాసేయరే! యపునరావృత్తి పథము నందుకొనగోరి మీర లహర్నిశమ్ము.

మ॥ అనివాసంతదినాంతకాల మలయూ యా తానిలాంకూర సం
జనితానంద మరందకుండలతికా సౌరభ్యమూరించు తి
య్యనివాగ్ధోరణి సంయమీశ్వరుఁ డుపన్యాసమ్ము గావింపగా
విని, బద్ధాంజలి నిల్చిరప్డె ప్రజ లావిర్భూతవిజ్ఞానులై

క॥ శరణము - చతురక్షరియే, శరణము - రామానుజార్యచరణద్వయమే
శరణము - తద్వాఙ్మయమే, శరణము - తద్వ్యాక్తియనుచు సాగిరి ప్రజలున్



సాలుచందా రు 5 లు భక్తినివేదన — BOOK POST రి. నెం. A 195

శ్రీ వాసుదాసాశ్రమం — నడిగడ్డపాలెం (పోష్టు) (వయా చేబ్రోలు) గుంటూరుజిల్లా.

Tirupathi, (Chithur dt.)

112

Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and Printed at Bharathi Press, Tenali For Sriman Press, Nadigaddapalem.

## శ్రీ గుణరత్న కోశము

### (మూడవ శ్లోకము)

అవతారిక: ఆశ్రయానుకూల్యమునకై ఆయనతోపాటు శ్రీరంగమున శ్రీరంగనాయకి రూపమున నవతరించినమంగళ మూర్తియై శ్రీరంగరాజ పట్టమహిషియై వెలుగొందుచుండు లక్ష్మీదేవిని యాశ్రయించుచున్నాము.

3. శ్లో॥ ఉల్లాస పల్లవిత పాలిత సప్తలోకీ
నిర్వాహకోరకిత నేమ కటాక్ష లీలాం
శ్రీరంగ హర్మ్యతల మంగళ దీపరేఖాం
శ్రీరంగరాజ మహిషీం శ్రియ మాశ్రయామః॥

#### —: ప్రతిపదార్థము :—

ఉల్లాసపల్లవిత పాలితసప్తలోకీ నిర్వాహకోరకిత నేమ కటాక్షలీలాం, ఉల్లాస=సృష్టిచేత; పల్లవిత=చిగర్చబడి; పాలిత=పరిపాలింపబడు; సప్తలోకీ=ఏడులోకములయొక్క; నిర్వాహ=నిర్వాహణముచేత; కోరకిత=మొగ్గతొడగబడిన; నేమ=సగముఅయిన, కటాక్ష=చూపులయొక్క; లీలాం=విలాసగలిగినట్టియు; శ్రీరంగ హర్మ్యతల మంగళ దీపరేఖాం, శ్రీరంగ=శ్రీరంగమందలి; హర్మ్య=మేడయొక్క; తల=ప్రదేశముకల; మంగళ=మంగళార్థమైన; దీపరేఖాం=దీపకళిక యైనట్టియు; శ్రీరంగరాజమహిషీం, శ్రీరంగరాజ=శ్రీరంగనాథునియొక్క; మహిషీం=పట్టమహిషియైనట్టియు; శ్రియం=లక్ష్మీదేవిని; ఆశ్రయామః=ఆశ్రయించుచున్నాము.

#### తాత్పర్యము

తనయంశయగు సంతానమునగు ఈజగత్తు కరణకళేబరరహితమై మూలప్రకృతియందు బీజరూపమున అత్యంత సూక్ష్మరూపమున యున్నపుడు అత్యంత దుఃఖవ్యాకులత్వముల జెందిన నిరుపాధికతల్లియగు శ్రీమహాలక్ష్మియొక్క నేత్రములు ముకుళితస్థితిలోనుండి ఆజగత్తు కరణకళేబరములతో సంఘటింపబడి నామరూపవిశిష్టమైన వెంటనే ఆనేత్ర లీలాకటాక్షము పల్లవితమై ఆజగత్తు చక్కగా పరిపాలితమై వృద్ధిజెందుచుండగ కోరకితమై క్రమముగ అర్థనిమీలిత స్థితినిగలదియై పిమ్మట సర్వేశ్వరుని శ్రీరంగనాయ కాత్మక యర్చారూపమున తాను శ్రీరంగమందిరమున శ్రీరంగనాయకి రూపమున యవతరించి మంగళమూర్తియై శ్రీరంగరాజ పట్టమహిషియై వెలుగొందుచుండు పురుషకార భూతురాలగు లక్ష్మీదేవిని యాశ్రయించుచున్నాము.

## శ్రీ గుణరత్న కోశము

### (నాలుగవ శ్లోకము)

అవతారిక :- లక్ష్మీకటాక్షము నాకు కలుగుగాక యని ప్రార్థించుచున్నారు.

4. శ్లో॥ అనుకల తనుకాణ్డాలి జ్గనారమ్భ శుమ్భత్
ప్రతిదిశ భుజశాఖ శ్రీసఖానోకహర్ధిః,
స్తన నయన గుళుచ్ఛ స్ఫార పుష్ప ద్విరేఖా
రచయతు మయి లక్ష్మీకల్పవల్లీ కటాక్షాన్.

#### —: ప్రతిపదార్థము :—

అనుకలతను కాణ్డాలి జ్గనారమ్భశుమ్భత్ప్రతిదిశ భుజశాఖ శ్రీసఖానోక హర్ధిః॥ అనుకల=ప్రతిక్షణమునను, తనుకాణ్ట=దండమువంటిదేహముయొక్క ఆలిజ్గన=ఆలింగనమును; ఆరమ్భ=వ్యాపారమున; శుంభత్=ప్రకాశించుచుండెడి; ప్రతిదిశ=అన్నిదిక్కులయందును; భుజశాఖ=కొమ్మలవంటి భుజములుగల; శ్రీసఖానోకహ=వృక్షము

(తరువాయి కైటిల్ 3-వ పేజీ చూడుడు)

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ భగవద్గీతా - దశమోఽధ్యాయః

# విభూతి విస్తర యోగః



అవ. భగవంతుడు తాను చెప్పవలంచిన విషయమును ప్రతిజ్ఞచేయుచున్నాడు.

శ్రీ భగవానువాచ = భగవంతుడు పలికెను.

1. శ్లో. భూయ ఏవ మహాబాహో ! । శృణు మే పరమం వచః
యత్తేఽహం ప్రీయమాణాయ । వక్ష్యామి హితకామ్యయా॥

అర్థము :- (హే) మహాబాహో ! = ఓ అర్జునా ! అహం = నేను, ప్రీయమాణాయ = సంతసించుచున్న, తే = నీ కొఱకు, హితకామ్యయా = హితమొన రించు కోరికతో, భూయః ఏవ = తిరిగి, పరమం = గొప్పదైన, యత్ = ఏ, వచః = వాక్యమును, వక్ష్యామి = చెప్పగలనో, మే = నాయొక్క, (తత్ = ఆ మాటను) శ్రుణు = వినుము.

తా॥ నా మాహాత్మ్యమును విని సంతోషపడుచున్నవాడవు గనుక నీకు హితమును చేయగోరి వెనుక జెప్పిన నా మాహాత్మ్యమును గూర్చి మరల విస్తారముగా నొకమాట జెప్పెదను. దానిని సావధానముగా వినుము.

అవ. తాను జెప్పెడు విషయమునందు ఆదరము కలుగుటకై యీ జ్ఞానము దుర్లభమని చెప్పుచున్నాడు.

2. శ్లో. న మే విదు స్సురగణాః । ప్రభవం న మహర్షయః
అహ మాది ర్హి దేవానాం । మహర్షీణాం చ సర్వశః॥

అర్థము :— సురగణాః = దేవతాసమూహములు. మే = నాయొక్క. ప్రభవం = ప్రభావమును. న విదుః = ఎఱుంగరు. మహర్షయః = మహర్షులు. న (విదుః) = ఎఱుంగరు. అహం = నేను. దేవానాం = దేవతలకును. మహర్షీణాం మహర్షులకును. సర్వశః = అన్నివిధములను. ఆదిః హి = మూలమైన వాడనుగదా.

తా॥ దేవతా సమూహములును, మహర్షులునుకూడ నా ప్రభావము నెఱుంగరు. ఏలననగా — నేను దేవతలకును, మహర్షులకును అన్ని విధములచేతను మూలభూతుడను.

అవ. ఈ జ్ఞానము భక్తి పుట్టుటకు ప్రతిబంధకములగు పాపములను పోగొట్టుటకు ఉపాయమని చెప్పుచున్నాడు.

3. శ్లో. యో మా మజ మనాదిం చ । వేత్తి లోకమహేశ్వరం
అసమ్మూఢ స్స మర్త్యేషు । సర్వపాపైః ప్రముచ్యతే॥

అర్థము :— మర్త్యేషు = మనుష్యులలో. అసమ్మూఢః = భ్రమచెందని. యః = ఎవడు. అజం = పుట్టనట్టియు. అనాదిం చ = ఆదిలేనట్టియు. మాం = నన్ను. లోకమహేశ్వరం = లోకములకు ప్రభువులకు ప్రభువునిగా. వేత్తి = ఎఱుంగుచున్నాడో. సః = వాడు. సర్వపాపైః = సకల పాపములచేతను. ప్రముచ్యతే = విడువబడుచున్నాడు.

తా॥ నేను పుట్టుక లేనివాడను, ఆదిలేనివాడను. మరియు లోకనాథులకు నాథుడను. ఇట్టి నన్ను ఎవడు తెలుసుకొనునో వాడు మానవులలో ఏ మాత్రము భ్రమలేనివాడగుచున్నాడు. అట్టివాడు సమస్త పాపముల నుండియు పూర్తిగా విడివడుచున్నాడు.

అవ. భగవదైశ్వర్యమును భగవంతుని కల్యాణగుణ విస్తారమును అనుసంధించుటచే భక్తి వృద్ధిపొందు రీతిని చెప్పుచున్నాడు.

4. శ్లో. బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః । క్షమా సత్యం దమ శ్శమః
సుఖం దుఃఖం భవోఽభావో । భయం చాభయ మేవ చ॥

అర్థము :- బుద్ధిః = మనస్సుయొక్క నిరూపణశక్తి. జ్ఞానం = చేతనాచేతన వస్తు నిర్ణయము. అసమ్మోహః = భ్రాంతిలేమి. క్షమా = ఓరిమి. సత్యం = ఉన్నది యున్నట్లు హితముగ బలుకుట. దమః = బాహ్యేంద్రియ జయము. శమః = మనోనిగ్రహము. సుఖం = సుఖము. దుఃఖం = దుఃఖము. భవః = మానసోల్లాసము. అభావః = మనస్సంకోచము. భయంచ = భయమును, అభయం = భయము లేకుండుటయు.

తా॥ మనస్సుయొక్క నిరూపణశక్తివలన చేతనాచేతన వస్తునిర్ణయమున్ను దానివలన విజాతీయులయందు సజాతీయభ్రమ నివృత్తియు కలుగును. ఇవియు - ఓర్పు, భూతహితముగ యదార్థమును మాట్లాడుట. బాహ్యేంద్రియ అంతరింద్రియముల నిగ్రహము, సుఖము, దుఃఖము, ఉల్లాసము, దైన్యము, భయము, భయము లేకుండుటయున్ను.

5. శ్లో. అహింసా సమతా తుష్టి । స్తపో దానం యశోఽయశః
భవన్తి భావా భూతానాం । మత్త ఏవ పృథగ్విధాః॥

అర్థము :- అహింసా = పరుల కేవిధముగను దుఃఖము కలిగించకుండుట. సమతా = అందరియెడల సమబుద్ధి కలిగియుండుట. తుష్టిః = సంతోషించు స్వభావము కలిగియుండుట. తపః = శరీరక్లేశము. దానం = భోగ్య వస్తువులను పరులకొసంగుట. యశః = గుణవంతుడను పేరు. అయశః = గుణహీనుడను ప్రసిద్ధి (అనెడు). భూతానాం = ప్రాణులయొక్క, పృథగ్విధాః = వేరువేరు విధములైన, భావాః = పై వ్యాపారము లన్నియు, మత్త ఏవ = నా వలననే, భవన్తి = కలుగుచున్నవి.

తా॥ పరుల కేవిధముగను దుఃఖమును కలిగించకుండుట, అందరి యెడల సమబుద్ధి కలిగియుండుట, అన్నిటిపట్లను సంతోష స్వభావము కలిగియుండుట, శాస్త్రమునుబట్టి భోగములను తగ్గించుట వలన కాయక్లేశమును పొందుట, తన కిష్టమైన వాటిని ఇతరుల కిచ్చుట, గుణవంతుడని పేరుపొందుట అనెడు వీటికి తగిన మనో వ్యాపారములు నాసంకల్పమువల్లనే ప్రాణులకు కలుగుచుండును.

అవ. సకల ప్రాణులయొక్క సృష్టిస్థితి ప్రవృత్తులకు కారణభూతులగు సమస్త మహర్షి ప్రభృతులున్ను భగవత్సంకల్పము వలననే ప్రవర్తింతురని చెప్పుచున్నాడు.

6. శ్లో. మహర్షయ స్సప్త పూర్వే । చత్వారో మనవ స్తథా
మద్భావా మానసా జాతాః । యేషాం లోక ఇమాం ప్రజాః॥

అర్థము :- యేషాం = ఎవరియొక్క, లోకే = పుత్రపౌత్రాది సంతానమైన లోకమునందు, ఇమాః ప్రజాః = ఈ సకల ప్రజలున్ను, జాతాః = పుట్టిరో, పూర్వే = వెనుకటి మన్వంతరమందు, మానసాః = బ్రహ్మమనస్సున పుట్టినవారై, సప్త = ఏడుగురు, మహర్షయః = భృగువు మొదలగు మహర్షులున్ను, తథా = అట్లే, చత్వారః = నలుగురైన, మనవః = సావర్ణి మొదలగు మనువులున్ను, మద్భావాః = నా సంకల్పమునే యనువర్తించువారు.

తా॥ గత మన్వంతరమున నిత్యసృష్టి నిమిత్తమై భృగువు మొదలగు సప్తర్షులును, నిత్యస్థితి ప్రవర్తనకై సావర్ణికాది నలుగురు మనువులును, బ్రహ్మ సంకల్పమువలన పుట్టింపబడిరి. లోకమందలి ప్రజలందరు వీరి పుత్ర పౌత్రాదులనుండి పుట్టిరి. ఇట్టి ఋషులును, మనువులును నా సంకల్పానుసారముగ ప్రవర్తింతురు.

అవ. భగవదైశ్వర్యమును, భగవంతుని కల్యాణగుణ విస్తారమును తలంచుచుండుటచే భక్తి వృద్ధిపొందురీతిని జెప్పుచున్నాడు.

7. శ్లో. ఏతాం విభూతిం యోగం చ । మమ యో వేత్తి తత్త్వతః
సోఽవికమ్పేన యోగేన । యుజ్యతే నాఽత్ర సంశయః॥

అర్థము :- యః = ఏవడు, మమ = నాయొక్క, ఏతాం = ఈ, విభూతిం = (నా) ఐశ్వర్యమును, యోగం చ = కల్యాణ గుణయోగమును, తత్త్వతః = యథార్థముగా, వేత్తి = ఎఱుంగుచున్నాడో, సః = వాడు, అవికమ్పేన = నిశ్చలమైన, యోగేన = భక్తియోగముతో, యుజ్యతే = కూడియున్నాడు, అత్ర = ఈ విషయమై, సంశయః = సందేహము, న = లేదు.

తా॥ సకల చేతనాచేతనముల ఉత్పత్తిస్థితి ప్రవృత్తులు నా సంకల్పాధీనమై యుండును. ఇదియే నా ఐశ్వర్యము. నేను సమస్తకల్యాణ గుణములతో గూడుకొని యున్నాను. ఇదియే నా యోగము. ఈ రెండింటిని యథార్థముగా నెఱుంగువాడు నిశ్చలభక్తి యోగి. ఇందుకు సందేహము లేదు.

అవ. విభూతి విజ్ఞానమునకు ఫలమగు భక్తి వృద్ధిని జూపుచున్నాడు.

8. శ్లో. అహం సర్వస్య ప్రభవో । మత్తస్సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజన్తే మాం । బుధా భావ సమన్వితాః॥

అర్థము :– అహం = నేను. సర్వస్య = సమస్త ప్రపంచముయొక్క, ప్రభవః = పుట్టుటకు కారణమైనవాడను. మత్తః = నానుండి. సర్వం = సమస్తమును. ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది. ఇతి = అని. మత్వా = తలంచి, బుధాః = జ్ఞానులు. భావసమన్వితాః = మనోభావముతో కూడినవారై, మాం = నన్ను, భజన్తే = భజించుచున్నారు.

తా॥ నేను సమస్త ప్రపంచముయొక్క పుట్టుకకును, ప్రవర్తించుటకును కారణమైనవాడను. ఇట్టి నాయొక్క నిరంకుశైశ్వర్యమును కల్యాణ గుణయోగమును తలంచి జ్ఞానులు నాయందు స్పృహ కలవారై నన్ను భజింతురు.

అవ. ఆ భజించురీతిని చెప్పుచున్నాడు.

9. శ్లో. మచ్చిత్తాః మద్గతప్రాణాః । బోధయన్తః పరస్పరం
కథయన్తశ్చ మాం నిత్యం । తుష్యన్తిచ రమన్తిచ॥

అర్థము :– మచ్చిత్తాః = నాయందు లగ్నమైన మనస్సు కలవారును, మద్గతప్రాణాః = నాపై యాధారపడియున్న ప్రాణము కలవారును, నిత్యం = ఎల్లప్పుడును, మాం = నన్నుగూర్చి, పరస్పరం = ఒకరికొకరు, బోధయన్తః = నా గుణములను తెలుపుచున్నవారును, కథయన్తః చ = నా చేష్టలను వర్ణించుచున్నవారును, (అయి) తుష్యన్తి చ = సంతోషించుచున్నారు, రమన్తి చ = ఆనందించుచున్నారు.

తా॥ నా భక్తులు నాయందే తమ మనస్సుల లగ్నముచేసి నన్నువిడిచి బ్రతుకలేనివారై తమ తమచే అనుభవింపబడిన నా కల్యాణ గుణములను, నా యవతార దివ్యచేష్టితములను నిత్యమును ఒకరి కొకరు బోధించుకొనుచు సంతోషించుచు ఆనందించుచుందురు.

అవ. ఇట్టిభక్తి - భగవత్ప్రాప్తికి పూర్వముండునట్టి విశదతమసాక్షాత్కార రూపమగు అవస్థకు కారణమనుటను జెప్పుచున్నాడు.

10. శ్లో. తేషాం సతతయుక్తానాం । భజతాం, ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తం । యేన మా ముపయాన్తి తే॥

అర్థము:– సతతయుక్తానాం = నాతో నెప్పుడును గూడియుండగోరువారును, భజతాం = నన్ను భజించుచున్నవారును (అగు) తేషాం = ఆజ్ఞానులకు. తం = ఆ, బుద్ధియోగం = విశదతమమైన నాసాక్షాత్కారమును, ప్రీతిపూర్వకం = ప్రేమతో, దదామి = యిచ్చుచున్నాను. యేన = దేనిచే, తే = వారు, మాం = నన్ను, ఉపయాన్తి = పొందుచున్నారో ।

తా॥ నాతో నిత్యసంసర్గమును కోరుచున్నవారై నన్ను భజించు జ్ఞానులకు వారుకోరిన ఆ విశదతమమైన నా సాక్షాత్కారమునే ప్రేమతో నిచ్చుచున్నాను. దానిచేత వారు నన్ను పొందగలరు.

అవ. తాను ప్రసాదించునట్టి బుద్ధియోగమునకు ఆటంకములు తొలంగు రీతిని తెలుపుచున్నాడు.

11. శ్లో. తేషా మేవా నుకమ్పార్థ । మహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మభావస్థో । జ్ఞానదీపేన భాస్వతా॥

అర్థము :– తేషాం ఏవ = వారలకే, అనుకమ్పార్థం = అనుగ్రహముకొఱకు, ఆత్మభావస్థః = మనస్సునకు విషయభూతుడనగు, అహం = నేను, భాస్వతా = ప్రకాశించుచున్న, జ్ఞానదీపేన = జ్ఞానమనెడుదీపముచే, అజ్ఞానజం = అజ్ఞానమువలనబుట్టిన, తమః = చీకటిని, నాశయామి = నశింపజేయుచున్నాను.

తా॥ నేను వారిని అనుగ్రహించుటకొఱకు వారి మనస్సునకు గోచరించుచు నన్ను గూర్చిన జ్ఞానమనెడు ప్రకాశించుచున్న దీపముచేత అజ్ఞానమువలన పుట్టిన విషయ ప్రావణ్యమనెడు చీకటిని పోగొట్టుదును.

అవ. ఇట్లితరు లెవ్వరికిని లేనట్టియు భగవంతునకు మాత్రముండునట్టియు, వారికపరిమితమగు ఆనందమొసంగునట్టియు, భగవంతుని కల్యాణ గుణసంపత్తిని, ఆతని యైశ్వర్యాతిశయమునువిని వాటిని సవిస్తరముగ వినగోరి యర్జును డడుగుచున్నాడు.

అర్జున ఉవాచ : అర్జునుడు పలికెను.

12. శ్లో. పరంబ్రహ్మ పరంధామ । పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య । మాదిదేవ మజం విభుమ్॥

అర్థము :- భవాన్ = నీవు. పరంబ్రహ్మ = పరబ్రహ్మవు. పరంధామ = పరంజ్యోతివి పరమంపవిత్రం = పరమపావనుడవు. శాశ్వతం = నిత్యుడవు. దివ్యం = పరమాకాశమునన్నుండువాడవు. ఆదిదేవం = జగత్కారణమైనదేవుడవు. అజం = పుట్టుకలేనివాడవు. విభుం = సర్వవ్యాపకుడవు.

తా॥ కృష్ణా !, నీవు పరబ్రహ్మవు. పరంజ్యోతివి. పరమపావనుడవు. నిత్యుడవు. పరమపదవాసుడవు. జగత్కారణుడవు. సృష్ట్యాదులు లీలలుగా కలవాడవు. కర్మవశమైన పుట్టుక లేనివాడవు సర్వ వ్యాపకుడవు. (అని యిట్లు)

13. శ్లో. ఆహుస్త్వా మృషయ స్సర్వే । దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాసః । స్వయం చైవ బ్రవీషి మే॥

అర్థము :- త్వాం = నిన్నుగూర్చి, సర్వే = సమస్తమైన, ఋషయః = ఋషులును, దేవర్షిః = దేవఋషియగు, నారదః = నారదుడును, తథా = అట్లే, అసితః = అసితుడును, దేవలః = (ఆతని తండ్రియగు) దేవలుడును, వ్యాసః = వ్యాసుడును, ఆహుః = చెప్పుచున్నారు, స్వయం ఏవచ = నీవేస్వయముగాను, మే = నాకు, బ్రవీషి = చెప్పుచున్నావు.

తా॥ నీ విట్టివాడవని సప్తఋషులును, దేవర్షియగు నారదుడును, అసితుడును, ఆతని తండ్రియగు దేవలుడును వ్యాసమహర్షియు చెప్పుచున్నారు. నీవే స్వయముగ నాకు చెప్పుచున్నావు.

అవ. వారి మాటలపై తన విశ్వాసమును తెలుపుచున్నాడు.

14. శ్లో. సర్వమేత దృతం మన్యే । యన్మాం వదసి కేశవ ।
న హితే భగవన్! వ్యక్తిం । విదు ర్దేవా న దానవాః॥

అర్థము:– కేశవ = కృష్ణా ! మాం = నన్ను గూర్చి యత్ = ఏనీమహిమను, వదసి = చెప్పుచున్నావో, ఏతత్సర్వం = దీనినంతను, ఋతం = సత్యముగా, మన్యే = తలంచుచున్నాను. భగవన్ = శ్రీకృష్ణా ! తే = నీయొక్క, వ్యక్తిం = తెలిపెడురీతిని, దేవాః = దేవతలును, దానవాః = రాక్షసులును, న విదుః = ఎఱుంగరు.

తా॥ శ్రీకృష్ణా నాకు నీ యైశ్వర్యమును యోగమునుగూర్చి చెప్పుచున్నావు. దీని నెల్ల నిజమని విశ్వసించుచున్నాను. ఈ నీ మహిమను దేవతలుగాని, దానవులుగాని యెఱుంగరు.

అవ. భగవంతుని వైభవమును భగవంతుడే చెప్పగలడనుచున్నాడు.

15. శ్లో. స్వయ మేవా త్మనా త్మానం । వేత్థ త్వం పురుషోత్తమ !
భూతభావన ! భూతేశ ! । దేవదేవ ! జగత్పతే ! ॥

అర్థము :– పురుషోత్తమ = పురుషశ్రేష్ఠుడా ! భూతభావన = సకలభూతములనుసృజించువాడా ! భూతేశ = సమస్తభూతములను నడిపించువాడా ! దేవదేవ ! = దేవతలకునుపరదైవమా ! జగత్పతే = జగత్తులకుస్వామీ ; త్వం = నీవు, ఆత్మనా = నీచేత, ఆత్మానం = నిన్ను, స్వయం ఏవ = నీయంతనే, వేత్థ = తెలుసుకొనుచున్నావు.

తా॥ పురుషోత్తమా ! సమస్త భూతములను సృష్టించువాడా ! సమస్త భూతములకును నియామకుడా ! దేవతలకును పరదైవమా ! జగత్తులకు స్వామీ ! నీ స్వరూపమును నీ జ్ఞానముచేత నీ యంతట నీవే యెఱుంగుదువు.

అవ, తానెఱుంగగోరు విషయములను తెలుపుచున్నాడు.

16. శ్లో. వక్తు మర్హస్య శేషేణ । దివ్యా హ్యాత్మవిభూతయః
యాభి ర్విభూతిభి ర్లోకా । నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి॥

అర్థము :- దివ్యాః = దివ్యములైన, ఆత్మవిభూతయః = నీకుమాత్రమే యుండెడు నియమనవిశేషములను, అశేషేణ = సాంతముగా, వక్తుం = చెప్పుటకు, అర్హసి = తగుదువు, యాభిః = ఏ విభూతులతో, త్వం = నీవు, ఇమాన్ = ఈ, లోకాన్ = లోకములను, వ్యాప్య = వ్యాపించి, తిష్ఠసి = ఉన్నావో.

తా॥ అనేకములైన నీ నియమన విశేషములతో కూడియుండి నీ వీ లోకములను వ్యాపించి యున్నావు. ఇట్టి విభూతులు నీకు మాత్రమే కలవు అవి దివ్యములైనవి. వాటి నన్నిటిని సమగ్రముగా జెప్పుటకు నీవే తగుదువు.

17. శ్లో. కథం విద్యా మహం యోగీ । త్వాం సదా పరిచిన్తయన్
కేషు కేషు చ భావేషు । చిన్త్యోఽసి భగవ న్మయా॥

అర్థము :- అహం = నేను, యోగీ = భక్తియోగినై, త్వాం = నిన్ను, సదా = ఎల్లప్పుడును, పరిచిన్తయన్ = చింతించుచున్నవాడనై, కథం = ఎట్లు, విద్యాం = తెలుసుకొందును ?, భగవన్ = కృష్ణా ! కేషు కేషు చ = ఏయే, భావేషు = భావములయందు, మయా = నాచేత, చిన్త్యః = చింతింపదగినవాడవు, అసి = అగుచున్నావు ?.

తా॥ నేను భక్తియోగ నిష్ఠుడనై భక్తితో నిన్ను నిరంతరము చింతించుచు నెట్లు తెలుసుకొందును ? కృష్ణా! నీవు చెప్పిన బుద్ధి జ్ఞానాదిభావములయందేగాక నిన్నింకను ఏ యే భావముల యందు నియామకునిగా చింతింపదగుదును ?

18. శ్లో. విస్తరేణాత్మనో యోగం । విభూతిం చ జనార్దన ।
భూయః కథయ తృప్తిర్హి । శృణ్వతో నాస్తి మేఽమృతమ్॥

అర్థము :— జనార్దన = శ్రీకృష్ణా, ఆత్మనః = నీయొక్క, యోగం = యోగమును, విభూతిం చ = విభూతినిన్ని. భూయః = తిరిగి. విస్తరేణ = సవిస్తరముగా. కథయ = చెప్పుము, అమృతం = అమృతమువంటి నీ మాహాత్మ్యమును, శృణ్వతః = వినుచున్న, మే = నాకు. తృప్తిః = సంతుష్టి, నాస్తి హి = లేదుకదా ।

తా॥ కృష్ణా! నీ జగత్సృష్టి మొదలగు యోగమును, నీ నియమనమును తిరిగి సవిస్తరముగ జెప్పుము. నీ మాహాత్మ్యము నాకు అమృతమువలె నున్నది. దానిని ఎంత విన్నను నాకు తృప్తి కలుగుటలేదు. ఆ సంగతి నీకే తెలియుచున్నదికదా !

అవ. ఇట్లర్జునుని ప్రార్థన కపరిమితానంద భరితుడైన భగవంతు డాతని యోగ్యతను జూపుచు తన విభూతిని గూర్చి విస్తరించి చెప్పుటకును వినుటకును దుశ్శకము గాన సంగ్రహముగా జెప్పెదననుచున్నాడు.

శ్రీ భగవానువాచ = శ్రీకృష్ణుడు పలికెను.

19. శ్లో. హన్త ! తే కథయిష్యామి । విభూతీ రాత్మన శ్శుభాః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ ! । నా స్త్యన్తో విస్తరస్య మే॥

అర్థము :— హన్త ! = అయ్యో ! కురుశ్రేష్ఠ ! = అర్జునా ! ఆత్మనః = నాయొక్క, శుభాః = కల్యాణములైన, విభూతీః = విభూతులను, ప్రాధాన్యతః = ముఖ్యములైనవాటిని, తే = నీ కొఱకు, కథయిష్యామి = చెప్పగలను, మే = నాయొక్క. విస్తరస్య = విభూతి విస్తారమునకు, అన్తః = అంతము. న = లేదు.

తా॥ అర్జునా ! నా నియమనకు లోబడియుండు కల్యాణములైన పదార్థములలో ముఖ్యమైన వాటిని మాత్రమే నీకు చెప్పగలను. అవి యనంతములగుటచే విస్తరించి చెప్పుటకును వినుటకును శక్యముకాదు.

అవ. విభూతి - యోగము అనెడు రెండింటిలో విభూతి యనగా అన్నిటికిని యాత్మయై లోపల నెలకొనియుండి సర్వభూతములను ప్రవర్తింపజేయుట. యోగ మనగా అన్నిటిని సృజించుట, పాలించుట, సంహరించుటయు నని స్పష్టముగా జెప్పుచున్నాడు.

20. శ్లో. అహ మాత్మా గుడాకేశ ! । సర్వభూతాశయ స్థితః
అహ మాదిశ్చ మధ్యం చ । భూతానా మన్త ఏవ చ॥

అర్థము:- గుడాకేశ ! = అర్జునా ! అహం = నేను, సర్వభూతాశయ స్థితః = సమస్త భూతముల హృదయమందుండు, ఆత్మా = ఆత్మను, భూతానాం = ప్రాణులకు, ఆదిః చ = సృష్టికర్తను, మధ్యం చ = రక్షకుడను, అన్తః చ = నశింపజేయువాడనున్ను, అహం ఏవ = నేనే.

తా॥ అర్జునా ! సకల ప్రాణుల హృదయములయందును నే నాత్మగా నున్నాను. కావుననే నేను వాటి యన్నిటియొక్క పుట్టుక, పోషణ, వినాశములకును కారణమగుచున్నాను.

అవ. భగవంతు డన్నిపదార్థముల యందును ఆత్మగా నెలకొనియుండుటచే నన్ని శబ్దములు నాతనికి వాచకములగుచున్నవని చెప్పుచున్నాడు. (అన్నియు నేనేయని చెప్పుటకును యిదియే కారణము)

21. శ్లో. ఆదిత్యానా మహం విష్ణుః । జ్యోతిషాం రవి రంశుమాన్
మరీచి ర్మరుతా మస్మి । నక్షత్రాణా మహం శశీ॥

అర్థము :- అహం = నేను, ఆదిత్యానాం = అదితిపుత్రులలో, విష్ణుః = విష్ణువున్ను, జ్యోతిషాం = వెలుగునిచ్చు వాటిలో, అంశుమాన్ = కిరణములుగల, రవిః = ఆదిత్యగణమున్ను, మరుతాం = మరుత్తులనెడు దేవతలలో, మరీచిః = మరీచియను వాయువున్ను, అస్మి = అగుచున్నాను, అహం = నేను, నక్షత్రాణాం = నక్షత్రములకు, శశీ = చంద్రుడను, (అస్మి = అగుచున్నాను).

తా॥ నేను అదితి పుత్రులలో విష్ణువున్ను, లోకమునకు వెలుగునిచ్చు వాటిలో కిరణములుగల ఆదిత్యగణమున్ను, మరుత్తులనెడు దేవతలలో మరీచి యనెడు వాయువున్ను, నక్షత్రములకు పతి యగు చంద్రుడనున్ను అగుచున్నాను.

22. శ్లో. వేదానాం సామవేదోఽస్మి । దేవానా మస్మి వాసవః
ఇన్ద్రియాణాం మన శ్చాస్మి । భూతానా మస్మి చేతనా॥

అర్థము :- వేదానాం = నాలుగువేదములలో, సామవేదః = సామవేదము, అస్మి = అగుచున్నాను, దేవానాం = దేవతలలో, వాసవః = దేవేంద్రుడను, అస్మి = అగుచున్నాను. ఇన్ద్రియాణాం = ఇంద్రియములలో, మనః చ = మనస్సున్ను, అస్మి = అగుచున్నాను, భూతానాం = చైతన్యముగల భూతములకు గల, చేతనా = చైతన్యమున్ను, అస్మి = అగుచున్నాను.

తా॥ నాలుగు వేదములలో సహస్రశాఖలుగల శ్రేష్ఠమైన సామవేదమున్ను, దేవతలకు ప్రభువగు దేవేంద్రుడున్ను, పదునొకండు యింద్రియములలో ప్రధానమైన మనస్సున్ను, చేతనాయుతములగు భూతములకుగల తెలివియు నేనే యగుచున్నాను.

23. శ్లో. రుద్రాణాం శఙ్కర శ్చాస్మి । విత్తేశో యక్షరక్షసామ్॥
వసూనాం పావక శ్చాస్మి । మేరు శ్శిఖరిణా మహమ్॥

అర్థము :- రుద్రాణాం = ఏకాదశరుద్రులలో, శఙ్కరః చ = శంకరుడను, అస్మి = అగుచున్నాను, యక్షరక్షసాం = యక్షులకును రాక్షసులకును, విత్తేశః = ప్రభువగు కుబేరుడను, వసూనాం = అష్టవసువులలో, పావకః చ = అగ్నియును, శిఖరిణాం = శిఖరముగల పర్వతములలో, మేరుః = మేరు పర్వతమును, అహం = నేను, అస్మి = అగుచున్నాను.

తా॥ ఏకాదశరుద్రులలో శంకరుడనున్ను, యక్షరాక్షసులకు ప్రభువగు కుబేరుడను, అష్టవసువులలో అగ్నియను వసువును శిఖరములుగల పర్వతములలో మేరు పర్వతమునున్ను నేనే యగుచున్నాను.

24. శ్లో. పురోధసాం చ ముఖ్యం మాం । విద్ధి పార్థ ! బృహస్పతిమ్
సేనానీనా మహం స్కన్ద । స్సరసా మస్మి సాగరః॥

అర్థము :- పార్థ = అర్జునా। మాం = నన్ను, పురోధసాం = పురోహితులలో, ముఖ్యం = ముఖ్యమైన, బృహస్పతిం = బృహస్పతినిగా, విద్ధి = తెలుసుకొనుము, అహం = నేను, సేనానీనాం = సేనాధిపతులలో, స్కన్దః = కుమారస్వామియున్ను, సరసాం = సరస్సులలో, సాగరః చ = సముద్రుడను, అస్మి = అగుచున్నాను.

తా॥ అర్జునా ! పురోహితులలో ప్రధానమైన బృహస్పతిని నేను, సేనాధిపతులలో కుమారస్వామిని నేను, సరస్సులలో సముద్రుడను నేనే అగుచున్నాను.

25. శ్లో. మహర్షీణాం భృగు రహం । గిరా మస్మ్యేక మక్షరమ్
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి । స్థావరాణాం హిమాలయః॥

అర్థము :- మహర్షీణాం = మహర్షులలో, భృగుః = భృగుమహామునిని, అహం = నేను, గిరాం = శబ్దములలో, ఏకం = ఒక, అక్షరం = ప్రణవము, అహం = నేను, అస్మి = అగుచున్నాను, యజ్ఞానాం = యజ్ఞములలో, జపయజ్ఞః = జపయజ్ఞము, అస్మి = అగుచున్నాను. స్థావరాణాం = పర్వతములలో, హిమాలయః = హిమవత్పర్వతము, అస్మి = అగుచున్నాను.

తా॥ మరీచి మొదలగు మహర్షులలో భృగుమహర్షిని నేను. అర్థవంతమైన శబ్దములలో ప్రణవము నేను. యజ్ఞములలో గొప్పదియైన జపయజ్ఞము నేను. పర్వతములలో హిమవత్పర్వతమును నేనే యగుచున్నాను.

26. శ్లో. అశ్వత్థ స్సర్వవృక్షాణాం । దేవర్షీణాం చ నారదః
గంధర్వాణాం చిత్రరథః । సిద్ధానాం కపిలో మునిః॥

అర్థము — సర్వవృక్షాణాం = సకలవృక్షములలో, అశ్వత్థః = రావిచెట్టున్ను. దేవర్షీణాం = దేవర్షులలో, నారదఃచ = నారదుడను. గంధర్వాణాం = గంధర్వులలో, చిత్రరథః = చిత్రరథుడను. సిద్ధానాం = సిద్ధులలో, కపిలః మునిః = కపిలమహర్షియును. (అహం = నేను. అస్మి = అగుచున్నాను)

తా॥ సకల వృక్షములలోను పూజ్యమగు రావిచెట్టును నేను, దేవర్షులలో నారదుడను నేను, గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపిల మహర్షినిన్ని నేనే యగుచున్నాను.

27. శ్లో. ఉచ్చైః శ్శ్రవస మశ్వానాం । విద్ధి మా మమృతోద్భవమ్
ఐరావతం గజేన్ద్రాణాం । నరాణాం చ నరాధిపమ్॥

అర్థము :- అశ్వానాం = గుఱ్ఱములలో, అమృతోద్భవం = జలమునందుపుట్టిన, ఉచ్చైః శ్రవసం = ఉచ్చైశ్శ్రవముగను, గజేన్ద్రాణాం = దిగ్గజములలో, ఐరావతం = ఐరావతముగను, నరాణాం = మనుష్యులలో, నరాధిపం = రాజునుగను, మాం = నన్ను, విద్ధి = తెలుసుకొనుము.

తా॥ గుఱ్ఱములలో సముద్ర మథన సమయమున బుట్టిన ఉచ్చైశ్శ్రవమనెడు గుఱ్ఱమును నేను, దిగ్గజములలో ఐరావతమును నేను, మనుష్యులలో రాజునున్ను నేనే యగుచున్నాను.

28. శ్లో. ఆయుధానా మహం వజ్రం । ధేనూనా మస్మి కామధుక్
ప్రజనశ్చాస్మి కన్దర్పః । సర్పాణా మస్మి వాసుకిః॥

అర్థము :– అహం = నేను, ఆయుధానాం = ఆయుధములలో, వజ్రం = వజ్రాయుధమును. ధేనూనాం = ఆవులలో, కామధుక్ = కామధేనువును, అస్మి = అగుచున్నాను, ప్రజనః = సంతానకారణమగు, కందర్పః = మన్మథుడను, అస్మి = అగుచున్నాను, సర్పాణాం = ఒకతల పాములలో, వాసుకిః చ = వాసుకియు, అస్మి = అగుచున్నాను.

తా॥ ఆయుధములలో వజ్రాయుధమున్ను, ఆవులలో కామధేనువున్ను, సంతాన కారణమైన మన్మథుడను, ఒక తలగల పాములలో వాసుకియు నేనే యగుచున్నాను.

29. శ్లో. అనన్త శ్చాస్మి నాగానాం । వరుణో యాదసా మహమ్
పితౄణా మర్యమా చాస్మి । యమ స్సంయమతా మహమ్॥

అర్థము :– అహం = నేను, నాగానాం = అనేకతలలుగల పాములలో, అనన్తః = అనంతుడను, యాదసాం = నీటియందువసించు ప్రాణులలో, వరుణః = వరుణుడనున్ను, అస్మి = అగుచున్నాను, అహం = నేను, పితౄణాం = పితృదేవతలలో, అర్యమా = అర్యముడను, సంయమతాం = దండించువారలలో, యమః = యముడను, అస్మి = అగుచున్నాను.

తా॥ అనేక తలలుగల పాములలో ఆదిశేషుడను నేను, జలచరములకు ప్రభువగు వరుణుడను నేను. పితృదేవతలలో అర్యముడను నేను. దండించు వారలలో యముడనున్ను నేనే యగుచున్నాను.

30. శ్లో. ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం । కాలః కలయతా మహమ్
మృగాణాం చ మృగేన్ద్రోఽహం । వైనతేయశ్చ పక్షిణామ్॥

అర్థము :— అహం = నేను, దైత్యానాం = దైత్యులలో, ప్రహ్లాదః = ప్రహ్లాదుడను, కలయతాం = గణించువారలలో, కాలః = మృత్యువును, అస్మి = అగుచున్నాను. అహం = నేను, మృగాణాం = మృగములలో, మృగేన్ద్రః = సింహమును, పక్షిణాం = పక్షులలో, వైనతేయః చ = గరుత్మంతుడనున్ను (అస్మి = అగుచున్నాను)

తా॥ దైత్యులలో ప్రహ్లాదుడను, అనర్థమును కలిగింపగోరి సమయమును లెక్కించువారలలో మృత్యువును మృగములలో సింహమును పక్షులలో గరుత్మంతుడను నేనే యగుచున్నాను.

31. శ్లో. పవనః పవతా మస్మి । రామ శ్శస్త్రభృతా మహమ్
ఝషాణాం మకర శ్చా స్మి । స్రోతసా మస్మి జాహ్నవీ॥

అర్థము :— పవతాం = గమనస్వభావముగలవారలలో, పవనః = వాయువు, అస్మి = అగుచున్నాను. శస్త్రభృతాం = ఆయుధధారులలో, రామః = శ్రీరాముడను, అహం = నేను, ఝషాణాం = మత్స్యములలో, మకరః = మొసలిని, అస్మి = అగుచున్నాను. స్రోతసాం = ప్రవాహములలో, జాహ్నవీ = గంగను, అస్మి = అగుచున్నాను.

తా॥ ఎడతెగని గమనస్వభావము గలవారిలో వాయువును, అమోఘ శస్త్రముల ధరించువారలలో రాముడను, మత్స్యములలో మొసలిని, ప్రవహించు నదులలో గంగను నేనే యగుచున్నాను.

32. శ్లో. సర్గాణా మాది రన్త శ్చ । మధ్యం చై వా హ మర్జున :
అధ్యాత్మవిద్యా విద్యానాం । వాదః ప్రవదతా మహమ్॥

అర్థము :— అర్జున = అర్జునుడా ! సర్గాణాం = సృజింపబడువాటికి, ఆదిః = పుట్టుటకు కారణమును, మధ్యం = రక్షకుడను. అన్తః చ = నాశకుడను, అహం ఏవ = నేనే, విద్యానాం = విద్యలలో, అధ్యాత్మవిద్యా = బ్రహ్మవిద్యయు, ప్రవదతాం = వాదించువారియొక్క, వాదః = వాదమును, అహం = నేను.

తా॥ సృజింపబడు ప్రాణులకు సృష్టికర్తను, సంహరింపబడు వారికి సంహారకర్తను, పాలింపబడువారికి పాలకుడను, విద్యలలో వేదాంతవిద్యను వాదించువారలలో తత్వనిర్ణయముకొఱకు ప్రవర్తించు వాదమును నేనే యగుచున్నాను.

33. శ్లో. అక్షరాణా మకారో ఽస్మి । ద్వన్ద్వ స్సామాసికస్య చ
అహ మేవా క్షయః కాలః । ధాతా హం విశ్వతో ముఖః॥

అర్థము :— అక్షరాణాం = అక్షరములలో, అకారః = అకారమును, సామాసికస్య చ = సమాస సమూహములో, ద్వన్ద్వః చ = ద్వంద్వసమాసమున్ను, అస్మి = అగుచున్నాను, అక్షయః = నాశనములేని, కాలః = కాలము, అహం ఏవ = నేనే, విశ్వతోముఖః = చతుర్ముఖములుగల, ధాతా = బ్రహ్మయు, అహం = నేను.

తా॥ అక్షరములలో అకారమును సమాససమూహములో ద్వంద్వ సమాసమును నాశరహితమగు కాలమును, అన్నిదిక్కులకు ముఖములుగల బ్రహ్మను నేనే యగుచున్నాను.

34. శ్లో. మృత్యు స్సర్వహర శ్చాహ । ముద్భవ శ్చ భవిష్యతామ్
కీర్తి శ్శ్రీ ర్వాక్చ నారీణాం । స్మృతి ర్మేధా ధృతిః క్షమా॥

అర్థము :— సర్వహరః = సకల ప్రాణులను హరించునట్టి, మృత్యుః చ = మృత్యువును, భవిష్యతాం = పుట్టబోవువారియొక్క, ఉద్భవః చ = పుట్టుకయు, అహం = నేను, అస్మి = అగుచున్నాను, నారీణాం = స్త్రీలలో, శ్రీః = లక్ష్మియు, కీర్తిః = కీర్తియు, వాక్ చ = సరస్వతియున్ను, స్మృతిః = జ్ఞాపకశక్తియు, మేధా = బుద్ధియు, ధృతిః = ధైర్యమును, క్షమా = ఓరిమియు (అహం = నేను, అస్మి = అగుచున్నాను).

తా॥ సకలప్రాణుల ప్రాణమును హరించునట్టి మృత్యువును, పుట్టువారి పుట్టుకయు నేను కర్మయు, స్త్రీలలో లక్ష్మి, కీర్తి, వాక్కు, జ్ఞాపకశక్తి, బుద్ధి, ధైర్యము, ఓర్పు అను ఇవి యన్నియు నేనే యగుచున్నాను.

35. శ్లో. బృహత్సామ తథా సామ్నాం । గాయత్రీ ఛన్దసా మహమ్
మాసానాం మార్గశీర్షో ఽహం । ఋతూనాం కుసుమాకరః॥

అర్థము:— సామ్నాం = సామగానములలో, బృహత్సామ = బృహత్సామయు, తథా = అట్లే, ఛన్దసాం = ఛందస్సులలో, గాయత్రీ = గాయత్రియును, అహం = నేను, మాసానాం = నెలలలో, మార్గశీర్షః = మార్గశిరమాసమున్ను, ఋతూనాం = ఋతువులలో, కుసుమాకరః = వసంత ఋతువును, అహం = నేను (అస్మి = అగుచున్నాను).

తా॥ సామములలో బృహత్సామమున్ను ఛందస్సులలో గాయత్రియు మాసములలో మార్గశిర మాసమును ఋతువులలో వసంత ఋతువును నేనే యగుచున్నాను.

36. శ్లో. ద్యూతం ఛలయతా మస్మి । తేజ స్తేజస్వినా మహమ్
జయోఽస్మివ్యవసాయోఽస్మి । సత్త్వం సత్త్వవతామహమ్॥

అర్థము :– అహం = నేను, ఛలయతాం = వంచనచేయువారిలో, ద్యూతం = జూదమును, తేజస్వినాం = తేజోవంతులయొక్క, తేజః = తేజస్సును, అస్మి = అగుచున్నాను, జయః = జయము, అస్మి = అగుచున్నాను, వ్యవసాయః = ప్రయత్నము, అస్మి = అగుచున్నాను, సత్త్వవతాం = సాత్త్వికులయొక్క, సత్త్వం = సత్త్వగుణమును, అహం = నేను (అస్మి = అగుచున్నాను).

తా॥ వంచనకు ఆస్పదమైన వాటిలో జూదమును, తేజోవంతుల యొక్క తేజస్సును, జయముకలవారియొక్క విజయమును, కార్యసిద్ధికై ప్రయత్నించువారియొక్క ప్రయత్నమును, సాత్వికులయందలి సత్వగుణమును నేనే యగుచున్నాను.

37. శ్లో. వృష్ణీనాం వాసుదేవో ఽస్మి । పాణ్డవానాం ధనఞ్జయః
మునీనామ ప్యహం వ్యాసః । కవీనా ముశనా కవిః॥

అర్థము :– వృష్ణీనాం = యాదవులలో, వాసుదేవః = వసుదేవపుత్రుడను, అస్మి = అగుచున్నాను, పాణ్డవానాం = పాండవులలో, ధనఞ్జయః అపి = అర్జునుడనున్ను, మునీనాం = మననశీలులలో, వ్యాసః = వ్యాసుడను. కవీనాం = విద్వాంసులలో, ఉశనాకవిః = శుక్రుడనెడు విద్వాంసుడను, అహం = నేనే (అస్మి = అగుచున్నాను).

తా॥ వృష్ణివంశమునకు చెందిన యాదవులలో వాసుదేవుడను, పాండవులలో అర్జునుడను, మునులలో వ్యాసుడను, విద్వాంసులలో శుక్రాచార్యుడను, నేనే యగుచున్నాను.

38. శ్లో. దణ్డో దమయతా మస్మి । నీతి రస్మి జిగీషతామ్
మౌనం చైవా స్మి గుహ్యానాం । జ్ఞానం జ్ఞానవతామహమ్॥

అర్థము :– దమయతాం = శిక్షించువారియొక్క. దణ్డః = శిక్ష. అస్మి = అగుచున్నాను. జిగీషతాం = జయింపగోరువారియొక్క. నీతిః = సామదానాది రాజనీతియు. అస్మి = అగుచున్నాను. గుహ్యానాం = రహస్యములలో, మౌనం = మౌనము. అస్మి = అగుచున్నాను. జ్ఞానవతాం = జ్ఞానము కలవారియొక్క. జ్ఞానం = జ్ఞానము. అహం = నేను (అస్మి = అగుచున్నాను).

తా॥ శిక్షించువారియొక్క శిక్షయు, జయింపగోరువారి జయోపాయమగు సామాది రాజనీతియు, రహస్యములను దాచెడు ఉపాయములలో మౌనమును, జ్ఞానవంతులలో జ్ఞానమును, నేనే యగుచున్నాను.

అవ. ఈ ప్రకరణమును ఉపసంహరించుటకై విభూతి సంక్షేపము నుపదేశించుచున్నాడు.

39. శ్లో. యచ్చాపి సర్వభూతానాం । బీజం త దహ మర్జున
న తదస్తి వినా యత్స్యాత్ । మయా భూతం చరాచరమ్॥

అర్థము :– అర్జున = అర్జునుడా! యత్ = ఏది. సర్వభూతానాం = సకల భూతములకు. బీజం = కారణమో, తత్ అపిచ = అదియున్ను. అహం = నేను. యత్ = ఏది. మయావినా = నన్ను విడచి. స్యాత్ = ఉండునో, తత్ = అట్టి. చరాచరం = చేతనా చేతనరూపమైన. భూతం = భూత సమూహము. నాస్తి = లేదు.

తా॥ అర్జునా! సకల భూతములకు కారణమైన వాడను నేనే యగుచున్నాను. జంగమ స్థావరరూపమైన సమస్త వస్తుసమూహము నకు ఆత్మభూతమైన నన్ను విడచి యుండునది ఒక్కటియు లేదు.

అవ. సాకల్యముగా జెప్పుటకు శక్యముగాదని వెనుక చెప్పినట్లే తిరిగి చెప్పుచున్నాడు.

40. శ్లో. నాన్తోఽస్తి మమ దివ్యానాం । విభూతీనాం పరన్తప ।
ఏష తూద్దేశతః ప్రోక్తః । విభూతే ర్విస్తరో మయా॥

అర్థము :- పరన్తప ! — అర్జునా ! దివ్యానాం = కల్యాణములైన, మమ = నాయొక్క, విభూతీనాం = విభూతులకు, అన్తః = అంతము, న అస్తి = లేదు, విభూతేః = విభూతియొక్క, ఏషః = ఈ, విస్తరః తు = వివిధ యన్ననో, ఉద్దేశతః = సంక్షేపముగా, మయా = నాచేత, ప్రోక్తః = చెప్పబడినది.

తా॥ అర్జునా ! కల్యాణ మయములగు నావిభూతులకు పరిమితిలేదు. ఇంతవరకు నా విభూతి విస్తారమును కొన్ని ఉపాధులచే సంగ్రహముగ నీకు జెప్పితిని.

అవ. చెప్పబడనివియు, ముఖ్యముగా చెప్పదగినవియు నగు ప్రధాన విభూతులను తెలుపుచు విరమించుచున్నాడు.

41. శ్లో. యద్య ద్విభూతిమ త్సత్త్వం । శ్రీమ దూర్జిత మేవ వా
త త్తదే వావగచ్ఛ త్వం । మమ తేజోఽంశసమ్భవమ్॥

అర్థము :- విభూతిమత్ = నాకు నియమించతగియున్నదియు, శ్రీమత్ = కాంతియుక్తమైనదియు, ఊర్జితం ఏవ వా = శుభకార్యములయందు ఉద్యుక్తమైనదియు నగు, సత్త్వం = భూతసమూహము, యత్ యత్ అస్తి = ఏదేది కలదో, తత్ తత్ = ఆయా ప్రాణిసమూహము, మమ = నాయొక్క, తేజోఽంశసంభవం, ఏవ = నియమన శక్తియొక్క స్వల్ప భాగమువలన పుట్టినదిగా, త్వం = నీవు, అవగచ్ఛ = తెలిసికొనుము.

తా॥ నాకు లోబడిన సంపత్తిగలదై, కాంతియుక్తమై కల్యాణ కార్యములయందుద్యుక్తమైన ప్రతివస్తువున్ను నా నియమన శక్తిలోని కొంతభాగమువలన పుట్టినదియే యని ఎఱుంగుము.

అవ. ప్రధానములును అప్రధానములు నగు సకల విభూతులను సంగ్రహముగ జెప్పుచున్నాడు.

42. శ్లో. అథవా బహు నైతేన । కిం జ్ఞానేన తవార్జున
విష్టభ్యాహ మిదం కృత్స్న । మేకాంశేన స్థితో జగత్॥

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విభూతి విస్తర యోగోనామ దశమోఽధ్యాయః

అర్థము :- అర్జున = అర్జునుడా ! అథవా = లేక, బహునా = విస్తారమైన, ఏతేన = ఈ, జ్ఞానేన = జ్ఞానముచేత, తవ = నీకు, కిం = ఏమిప్రయోజనము, అహం = నేను, కృత్స్నం = సమస్తమైన, ఇదం = ఈ, జగత్ = ప్రపంచమును, ఏకాంశేన = స్వల్పభాగముచేత, విష్టభ్య = నిలిపి, స్థితః = ఉన్నాను.

తా॥ ఓ అర్జునా ! నీకు నేను ఈ జ్ఞానమును విస్తారముగా చెప్పుచుండుటవలన ప్రయోజనములేదు. నీకు తెలియునటుల సంగ్రహముగా తెలిపెదను వినుము. ఈ సమస్త జగత్తును నామహిమలోని అతిస్వల్ప భాగముచే నిలబెట్టియున్నాను.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన శ్రీభగవద్గీత యందలి విభూతి విస్తర యోగమనెడు పదియవ అధ్యాయము.

ఈ అధ్యాయమందలి శ్లోకసంఖ్య 42
ఇప్పటికి మొత్తము అయిన శ్లోకములసంఖ్య 414

---

## ఏకాదశాధ్యాయార్థ సంగ్రహము

శ్లో. ఏకాదశే స్వయాథాత్మ్య
సాక్షాత్కారావలోకనమ్
దత్త ముక్తం విదిప్రాప్త్యో
ర్భక్త్యైకోపాయతా తథా॥

అర్థము :— స్వయాథాత్మ్య సాక్షాత్కారావలోకనం : స్వ = తన స్వరూపముయొక్క, యాథాత్మ్య = నిజస్థితిని, సాక్షాత్కార = దర్శించుటకుగాను, అవలోకనం = దివ్యచక్షుస్సు, దత్తం = ఇవ్వబడెను, తథా = అ ప్రకారము గానే. విధిప్రాప్త్యోః = తనను తెలుసుకొనుటకును, పొందుటకును, భక్త్యైకోపాయతా = భక్తియొక్కటే ఉపాయమగుటయును, ఏకాదశే = ఏకాదశాధ్యాయమున, ఉక్తం = చెప్పబడినది.

తా॥ పదునొకండవ యధ్యాయమున నర్జునునకు భగవంతునిచే తనను నిజరూపముతో జూచుటకు సాధనమగు దివ్యనేత్ర మొసంగబడె ననియు, తనను లెస్సగ నెఱుంగుటకును, పొందుటకును, చూచుటకును ముఖ్యసాధనము భక్తియే యని ఉపదేశింపబడెననియు చెప్పబడెను.

# శ్రీ భగవద్గీత - ఏకాదశాధ్యాయము

## విషయసూచిక

శ్లోక సంఖ్య.

శ్రీ హయగ్రీవాయ నమః



# ప్రచార విభాగము

## శ్రీబదరీనాథ్ క్షేత్రమున శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘమువారిచే నిర్మింపబడిన అష్టాక్షరీ క్షేత్రోద్ఘాటన – ఆళ్వారుల సంప్రోక్షణ

### కార్యక్రమ వివరములు

ఆళ్వారుల ప్రతిష్ఠా మహోత్సవము 5-8-59 వ తేదీని ప్రారంభింపబడి 7-8-59 వ తేదీ మధ్యాహ్నము పూర్ణాహుతితో ముగింపబడినది. 8-8-59 వ తేదీ రాత్రి అష్టాక్షరీ క్షేత్ర గృహప్రవేశము జరుపబడి 9-8-59 వ తేదీ భూరి తదీయారాధన ప్రసాద వినియోగములతో ముగింపబడినది.

ఇందులకై దక్షిణ ప్రాంతమునుండి సుమారు 150 మంది భక్తులు వచ్చియుండిరి. స్థానికులగు స్త్రీలు, పురుషులు కూడా పెక్కుమంది ఈ మహోత్సవములలో ఉత్సాహముతో పాల్గొనిరి.

### విగ్రహములకై విరాళముల నొసంగిన భక్తుల తిరునామములు.

శ్రీమాన్ న. చ. శఠగోపాలాచార్యులుగారు, రాజమండ్రి. నమ్మాళ్వార్లకై
శ్రీమాన్ రేపాక శేషావతారంగారు, పాలకొల్లు. తిరుమంగైయాళ్వార్లకై
శ్రీమాన్ వంకదారు సత్యనారాయణగారు, ఏలూరు. పెరియాళ్వార్లకై
శ్రీమతి నూరపనేని సీతారామమ్మగారు, తాడేపల్లి. చక్రత్తాళ్వార్లకై

వీరు విగ్రహనిర్మాణ ప్రతిష్ఠాదులకు ఒక్కొక్కరు రు. 600-0-0 చొ॥న మొత్తం రు. 2400-0-0 సమర్పించిరి.

### ఈ కార్యక్రమములో పాల్గొనిన మహాశయులు

#### నిర్వాహకులు

శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు
శ్రీ శ్రీ శ్రీ త్రిదండి వేదాంత రామానుజ పామకాజీయ్యర్ స్వామివారు
శ్రీ మహంత్ సుదర్శనాచార్య స్వామిజీ

#### ఋత్విక్కులు

పాంచరాత్రాగమ విద్వాన్ శ్రీ గోపినంబాళం, దాసకూర్మాచార్యులుగారు, శ్రీ కూర్మం.
పాంచరాత్రాగమ విద్వాన్ శ్రీ చామర్తి సీతారామాచార్యులుగారు శ్రీకూర్మం

#### అర్చకులు

శ్రీమాన్ జానకీ ప్రసన్నాచార్య స్వామీజీ, రీవా

## ప రి చా ర కు లు

శ్రీమాన్ న. చ. రంగోపాచార్యులుగారు
శ్రీమాన్ న. చ. రఘునాథాచార్యులు గారు, వేణుగోపాలపురం.
శ్రీమాన్ రామప్రసన్నాచార్యజీ, రీవా
శ్రీమాన్ మధుసూదనాచార్య జీ (శృంగారి), గంగోత్రి

## పా చ కు లు

శ్రీమాన్ బృందావనం రామానుజాచార్యులుగారు, నెల్లూరు

## వే దా ధ్యా ప కు లు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ గుదిమెళ్ళ వెంకట నరసింహాచార్యులుగారు
సలక్షణ కృష్ణయజుర్వేదవిద్వాన్ - వేదపారాయణకు
పెద్దగూడూరు - కృష్ణా జిల్లా

## నా లా యి రా ధ్యా ప కు లు

శ్రీ ఉ. వే. శ్రీమాన్ తిరుమలపెద్దింటి సంపత్కుమార స్వామివారు, సింహాచలం.
సింహాచల దేవస్థానం - శ్రీభాష్యపండితులు
శ్రీ ఉ. వే. శ్రీమాన్ నడాదూరి వేదాంతాచార్యులుగారు - పుట్టగుంట

## పా రా య ణ ప రు లు

శ్రీమాన్ పరాంకుశాచార్యజీ, డార్జిలింగు - గీతాపారాయణం
శ్రీమాన్ ముకుందాచార్యజీ, సాలగ్రామ క్షేత్రం - సుదర్శనశతకం
శ్రీమాన్ ఛోటా పరాంకుశాచార్యజీ, ముక్తినారాయణ్ - ఆళవందార్
శ్రీమాన్ ధరణీధరాచార్యజీ, జనకపూర్ - శ్రీవిష్ణు సహస్రనామం
శ్రీమాన్ శ్రీ హయగ్రీవస్వామీజీ, గద్వాల్ - అష్టాక్షరీజపం
శ్రీమాన్ శ్రీనివాసప్రసన్నాచార్యజీ, జ్యోతిర్మఠం - గాయత్రీజపం

ఈమహోత్సవములకు తదీయారాధనకై విరాళముల నొసంగిన భక్తులపేర్లు.

| | రు. న పైసలు |
|---|---|
| శ్రీమతి చాప్రారాణీగారు - చాప్రా | 101-00 |
| శ్రీమతి అంబికాదేవిగారు - పాట్నా | 101-00 |
| శ్రీమతి సూరపనేని సీతారామమ్మగారు - తాడేపల్లి | 100-00 |
| శ్రీమాన్ ఎర్రబల్లి వెంకటేశ్వరరావు జమీందారుగారు - కల్లెడ | 100-00 |
| కలవపాముల భక్తబృందం శ్రీమతి భగవన్నామంగారి ద్వారా | 50-00 |
| శ్రీ భగవన్నామంగారి ద్వారా ఇతరభక్తులవలన | 45-00 |
| శ్రీమతి దమయంతమ్మగారు - ఉనికిలి | 50-00 |
| „ వెంకుబాయమ్మగారు - ఉనికిలి | 50-00 |
| „ కొమాండూరి. అలివేలమ్మగారు | 30-00 |
| „ చెలికాని పెద్దసీతాయమ్మగారు - బొబ్బిలి | 25-00 |
| „ చెలికాని చిన్నసీతాయమ్మగారు - బొబ్బిలి | 50-00 |
| శ్రీమాన్ తె. కం. జగన్నాథాచార్యులు గారు - ఏలూరు | 25-00 |

| | |
|---|---|
| శ్రీమతి చెలిసాని మాణిక్యమ్మగారు | 25-00 |
| శ్రీమతి ఎర్నేని లక్ష్మీకాంతమ్మగారు - కొరజ | 22-00 |
| శ్రీమతి గోపు శేషావతారంగారి భార్య ధనమ్మగారు, విజయవాడ | 14-00 |
| శ్రీమాన్ పి. ఇ. సుబ్రహ్మణ్య అయ్యర్ గారు విశాఖపట్టణం కలింగపట్నం గీతామండలివారు | 10-00 |
| శ్రీ ఉ. వే. మ. రా. నరసింహాచార్యులుగారి ద్వారా | |
| „ కొర్లాం నరసింహస్వామిగారు- కొర్లాం- | 10-00 |
| „ ఆరంగ అప్పారావుగారు - కొర్లాం | 10-00 |
| శ్రీమతి దామెర లక్ష్మీరామాయమ్మాదేవిగారు - శైలంకరం | 10-00 |
| శ్రీమతి అలత్తూరు చిన్నకుట్టిమ్మగారు - మదరాసు | 6-00 |
| శ్రీమతి కందాళై సుగుణమ్మగారు - నరసాపురం | 10-00 |
| శ్రీవాసుదాశ్రమం రంగనాయకమ్మగారు- | 5-00 |
| శ్రీన. చ. సుభద్రమ్మగారు- | 5-00 |
| శ్రీ ఎండూరి తాయారమ్మగారు- | 5-00 |
| శ్రీ వి. సుగుణమ్మగారు- | 2-00 |
| „ దేశంశెట్టి ఆళవందారు గారు | 3-00 |
| శ్రీముప్పిరాల నరసింహాచార్యులుగారు | 2-00 |
| గీతా ట్రావెలర్సువారు - విజయవాడ. | 500-00 |
| చిల్లర జమలు - | 23-00 |
| మరియు- | 1400-00 |
| విగ్రహ ప్రతిష్ఠాపకుల విరాళములు | 2400-00 |
| మొత్తం- | 3800 00 |

## ఈ మహోత్సవములకైన ఖర్చులు

| | |
|---|---|
| తదీయారాధనకై | 1400-0-0 |
| ఋత్విక్కులు అధ్యాపకులు వగైరాలకు సన్మానం | 1300-0-0 |
| సంభారములకు | 200-0-0 |
| ప్రయాణం ఖర్చులు | 150-0-0 |
| సింహాసనం చేయించినందుకు | 50-0-0 |
| ఆహ్వానపత్రికల అచ్చు పోస్టింగు | 100-0-0 |
| విగ్రహములు చేయించుటకు | 600-0-0 |
| మొత్తంఖర్చు | 3800-0-0 |

అష్టాక్షరీక్షేత్ర రామానుజకూట సత్సంగసదనముల ఉద్ఘాటనోత్సవము ది 8-8-1959 రాత్రి గం. 8-25 కు అతివైభవముగా జరిగినది. ఆ ప్రదేశమంతయూ దీపములచేతను, రంగవల్లులచేతను చక్కగా అలంకరింపబడినది. ముత్తైదులు సుమారు ముప్పది మంది వరకు తీర్థముతో పూర్ణకలశములు తీసుకొని వెంబడించగా ముందుగ కన్యలు పిమ్మట గోవులు పిమ్మట ముత్తైదులు పిమ్మట వేదఘోషతో బ్రాహ్మణోత్తములు భవనములందు ప్రవేశించిరి. పిమ్మట విష్వక్సేనారాధనము పుణ్యాహవచనము వాస్తు శాంతిహోమములు తిరువారాధనము సేవకాలము తీర్థ

ప్రసాదవినియోగములు, పొంగించినపాల పాయసములు వినియోగము ఇత్యాదులు చాల విలక్షణముగ జరిగెను. రామానుజకూటములో ప్రతిగదిలోను బదరీనారాయణ వాతావరణమునకు చలికి తగినటుల యాత్రికులకు వలయు సర్వసౌకర్యములకు అనుగుణముగ 25 రకముల సామానులు అమర్చబడినవి. ఇవియేగాక యింకను యాత్రికులకు అవసరమైన అన్నిరకముల సామానులు పుష్కలముగ సమకూర్చబడినవి. సుమారు వెయ్యిమందికి తదీయారాధన చేయుటకు తగినంత పాత్రసామాను చిన్నవి పెద్దవి అన్నియు డబ్బురోళ్ళు రోకళ్ళు తిరుగలితో సహా సమకూర్చబడినవి. 30, 40, కుటుంబములు ఒకేపర్యాయము ప్రత్యేక ప్రత్యేకముగ వంటచేసుకొనుటకును సుఖముగా బసలు చేసి ఎన్నిదినములైన యుండుటకును వలయు వసతులు సామానులు సమకూర్చబడినవి.

## అష్టాక్షరీక్షేత్ర - రామానుజ కూటము నందలి ప్రతి గదిలోను ఉంచబడిన సామానులు:-

| | | |
|---|---|---|
| 1. | నేలమీద పరచు తివాచీ | - 10×7 సైజు |
| 2. | నేలమీదపరచు తివాచీ | - 6×4 సైజు |
| 3. | బల్లమీదపరచు తివాచీ | - 6×3 సైజు |
| 4. | బల్లమీదపరచు తివాచీ | - 6×2½ సైజు |
| 5. | పరుండుబల్ల | - 6×3 సైజు |
| 6. | కూర్చొనుబల్ల | - 6×2½ సైజు |
| 7. | హరికను లాంతరు | క్రొత్తది |
| 8. | చిన్నదీపము | 4 |
| 9. | రోజాయి | 4 |
| 10. | బ్లాంకెటు | 4 |
| 11. | స్టౌవ్ | 4 |
| 12. | ఇనుప కుంపటులు | 4 |
| 13. | ఇత్తడి బకెట్టు | 4 |
| 14. | ఇత్తడి చెంబు | 4 |
| 15. | ఇత్తడి పళ్ళెము పెద్దది | 4 |
| 16. | ఇత్తడి గ్లాసు | 4 |
| 17. | అద్దములు 2 | 4 |
| 18. | కర్రపీట (కూర్చొనుటకు) | |
| 19. | దర్భాసనము | 4 |
| 20. | చిత్రాసనము | 4 |
| 21. | కాళ్ళుతుడుచుకొను పీచు | 4 |
| 22. | తుడుచుబ్రష్షు | 4 |
| 23. | ఇనుపచిమ్మట | 4 |
| 24. | చిన్నబల్ల | |
| 25. | విసనికర్ర | |

శ్రీ హయగ్రీవాయనమః

### బదరికాశ్రమములో

# "అష్టాక్షరి" కృతిసమర్పణోత్సవము

అష్టాక్షరీమంత్ర ప్రాదుర్భావముచే బరమ విలక్షణమైన శ్రీ బదరికాశ్రమములో శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘమువారిచే బ్రతిష్ఠింపబడిన శ్రీభగవద్రామానుజులవారికి శ్రీమాన్ ఉ. వే. కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులవారు తాము రచించిన "అష్టాక్షరి" యను కృతిని అంకితము గావించిరి.

సభకు శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు అధ్యక్షత వహించిరి. శ్రీమాన్ ఉ. వె. విద్వాన్ తె. కం. గోపాలచార్యస్వామివారు సభను ప్రారంభించుచు ఈ బదరికాశ్రమములో అష్టాక్షరి అవిర్భవించుటయు అ అష్టాక్షరిని ఆసేతు శీతాచలముదాక శ్రీ భగవద్రామానుజులవారు వ్యాప్తిగావించుటయు ఆ అష్టాక్షరిపేరుతో నిచట మన శ్రీ జియ్యర్ స్వానివారు క్రతువు గావించి అష్టాక్షరి క్షేత్రమును సంపాదించి అష్టాక్షరి రామానుజ కూటమును నిర్మించుటయు ఈ శుభపరంపరకు తగినట్లుగా మన కవిగారు అష్టాక్షరి కృతిని రచించి శ్రీరామానుజుల వారికి అంకితము గావించుటయు ఎంతయో శ్లాఘనీయముగా నున్నదని ప్రశంసించిరి. కృతిసమర్పణకు ముందుగా శ్రీజియ్యర్ స్వామివారు కవిగారి గోత్రనామములతో శ్రీ భూసమేత శ్రీనివాసులకు సహస్ర నామార్చనయున్ను శ్రీ భగవద్రామానుజులవారికి అష్టోత్తర శత నామార్చనయు జరిపించిరి. పిమ్మట శ్రీ కవిగారు కృతిసమర్పణ కీ క్రింది పద్యములు చదివిరి.

కం॥ జయ, విజయోద్భవ, జయ, జయ
జయ, జయ, బదరీనివాస! శ్రీకళికాన్తా!
జయ, భగవద్రామానుజ!
జయ, సంశ్రిత శ్రీనివాస చరణసరోజా!

మ॥ మొదటన్ శ్రీతిరుమంత్రమిచ్చి గురురాణ్మూర్ధన్యుఁడై యున్న శ్రీ
బదరీనాథుని కత్కటాక్షమును సంపాదించి, సత్సంగమున్
సదనం బందున నవి - ప్రప - సంఘూర్ణ కృషి, సాక్షాత్కారమున్ పెందినా
వదిరా! లక్ష్మణయోగిసంయమి! యుఁక, నిశ్శ్రేయ, వర్ధిల్లుమా!

మ॥ ఒకఁ డష్టాక్షరిమంత్రమిచ్చి గురుడై యున్నాడు, నారాయణుం
డొకఁ డష్టాక్షరిభావమిచ్చి గురుడై యున్నాడు రామానుజం
డొక డష్టాక్షరి క్షేత్రమిచ్చి యతియై యున్నాడు నారాయణుం
డొకఁ డష్టాక్షరికావ్యమిచ్చి కవియై యున్నాడు, రామానుజం
డొకచోఁ గూడిన విన్నియోగములతో యూహింపసామాన్యమే

శా॥ ఏనాడో బదరీప్రదేశమున పన్నెండ్లయ్యెనో? యెంతగా
ధ్యానంబూని తపంబుసేసి తిరుమంత్రంబిచ్చినాడో కదా
శ్రీనారాయణుఁ డాత్మశక్తి నరునిన్ సృష్టించి శిష్యుండుగా
దానిన్ వ్యాప్తి నొనర్పఁజేసితి యతీంద్రా! యెంతధీరుండవో!

ఆ. వె. ఒకడు మంత్రదాత - యొకఁడు మంత్రగ్రహుఁ
డొకడు. శ్రీనివాసుఁ డొకడు యోగి
ఇరువురొక్కచోట కీనాడు చేరుట
బదరియయ్యె నేడు పరమపదము.

కం॥ సన్యాసికిఁ గృతియిచ్చిన
సన్యాసమె నాకొసంగఁ జాలునదియే.
సన్యాసమనగ - హరికద
విన్యాసమె గాదె - యదిలభించినజాలున్

గీ॥ శ్రీనివాసుఁడు కావున శ్రీసమేత
భాగ్యమకింత మిచ్చిరి భాగ్యకారు
లేను సన్యాసి కంకితమిచ్చి కృతిని
న్యాస లక్ష్మినిగోరితి నదియెచాలు

మ॥ ఇది అష్టాక్షరి పుట్టినట్టి స్థలమం చిచ్చోట నారాయణుం

డడిగాకీవును జేరినట్టి స్థలమం చష్టాక్షరీకావ్యమున్

ముదమేపార నొసంగినాడ నీక నాపుణ్యమ్ము పండెన్ గృపా

స్పదులౌ జియ్యరు వారొసంగిన కటాక్షస్ఫూర్తి యోగీశ్వరా!

శ్రీ కవిగారు కృతిసమర్పణ పద్యపఠనానంతరము అష్టాక్షరీ కృతిలోని కొన్నిపద్యములు చదివి విని పించిరి. మరియు కవిగారు ప్రథమాచార్యులైన బదరీనాథుని గురించి అష్టకమును రచించి చదివిరి, కృతిసమర్ప ణానంతరము శ్రీ జియ్యరుస్వామివారు కవిగారికి శ్రీ భగవద్రామానుజులవారి తీర్థము, శఠారి, ప్రసాదము, తోమాల మంగళాశాసన పూర్వకముగా సత్కరింపజేసిరి. పిమ్మట శ్రీమాన్ గోపాలాచార్య స్వామి వారు ఒకమాలను కవిగారిమెడలోవైచి కృతిసమర్పణ సత్కారమని కొంతనగదును, సత్కరింపగా ఆ సొమ్మును తిరిగి కవిగారు బదరీ భగవద్రామానుజులవారి శాశ్వతారాధనకు వినియోగింపవలసినదిగా సమర్పించిరి. పిదప శ్రీ జియ్యరుస్వామివారు యాత్రికులకు సభ్యులకందరకును శుభాక్షతలు ప్రసాదము నొసంగిరి. పిదప కవిగారు సభను ముగించుచు

శ్లో॥ బదరీశదయాపాత్రం । పరమై కాంతినాం వరం - గోపాలప్రవణం వందే । శ్రీమన్నారాయణం మునిం ॥

శ్లో॥ రామానుజస మారంభాం । గోపాలాచార్య మధ్యమాం - నారాయణార్య పర్యంతాం । వందేగురుపరంపరాం॥

అని ఆచార్య విషయకముగా స్తోత్రాను సంధానము గావించిరి.

## శ్రీ బదరీనారాయణో విజయతాం

# మా బదరీ యాత్ర

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారు బదరికాశ్రమములో నిర్మించిన శ్రీ అష్టాక్షరీక్షేత్ర రామానుజ కూటమునకు సత్సంగ సదనమునకు 8-8-59 వ తేదీ నాడు ప్రవేశమహోత్సవము జరుపుటకు సుముహూర్తము నిర్ణయింపగా నావేళకు యాత్రికులను బదరికాశ్రమమునకు ఉత్తరదేశయాత్రలు కాశ్మీరయాత్రలను సేవింపజేయు నియమముతో విజయవాడ గీతాట్రావెలర్సువారు రెండు స్పెషల్ రైల్వేక్యారేజిలను ఏర్పాటుచేసిరి. మొదటి రైలుబోగి 70 మంది యాత్రికులను 17-7-59 వ తేదీ రాత్రి విజయవాడనుండి బయలుదేరెను. ఆ భోగిలో యాత్రికుల సౌకర్యము నిమిత్తమై మంచి అనుభవముగల ఒక స్వామిని శ్రీకూర్మమునుండి శ్రీమాన్ ఉ. వె. శ్రీభాష్యం వెంకటాచార్య స్వామివారిని శ్రీజియ్యర్ స్వామివారు పంపిరి. వారి యాజమాన్యమున మొదటి భోగిలో సాపాటు సౌకర్యములు వేళకు వర్ణాశ్రమానుగుణముగా ఏర్పాటు విలక్షణముగా జరిపింపబడెను. ప్రతి మకామునుండి యాత్రికుల యోగక్షేమములు ఎప్పటి కప్పుడు శ్రీ జియ్యర్ స్వామివారికి బదరికి తెలియజేయుచుండెడివారు మొదటి బోగి విజయవాడనుండి బయలుదేరి రాజమండ్రి, అన్నవరం, సింహాచలం, పూరీజగన్నాథం, కలకత్తా. కాశీ, ప్రయాగ, హరిద్వారం ఇత్యాది తీర్థముల సేవింపజేయుచు హృషికేశం జేరెను. ఆ భోగిలో మేనేజరుగా నున్న శ్రీ సుబ్బారావుగారు యాత్రికులకు వలయు సౌకర్యములు గావించుచు సుముహూర్తపు వేళకు బదరికాశ్రమ మున కందరిని జేరవేసిరి. బదరికాశ్రమములో మూడుదినములు మనసార బదరీనాథుని. మనసంఘ పెరుమాళ్లను ఆవిష్కారణోత్సవమును తృప్తిదీరసేవించి శ్రీస్వామివారిచెంత తీర్థప్రసాదమును శుభాక్షతలు, మంగళాశాసనముల నుగ్రహించి మరల బదరినుండిబయలుదేరి సుఖముగానందరు హృషీకేశమునకు జేరుకొనిరి. అందు రెండవక్యారేజీ యాత్రికులు వచ్చువరకు మొదటిభోగిలోనియాత్రికులందరు సుఖముగా హృషీకేశములోనుండిరి. మొదటిభోగిలో సమర్థులైన తళియస్వాములునలుగురుండి యాత్రికులకు సకాలములో సర్వవిధరుచులతో సాపాటు ఏర్పాట్లు, గావించిరి.

రెండవ టూర్యారెష్టక్యారేజి 31-7 59 వతేది రాత్రి గం 10 లకు విజయవాడనుండి బయలుదేరినది. ఈ క్యారేజిలో యాత్రికులు 50 మందివరకుండిరి. ఈక్యారేజి సర్వవిధసౌకర్యములతో నిండియున్నది. ఇందులో మన సంఘకవిగారైన శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులవారు బయలుదేరి వచ్చుచుండుటచే తీర్థ

ప్రసాదగోష్ఠి రైలులోను దారిలోను విలక్షణముగా జరిగినది. ఒకసమర్థుడైన తళియస్వామి శ్రీకాకుళమునుండివచ్చెను రైలులో సాపాట్లు వర్ణాశ్రమానుగుణముగా ఏర్పాటుగావింపబడెను. రైలుప్రొప్రయిటరు శ్రీ పోతుకూచి వెంకటేశ్వర్లుగారు ఈక్యారేజిలో వచ్చుచుండుటచే బండికి కలయుఏర్పాట్లన్నియు అతిశ్రద్ధతో గావించిరి. 31-7-59 వ తేది రాత్రిబయలుదేరిన మాక్యారేజి 3-8-59 వతేది రాత్రికి హృషీకేశం చేరెను. హృషీకేశములో 4-8-59 వ తేది బయలుదేరిన మామోటారు ది 5-8-59 వతేది రాత్రికి పిప్పలికోట మకాంనకు చేరెను మోటారుప్రయాణములో రెండుమూడుచోట్ల రోడ్డుమీద కొండలువిరిగిపడి మార్గావరోధముకలిగించెను. 6-8-59 వతేది పిప్పలకోటనుండి బదరికి నడకప్రారంభించితిమి. దారిలో బెల్లాకుచ్చివద్ద పెద్దగాలివానతగిలి ఒకరోజు అందే నిలిచిపోతిమి. 6 వతేది పిప్పలకోటలో బయలుదేరినమేము 10-8-59 వతేది సాయంకాలమునకు బదరికిచేరితిమి శ్రావణమాసములో విపరీతవర్షము లగుటచే మార్గములో మాకు వర్షప్రతిబంధకముచేత బాటబాగులేక కొంతశ్రమపడవలసివచ్చెను. తుదకు బదరీనాథ దయచే బయలుదేరితిమి శ్రీజియ్యర్ స్వామివారు చిరునగవుతో కుశలప్రశ్న రూపముగా మాకందరకు హృదయపూర్వకముగా స్వాగతమిచ్చిరి యాత్రికులలోకొందరు మనరామానుజకూటములో వెంచేసిరి. మన రామానుజకూటము సకలవిధసౌకర్యములతో ఇంద్రభవనమువలెనున్నది. బదరిలో 3 రాత్రులుండి బదరీనాథుని మనశ్రీనివాస రామానుజస్వామివారిని సేవించి మరలసుఖముగా 16-8-59 వతేదికి హృషీకేశ మందరము చేరితిమి. ఇక్కడ 17 వతేది బయలుదేరి హరిద్వారం, ఢిల్లి, మథుర, బృందావనం, గోకులం, గోవర్ధనం సేవించుకొని ఈయాత్రికులందరు 24-8-59 వ తేదికి హాయిగా విజయవాడకు చేరుకొనిరి. మాబదరీ ప్రయాణమీవిధముగా మధురముగా మంగళాంతముగా ముగిసినది.

---

# ఒక మనవి

బదరీ శ్రీనివాసరామానుజ స్వామివారల శాశ్వత, తాత్కాలిక పూజావిరాళములిచ్చువారికి వారువారు ఇవ్వవలసియున్న బకాయిలను పంపవలసినదిగా M. O. ఫారములతో మేమితీవల జాబులు వ్రాసియున్నాము. ఈ పంపుటలో కొన్నిలోటుపాటులు మావలన జరిగినట్లు కొందరు వ్రాసిన జాబులవలన తెలియవచ్చినది. ఇందుకు మామనవి ఏమనగా మేము ప్రచారములో నుండుటచేత ఈ విరాళ ద్రవ్యములు కొంత ఆశ్రమమునకు, కొంత మాకు, కొంత ఏజంట్లకు చేరియుండుటచే ఈ మొత్తములన్నియు ఒకేరిజిష్టరులో ఒక కాలమున చేరక పోవుటచేత మావద్దయున్న వాగ్దానముల రిజిష్టరుపట్టియు, చిరానుబట్టియు పంపియుంటిమి. ఇప్పుడా లెక్కలన్నియు ఒకటచేర్చి సరిచూచుచున్నాము. కనుక విరాళదాతలు మేము పంపిన లెక్కప్రకారం హెచ్చుతగ్గులున్న మాకు తెలియజేసినచో ఆ పొరబాటును సవరించుకొందుము. శ్రీ జియ్యరుస్వామివారు ఈ విరాళముల తాలూకు రికార్డునంతయు బదరికి తెప్పించుకొని లెక్కలను సరిచూచుకొనుచున్నారు కాన విరాళదాతలు మేము పంపినలెక్కలలో హెచ్చుతగ్గులను తెలియజేయుచు చెల్లించవలసిన విరాళమును మేము పంపిన M. O. ఫారము ద్వారా బదరికి శ్రీ జియ్యరు స్వామివారికి పంపగోరుచున్నాము.

శ్రీ జియ్యరు స్వామివారు శ్రీ గోపాలాచార్య స్వామివారు బదరికాశ్రమములో వేంచేసియున్నారు. వారితో సంప్రదించవలసిన వారి అడ్రస్సుకు జాబులు వ్రాయవలెను. (అడ్రసుమాత్రము ఇంగ్లీషులో ఉండవలెను.

అడ్రసు :

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామాను జయ్యరు స్వామివారు

రామానుజకూటం - బదరీనాథ్ - గార్వాలజిల్లా

(యు. పి.) హిమాలయాస్)

బదరీ శ్రీనివాస, రామానుజ స్వామివారల శాశ్విత, తాత్కాలిక.

# పూ జా వి రా ళ ము లు.

శ్రీ గుళ్లపల్లి శ్రీరామశెట్టిగారు, నెల్లూరు - రు 29/-
„ నెలపావని పెదరామానుజంగారు, మలకాపల్లి 29/-
„ యన్ నరసింహాంగారు - విశాఖపట్నం - 11/-

క ట్నా లు

శ్రీ రావు లక్ష్మీనరసయ్యగారు, తిమ్మాపురం - శుక్రవారపూజా కట్నం - 3/-
„ మోతే తాయారమ్మగారు, ఏలూరు బదరీ అన్నదాన విశాళం - 20/-
„ యన్ రాఘవన్‌గారు, వనపాక - పంపినకట్నం 5/-
శ్రీ అప్పాది వెంకటరత్నంగారు (కడలి) 2-0-0
శ్రీ ఉప్పల పద్మనాభాచార్యులుగారు (పొద్దుటూరు) తమ కుమారుని (చి॥ శ్రీనివాసరామానుజుని, అక్షరాభ్యాసమునకుగా పంపిన కట్నం 2-0-0

శ్రీ వక్కలగడ్డ సీతమ్మగారు, ఏలూరు - 5/-
„ ఏరుబండి వీరవెంకటసత్యనారాయణమూర్తి గారు, ఏనుగువారిపాలెం - 5/-

చుండూరు శ్రీ మహిళామండలివారు శ్రీ జియ్యరుస్వామివారి తిరునక్షత్రోత్సవమును శ్రద్ధగా జరిపి 2-0-0 లు కట్నముగా సమర్పించిరి.

శ్రీకూర్మములో శ్రీ రాపోలు వెంకటచలపతిరావుగారు శ్రీ జియ్యరుస్వామివారి శ్రీపాద పూజకు 10-0-0 కట్నం సమర్పించిరి.

శ్రీ కూర్మంలో శ్రీమాన్ కం॥ వెం॥ మన్నాథాచార్యులుగారు తమ కుమారుని నామకరణ సందర్భములో పంపినకట్నం 2-0-0

# గ మ ని క

మనసంఘ సహాయకార్యదర్శులైన శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులవారు బదరికాశ్రమమునుండి సుఖముగా ఆశ్రమమునకు విచ్చేసిరి. ఇచ్చట శ్రీ కవిగారు సాంఘికవ్యవహారములను, భక్తినివేదన పత్రిక వ్యవహారములను ఇకనుండి చూచుచుందురు. కావున పత్రికచందాలుగాని, బదరిచందాలుగాని ఉత్తరప్రత్యుత్తరములుగాని, ఈదిగువ అడ్రస్సుకు పంపవచ్చును.

అడ్రసు

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము – నడిగడ్డపాలెం (P. O.)
(Via) చేబ్రోలు - తెనాలి తాలూకా - గుంటూరు జిల్లా

# ప్ర క ట న

భక్తినివేదన పత్రికాప్రచారార్థమై సహాయసంపాదకులు శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులవారు బరంపురమునుండి మద్రాసువరకు. కొన్ని ముఖ్యపట్టణములలో పర్యటించుటకు రాబోవుచున్నారు. సంప్రదాయాభిమానముగల స్త్రీలు, పురుషులు, అందరు. యీ ఉద్యమమునకు సహకరించవలసినదిగా కోరుచున్నాము పత్రికపైనభిమానముగల ప్రతియొకరు ఇందుచందాదారులుగా చేరవలెను. పిండికొలదిరొట్టె అన్నట్లుగా మీరెంత అధికముగా సహకరించిన పత్రికలో అన్నివ్యాసములు వచ్చుచుండును. ప్రస్తుతము భగవద్గీతటీకాతాత్పర్యములోను శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమునకు, అర్థముతోను. అనుష్ఠానరహస్యములతోను ముఖ్యవార్తలతోను పత్రికవెలువడుచున్నది. చందాదారులుగా చేరదలసినవారి క్రిందిఅడ్రసుకు సాలుచందా 5/- లు పంపవలెను -

భక్తినివేదన పత్రికాకార్యాలయము – మేనేజరు
శ్రీ వాసుదాసాశ్రమం నడిగడ్డపాలెం (P. O.)
(Via) చేబ్రోలు తెనాల తాలూకా - గుంటూరు జిల్లా

సూచనః- మాయొద్ద పుస్తకములుగాని శ్రీచూర్ణముగాని పతకములుగాని, పటములుగాని పోష్టుద్వారా తెప్పించుకొనగోరువారు ముందుగాసగముసొమ్ము మాకు M. O. ద్వారా పంపవలెను. ప్రత్యుత్తరముకోరువారు రిప్లైకార్డువ్రాయవలెను మేనేజరు - పుస్తవిక్రయశాఖ.

శ్రీహయగ్రీవాయనమః

# కీర్తనము

శ్రీమాన్. ఉ. వే. విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు

(వెనుకసంచిక తరువాయి)

శ్లో॥ అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపి వా
యః స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యన్తర శ్శుచిః

శుచియైయుండిగాని అశుచియైయుండిగాని, ఏయవస్థయందున్ననుగాని భగవంతుని స్మరించినచో వాడు లోపలను బయటనుకూడ పవిత్రుడగుచున్నాడని యీస్మరణభక్తికి పవిత్రతఫలముగా చెప్పబడెను.

శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ
మయ్యర్పితమనోబుద్ధిః మామేవైష్య స్యసంశయమ్॥

గీ - 8 అ. 7 శ్లో.

దీనికి వెనుకటి శ్లోకమున మరణకాలమునయెవ్వడేరూపమును ధ్యానించుచు శరీరమును విడచునో వాడు మరణానంతరమున ఆరూపమునే పొందును. అయినచో జీవితమంతయు నీచవృత్తితో గడిపి చివరసమయమున మంచిరూపమును తలంచుచు ప్రాణమును విడిచి తన పాపములనుండి తప్పించుకొనవచ్చునేయని ప్రశ్నించుకొని చిరకాలమునుండియు నలవాటుపడిన విషయములే ఆసమయమున స్మరింపబడునుగాని తన కిష్టమైనప్పుడు ధ్యానింపనలవికాదు. కావున అర్జునా! సర్వకాలములయందును మరణమువరకు ప్రతిదినము నన్నే స్మరించుచుండుము. తానాచరించు వర్ణాశ్రమధర్మములన్నియు భగవదర్పణబుద్ధితో నాచరించిన నవియే సర్వదా భగవంతుని స్మరింప జేయును.

ఇట్లలవరచుకొన్నచో మరణసమయమున నాభావనయే ననువర్తించును గాన నాసాయుజ్యమునే పొందగలుగుదువని దీనికి ఉత్తమపురుషార్థప్రాప్తినే ఫలముగ జెప్పెను.

శ్లో॥ 'అనన్యా శ్చింతయన్తో మాం' అనెడు గీత 9 అ. 22 శ్లోకమున ఇట్టి స్మరణభక్తుల యోగక్షేమములను నేనేవహింతునని చెప్పి పొందబడని శ్రేయస్సులను బడయుటకు పొందిన శ్రేయముల గాపాడుకొనుట కీస్మరణభక్తియే కారణమని ఉపదేశించెను.

శ్లో॥ అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్॥

గీత 12 అ. 6 శ్లో

ఫలాంతమునుగోరని భక్తితో నెవ్వరు నాధ్యానార్చనస్తుతి కీర్తన ప్రణామాదులను సలుపుచున్నారో వారినినేను మృత్యువునుబోలిన సంసారమనెడు సముద్రమునుండి లేవనెత్తుదునను టచే సంసారవిమోచనమే ఈ స్మరణమునకు ఫలముగా జెప్పబడెను.

శ్లో॥ మచ్చిత్త సతతం భవ
మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి॥
గీత 18 అ. 58 శ్లో.

నన్నుధ్యానింతువేని నా యనుగ్రహమువలన సకల సాంసారిక దుఃఖరాశినుండియు విడువ
డుదువనుటచే సాంసారిక దుఃఖవిమోచనోపాయ మీ స్మరణభక్తియే యగుచున్నది

ఈ ఫలములకేల - మహాత్ములందరు నీస్మరణభక్తినే పురుషార్థముగా భగవంతుని
ప్రార్థించిరి. చూడుడు - ప్రహ్లాదుడు తనను నాగపాశబద్ధుని గావించి సముద్రమునముంచి పైన
పర్వతముల నెత్తిడినతరి -

శ్లో॥ తుష్టావా = హ్నికవేలయాం అనినటుల తన నిత్యకృత్యముగా భగవంతు నావేళకు
స్మరియించునరి కాతడు ప్రత్యక్షమై తనను లేవనెత్తు వరమును వేడుకొనమనగనే ప్రహ్లాదుడు

శ్లో॥ యా ప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ
త్వా మనుస్మరత స్సా మే హృదయా న్మాప సర్పతు॥
(విష్ణుపురాణ)

శ్రియఃపతీ! అవివేకులకు సాంసారిక క్షుద్రవిషయాను సంధానముచే నేప్రీతి జనించు
చున్నదో ఆప్రీతి నిన్నెల్లవేళలస్మరించు నాహృదయమునుండి తొలగకుగాక!

శ్లో॥ నాథ యోనిసహస్రేషు యేషు యేషు వ్రజామ్య హం
తేషు తేష్వ చ్యుతా బుద్ధి రచ్యుతా స్తు సదా త్వయి

తండ్రీ! నన్నెన్నివేల జన్మలెత్తించినను సరియేగాని ఆజన్మలయందెల్లడల నాబుద్ధి నీయందే
నిశ్చలముగ నుండునట్లనుగ్రహింపుమని వరించెను.

శ్రీకుల శేఖరులు ముకుందమాలలో

శ్లో॥ బద్ధేనా ఞ్జలినా నతేన శిరసా గాత్రై స్సరోమోద్గమైః
కణ్ఠేన స్వరగద్గదేన నయనే నోద్గీర్ణభాష్పాంబునా
నిత్యం త్వచ్చరణారవింద యుగళధ్యానామృతాస్వాదినా
మస్మాకం సరసీరుహాక్ష సతతం సమ్పద్యతాంజీవితం॥

ఓపుండరీకాక్షా! నిత్యము నీపాదారవింద ధ్యానమనెడు అమృతము నాస్వాదించుచున్న
మాజీవితము నెల్లప్పుడును చేతులుజోడించి తలనువంచి ఆపాదమస్తకము పులకరింప కంఠమున
గద్గదస్వరము నెగడ నేత్రముల నానందాశ్రువులురాల్చుచు గడుపుచుండునట్లనుగ్రహింపుమని
స్మరణగావింపవలసిన రీతులతో ప్రార్థించిరి.

భగవద్రామానుజులును తమ శ్రీభాష్యమంగళాచరణ శ్లోకమున

శ్లో॥ భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా॥

ధ్యేయమగు శ్రీ శ్రీనివాసమూర్తిని అసాధారణ లక్షణములతో వర్ణించి ఇట్టిపరాత్ప
రుని విషయమై నాకు నిరంతరము ధ్యానరూపమగు జ్ఞానము లభించుగాకయని ప్రార్థించిరి.



శ్రీమతే రామానుజాయ నమః

# అనుష్ఠాన విశేషములు

## తీర్థప్రసాదయోగ్యత

తీర్థప్రసాదములను, విశేషించి పరమైకాంతులైనవారియొక్క పావనత్వ భోగ్యత్వములతో కూడియున్నట్టు తీర్థప్రసాదములను భోగ్యబుద్ధితో స్వీకరించవలయును. వీనిని స్వీకరించునప్పుడును "గురో రుచ్ఛిష్టం భుఞ్జీత" అను విధిని యనుసరించిరాక "[illegible]" అను రాగముతో వారిని తామై ప్రార్థించి అనువర్తించి వానిని లభింపజేసుకొని స్వీకరించవలయును.

"తరువరేల్" అను పాశురమున తెలుపబడిన విలక్షణులే కదా తీర్థప్రసాదముల నను గ్రహించుటకు తగినవారు. శ్రీపాదతీర్థమనగా మూడు ఆరు మాసములు ప్రార్థించి లభింపవలసి నట్టిదిగదా. అంతియెగాని అపేక్షించిన వెంటనే కాలుజాపునట్టి వారందరియొక్క శ్రీపాదతీర్థము ను స్వీకరింపకూడదు.

ప్రసాదయోగ్యత కూడ యిట్టిదే. దీనిని తెలిసినచోట "తొణ్డరడిప్పొడి యాడ నాం పెరిల్ నీ కంగైనీర్ కుడైన్దాడుం వేట్కై యెన్నావతే" (భాగవతోత్తముల శ్రీపాదరేణువులలో నవగహింపగలిగినచో నిక గంగలో మునుగుట యెందుకు) అను పాశురమున తెలుపబడిన తీర్థమునకును ఉపలక్షణముగ తీసుకొనవలెను. ఇంతియేగాని ఇతర విధముగ స్వీకరించినచో ప్రయోజనము లేదు. సరిగదా ప్రత్యుత విరోధముగ పరిణమించును. ఇతర విధముగ ననగా:- భోగ్యతగ స్వీకరించ కుండుటయును, మరియు తీర్థప్రసాదముల కెండిటిని ఇద్దరివద్ద స్వీకరించవలయు నను కొని స్వీకరించుటయును అయియున్నది. తీర్థప్రసాద స్వీకారవిధి యుండనప్పుడే వానిని రాగ ప్రాప్తముగ తీసుకొన వలెననినచో భాగవత విశేషమున అవి రాగప్రాప్త మైనవని వేరే చెప్ప నవసరము లేదుకదా

"గురో రుచ్ఛిష్టం భుఞ్జీత" అని విధింపబడినది. గ్రంథగౌరవమును పురస్కరించు కొని మాత్రమే ఈ విషయమున నంబిళ్లైగారి యొక్క అనుష్ఠానము ప్రమాణముగ గనుపించుచున్నది. అదేమనగా:- నంబిళ్లైగారు ఒక శ్రీవైష్ణవునకు ఈడు ముప్పత్తారాయిరమును (భగవద్విషయమును) సాయించునపుడు శ్రీపాదతీర్థమును కటాక్షించకుండగనే సాయించిరట, ఏలననగా కాలక్షేపమగు శ్రీవైష్ణవుని యభిప్రాయ మటుల నుండెనట ఆ శ్రీవైష్ణవుడన్న "పయిలుం శుడరొళి" అను తిరువాయిమొళి యొక్క కాలక్షేపము ప్రస్తుతమైన వెంటనే దాసునికి తీర్థతళిగ ప్రసాదములను కటాక్షించిన తరువాత మాత్రమే కాలక్షేపమును సాయించవలయునని నంబిళ్లై గారి తిరువడి ఘళ్లమీదపడి మిక్కిలి ప్రార్థించగా "ఇపుడుగదా రాగప్రాప్తమైనది" అని నంబిళ్లై గారు ఆ శ్రీవైష్ణవునకు తీర్థప్రసాదములను కటాక్షించినారట.

అయినచో "భుఞ్జీత" అని విధించుటవల్ల తటస్థించె ననగా రాగప్రాప్తమైన భోజనమునకు అత్యావశ్యకరాహిత్యమునకై యనుటకుల విధింపబడినది. "ప్రాఙ్ముఖోన్నాని భుఞ్జీత" అని ప్రాఙ్ముఖత్వాది నియమములతో భుజింపవలయునని విధించి నట్లునే, నిత్యము ఆత్మస్వరూపవర్ధకమైన తీర్థప్రసాద స్వీకారము రాగప్రాప్తమై యుండగ అవిలక్షణులైనవారి తీర్థప్రసాదాంగీకారము కూడ తటస్థించగలదను అత్యవస్థను నివారించుటకై విధిరూపముగ తెలుపబడినది.

మరియు "గురో రుచ్ఛిష్టం భుఞ్జీత అనియు,

"విశిష్టానాం చ విప్రాణాం గురూణాం వ్రతశాలినాం
వినతశేషా ముచ్ఛిష్టం నాశ్నీయా త్స్వయ మాత్మనాం" అనియు

స్వాచార్యుల యొక్కయు స్వాచార్యతుల్యులైన భాగవతోత్తముల యొక్కయు తీర్థప్రసాదస్వీకారమును కలిగియుండవలెననియు తెలుపుటకును విధింపబడినది. గనుక ఎవరివద్దనైతే తళిగై ప్రసాద స్వీకారయోగ్యత యుండునో అట్టివారివద్ద మాత్రమే శ్రీపాదతీర్థస్వీకారయోగ్యతయును యుండగలదు. మిగితవారివద్ద యుండదు.

## సంస్కారము

శ్లో॥ దేహకృ న్మంత్రకృ న్నస్యాత్ మంత్రసంస్కారకృత్పరః ।
తౌ చేన్నాత్మవిదౌ స్యాతా మన్యస్త్వాత్మ విదాత్మకృత్

అనునటుల "శరీరమేవ మాతాపితరౌ జనయుతః" అని దేహజనకుడైన తండ్రి స్వరూపజ్ఞుడై తన పుత్రునకు జ్ఞానోపదేశము చేయగలవాడు కాజాలనిచో అట్టి తండ్రి యందు గురుత్వము లేదు. ఇచ్చట "దేహకృత్ ఆత్మవిత్ మంత్రకృ న్నస్యాత్" (దేహజనకుడు ఆత్మవేత్తయై మంత్రోపదేశకుడు కాజాలనిచో) అని అన్వయించుకొన వలయును.

'మంత్రసంస్కారకృత్' అనగా ఉపనయనాది సంస్కారములను మరియు తాపాది పరమ సంస్కారములను తాను స్వరూపజ్ఞుడై చేయగలవాడు కాజాలనిచో, వానికొరకై మరియొక సదాచార్యులను యాశ్రయింపవలయును.

దేహకృత్ ఆత్మవిత్ నస్యాత్ = దేహజనకుడు స్వరూపజ్ఞుడుకానిచో; మంత్రసంస్కారకృత్ పరస్స్యాత్ = తాపాది పంచసంస్కారములను పొందుటకై మరియొక సదాచార్యులను యాశ్రయించవలయును.

"దేహకృత్ ఆత్మవిత్ మంత్రకృత్ స్యాత్" దేహజనకుడు ఆత్మస్వరూపజ్ఞానియై సామాన్య విశేష సంస్కారములను జేసిన వాడైనచో ("తజ్ఞమాకియ తన్దై" అనునట్టి వాడైనచో మరియొక ఆచార్యులను యాశ్రయించ నవసరము లేదు.

"మంత్రసంస్కార కృత్పరః" "ఆత్మవిన్నస్యాత్" = తాపాది పంచసంస్కారములను కలిగించిన వారికి జ్ఞానానుష్ఠాన సంపత్తి యుండనిచో ఆత్మస్వరూపజ్ఞానమునకై మరియొక సదాచార్యులను తిరిగి యాశ్రయించవలసినది.

"అన్యస్స్వాత్మ విదాత్మస్యాత్" = సమాశ్రయణమును సాయించిన యాచార్యులు జ్ఞానానుష్ఠాన సంపన్నులు కానిచో, అట్టివారిని విడిచి "జ్ఞానమనుష్ఠానం మిచై తస్యాగవే యద్యైయనాన కురుమై" జ్ఞానానుష్ఠానములు కలిగియుండు సదాచార్యులను యాశ్రయించ వలయును.

దేహజనకుడు స్వరూపజ్ఞుడై తన యొక్క కాలక్షేపవర్తనను కాజాలనిచో, తాను వేరొక యాచార్యుల నాశ్రయించి నప్పటికిని తన తండ్రి పట్ల ఉపకార ప్రతిపత్తిని కలిగియుండ వలయును. వారిపట్ల ఆచార్యతుల్యత్వముండునుగదా

ఆ తండ్రియే "తజ్ఞమాకియ తన్దై" (రక్షించునట్టి తండ్రి) కానిచో అట్టి వారిపట్ల ఉపకార ప్రతిపత్తి యుండనవసరము లేదు. అట్టి వారిపట్ల ఆచార్యతుల్యత్వముండజాలదు. గాన జనకత్వ ప్రతిపత్తి మాత్రమే కలిగియుండవలయును.

దీని సారాంశమేమనగా - సామాన్య విశేష సంస్కారముల నన్నింటికి యనుగ్రహించిన తండ్రియును, విశేష సంస్కారములను యనుగ్రహించిన ఆచార్యులును వీరిద్దరును "తజ్ఞమాకియ తన్దైయుల" (రక్షించునట్టి తండ్రి) "ఞాన మనుట్టాన మివై నన్ఱాగవే యుడైయనాన కురుక్కళుం" (జ్ఞానమును అనుష్ఠానమును ఈ రెండింటిని చక్కగా కలిగియున్న గురువులు) అయిన వారలు గానిచో అట్టివారి నిద్దరిని కూడ విడిచిపెట్టి జ్ఞానానుష్ఠానములు చక్కగా కలిగియుండునట్టి మరివక యాచార్యులను యాశ్రయించవలయును.

తండ్రి యున్నచో "తజ్ఞమాకియ తన్దై" (రక్షించునట్టి తండ్రి) అయ్యె యుండవలయును. విడిచిపెట్ట కుండగ యుండుటకు గురువు యున్నచో "ఞాన మనుట్టాన మివై నన్ఱాగవే యుడైయ గురు" జ్ఞానానుష్ఠానములు చక్కగా కలిగి యున్నవారై యుండవలయును విడిచిపెట్ట కుండగ యుండుటకు

శ్లో॥ భిన్న నావాశ్రిత స్తబ్ధో యథా పారం న గచ్ఛతి।
జ్ఞానహీనం గురుం ప్రాప్య కుతో మోక్ష మవాప్నుయాత్ ।"

చిల్లిపడిన నావను యాశ్రయించిన మూఢుడు ఎటుల నదిని దాటజాలడో, అటులనే జ్ఞానహీనుడైన గురువును యాశ్రయించిన వాడును మోక్షమును పొందజాలడు."

మరియు:- దేహాకృ న్మంత్రకృ న్నస్యాత్ = దేహజనకుడైన తండ్రియైనప్పటికిని స్వరూపజ్ఞుడై ఇతనికి జ్ఞానోపదేశము జేయజాలనివాడైనచో, అట్టివారియందు గురుత్వము లేదు.

వీనికి ఉపనయనాది సామాన్యసంస్కారములను, తాపాది పరమ- విశేష సంస్కారములను జేసినన్నటివంటి తండ్రియు ఆత్మస్వరూపజ్ఞుడై, వీనినికూడ స్వరూపజ్ఞుడగునటుల జేసి స్వరూప వృద్ధికి హేతువైనచో మహాగురువైన అట్టితండ్రిని విడిచి మరొకరి నెవరినియాశ్రయించ నవసరము లేదు. మరియు వారియందు దేహజనకత్వబుద్ధిని విడిచి ఆత్మజనకత్వబుద్ధిని కలిగి యుండవలయును. ఇట్టిభావన కలిగియుండనిచో దేహజనకత్వమేగాని ఆత్మజనకత్వముండజాలదు. అట్టిస్థితిలో ఆత్మోజ్జీవనమునకై మరివక సదాచార్యుల నాశ్రయించవలసి యుండును. ఇట్టితండ్రియొక్క తిరునక్షత్రపరి

పాలన మాచరింప నవసరము లేదు. జనకుడు స్వరూపజ్ఞానియై పుత్రునకు తానాచార్యుడు కాజాలనిచో పుత్రుడు మరివక విలక్షణులైన యాచార్యులను ఆశ్రయించి జనకుని ఉపకారకుడుగ భావింప వలయును.

స్వరూపజ్ఞానరహితుడైన తండ్రినియాశ్రయించి నా తండ్రిని నేనాశ్రయించితినను దురభిమానముతో విలక్షణులైనవారిని యాశ్రయింపకుండగ యున్నచో ఆత్మోజ్జీవనమునకు యవకాశము లేదు.

మహాత్ములైనవారల నాశ్రయించి, దురాభిమానముచే ఆ ఆశ్రయణమును అర్థకామపరవశుడై త్యజించి నాతండ్రియే నా కాచార్యులని యున్నప్పటికిని ఆత్మోజ్జీవనమున కవకాశము లేదు. తామరపద్మమును వికసింపజేయు సూర్యుడే, నీటిని విశ్లేషించినచో ఆ తామరపద్మమును తానే ఎండింపజేయునటులనే సదాచార్యసంబంధమును విడిచినచో ఆత్మోజ్జీవనకరుడైన సర్వేశ్వరుడే ఈ ఆత్మను వాడింపజేయును. గావున "త్రిజ్ఞమ ంకియ తన్నై" అనునటుల స్వరూపజ్ఞుడైన తండ్రియే యాచార్యులుకాగలిగినచో వారిపట్లపితృత్వబుద్ధిని విడిచి యాచార్య బుద్ధిని కలిగియుండవలయును. అట్టివారి తిరునక్షత్ర పరిపాలన మాచరింపవలయును. తండ్రిస్వరూపజ్ఞుడై, తనకు యాచార్యులగుట తటస్థించనిచో వారివిషయమున ఆచార్యతుల్యులను భాగవత ప్రతిపత్తిని కలిగియుండియు, వారితిరునక్షత్ర పరిపాలన మాచరించుచుండ వలయును.

## తిరువధ్యయన విషయము

మహాగురువులైన తండ్రిగారి యొక్క తిరువధ్యయనోత్సవము తటస్థించినపుడు బ్రహ్మవేత్తలైనవారిని నిమంత్రించి వారితో కలిసి తానుకూడ తిరువాయిమొళి ఆయిర ప్రబంధమును అనుసంధించి చాత్తుమొఱ గావించి వారి తిరువడిఘుళ్లను కడిగి వారిని ఆచార్యులుగ భావించి "బ్రహ్మవిచ్ఛయః" అని సంకల్పవిధానమునవారిని ఆరగింపజేసి, పిమ్మట వారి శ్రీపాదతీర్థమును చేర్చుకొని వారిని చందన కుసుమ తాంబూలాదులచే సత్కరించి "తిరుమాలరియార్కళై పూశిక్కనోత్తార్కళే" (శ్రియఃపతికి దాసులైన వారలను పూజింపగల యదృష్టవంతులైరి) అనునటుల వారిని పూజించి ఆ శ్రీపాదతీర్థపాత్రను వారి చేతికిచ్చి తాను వారికి దండము సమర్పించి అత్యాదరముతో భోగ్యముగ ఆ శ్రీపాదతీర్థమును స్వీకరింపవలయును.

బ్రహ్మవేత్తలు కానివారిని నిమంత్రించినచో తానే తిరువాయ్మొళిని యనుసంధించి, శాత్తుమొఱ గావించి స్వాచార్యుల తిరువడితీర్థమును చేర్చుకొని భగవంతుని సన్నిధియుందుంచి,

"అజ్ఞశ్చేదతివేళయా మాపది బ్రహ్మవిచ్ఛయః।
సంకల్పేన విధానేన కుర్యాచ్ఛ్రాద్ధం న పార్వణమ్।   అనునటుల

"బ్రహ్మవిచ్ఛయః" అని తాను బ్రహ్మవేత్తయైనచో సంకల్పవిధానమాచరించి పిమ్మట వారి పాదప్రక్షాలన కాలమున పాదోదకమును చేర్చి. దానిని యథాయోగ్యముగ వినియోగించి,

వారు ఆరగించిన పిమ్మట వారిని పంపివేసి తరువాత తానిదివరలో చేర్చియుంచుకొనిన స్వాచార్య శ్రీపాదతీర్థమును తాను స్వీకరింపవలయును.

అటులగాక తండ్రియు బ్రహ్మవేత్తయై ఆరగించినవారున్ను తానుకూడ బ్రహ్మవేత్తయైనచో "బ్రహ్మవిచ్ఛ్రయః" అని సంకల్పించి వారు ఆరగించిన పిమ్మట వారల శ్రీపాదతీర్థమును చేర్చుకొని స్వీకరించవలయును.

తండ్రియును ఆరగించినవారలును తానుకూడ బ్రహ్మవేత్తలుకానిచో "అపార్వణం వృథా శ్రాద్ధం" అని యున్నది గావున పార్వణవిధానముగనే శ్రాద్ధమును నాచరింపవలయును. వారల శ్రీపాదతీర్థమును చేర్చుకొన నవసరములేదు. స్వాచార్యుల శ్రీపాదతీర్థమును మాత్రమే స్వీకరింపవలయును. ఆ సమయమునకు "అతిథిదేవో భవ" అని అదృష్టవిశేషముచే ఎవరైన విలక్షణులు వేంచేసినచో వారల శ్రీపాదతీర్థమును చేర్చుకొని స్వీకరించవలయును.

బ్రహ్మవేత్తగానట్టి తండ్రియును ఆయన యాశ్రయించిన వారల యొక్క రాజకుల మహాత్మ్యముచే కృతార్థులు కాగలిగినచో, పుత్రుడైన ఈతను శరీరసంబంధమును మాత్రమే యవలంబించి పుత్రకృత్యమును ఆచరింపవలయును. ఏకారణము చేతనైన శ్రీపాదతీర్థమును చేర్చవలసి వచ్చినను దానిని స్వీకరింప నవసరము లేదు. దానిని రహస్యముగ పరిహరించవలయును.

తండ్రి బ్రహ్మవేత్తగానివారై ఆరగించువారు బ్రహ్మవేత్తలైనచో సాక్షాత్తుగ వీరే ఉద్దేశ్యులగుదురు. వీరల నుద్దేశించియే శ్రీపాదతీర్థమును చేర్చుకొని స్వీకరించవలయును. శ్రీపాద తీర్థమునకు అబ్రహ్మవేత్తయైన తండ్రి ఉద్దేశులు కాజాలరు.

తాను బ్రహ్మవేత్తయై మిగతవారు అనగా తండ్రియును ఆరగించు వారును కూడ బ్రహ్మవేత్తలు కాకపోయినను సంకల్పవిధానముగ మాత్రమే యాచరింపవలయును. తాను బ్రహ్మవేత్తయనుట యనగా

ప్రాపకాన్తర పరిత్యాగత్తుక్కు అజ్ఞానాశక్తికళన్ఱు
స్వరూపవిరోధమే ప్రధానహేతువు"

(ఉపాయాంతరములను విడుచుటకు అజ్ఞానము అశక్తులు కారణములు కావు. తన స్వరూపమునకు అవి విరోధములై యుండుటయే ప్రధాన కారణము) అని ఉపాయాంతరములను స్వరూపముతో విడిచిపెట్టినవారై యుండుట యని అర్థము.

స్వాచార్యులను తన తండ్రిగారి తిరువధ్యయనాదుల యందు నిమంత్రించినచో వారి తిరువడి ఘళ్లను కడుగ నవసరము లేదు. కేవలము వారిని ఆరగింపు జేసిన చాలును. అనగా సంకల్పము కూడ కూడదని తాత్పర్యము.

"ఉద్దిశ్య తు పితౄన్ వాపి గురౌ యత్ప్రతిపద్యతే
దేశకాల క్రియామంత్ర నిరపేక్షం తదక్షయం''

(పితరుల ఊర్ధ్వదైహిక క్రియల యందు స్వాచార్యులు భోక్తగ కటాక్షించినచో దేశనియమము కాలనియమము క్రియానియమము మంత్రనియమముల పాటించనవసరము లేదు. అయినను అదిఅక్షయమై ఫలించును.) అని

శ్లో॥ ఆత్మనో హ్యతినీచస్య యోగిధ్యేయపదార్హతాం।
కృపయై వోపకర్తార మాచార్యం సంస్మరే త్సదా"

(అత్యంత నీచస్థితిలో నుండు తనకు యోగీశ్వరులకు ధ్యేయుడైన సర్వేశ్వరుని సాయుజ్యరూపమైన స్థానమును తన కృపావిశేషముచే ఉపకరించిన యాచార్యులను సర్వదా సంస్మరించుకొను చుండవలయును.) అని కదా న్యాయము కలదు.

## నిత్య ప్రసాద స్వీకార ప్రకారము

ప్రతినిత్యమును ప్రసాదమును స్వీకరించు నపుడు (సాపాటు చేయునపుడు) "శ్రీశైలేశ" యను తనియ మొదలుకొని "ప్రణతోఽస్మి నిత్య అను వరకు యను సంధించి; తిరిగి "శ్రీశైలేశ మొదలుకొని అవరోహణ క్రమముగ స్వాచార్యతనియ వరకును అనువదించు కొనవలయును.

---

### చావలి

ఇచ్చట శ్రీమహిళామండలివారు. శ్రీఆండాళ్ తిరునక్షత్రానికి- 1-0-0 శ్రీజియ్యర్ స్వామివారి తిరునక్షత్రసందర్భములో 2-0-0 లు శ్రీకణ్ణన్‌తిరునక్షత్ర సందర్భములో 2-0-0 లు వెరశి 5-0-0 లు సంఘమునకు కట్నముగా సమర్పించిరి.

### పత్రికాపాఠకులకు ఒకమనవి

మాబదరీయాత్ర మూలకముగా శ్రావణమాస పత్రిక సకాలములో పంపలేకపోతిమి. ఇప్పుడు శ్రావణ భాద్రపదములనుకలిపి యీపత్రికను పంపుచున్నాము. — సబ్ఎడిటర్

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
| --- | --- | --- | --- |
| 122 | వరారోహః | వరమంత్కృష్ట మారోహం। యస్యస్వప్రాప్తిలక్షణమ్ వర్తతే స వరారోహః ప్రకృష్ట స్థానదోమనుః । | అన్నిటికిని మిన్నయగు తనను పొందుట యనెడు ఉత్కృష్ట ప్రాప్తికలవాడు దీనిని 'ఓమ్ వరారోహాయనమః' అని మంత్రము [illegible] పఠించినచో సుత్కృష్టమగు స్థానము నిచ్చును. |
| 123 | మహాతపాః | మహాత్ప్రాజ్యం తపోజ్ఞానం। యస్యేతి సమహాతపాః । | పూజ్యమైన జ్ఞానము కలవాడు లేనగా బద్ధుల సంసార దుఃఖములను తొలగించవలెనను సంకల్పముకలవాడు. |
| 124 | సర్వగః | ధారయన్ సంహృతాన్స్వై గచ్ఛతీతి స సర్వగః। | ఆత్మనలె నన్నిటిని తన [illegible] సామర్థ్యముతో ధరించి సంహరించి తిరిగి [illegible] సృష్టించుటకు వాటియందు ప్రవేశించువాడు. |
| 125 | సర్వవిత్ | ప్రద్యుమ్నత్వేతు కార్యాణి లభతే యస్స సర్వవిత్ | ప్రద్యుమ్న [illegible] సమస్త కార్య సముదాయమును లభించువాడు. |
| 126 | భానుః | భాను సర్వస్యభాతీతి నిర్మాణే ప్యవికారతః | సమస్త పదార్థములను నిర్మించియు లోనొకింతయు వికారములను [illegible] ప్రకాశించువాడు. |
| 127 | విష్వక్సేనః | ఇనేన స్వామినా సాకం। వర్తతేసేన ఇత్యతః విష్వగ్విశ్వో జనోయస్య విష్వక్సేన ఇతీరితః ॥ | [illegible] నట్టి సంసారి [illegible] |
| 128 | జనార్దనః | భక్తవిద్వేషిణాం మార్గం। మర్దనాద్ధి జనార్దనః । | [illegible] శాస్త్రులను ద్వేషించువారిని వెంటనే మర్దించువాడు. |
| 129 | వేదః | సర్వశాస్త్రాణత్వే శాస్త్రార్థ ప్రదత్వాద్వేద ఈరితః। | సంగముగా [illegible] శాస్త్రార్థములను ప్రసాదించువాడు. |

| | | | |
|---|---|---|---|
| 130 | వేదవిత్ | అసంశయ విపర్యాసం ।<br>వేదార్థం వేత్తి వేదవిత్ । | సందేహము పొరబాటు లేక వేదార్థము నంతను తెలియగ నెఱుంగువాడు. |
| 131 | అవ్యఙ్గః | శిక్షావ్యాకరణాద్యఙ్గైః ।<br>నహీనో ఽవ్యఙ్గ ఉచ్యతే | శిక్షావ్యాకరణాది వేదాంగ పరివర్తకుడు తానే గాన వాటిలో ఎంతమాత్రము లేనివాడు. |
| 132 | వేదాఙ్గః | యస్య వేదో ఽనన్తశాఖో<br>వేదాఙ్గో ఽఙ్గతయా స్మృతః । | వేదములను ప్రకాశింప జేయువాడుగాన వేదములను శరీరముగా కలవాడు. |
| 133 | వేదవిత్ | వేదైర్వేద్యతయా వేదః ।<br>తదర్థో ధర్మ ఉచ్యతే<br>తదనుష్ఠాపనా న్నిత్యం ।<br>ప్రద్యుమ్నో వేదవిత్స్మృతః । | ప్రద్యుమ్నమూర్తియై వేదములను బోధింపబడు ధర్మమును తన శాసనముచేతను, తన యనుష్ఠానముచేతను నిత్యమును అనుష్ఠింప జేయుటద్వారా దానిని పొందువాడు. |
| 134 | కవిః | సర్వకాన్త దర్శిత్వాత్ ।<br>కవిరిత్యుచ్యతే బుధైః । | భక్తులకు మధురముగా గానిప్పించువాడు. |
| 135 | లోకాధ్యక్షః | ధర్మాధికారిణో లోకాః । | ధర్మమును తామాచరించుచు ఇతరులచే నాచరింప జేయువారు లోకులు. |
| 136 | సురాధ్యక్షః | తదారాధ్యా స్సురాస్తథా ।<br>ధర్మస్తత్సాధనం తేషాం ।<br>మధ్యక్షస్సాక్షీ నామవాన్<br>లోకాధ్యక్ష స్సురాధ్యక్షో ।<br>ధర్మాధ్యక్ష ఇతి క్రమాత్ ॥<br>అనిరుద్ధ స్సవిజ్ఞేయో ।<br>లోకాధ్యక్షాది నామవాన్ । | అట్టివారిచే నారాధింపబడు దేవతలు సురలు.<br>వారికి ఉపాయము ధర్మము.<br>ఈ మూడింటికిని తానే ప్రభువు అనగా అనిరుద్ధమూర్తియై చేసిన సుకృత దుష్కృతములను వ్యర్థముగాకుండగను చేయనిది వచ్చిపడకుండగను కాపాడుచు తగు ఫలముల నొసంగుచుండువాడు. |
| 137 | ధర్మాధ్యక్షః | | |

(టైటిల్ 2-వ పేజీ తరువాయి)

వంటి శ్రియఃపతియొక్క; ఋద్ధిః=సమృద్ధి గలిగినదియూ; స్తన నయన గుళుచ్ఛ స్ఫారపుష్ప ద్విరేఖా స్తన=స్తనములను; నయన=నేత్రములను; గుళుచ్ఛ=గుత్తులవలె; స్ఫార=వికసించిన; పుష్ప=పుష్పమండలి; ద్విరేఖా=తుమ్మెదల గలిగినదియునగు; లక్ష్మీకల్పవల్లీ=కల్పలతవంటి లక్ష్మీదేవి; మయి=నాయందు; కటాక్షాన్=క్రేగంటిచూపులను; రచయతు=ప్రసరింపజేయుగాక!

## తాత్పర్యము

క్షణక్షణమును శ్రియఃపతి ఋజువగు తనదేహయష్టిని యాలింగనము చేసుకొనినపుడెల్ల అత్యంతము ప్రకాశించుచున్నదై, కొమ్మలవలె నాలుగుదిక్కులకు వ్యాపించియున్న నాలుగు బాహువులతోను విరాజిల్లు కృష్ణ సదృశమగు శ్రియఃపతిని చుట్టబెట్టుకొనియున్నదై, పుష్పగుత్తులపైవాలినతుమ్మెదలవలెనున్న స్తనములను నేత్రములను గలదై కల్పలతవలె విరాజిల్లుచున్న లక్ష్మీదేవియొక్క క్రీగంటిప్రసారము నాపై ప్రసరించుగాక,

## గోపికా గీతలు

(3వ శ్లోకము)

శ్లో॥ విషజలాప్యయాత్ వ్యాళరాక్షసాత్ ॥
వర్షమారుతాత్ వైద్యుతానలాత్ ।
వృషమయాత్మజాత్ విశ్వతోభయాత్ ।
వృషభతే వయం రక్షితా ముహుః ॥

## అర్థము:—

హే వృషభ=శ్రేష్ఠుడవగు ఓకృష్ణా; విషజలాప్యయాత్=విషమయమగు కాళీయమడుగునందలి జలప్రళయము నుండియు; వ్యాళరాక్షసాత్=అఘాసురునిబారినుండియు; వర్షమారుతాత్=వర్షమునుండియు గాలినుండియు; వైద్యుతానలాత్=పిడుగుమంటనుండియు; వృషమయాత్మజాత్=అరిష్టాసురు, వ్యోమాసురులనుండియు; విశ్వతః=మిగతఅన్నివిధములైన; భయాత్=భయములనుండియు; తే=నీయొక్క; వయం=దాసులమైనమేము, ముహుః=మాటి మాటికిని; రక్షితాః=రక్షింపబడినారము.

## అవతారిక:-

మీరునాకు దాసులమని అనుకున్నంతమాత్రమే చాలునా? అంతమాత్రముచే నాభారమును నేను వహించి తీరవలేనను నియమమేమి? అని శ్రీకృష్ణపరమాత్మప్రశ్నించుట కవకాశములేకుండుటకై గోపికలుతమకు ఆయనతోగల రక్ష్యరక్షకభావమును స్మరించుకొనుచున్నారు. రక్షణయనగా ఇష్టప్రాప్తి అనిష్టనివృత్తియును గదా. "సురతనాథ" అని క్రిందటిశ్లోకములో యిష్టప్రాప్తి స్మరింపబడినది. ఇప్పుడీ శ్లోకమున అనిష్టనివృత్తి తెలుపబడుచున్నది. ఈవిధమైన రక్ష్య రక్షకభావము జీవేశ్వరులకు అనాది సిద్ధమైన స్వరూపాంతర్గతమైన ప్రధానవిషయమనియు, ఇది తమచేతగాని లేక ఆయనచేతగాని లేక ఉభయులు చేతగాని పోగొట్టుకొన శక్యమైనది కాజాలదనియు, తిరుప్పావైలో అండాళుతల్లి "ఉరవేల్ నమక్కింగు ఒళిక్కవొళియాదు" అని తెలిపినటుల ఈగోపికారలును ఆదేవిధముగా శ్రీకృష్ణ పరమాత్మను ప్రార్థించుచున్నారు.

## తాత్పర్యము

ఓ శ్రీకృష్ణా! మాకు ఈ శరీరములకు స్థూలముగ తాత్కాలిక కారకులైన మాతాపితరులుగాని, ఆత్మకు ఔపాధిక రక్షకులైన బ్రహ్మరుద్రాది దేవతలుగాని రక్షకులుగారు. నిరుపాధిక నిత్య సర్వ రక్షకుడవు నీవే సుమా! విషపూరితమైన కాళీయమడుగునందలి జలప్రళయమునుండియు, అఘాసురుని బారినుండియు గాలివానలనుండియు, ఉరుములు పిడుగులనుండియు, అరిష్టాసురుని నుండియు ఒకదానినుండేమి, ఒకప్పుడేమి, మహాప్రళయా

...నము నుండియు, పుణ్యపాపరూప కర్మదురితము నుండియు, సాంసారిక ఈషణాత్రయములనుండియు, ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక తాపత్రయములనుండియు, శబ్దస్పర్శరూపరసగంధాది విషయ రుచి, వాసన నుండియు సర్వకాల సర్వదేశ సర్వావస్థలయందును రక్షించినట్టియు రక్షించుచున్నట్టియు, రక్షింపబోవునట్టియు, సర్వరక్షక దక్ష నీవేగదా. అట్టి నీవిపుడు యిటుల మమ్ముల నేకాకులుగ జేసి పోయితివేల?

నీ భక్షకులై స్వతంత్రులై అన్యశేషభూతులై విషయేంద్రియలోలురై యుండినవారే గాని నీభక్తులై, పరతంత్రులై, త్వదేక శేషభూతులై, అనన్యశరణులై అనన్యగతికులైయుండిన మేము నీ రక్షణకు తగమా? నీకు మేము దయాపు కోటిలోనివారమే గాని క్షిపామి కోటిలో నివార మెంతమాత్రమును కాముగదా!

ఓ స్వామీ! కన్నుబుస్సుమనుట, మ్రింగుట, కొట్టుట, కాల్చుట, చంపుట చేయదలచినవారలకే గాని నీదర్శనాలాపాది యానందమునకై కుయ్యో మొఱ్ఱోయని ఏడ్చుట ఆత్మాత్మీయముల నీకు సమర్పించుట, చందన పుష్పాదులను సమర్పించుట, నన్నానందింపజేసి తద్వారా యానందించుటను కోరువారలను రక్షించకూడదను నియమమేమైన గలదా?

నిన్ను ప్రేమపూరిత ఆనందభాష్ప జలమయ బాహ్య అంతరంగిక నేత్రములపై కుదురుగ కూర్చొనమని కోరితిమేగాని దుర్గంధపూరిత విషపూరిత జలమందు పాముపడగపైకెక్కి గంతులు వేయమనలేదే.

పంచబాణుని ప్రక్కపై పవళింపమంటిమేగాని పామునోటిలో దూరమనలేదే. ప్రేలితో వెన్నముద్దను నాకమంటిమేగాని ప్రేలితో గోవర్ధనమును నాకముపై నిలబెట్టి మోయమనలేదే. పంచభక్ష్య పరమాన్నముల ప్రేమతో నారగించమంటిమేగాని బడబాగ్నిని మ్రింగమనలేదే.

అసిలేకుండ ననుభవింపమంటిమేగాని ఆశీవిషముల నాలింగనము చేయమనలేదే. దర్శనమును కోరితిమేగాని అదృశ్యమును అపేక్షింపలేదే. ఏలనీవు మమ్ముల నిటుల కనబడకుండగ బాధించెదవు?

అని గోపికలు శ్రీకృష్ణుని స్మరించుకొనుచున్నారు.




సాలుచందా రు 5 లు భక్తినివేదన — BOOK POST రి. నెం. A 195

శ్రీ వాసుదాసాశ్రమం — నడిగడ్డపాలెం (పోష్టు) (వయా చేబ్రోలు) గుంటూరుజిల్లా.

... ఓరియంటల్ లైబ్రరీ
Tirupathi, (Chithur dt.)



Edited and Published by Sri T. K Gopalacharyulu Garu and printed at Bharathi Press Tenali For Sriman Press, Nadigaddapalem.

శ్రీమతే రామానుజాయ నమః







శ్లో॥ శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే। భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా॥

# భక్తినివేదన

[ వేదాంత మాసపత్రిక ]


సంపుటి ౧౨ ‖ వికారి – ఆశ్వయుజము ‖ సంచిక ౭


## శ్రీ వైష్ణవ సర్వస్వము

శ్లో॥ న వేదాన్తాచ్ఛాస్త్రం, న మధుమథనాత్తత్త్వమధికం
న తద్భక్తాత్తీర్థం న తదభిమతాత్సాత్త్విక పదమ్ ।
న సత్త్వాదారోగ్యం న బుధ భజనాద్బోధజనకం
న ముక్తేః సౌఖ్యం న ద్వయవచనతః క్షేమకరణమ్ ॥

తాత్పర్యము :

1. వేదాంతమునకన్న మించి చదవదగిన శాస్త్రము మరియొకటి లేదు.
2. శ్రియఃపతికన్న మించిన తత్త్వము మరియొకటిలేదు.
3. భగవద్భక్తులకన్న మించిన పుణ్యతీర్థము మరియొకటి లేదు.
4. భాగవతోత్తముల శ్రీసూక్తికన్న మించిన సాత్త్విక వాక్యము మరియొకటిలేదు.
5. సత్త్వగుణముకన్న మించిన ఆరోగ్యము మరియొకటిలేదు.
9. భాగవత పరిచర్యకన్న మరియొక జ్ఞానసాధనము మించినదిలేదు.
7. ముక్తికన్న సౌఖ్యము మరియొకటిలేదు.
8. ద్వయమంత్రమును అర్థానుసంధానములో అనుభవించుటకన్న మరియొకటి క్షేమంకరమైన కర్తవ్యము లేదు.


సంపాదకులు :
విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు

సహాయ సంపాదకులు :
కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులు



1959 నవంబరు

# గోపికా గీత

## 4వ శ్లోకము.

శ్లో॥ న ఖలు గోపికానంద నో భవాన్ ।
అఖిలదేహినా మంతరాత్మదృక్ ।
విఖనసా ఽర్థితో విశ్వగుప్తయే ।
సఖ ఉదేయివాన్ సాత్వతాం కులే. ।

### అర్థము:

హే సఖే = చెలికాడవగు నో కృష్ణా;
భవాన్ = నీవు ;
గోపికానందనః = యశోదా సుతుడవు;
న = కావు ;
ఖలు = నిశ్చయము ;
అఖిలదేహినాం = సమస్తప్రాణుల యొక్కయు ;
అంతరాత్మదృక్ = హృదయములలోనుండి జూచు మండు పరమాత్మవు;

విఖనసా = చతుర్ముఖ బ్రహ్మచే ;
విశ్వగుప్తయే = లోకసంరక్షణ కొరకు ;
అర్థితః = ప్రార్థింపబడినవాడవై;
సాత్వతాం = పరమ సాత్వికులగు యాదవులయొక్క;
కులే = కులమునందు ;
ఉదేయివాన్ = అవతరించినట్టివాడవు,

### తాత్పర్యము :

“ఓ కృష్ణా, లోకైకరక్షకుడవగు నీ నిత్య నిర్హేతుక కటాక్ష విశేషముచే వెర్రి గొల్లబాలికలమగు మాకు చెలికాడవై యవతరించితివి. మమ్ముల స్నేహములో ముంచి నిన్ను స్నేహింపజేసితివి. బాహ్యచక్షుస్సుల కదృశ్యుడవు కాగలిగినను, నీవు మా హృదయాంతరముల నుండి తొలగజాలవు కదా. ఏలననగా, నీవు గోపిక యగు ఈ యశోదకు నందుడువుగా యిపుడవతరించితివే, గాని యదార్థమునకు నీవు సమస్తప్రాణికోటికిని యంతరాత్మ భూతుడవై విరాజిల్లు పరమాత్ముడవు గదా. లోకసంరక్షణార్థమయ్యే గదా ఆనాడు చతుర్ముఖ బ్రహ్మ నిన్ను ఈ యవతారమునకై ప్రార్థించగా ఈ సాత్వికకులములలో అవతరించితివి. ఆ కులములోనే నీచే అవతరింపజేయబడిన మేము నీదర్శనాలాపాది యిష్టప్రాప్తినిన్ని, నీ యదర్శన లోపాక్లేశాది కర్మబంధనాది యనిష్టనివారణమున్ను, నీచే ఎటుల పొందకుండగ శాంతించి యుండగలము. కాన ఓ కృష్ణా! మాకు వెంటనే నీ దర్శనాలాపాదుల ననుగ్రహించి రక్షించుమా” యని ఒక గోపిక విలపించుచు ప్రార్థించుచున్నది.

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ భగవద్గీతా - ఏకాదశోఽధ్యాయః

# విశ్వరూపసన్దర్శనయోగః



అవ. అర్జును డింతవరకు భగవంతునివలన వినిన దానియందు విశ్వాస ముంచి యట్టి భగవంతుని కన్నులార చూడగోరి యడుగుచున్నాడు. ఈ శ్లోకము మొదలు మూడు శ్లోకములవరకు తనకుగల కృతజ్ఞతను, ఆస్తిక్యమును, భక్తి కలిగియుండుటను తెలుపుచున్నాడు.

అర్జున ఉవాచ = అర్జునుడు పలికెను.

1. శ్లో. మదనుగ్రహాయ పరమం । గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్
యత్త్వయోక్తం వచస్తేన । మోహోఽయం విగతో మమ॥

అర్థము :— మదనుగ్రహాయ = నన్ను అనుగ్రహించుకొఱకు, పరమం = మిక్కిలి, గుహ్యం = రహస్యమైనదియు, అధ్యాత్మసంజ్ఞితం = ఆత్మనుగూర్చి చెప్పదగిన, యత్ వచః = ఏమాట, త్వయా = నీచేత, ఉక్తం = చెప్పబడెనో, తేన = ఆమాటచే, మమ = నాయొక్క, అయం = ఈ, మోహః = అజ్ఞానము, విగతః = తొలగిపోయినది.

తా॥ దేహాత్మాభిమాన మోహితుడనగు నన్ననుగ్రహించుకొఱకు నీవు ఆత్మ స్వరూపమునుగూర్చి చెప్పదగిన పరమరహస్యము నంతను చెప్పితివి. దానిచే నాయజ్ఞానమంతయు నంతరించినది. (ఇది మొదటి షట్కార్థసంగ్రహము)

అవ. ఏడవ యధ్యాయము మొదలు పదియవ యధ్యాయమువరకు గావించిన ఉపదేశమును సంగ్రహించి చెప్పుచున్నాడు.

2. శ్లో. భవాప్యయౌహి భూతానాం । శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమల పత్రాక్ష ! । మాహాత్మ్యమపి చావ్యయమ్॥

అర్థము :- కమలపత్రాక్ష ! = శ్రీకృష్ణా ! భూతానాం = సకలప్రాణులకును, త్వత్తః = నీవలన కలుగునట్టి, భవాప్యయౌ = పుట్టుకచావులు, మయా = నాచేత, విస్తరశః = సవిస్తరముగా, శ్రుతౌహి = వినబడినవిగదా ! అవ్యయం = నాశములేని, మాహాత్మ్యం అపి = మహిమకూడ, (శ్రుతం = వినబడెను).

తా॥ నీవు సమస్తభూతముల చావుపుట్టుకలకు కారణమగుటను విస్తరించి చెప్పితివి. మరియు నేను నీవలన నీయొక్క అపరిమితమైన మాహాత్మ్యమునుకూడ సమగ్రముగవింటిని. (ఇది ఏడు ఎనిమిది తొమ్మిది పది యధ్యాయముల అర్థసంగ్రహము)

అవ. వినిన యర్థమునందు తనకు కలిగిన విశ్వాసమును సహేతుకముగ సూచించుచున్నాడు.

3. శ్లో. ఏవ మేత ద్యథాఽఽత్థత్వ । మాత్మానం పరమేశ్వర !
ద్రష్టు మిచ్ఛామి తే రూప । మైశ్వరం పురుషోత్తమ ! ॥

అర్థము :- పరమేశ్వర ! = శ్రీకృష్ణా ! త్వం = నీవు. ఆత్మానం = నిన్నుగూర్చి, యథా = ఏ ప్రకారముగా, ఆత్థ = చెప్పితివో. ఏతత్ = ఇది. ఏవం ఇతి = ఇట్లేయని (అవధృతం = నిశ్చయింపబడెను) పురుషోత్తమ ! = కృష్ణా ! తే = నీయొక్క, ఐశ్వరం = ఈశ్వరాసాధారణమైన. రూపం = స్వరూపమును. ద్రష్టుం = చూచుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా॥ కృష్ణా ! నిన్నుగూర్చి నీవు చెప్పినదంతయు నిజమని నమ్మితిని. ఈశ్వరుడవగుటచే నీకుమాత్రమే సంబంధించిన నీవిశ్వరూపమును సాక్షాత్కరించగోరుచున్నాను.

(పరమేశ్వర, పురుషోత్తమ సంబోధనలు విశ్వాసమునకు కారణమగు ఆప్తతమత్వమును సూచించుచున్నవి)

అవ. అర్జునుడు శ్రీకృష్ణుని విశ్వరూపమును జూపుమని సవినయముగ ప్రార్థించుచున్నాడు.

4. శ్లో. మన్యసే యది తచ్ఛక్యం । మయా ద్రష్టుమితి ప్రభో ।
యోగేశ్వర! తతో మే త్వం । దర్శయాత్మాన మవ్యయమ్॥

అర్థము :– ప్రభో = స్వామీ! తత్ = ఆ రూపము, మయా = నాచేత, ద్రష్టుం = చూచుటకు, శక్యం (ఇతి) = సాధ్య (మని) మన్యసే యది = తలంతు వేని, తతః = అటుపిమ్మట, యోగేశ్వర! = శ్రీకృష్ణా! త్వం = నీవు, ఆత్మానం = నిన్ను, మే = నాకు, అవ్యయం = పూర్తిగా, దర్శయ = చూపుము.

తా॥ ప్రభో! శ్రీకృష్ణా! ఆ రూపమును చూచుటకు నేను తగుదునని నీవు తలంతువేని నీవు నాకు దానిని సమగ్రముగా జూపుము.

అవ. ఇట్లతికుతూహలముతో ఆనందపరవశుడై దగ్గుత్తికతో ప్రార్థించిన పార్థునిగూర్చి భగవంతు డామోదముతో నిట్లు పలికెను.

శ్రీ భగవానువాచ = భగవంతుడు పలికెను.

5. శ్లో. పశ్య మే పార్థ! రూపాణి । శతశోఽథ సహస్రశః
నానావిధాని దివ్యాని । నానా-వర్ణా-కృతీనిచ॥

అర్థము :– పార్థ! = అర్జునా! శతశః = నూరులకొలదియు, అథ = మరియు, సహస్రశః = వేలకొలదియు, నానావిధాని = అనేక విధములైన, దివ్యాని = అప్రాకృతములగు, నానావర్ణాకృతీని చ = అనేకరంగులు ఆకారములును గల, మే = నాయొక్క, రూపాణి = రూపములను, పశ్య = చూడుము.

తా॥ అర్జునా నూరులకొలదియు, వేలకొలదియు అనేక విధములును అప్రాకృతములును అనేకరంగులును, అనేక ఆకారములును గల నారూపములను చూడుము.

అవ. శ్రీకృష్ణుడు తాను జూపబోవు ప్రధానరూపములను పేర్కొనుచున్నాడు.

6. శ్లో. పశ్యాదిత్యాన్ వసూ న్రుద్రా । నశ్వినౌ మరుత స్తథా
బహూ న్యదృష్టపూర్వాణి । పశ్యా శ్చర్యాణి భారత ! ॥

అర్థము :— భారత ! = అర్జునా ! ఆదిత్యాన్ = సూర్యులను, వసూన్ = వసువులను, రుద్రాన్ = రుద్రులను, అశ్వినౌ = అశ్వినీదేవతల నిరువురను, మరుతః = మరుత్తులను, పశ్య = చూడుము, తథా = అట్లే, అదృష్టపూర్వాణి = ఇదివరకెన్నడును చూడని, బహూని = అనేకములగు. ఆశ్చర్యాణి = అద్భుతములను, పశ్య = చూడుము.

తా॥ అర్జునా ! ద్వాదశాదిత్యులను, అష్టవసువులను, పదునొకండుగురు రుద్రులను, ఇద్దరశ్వినీకుమారులను నలుబదితొమ్మిది మరుద్గణములను, ఇట్లే యిదివరకెన్నడును కనివిని యెఱుంగని ఆశ్చర్యములను చూడుము.

7. శ్లో. ఇహైకస్థం జగత్కృత్స్నం । పశ్యాద్య సచరాచరమ్
మమ దేహే గుడాకేశ ! । య చ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి॥

అర్థము :— గుడాకేశ ! = అర్జునా ! సచరాచరం = జంగమస్థావరములతో గూడిన, కృత్స్నం = సమస్తమైన, జగత్ = ప్రపంచమునున్ను, అన్యత్ = ఇతరమగు, యత్ చ = ఇంకను దేనిని, ద్రష్టుం = చూచుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావో (తత్ = దానిని) మమ = నాయొక్క, ఇహ దేహే = ఈ శరీరమునందే, ఏకస్థం = ఒకచోట నున్నదానినిగా, అద్య = ఇప్పుడు, పశ్య = చూడుము.

తా॥ ఓ అర్జునా ! నాయొక్క దేహమునం దొకేభాగమున చరాచరాత్మకమైన సకలప్రపంచముండుట నిప్పుడు చూడుము. ఇంకను నీవు దేనిని చూడగోరెదవో దానినిగూడా నిచ్చటనే చూడుము.

అవ. శ్రీకృష్ణు డర్జునునకు తానుజూపు విశ్వరూపమును జూచుటకు తగిన దివ్యనేత్రము నొసంగుదునని చెప్పుచున్నాడు.

8. శ్లో. న తు మాం శక్యసే ద్రష్టు । మనేనైవ స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షుః । పశ్య మే యోగ మైశ్వరమ్॥

అర్థము :— అనేన = ఈ, స్వచక్షుషా ఏవతు = నీకంటితోనే, మాం = నన్ను, ద్రష్టుం చూచుటకు, న శక్యసే = శక్తుడవు కావు, తే = నీకు, దివ్యం = అప్రాకృతమైన, చక్షుః = దృష్టిని, దదామి = ఇచ్చుచున్నాను, మే = నాయొక్క, ఐశ్వరం = ఈశ్వర అసాధారణమైన, యోగం = యోగమును, పశ్య = చూడుము.

తా॥ ఈ నీ చర్మచక్షుస్సుతో నన్ను చూడజాలవు. కావున నీకు నన్ను జూచుటకు తగిన అప్రాకృతమైన దృష్టి నొసంగెదను. దానిచే నా కసాధారణమైన అనంతజ్ఞానాది యోగమును, విభూతి యోగమును చూడుము.

అవ. చెప్పినటులనే తన విశ్వరూపమును జూపెనని సంజయుడు చెప్పుచున్నాడు.

9. శ్లో. ఏవ ముక్త్వా తతో రాజన్ । మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ । పరమం రూప మైశ్వరమ్॥

అర్థము :— రాజన్ ! = ధృతరాష్ట్రా, మహాయోగేశ్వరః = గొప్ప యోగములకు ప్రభువగు, హరిః = శ్రీకృష్ణుడు, ఏవం = ఇట్లు, ఉక్త్వా = పలికి, తతః = అటుపైని, ఐశ్వరం = ఈశ్వరసంబంధమగు, పరమం = మిక్కిలి గొప్పదియగు, రూపం = రూపమును, పార్థాయ = అర్జునునికొఱకు, దర్శయా మాస = చూపించెను.

తా॥ ధృతరాష్ట్రా! మహదాశ్చర్యకరములగు యోగములకు ప్రభువగు శ్రీకృష్ణుడు ఇట్లు చెప్పి తన కసాధారణమును వివిధ విచిత్రమును నగు విశ్వమునకు నియామకమైన రూపమును అర్జునునకు జూపెను.

అవ. సంజయుడు తాను దర్శించిన విశ్వరూపమును ధృతరాష్ట్రునకు వర్ణించి చెప్పుచున్నాడు.

10. శ్లో. అనేక వక్త్రనయన । మనేకాద్భుత దర్శనమ్
అనేక దివ్యాభరణం । దివ్యానేకోద్యతాయుధమ్॥

అర్థము :— అనేక వక్త్రనయం = అనేక ముఖములు నేత్రములు కలదియు, అనేకాద్భుత దర్శనం = అనేకములగు అద్భుతములైన దర్శనములు కలదియు, అనేక దివ్యాభరణం = అనేక దివ్యభూషణములు కలదియు, దివ్యానేకోద్యతాయుధం = అప్రాకృతములగు అనేకములైన ఎత్తబడిన ఆయుధములు కలదియునగు.

తా॥ అనేక ముఖములును అనేక నేత్రములును కలదియు, నిరతిశయమై ఆశ్చర్యముగా జూడబడునదియు అనేక దివ్యాభరణములను ధరించునదియు అప్రాకృతములైన అనేక ఆయుధములను ఎత్తిపట్టుకొని యున్నదియునగు (రూపమును జూపెను)

11. శ్లో. దివ్యమాల్యామ్బర ధరం । దివ్యగన్ధానులేపనమ్
సర్వాశ్చర్యమయం దేవ । మనన్తం విశ్వతో ముఖమ్॥

అర్థము :— దివ్యమాల్యామ్బరధరం = అప్రాకృతమైన పుష్పమాలికలను వస్త్రములను ధరించినట్టియు, దివ్యగన్ధానులేపనం = అప్రాకృతమైన సుగంధమైపూత కలిగినట్టియు, సర్వాశ్చర్యమయం = ఆశ్చర్యకరములైన సకల తత్త్వములకు నాశ్రయమైనట్టియు, దేవం = ప్రకాశించుచున్నట్టియు, అనన్తం = దేశకాల పరిచ్ఛేదములేనట్టియు, విశ్వతోముఖం = అన్నిప్రక్కల ముఖములు కలిగియున్నట్టియు.

తా॥ అప్రాకృతమైన పుష్పమాలికలను బట్టలను ధరించినట్టియు, అప్రాకృతమైన సుగంధమైపూత కలిగినట్టియు, ఆశ్చర్యకరములైన సమస్త తత్త్వములకు ఆశ్రయమైనట్టియు, ప్రకాశించునట్టియు, దేశకాలపరిచ్ఛేదములు లేనట్టియు, అన్ని ప్రక్కల ముఖములు కలిగినట్టి (రూపమును జూపెను).

అవ. విశ్వరూపముయొక్క అపరిచ్ఛిన్నమైన కాంతిని వర్ణించుచున్నారు.

12. శ్లో. దివి సూర్యసహస్రస్య । భవే ద్యుగపదుత్థితా
యది భా స్సదృశీ సా స్యా । ద్భాస స్తస్య మహాత్మనః॥

అర్థము :— దివి = ఆకాశమునందు, సూర్యసహస్రస్య = వేయిమంది సూర్యుల యొక్క, భాః = కాంతి, యుగపత్ = ఒక్కసారిగా, ఉత్థితా = బయలు దేరినది, భవేత్ యది = అయినచో, సా = అట్టికాంతి, తస్య = ఆ, మహాత్మనః = మహాత్మునియొక్క, భాసః = కాంతికి, సదృశీ = సాటియైనది, స్యాత్ = అగును.

తా॥ ఆకాశమునందు వేయిమంది సూర్యులొక్కసారిగా నుదయించి నపుడు పుట్టునట్టి కాంతి యున్నచో విశ్వరూపుని కాంతికి సాటి కావచ్చును. (అభూతోపమా)

13. శ్లో. తత్రైకస్థం జగత్కృత్స్నం । ప్రవిభక్త మనేకధా
అపశ్య ద్దేవదేవస్య । శరీరే పాణ్డవ స్తదా॥

అర్థము :— పాణ్డవః = అర్జునుడు, తదా = అప్పుడు, అనేకధా = పెక్కుతీరులుగా, ప్రవిభక్తం = విభజింపబడిన, కృత్స్నం = సమస్తమైన, జగత్ = ప్రపంచమును, దేవదేవస్య = శ్రీకృష్ణునియొక్క, తత్ర = ఆ, శరీరే = విశ్వరూపమునందు, ఏకస్థం = ఒక్కచోటున నున్నదానినిగా, అపశ్యత్ = చూచెను.

తా॥ అప్పు డర్జును డావిశ్వదేహమున భోక్తృభోగ్యభోగోపకరణము లుగా విభజింపబడిన జగత్తునంతను ఒక్కచోట నున్నదానినిగా సాక్షాత్కరించెను.

అవ. అట్టి రూపమును జూచినతోడనే యర్జునునకు కలిగిన మార్పును సంజ యుడు ధృతరాష్ట్రునితో వర్ణించి చెప్పుచున్నాడు

14. శ్లో. తత స్స విస్మయావిష్టో । హృష్టరోమా ధనఞ్జయః
ప్రణమ్య శిరసా దేవం । కృతాఞ్జలి రభాషత॥

అర్థము:— తతః = అటుపిమ్మట. విస్మయావిష్టః = ఆశ్చర్యముతో కూడియున్న ట్టియు. హృష్టరోమా = రోమాంచము (గగుర్పాటు) కలిగినట్టియు, సః = ఆ యర్జునుడు. దేవం = శ్రీకృష్ణుని. శిరసా = తలతో. ప్రణమ్య = నమస్కరించి. కృతాఞ్జలిః = చేతులు జోడించుకొన్నవాడై. అభా షత = పలికెను

తా॥ అటు పిమ్మట అర్జునుడు మిక్కిలి ఆశ్చర్యముతో నొడలు గగుర్పొడువ శ్రీకృష్ణునకు సాష్టాంగముగ నమస్కరించి చేతులుజోడించి డగ్గుత్తికతో నాతనితో నిట్లుపలికెను.

అవ. అర్జునుడు విశ్వరూపమున తాను గాంచుచున్న విశేషములను వివరించు చున్నాడు.

15. శ్లో. పశ్యామిదేవాంస్తవదేవ!దేహే।సర్వాం స్తథాభూతవిశేషసఙ్ఘాన్
బ్రహ్మాణమీశంకమలాసనస్థం।ఋషీంశ్చసర్వానురగాంశ్చదివ్యాన్॥

అర్థము:— దేవ! = శ్రీకృష్ణా! తవ = నీయొక్క. దేహే = శరీరమునందు. సర్వాన్ = సమస్తమైన. దేవాన్ = దేవతలను. తథా = అట్లే. భూత విశేషసఙ్ఘాన్ = అనేకరీతులగు ప్రాణిసమూహములను. బ్రహ్మాణం = చతు ర్ముఖుని. కమలాసనస్థం = బ్రహ్మకు వశంవదుడైన. ఈశం = రుద్రుని. సర్వాన్ = సమస్తమైన. ఋషీన్ చ = ఋషులను. దివ్యాన్ = ప్రకా శించుచున్న. ఉరగాన్ = పాములను. పశ్యామి = చూచుచున్నాను.

తా॥ శ్రీకృష్ణా! నీశరీరమునందు సకలదేవతలను సమస్తప్రాణి సమూహములను, చతుర్ముఖబ్రహ్మను, బ్రహ్మఆజ్ఞానువర్తియగు రుద్రుని, సకలఋషిపుంగవులను ప్రకాశించు వాసుకి మొదలగు సర్పరాజములను చూచుచున్నాను.

16. శ్లో. అనేక బాహూదర వక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్
నాన్తం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర ! విశ్వరూప ! :

అర్థము :– విశ్వేశ్వర ! = ప్రపంచమునకు ప్రభువగు, విశ్వరూప ! = విశ్వరూపధరా ! త్వాం = నిన్ను. అనేక బాహూదరవక్త్రనేత్రం = అనేక భుజములు కడుపులు ముఖములు కన్నులు కలవానినిగాను, అనన్తరూపం = అంతము లేని ఆకారములు కలవానినిగాను, సర్వతః = అంతటను, పశ్యామి = చూచుచున్నాను, పునః = తిరిగి. తవ = నీయొక్క, ఆదిం = మొదలును న పశ్యామి = చూడజాలకున్నాను, మధ్యం చ = మధ్యభాగమునున్ను. న (పశ్యామి) = చూడజాలకయున్నాను, అన్తం = తుదనున్ను. న (పశ్యామి) చూడజాలకయున్నాను.

తా॥ ప్రపంచమునకు నాధుడవగు నోవిశ్వరూపధరా! నిన్ననేక భుజములు కడుపులు, ముఖములు కన్నులు కలిగి ఇంతింతనరాని యాకారములు కలవానిగా నంతటను చూచుచున్నాను. నీ యాది మధ్యాంతములు నాకు గోచరించుట లేదు

అవ. ఎన్నడు నెఱుంగని రూపమును జూపినను అతని యసాధారణచిహ్నలను గాంచి గుర్తించగలుగు చున్నాననుచున్నాడు.

17. శ్లో. కిరీటినంగదినంచక్రిణం చ । తేజోరాశింసర్వతోదీప్తిమన్తమ్
పశ్యామిత్వాందుర్నిరీక్షంసమన్తాద్దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్॥

అర్థము :– తేజోరాశిం = కాంతిపుంజమైనట్టియు. సర్వతోదీప్తిమన్తం = అంతటను కాంతితో కూడినట్టియు. సమన్తాత్ = అంతటను, దీప్తానలార్కద్యుతిం = మండుచున్న నిప్పు సూర్యులవంటి కాంతిగలిగినట్టియు, దుర్నిరీక్షం = చూడ శక్యముగానట్టియు. అప్రమేయం = ఇంతయని చెప్పతగనట్టి. త్వాం = నిన్ను, కిరీటినం = కిరీటముకలవానినిగాను, గదినం = గద కలవానిని గాను. చక్రిణంచ = చక్రము కలవానినిగాను, పశ్యామి = చూచుచున్నాను.

తా॥ కాంతిపుంజమై యంతటను నిండిన కాంతివలన చూడశక్యము గాక మండుచున్న నిప్పు, సూర్యుల కాంతివంటి కాంతిగలిగి యింత యని హద్దుగా చెప్పదగని నిన్ను కిరీటాది భూషణములను చక్రగదాద్యాయుధములను ధరించియున్నట్లు దర్శించుచున్నాను.

అవ. దివ్యనేత్రముతోఁగాంచిన భగవత్ప్రభావముచే తనకు గలిగిన ఔపనిషద భగవదనుభవమును వర్ణించుచున్నాడు.

18. శ్లో. త్వమక్షరంపరమంవేదితవ్యం।త్వమస్యవిశ్వస్యపరంనిధానమ్
త్వమవ్యయశ్శాశ్వత-ధర్మగోప్తా।సనాతనస్త్వంపురుషోమతోమే॥

అర్థము :— వేదితవ్యం = తెలియదగిన. పరమం = గొప్పదియగు. అక్షరం = అక్షరము. త్వం = నీవు. అస్య = ఈ. విశ్వస్య = ప్రపంచమునకు. పరం = గొప్ప. నిదానం = ఆధారము. త్వం = నీవు. అవ్యయః = వికారములు లేనివాడవు. త్వం = నీవు. శాశ్వతధర్మగోప్తా = నిత్యమైన ధర్మమును కాపాడువాడవును. సనాతనః = అనాదియైన. పురుషః = పురుషుడవును. త్వం ఏవ ఇతి = నీవేయని. మే = నాకు. మతః = తెలిసినది.

తా॥ ముండకాది ఉపనిషత్తులలో తెలియదగినదిగా నిర్దేశింపబడిన పరమైన అక్షరము నీవే. ఈజగత్తునకు సర్వోత్కృష్టమైన ఆధారము నీవే. స్వరూపాదులయం దెల్లప్పుడు నొకరూపముతో నుండువాడవునీవే. నిత్యమైన ధర్మములను కాపాడువాడవు నీవే. పురాణ పురుషుడవునీవే, యని నాకిప్పుడు తెలిసినది.

19. శ్లో. అనాదిమధ్యాన్తమనన్తవీర్య।మనన్తబాహుంశశిసూర్యనేత్రమ్
పశ్యామిత్వాందీప్తహుతాశవక్త్రం।స్వతేజసావిశ్వమిదంతపన్తమ్॥

అర్థము :— అనాదిమధ్యాన్తం = ఆది మధ్య అంతములులేనివాడవున్ను. అనన్తవీర్యం = అపరిమిత పరాక్రమము కలవాడవున్ను. అనన్తబాహుం = అనేక బాహువులుకలవాడవున్ను. దీప్తహుతాశవక్త్రం = మండుచున్న నిప్పువంటి ముఖ కలవాడవున్ను. స్వతేజసా = నీ కాంతితో. ఇదం = ఈ. విశ్వం = జగత్తును. తపన్తం = తపింపచేయుచున్నవాడవును నగు. త్వాం = నిన్ను. పశ్యామి = చూచుచున్నాను.

తా॥ ఆదిమధ్యాంతములు లేనట్టియు అపరిమిత పరాక్రమము కలిగియున్నట్టియు, లెక్కలేనన్ని చేతులుకలిగియున్నట్టియు, చంద్రునివలె చల్లగను సూర్యునివలె తీవ్రముగను నుండు కండ్లు కలిగియున్నట్టియు కాలాగ్నివలె మండుచున్న ముఖము కలిగినట్టి నీతేజస్సుచేత నీప్రపంచమును తపింపజేయుచున్న నిన్ను జూచుచున్నాను.

అవ. ఇట్లత్యుగ్రరూపధారివగు నిన్నుజూచి నేనేకాదు దేవాదులున్ను భయ భీతులగుచున్నారనుచున్నాడు.

20. శ్లో. ద్యావా పృథివ్యో రిదమన్తరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః
దృష్ట్వాఽద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥

అర్థము :— ద్యావాపృథివ్యోః = ఆకాశ భూములయొక్క, ఇదం = ఈ, అన్తరం = మధ్యప్రదేశము, ఏకేన = ఒక్కడవైన, త్వయా = నీచేత, వ్యాప్తంహి = వ్యాపింపబడియున్నదిగదా ! సర్వాః = సమస్తమైన, దిశః చ = దిక్కులున్ను, (వ్యాప్తాః = వ్యాపింపబడియున్నవి) మహాత్మన్ ! = కృష్ణా ! ఉగ్రం = భయంకరమైన, అద్భుతం = ఆశ్చర్యకరమైన, తవ = నీయొక్క, ఇదం = ఈ, రూపం = విశ్వరూపమును, దృష్ట్వా = చూచి, లోకత్రయం = మూడువిధములగు జనులున్ను, ప్రవ్యథితం = మిక్కిలి భయమునుజెందెను.

తా॥ భూమి ఆకాశముల మధ్యభాగ మంతయును అన్ని దిక్కులును నీవే వ్యాపించియున్నావు. మహాత్మా ! బ్రహ్మాది దేవతావర్గములో అనుకూలురు - ప్రతికూలురు మధ్యస్థులు అనెడు మూడు విధములవారును అత్యద్భుతమై అతి భయంకరమైయుండు నీరూపమునుజూచి భయపడుచున్నారు. (అర్జునునకు తన ఐశ్వర్యమును జూపుటకై వీరందరికిని దివ్యదృష్టి యొసంగబడెను.)

21. శ్లో. అమీహిత్వాసురసఙ్ఘావిశన్తి । కేచిద్భీతాః ప్రాఞ్జలయోగృణన్తి
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసఙ్ఘాః। స్తువన్తిత్వాంస్తుతిభిః పుష్కలాభిః॥

అర్థము :— అమీ = ఈ, సురసఙ్ఘాః = దేవతాసమూహములు, త్వాం = నిన్ను, విశన్తి = ప్రవేశించుచున్నవి, కేచిత్ = కొందరు, భీతాః = భయపడిన వారై, ప్రాఞ్జలయః = చేతులు జోడించినవారగుచు, గృణన్తి = స్తోత్రము చేయుచున్నారు, మహర్షి సిద్ధసఙ్ఘాః = మహర్షులయొక్కయు సిద్ధుల యొక్కయు సమూహములు, స్వస్తి = మంగళము, (అస్తు = అగుగాక) ఇతి = అని, ఉక్త్వా = పలికి, పుష్కలాభిః = సంపూర్ణములైన, స్తుతిభిః = స్తోత్రములచేత, త్వాం = నిన్ను, స్తువన్తి = స్తుతించుచున్నారు.

తా॥ ఈ గొప్ప దేవతాసమూహము నీసమీపమునకు వచ్చుచున్నది. కొందరు భయపడి చేతులుజోడించి స్తోత్రము చేయుచున్నారు. భృగువు మొదలగు మహర్షులు సనకాది సిద్ధులును నీకు మంగళాశాసనముగావించి నీకు తగిన సంపూర్ణస్తోత్రములచే నిన్ను నుతించుచున్నారు.

22. శ్లో. రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః
విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ
గన్ధర్వ - యక్షా - సుర - సిద్ధ - సఙ్ఘాః
వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥

అర్థము :— రుద్రాదిత్యాః = ఏకాదశాదిత్యులును. వసవః = ఎనమండ్రు వసువులును, యే సాధ్యాః = ఎవరు సాధ్యులో వారును, విశ్వే = విశ్వేదేవతలు అశ్వినౌ = అశ్వినీదేవతలిద్దరును, మరుతః చ = ఏడుగురు మరుత్తులును, ఊష్మపాః చ = పితృదేవతలున్ను, గన్ధర్వ యక్షాసుర సిద్ధసఙ్ఘాః = గంధర్వులు, యక్షులు, రాక్షసులు, సిద్ధులు అనువారి సమూహము లున్ను, సర్వేచ = వీరందరును, విస్మితాః ఏవ = ఆశ్చర్యపడినవారగుచునే, త్వాం = నిన్ను. వీక్షన్తే = చూచుచున్నారు.

తా॥ ఏకాదశరుద్రులును, ద్వాదశాదిత్యులును, అష్టవసువులును, సకలసాధ్యులును విశ్వేదేవతలును ఇద్దరశ్వినీదేవతలును సప్త మరుత్తులును పితృదేవతలును గంధర్వయక్షరాక్షస సిద్ధసమూహములున్ను అందరును ఆశ్చర్యమునుపొంది నిన్ను చూచు చున్నారు.

23. శ్లో. రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో ! బహుబాహూరుపాదమ్
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథి తాస్తథాఽహమ్॥

అర్థము :— మహాబాహో ! = శ్రీకృష్ణా। బహువక్త్రనేత్రం = అనేక ముఖములు కండ్లు కలిగినట్టియు, బహుబాహూరుపాదం = అనేక భుజములు తొడలు పాదములు కలిగినట్టియు, బహూదరం = అనేక కడుపులుకలిగినట్టియు, బహుదంష్ట్రాకరాళం = అనేకమైన కోరలచే భయంకరమైనట్టి, తే = నీయొక్క, మహత్ = గొప్పదైన, రూపం = రూపమును, దృష్ట్వా = చూచి, లోకాః = జనులు, ప్రవ్యథితాః = మిక్కిలి భయపడిరి, అహం నేను, తథా = అట్లే (ప్రవ్యథితః = భయపడితిని).

తా॥ శ్రీకృష్ణా! అనేక ముఖములును, లెక్కలేని కన్నులును, పరిమితి లేని భుజములును పెక్కుతొడలును, బహుపాదములును, అనేకములగు కడుపులును, పెక్కుకోరలచేత భయంకరమును నగు నీయిట్టి గొప్ప ఆకారమునుజూచి జనులందరును అతి భయముతో వణకుచున్నారు. అట్లే నేనును భయపడుచున్నాను.

24. శ్లో. నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్
దృష్ట్వా హి త్వాం ప్రవ్యధితాన్తరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో ! ॥

అర్థము :- విష్ణో ! = శ్రీకృష్ణా! నభఃస్పృశం = ఆకాశమునంటియున్నట్టియు, దీప్తం = ప్రకాశించుచున్నట్టియు, అనేకవర్ణం = అనేక రంగులుకలిగి యున్నట్టియు, దీప్తవిశాలనేత్రం = ప్రకాశించుచున్న విశాలమైన నేత్రములు కలిగియున్నట్టియు, త్వాం = నిన్ను దృష్ట్వా = చూచి, ప్రవ్యధితాన్తరాత్మా = మిక్కిలి భయపడిన మనస్సుకలవాడనై, ధృతిం = దేహధారణను, శమంచ = ఇంద్రియముల కుపశాంతిని, న విన్దామిహి = పొందజాలకున్నానుగదా!

తా॥ కృష్ణా! ఆకసము నొరయుచు ప్రకాశించుచు పెక్కురంగులు కలిగి తెరువబడిన నోరులుకలిగి ప్రకాశించు విశాలమైన కండ్లు కలిగియున్న నిన్నుజూచి మిక్కిలి భయపడినవాడనై దేహమును ధరింపజాలకయున్నాను. నాసకలేంద్రియములకును శాంతి లేక యున్నది.

అవ. ఇతరావయవములకంటె ముఖము లత్యంతభయంకరములై యున్నవనియు, తన భయమును బోగొట్టి యనుగ్రహించమనియు వేడుచున్నాడు.

25 శ్లో. దంష్ట్రాకరాళాని చ తే ముఖాని।దృష్ట్వైవ కాలానలసన్నిభాని
దిశో న జానే న లభే చ శర్మ।ప్రసీద దేవేశ! జగన్నివాస! ॥

అర్థము :- దేవేశ ! = శ్రీకృష్ణా ! దంష్ట్రాకరాళాని = కోరలచే భయంకరమైనట్టియు, కాలానలసన్నిభాని = ప్రళయకాలాగ్నితో సమానమైన, తే = నీయొక్క, ముఖాని = ముఖములను, దృష్ట్వా ఏవ = చూచినంతనే, దిశః = దిక్కులను, న జానే = తెలియకున్నాను, శర్మచ = సుఖమునున్ను, న లభే = పొందకయున్నాను, జగన్నివాస ; = శ్రీకృష్ణా ! ప్రసీద = అనుగ్రహింపుము.

తా॥ కృష్ణా! కోరలచే భయంకరములై ప్రళయ కాలాగ్నివలెనున్న నీ ముఖముల జూచినంతనే దిక్కుల గానక సుఖమును బడయజాలకయున్నాను. జగన్నివాస! దేవదేవ! నేను స్వస్థచిత్తుడ నగునట్లనుగ్రహింపుము.

అవ. ఇట్లు శ్రీకృష్ణు డర్జునునకు ప్రపంచమంతయు తన యధీనమైయుండి సంచరించుచున్నదని జూపుచు ఉభయపక్షములయందును రాజవేషములతో నున్న అసురాంశసంభూతుల నందరను సంహరించి తాను స్వయముగ జేయదలంచిన భూభారమును తొలగించు భావివ్యాపారమును తన విశ్వ రూపమున జూపెను. దానినంతను అర్జునుడు తనకు ప్రసాదించిన దివ్య దృష్టిచే ప్రత్యక్షముగా జూచి యిట్లు చెప్పుచున్నాడు.

26. శ్లో. అమీ సర్వే ధృతరాష్ట్రస్య పుత్రా
స్సర్వే స్సహై వావనిపాల సఙ్ఘైః
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః॥

అర్థము:- అమీ = ఈ. సర్వే = సమస్తమైన. ధృతరాష్ట్రస్య = ధృతరాష్ట్రుని పుత్రాః = దుర్యోధనాదిబిడ్డలును. భీష్మః = భీష్ముడును. ద్రోణః = ద్రోణుడును. అసౌ = ఈ సూతపుత్రః = కర్ణుడును. సర్వైః = సమస్తములగు అవనిపాల సఙ్ఘైః సహ = రాజుల సమూహములతో కూడ. తథా = అట్లే. అస్మదీయైః = మావారైన. యోధముఖ్యైః అపి సహ = కొందరు వీరాగ్రేసరులతోసహా.

తా॥ ఈ కాన్పించుచున్న ధృతరాష్ట్రుని పుత్రులున్ను భీష్మ ద్రోణ కర్ణ మొదలగువారందరున్ను, పరపక్షమందలి రాజులున్ను వీరితోసహా మనసేనయందలి వీరాగ్రేసరులున్ను కూడ (దీనికి ముందు శ్లోకముతో సంబంధము)

27. శ్లో. వక్త్రాణి తే త్వరమాణా విశన్తి । దంష్ట్రాకరాళానిభయానకాని
కేచిద్విలగ్నాదశనాన్తరేషు । సన్దృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గైః॥

అర్థము :– దంష్ట్రాకరాళాని = కోరలచే వికారరూపములు గలవియు, భయానకాని = భయంకరములై నవియు నగు, తే = నీయొక్క, వక్త్రాణి = ముఖములను, త్వరమాణాః = త్వరపడుచున్నవారై, విశన్తి = ప్రవేశించుచున్నారు, కేచిత్ = కొందరు, దశనాన్తరేషు = పండ్లసందులయందు, విలగ్నాః = చిక్కినవారై, చూర్ణితైః = గుండచేయబడిన, ఉత్తమాఙ్గైః = తలలతో, సన్దృశ్యన్తే = కనబడుచున్నారు.

తా॥ కోరలచే వికృతములును, భయంకరములును నగు నీ నోళ్ళ యందు తమ వినాశముకొఱకు త్వరపడుచు ప్రవేశించుచున్నారు. మరికొందరు నీపండ్లసందుల జిక్కుకొనినవారై గుండ జేయబడిన తలలతో కనబడుచున్నారు.

అవ. ఆ యోధులందరును తమ ప్రయత్నము లేకనే ఒకే విశ్వ రూపునియందు లయమగుటకును, ఆతడు సర్వసంహారానుకూలమైన సామాన్యాకార ముతో నుండుటకును రెండు దృష్టాంతములను జూపుచున్నాడు.

28. శ్లో. యథానదీనాంబహవోఽమ్బువేగాఃసముద్రమేవాభిముఖాద్రవన్తి
తథా తవామీ నరలోకవీరాః । విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి॥

అర్థము :– యథా = ఎట్లు, నదీనాం = నదులయొక్క, బహవః = అనేకములైన, అమ్బువేగాః = జలప్రవాహములు, సముద్రం ఏవ = సముద్రమును గూర్చియే, అభిముఖాః = ఎదురైనవై, ద్రవన్తి = ప్రవహించుచున్నవో, తథా = అట్లే, అమీ = ఈ, నరలోకవీరాః = మనుష్యలోకమునందలి శూరులు, తవ = నీయొక్క, అభివిజ్వలన్తి = అంతటను మండుచున్న, వక్త్రాణి = ముఖములను, విశన్తి = ప్రవేశించుచున్నారు.

తా॥ నదులయొక్క బహువిధములగు జలప్రవాహములు సముద్రము నకు ఎదురుగా ప్రవహించునట్లు, ఈ శూరులగు రాజులందరు మండుచున్న నీముఖములను ప్రవేశించుచున్నారు.

29. శ్లో. యథాప్రదీప్తం జ్వలనం పతఙ్గాః।విశన్తి నాశాయసమృద్ధవేగాః
తథైవ నాశాయ విశన్తి లోకా। స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥

అర్థము :- యథా = ఎట్లు, పతఙ్గాః = మిడుతలు, సమృద్ధవేగాః = మిక్కిలి వేగము కలవై, ప్రదీప్తం = మండుచున్న, జ్వలనం = అగ్నిహోత్రమును, నాశాయ = నాశముకొఱకు, విశన్తి = ప్రవేశించుచున్నవో, తథైవ = అట్లే, లోకాః అపి = మనుష్యులున్ను, నాశాయ = నాశముకొఱకు, సమృద్ధవేగాః = అతివేగముకలవారై, తవ = నీయొక్క, వక్త్రాణి = ముఖములను, విశన్తి = ప్రవేశించుచున్నారు.

తా॥ మిడుతలు మిక్కిలి వేగముకలవై మండుచున్న అగ్నిహోత్రమును తమ నాశముకొఱకే ప్రవేశించుచున్నట్లు వీరులగు ఈ రాజులందరును అతివేగముతో తమ నాశముకొఱకు మండుచున్న నీ నోళ్ళయందు ప్రవేశించుచున్నారు.

30. శ్లో. లేలిహ్యసే గ్రసమానస్సమన్తా
ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః
తేజోభి రాపూర్య జగత్సమగ్రం
భాస స్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో!॥

అర్థము :- విష్ణో = కృష్ణా! జ్వలద్భిః = మండుచున్న, వదనైః = ముఖములచేత, సమగ్రాన్ = సమస్తములైన, లోకాన్ = రాజసమూహములను, గ్రసమానః = మ్రింగుచున్నవాడవై, సమన్తాత్ = అంతటను, లేలిహ్యసే = నాకుచున్నావు, తవ = నీయొక్క, ఉగ్రాః = భయంకరములైన, భాసః = కిరణములు, తేజోభిః = తమ కాంతులచే, సమగ్రం = సమస్తమైన, జగత్ = ప్రపంచమును, ఆపూర్య = నింపి, ప్రతపన్తి = మిక్కిలి తపింప చేయుచున్నవి.

తా॥ కృష్ణా! యుద్ధమునకు వచ్చిన రాజులనందరను మండుచున్న నీ నోళ్ళచే మ్రింగుచున్నవాడవై వారిరక్తముచే పూయబడిన నీ పెదవులను నాకుకొనుచున్నావు. అతిభయంకరమగు నీకిరణములు తమ కాంతిచే లోకము నందంతటను వ్యాపించి తపింప జేయుచున్నవి.

అవ. ఇట్టి భయంకరాకారమును చూడజాలక భయపడి అర్జునుడు 'నీ సకలై శ్వర్యమును జూప నమకట్టిన నీవీ యుగ్రరూపము నేల జూపితివి? దయతో నీ సౌమ్యరూపమునుజూపి యనుగ్రహించు'మని వేడుచున్నాడు.

31. శ్లో. ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర! ప్రసీద
విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం
నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥

అర్థము :- దేవవర = శ్రీకృష్ణా! ఉగ్రరూపః = భయంకరాకారముగల. భవాన్ = నీవు. కః = ఎవడవు? ఆద్యం = ఆదిపురుషుడవగు. భవన్తం = నిన్ను. విజ్ఞాతుం = తెలిసికొనుటకు. ఇచ్ఛామి = కోరుచున్నాను. తవ = నీయొక్క. ప్రవృత్తిం = ఉద్యమమును. నహి ప్రజానామి = ఎరుగను కదా! మే = నాకు. ఆఖ్యాహి = చెప్పుము. తే = నీకు. నమః = నమస్కారము. అస్తు = అగుగాక! ప్రసీద = అనుగ్రహింపుము.

తా॥ శ్రీకృష్ణా! ఆదిపురుషుడవగు నీవు ఈభయంకరాకారమును నీ భక్తుడనగు నాకేల జూపితివి? నీ విట్టిరూపమును జూపుటలో నీ యభిప్రాయమేమో తెలియగోరుచున్నాను. అది నాకు తెలిపి యనుగ్రహింపుము. నీకిదే నమస్కరించుచున్నాను.

అవ. అందులకు శ్రీకృష్ణుడు అర్జునుని ప్రయత్నము లేకున్నను యీ రాజ లోకమునంతను నంతమొందించుటకే తానువ్యవించితినని తెలుపుటకే యాతనికీ రూపమును జూపెను గాన వెనుకంజ వేయవలదని యాతనిని ప్రోత్సహించుచున్నాడు.

శ్రీ భగవాన్ ఉవాచ = శ్రీకృష్ణుడు పలికెను.

32. శ్లో. కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధః
లోకాన్ సమాహర్తు మిహప్రవృత్తః
ఋతేఽపి త్వా న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥

అర్థము :— కాలః = లెక్కించువాడనై, లోకక్షయకృత్ = రాజలోకమును నాశనము చేయువాడనై, ప్రవృద్ధః = మిక్కిలి పెరిగినవాడనై, లోకాన్ = రాజ లోకములను, సమాహర్తుం = ఎదుటనే చంపుటకు, ఇహ = ఇచ్చట, ప్రవృత్తః = ప్రవర్తించినవాడను, అస్మి = అగుచున్నాను, ప్రత్యనీకేషు = శత్రుసైన్యములందు, యే యోధాః = ఏ వీరులు, అవస్థితాః = ఉన్నారో, తే సర్వే = వారందరును, త్వా ఋతే అపి = నీవు లేకపో యినను, న భవిష్యన్తి = ఉండలేరు.

తా॥ నేను రాజలోకముయొక్క ఆయుఃపరిమాణమును లెక్కించుచు వీరినందరను నాశనము చేయుటకై యిట్టిఘోర రూపముతో పెరిగి వీరినెదుర్కొని చంపబూనియున్నాను. శత్రుసైన్యము నందుగల యోధులందరును నీప్రయత్నము లేకపోయినను నా సంకల్పముచే తప్పక నశింతురు.

అవ. 'నేను చంపకున్నను దుర్యోధనాదులు నశించుచో నన్నేల ప్రేరేపింతు' వను నర్జునుని భావమును గ్రహించి 'నా ప్రియభక్తుడవగు నీకు జయ యశోరాజ్యముల ప్రసాదింపగోరి ప్రోత్సహించుచున్నా'నని శ్రీకృష్ణుడు సమాధానమొసంగుచున్నాడు.

33. శ్లో. తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్
మయై వైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ! ॥

అర్థము :– తస్మాత్ = ఆ కారణమువలన, త్వం = నీవు, ఉత్తిష్ఠ = లెమ్ము, శత్రూన్ = శత్రువులను, జిత్వా = జయించి, యశః = కీర్తిని, లభస్వ = పొందుము, సమృద్ధం = పూర్ణమైన, రాజ్యం = రాజ్యమును, భుఙ్క్ష్వ = అనుభవింపుము, ఏతే = వీరు, మయా ఏవ = నాచేతనే, పూర్వం ఏవ = మునుపే, నిహతాః = చంపబడిరి, సవ్యసాచిన్ ! = అర్జునా ! త్వం = నీవు, నిమిత్తమాత్రం = సాధనముమాత్రమే, భవ = అగుము.

తా॥ కాబట్టి నీవు శత్రువులతో యుద్ధమును జేయ సన్నద్ధుడవుకమ్ము. కీర్తిని పొందుము. శత్రువులనుజంపి పరిపూర్ణమైన రాజ్యము ననుభవింపుము. ఈ రాజులందరును చంపదగినవారని నేనిదివరకే సంకల్పించితిని. కావున అర్జునా ! నీవీ పనిలో నాకు శస్త్రాదుల వలె సాధనముమాత్ర మగుము.

అవ. ధర్మభీరువగు నర్జునుడు 'భీష్మద్రోణాదుల నే నెట్లు చంపగల'నని యడిగిన ప్రశ్నకీ శ్లోకమున సమాధాన మొసంగుచున్నాడు.

34\. శ్లో. ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథా న్యానపి యోధవీరాన్
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠాః
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్॥

అర్థము :- మయా = నాచేత, హతాన్ = చంపబడుటకై ఏర్పరచబడిన, ద్రోణం = ద్రోణాచార్యుని, భీష్మం = భీష్మాచార్యుని, జయద్రథంచ = సైంధవుని, కర్ణం = కర్ణుని తథా = అట్లే, అన్యాన్ = ఇతరులగు, యోధవీరాన్ అపి = యుద్ధవీరులనున్న. త్వం = నీవు జహి = చంపుము, మా వ్యథిష్ఠాః = భయపడకుము. యుధ్యస్వ = యుద్ధముచేయుము. రణే = యుద్ధమునందు, సపత్నాన్ = శత్రువులను, జేతాసి = జయించగలవు.

తా॥ తప్పుచేయుటచే నేను చంపుటకే నిర్ణయించిన ద్రోణుని భీష్ముని సైంధవుని కర్ణుని యింకను నితర యుద్ధవీరులను నీవు చంపుము. భయపడకుము. యుద్ధమును జేయుము. తప్పక రణరంగమున నీకు జయము కలిగియే తీరును.

అవ. ఈమాటలు వినుటచే నర్జునునకు కలిగిన భయభక్తులను సంజయుడు వర్ణించుచున్నాడు.

35\. శ్లో. ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య।కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ
నమస్కృత్వాభూయఏవాహకృష్ణం।సగద్గదంభీతభీతఃప్రణమ్య॥

అర్థము :- కిరీటీ = అర్జునుడు, కేశవస్య = శ్రీకృష్ణునియొక్క, ఏతత్ = ఈ, వచనం = మాటను, శ్రుత్వా = విని, నమఃకృత్వా = నమస్కరించి, భీతభీతః = మిక్కిలి భయపడుచున్నవాడై, భూయః ఏవ = తిరిగిన్ని, ప్రణమ్య = నమస్కరించి; కృతాఞ్జలిః = చేతులు జోడించినవాడై, వేపమానః = వణకుచు, స గద్గదం = గద్గదస్వరముతో, కృష్ణం = శ్రీకృష్ణునిగూర్చి, ఆహ = పలికెను.

తా॥ ఇట్లు శ్రీకృష్ణుని మాటను విని యర్జునుడాతనికి నమస్కరించి మిక్కిలి భయపడుచు చేతులు జోడించి తిరిగి నమస్కరించి వణకుచు గద్గదకంఠముతో శ్రీకృష్ణునితో నిట్లనియెను.

అర్జున ఉవాచ = అర్జునుడు పలికెను.

36. శ్లో. స్థానే హృషీకేశ ! తవ ప్రకీర్త్యా
జగ త్ప్రహృష్య త్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః॥

అర్థము :– హృషీకేశ ! = శ్రీకృష్ణా ! జగత్ = దేవగన్ధర్వాదిలోకము, తవ = నీ యొక్క, ప్రకీర్త్యా = కీర్తిచేత, ప్రహృష్యతి = మిక్కిలి సంతోషించుచున్నది. రక్షాంసి = రాక్షసులు, భీతాని = భయపడినవారై, దిశః = దిక్కులనుగూర్చి, ద్రవన్తి = పరుగిడుచున్నారు. సర్వే = సమస్తమైన, సిద్ధసఙ్ఘాః చ = సిద్ధసమూహములున్ను, నమస్యన్తి = నమస్కరించుచున్నవి. స్థానే = (అది) యుక్తమే.

తా॥ కృష్ణా! దేవగంధర్వాదీ సమస్తదేవజాతియు నీకీర్తికి మిక్కిలి ఆనందమును అనురాగమును పొందుచున్నది. నిన్ను జూచి రాక్షసులు భయపడి పలుదిక్కులకు పారిపోవుచున్నారు. సిద్ధులు మొదలగు భక్తబృందమంతయు నీకు నమస్కరించుచున్నారు. ఇట్లు గావించుటయంతయు యుక్తమే.

(ఈశ్లోకము శ్రీవిష్ణుపంజరాదులలో ముఖ్యమంత్రముగా వినియోగింపబడును. మధుసూదన సరస్వతి దీనిని రక్షోఘ్న మంత్రమని పేర్కొనిరి.)

అవ. అది యెట్లుయుక్తమో తెలుపుచున్నాడు.

37. శ్లో. కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్!
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే
అనన్త! దేవేశ! జగన్నివాస!
త్వ మక్షరం సదసత్తత్పరం యత్॥

అర్థము :- మహాత్మన్ ! = ఓ మహాత్ముడా! బ్రహ్మణః అపి = చతుర్ముఖ బ్రహ్మకున్ను, ఆదికర్త్రే = ప్రధానకారణమైనట్టియు, గరీయసే = గొప్పవాడవునునగు, తే = నీకొఱకు, కస్మాత్ = ఏకారణమువలన, న నమేరన్? = నమస్కరించరు? అనన్త = అపరిచ్ఛిన్నుడా! దేవేశ! = దేవతలకు ప్రభువా! జగన్నివాస! = జగత్తునందంతటను స్థిరముగ నుండువాడా! శ్రీకృష్ణా!! అక్షరం = నాశరహితమైన ఆత్మతత్వము. త్వం = నీవే. సత్ అసత్ = కార్యకారణరూపమగు ప్రకృతితత్వమున్ను. తత్పరం = ఆ రెండింటికంటెను వేరైన ముక్తాత్మతత్త్వమున్ను (త్వం ఏవ = నీవే)

తా॥ ఓ మహాత్మా! నీవు మిక్కిలి గొప్పవాడవు. చతుర్ముఖునకును ఆదికారణమైనవాడవు. ఇట్టి నీకు బ్రహ్మాదులేల నమస్కరింపరు? నీవపరిచ్ఛిన్నుడవు. బ్రహ్మాది దేవతలకందరకును ప్రభువువు. సకల జగత్తునందును వ్యాపించివిడువక యుండువాడవు. జీవాత్మతత్త్వము ప్రకృతితత్త్వము, ముక్తాత్మతత్త్వమున్ను నీవే యగుచున్నావు.

38. శ్లో. త్వమాదిదేవఃపురుషఃపురాణః। త్వమస్యవిశ్వస్యపరంనిధానమ్
వేత్తాఽసివేద్యంచపరంచధామ।త్వయాతతంవిశ్వమనన్తరూప ! ॥

అర్థము :— ఆదిదేవః = సృష్టికర్తవును. పురాణః = పురాతనుడవగు. పురుషః = పురుషుడవును త్వం = నీవే అస్య = ఈ. విశ్వస్య = ప్రపంచమునకు. పరం = శ్రేష్ఠమైన. నిధానం = ఆధారమున్ను. త్వం = నీవే. వేత్తా = తెలుసుకొనువాడవున్ను. వేద్యం చ = తెలియబడునదియు. పరం = ఉత్తమమైన. ధామ చ = ప్రాప్యస్థానమున్ను. త్వం అసి = నీవే యగుచున్నావు అనన్తరూప ! = అంతములేని స్వరూపము కలవాడా, విశ్వం = ప్రపంచమంతయు. త్వయా = నీచేత. తతం = వ్యాపింపబడియున్నది.

తా॥ కృష్ణా! సృష్టికర్తయగు నాదిదేవుడవును, పురాణపురుషుడవును నీకు శరీరమగు నీప్రపంచమునకంతకును ఆత్మస్వరూపమున పరమాధారభూతుడవును నీవే అయియున్నావు, జగత్తునందు తెలుసుకొనువారును తెలియబడునవియును, అన్నియు నీవే. ఇందుచే పరమప్రాప్యస్థానమును నీవే. అంతము లేని స్వరూపముకలవాడా! చిదచిదాత్మకమగు నీప్రపంచము నంతను నీవే యాత్మభూతుడవై వ్యాపించియున్నావు.

అవ. ఇట్లన్నిటికి నంతర్యామిగానున్నవాడవు గావుననే వాయ్వాది శబ్దములచే నీవే చెప్పబడుచున్నావనుచున్నాడు.

39. శ్లో. వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాఙ్కః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ॥

అర్థము :— వాయుః = వాయువును, యమః = యముడును, అగ్నిః = అగ్నియు, వరుణః = వరుణుడు, శశాఙ్కః = చంద్రుడు. ప్రజాపతిః = బ్రహ్మయు, ప్రపితామహః చ = ముత్తాతయు, త్వం = నీవే.

తా॥ వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, బ్రహ్మ, ప్రపితామహుడు, ఈశబ్దములన్నియు నీకే వర్తించుచున్నవి.
(శరీరవాచకములగు శబ్దములన్నియు శరీరియందు పర్యవసించునని శాస్త్రము. అన్నిటిని శరీరముగా గలిగియున్న శరీరి సర్వేశ్వరుడే గావున శబ్దములన్నియు నాతనినే బోధించును.)

అవ. విశ్వరూపమును జూపుటచే తెలుపబడిన భగవంతుని పరత్వ సౌలభ్య
ముల రెండింటిని యనుభవించుటవలన తనకు కలిగిన భయహర్షములచే
నవశుడై యర్జునుడు నమస్కరించుచున్నాడు.

39. శ్లో. నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే॥

40. శ్లో. నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ

అర్థము :- తే = నీకొఱకు, సహస్రకృత్వః = వేయిమారులు, నమః నమః అస్తు = నమస్కారములగుగాక । పునః చ = తిరిగియు, నమః = నమస్కారము (అస్తు = అగుగాక) భూయః అపి = తిరిగియు, తే = నీకొఱకు, నమో నమః = నమస్కారము, అథ = మరియు, తే = నీకొఱకు, పురస్తాత్ = ఎదుటను, నమః = నమస్కారము, పృష్ఠతః = వెనుకను, నమః = నమస్కారము (అస్తు = అగుగాక). సర్వః = అన్నిటికి నంతర్యామిగా నుండువాడా । తే = నీకు, సర్వత ఏవ = అన్ని దిక్కులయందును, నమః అస్తు = నమస్కారమగుగాక.

తా॥ శ్రీకృష్ణా! నీకనేక వేల వందనములు. మాటి మాటికిని యనేక వందనములు. నీకు ముందును వెనుకను అన్ని దిక్కులయందును వందనము చేయుచున్నాను.

(ఈ శ్లోకము భక్తులందరును భగవంతుని దర్శించునపు డనుసంధించదగినది)

అవ. భగవంతుని దెలుపు సర్వ శబ్దమునకు నిర్వచనమును దెలుపుచున్నాడు.

40. శ్లో. అనన్తవీర్యా మితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః॥

అర్థము :— అనన్తవీర్య! = అపరిమిత వీర్యముకలవాడా ! అమిత విక్రమః = మిక్కిలి పరాక్రమముగల, త్వం = నీవు, సర్వం = సమస్తమును, సమాప్నోషి = పొందుచున్నావు. తతః = కనుక, సర్వః = సమస్తమును నీవ అయినవాడవు. అసి = అగుచున్నావు.

తా॥ మిక్కిలి పరాక్రమములుగల నీవన్నిటికిని ఆత్మభూతుడవై యన్నిటిని శరీరములుగా పొందియున్నావుగాన వాటినన్నిటిని తెలుపు శబ్దములచే నీవే చెప్పబడుచున్నావు.

అవ. తెలియక జేసిన తప్పులను మన్నింప వేడుచున్నాడు.

41. శ్లో. సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ ! హే యాదవ ! హే సఖేతి !
అజానతా మహిమానం తవేమం
మయా ప్రమాదా త్ప్రణయేన వాపి॥

అర్థము :— తవ = నీయొక్క, ఇమం = ఈ, మహిమానం = మాహాత్మ్యమును, అజానతా = ఎఱుంగని, మయా = నాచేత, ప్రమాదాత్ = పొరబాటువలన గాని, ప్రణయేన వాపి = చనువుచేతనుగాని, సఖా ఇతి = స్నేహితుడవని మత్వా = తలంచి, హే కృష్ణ ! = ఓ కృష్ణా ! హే యాదవ ! = ఓ యాదవా ! హే సఖే = ఓ మిత్రమా ! ఇతి = అని, ప్రసభం = అవినయముగా, యత్ = ఏది, ఉక్తం = పలకబడెనో.

తా॥ శ్రీకృష్ణా ! నీయొక్క యీ మహిమను నెఱుంగక పొరబాటువలనను, చనువుచేతను, స్నేహితుడవే యని తలంచి, ఓకృష్ణా ! ఓ యాదవా ! ఓ చెలికాడా ! యని వినయములేక పలికితిని. దానినన్ని (దీనికి ముందుశ్లోకముతో సంబంధము)

(ఈ శ్లోకమున 'హే సఖేతి' అనుచోట సంధి ఆర్షము)

42. శ్లో. యచ్చాపహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు
ఏకోఽథవా ప్యచ్యుత! తత్సమక్షం
తత్ క్షామయే త్వా మహ మప్రమేయమ్॥

అర్థము :- అచ్యుత = శ్రీకృష్ణా ! విహారశయ్యాసనభోజనేషు = విహరించునపుడు, శయనించునపుడు, కూర్చుండునపుడు. భుజించునపుడును, ఏకః = ఏకాంతమునగాని. అథవా = లేక, తత్సమక్షం = జనులఎదుటగాని. అపహాసార్థం = పరిహాసముకొరకుగాని. అసత్కృతః అసి ఇతియత్ = అగౌరవపరచబడితివి అనుట ఏదికలదో. తత్ = ఆ యపరాధమును. అప్రమేయం = ప్రమాణములచే తెలియ శక్యముగాని. త్వాం = నిన్ను, అహం = నేను, క్షామయే = క్షమింపజేసికొందును.

తా॥ కృష్ణా ! మన మిరువురముకలసి విహరించునపుడును, పరుండునపుడును, కూర్చుండునపుడును భుజించునపుడును, ఒంటరిగానున్నపుడుగాని, పదిమంది ముందుగాని పరిహాసముకొఱకు ప్రమాణములచే తెలియని నిన్ను గౌరవముగ ఆదరించక అవమానించితిని. వాటినన్నిటిని క్షమింప నిన్ను నేను ప్రార్థించుచున్నాను.

అవ. భగవంతుడే తన తప్పులను మన్నించవలెనుగాని తనకు వేరొక దిక్కు లేదనుటకు కారణముల దెలుపుచున్నాడు.

43. శ్లో. పితాసి లోకస్య చారాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోక త్రయేఽప్య ప్రతిమప్రభావ ! ॥

అర్థము :- అప్రతిమప్రభావ ! = సాటిలేని ప్రభావముగల ఓ స్వామీ ! త్వం = నీవు, చరాచరస్య = చరస్థిరరూపమైన, అస్య = ఈ, లోకస్య = ప్రాణిసమూహమునకు, పితా = తండ్రియు, గురుః = గురువును, గరీయాన్ = శ్రేష్ఠమైన, పూజ్యః = పూజ్యుడవును, అసి = అగుచున్నావు, లోకత్రయే అపి = మూడులోకములయందును, త్వత్సమః = నీతో సమానుడు, అన్యః = మరియొకడు, నాస్తి = లేడు, అభ్యధికః = గొప్పవాడు, కుతః ? = ఎట్లుండును ?

తా॥ సాటిలేని ప్రభావముగల ఓ స్వామీ ! జంగమ స్థావర రూపమగు జగత్తున కంతకును నీవు తండ్రివి. గురుడవు. కావున నీవుత్తమ పూజ్యుడవు. మఱియు ముల్లోకములయందును కాను త్యాగిగుణములతో నీకు సమానుడే లేనప్పు డధికు డెట్లుండును?

అవ. నీతో నాకిట్టి సంబంధమున్నదిగాన నీవే నన్ను క్షమించి రక్షింపవలెనని ప్రార్థించుచున్నాడు.

44. శ్లో. తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥

అర్థము :– తస్మాత్ = అందువలన, అహం = నేను, కాయం = శరీరమును, ప్రణిధాయ = బాగుగా వంచి, ప్రణమ్య = నమస్కరించి, ఈశం = నియామకుడును, ఈడ్యం = స్తుతించదగిన, త్వాం = నిన్ను, ప్రసాదయే = అనుగ్రహింపజేసుకొనుచున్నాను. హే దేవ ! = శ్రీకృష్ణా ! పుత్రస్య = పుత్రునకు, పితా ఇవ = తండ్రివలెను, సఖ్యుః = చెలికానికి, సఖా ఇవ = చెలికానివలెను, ప్రియః = ఇష్టుడవైన నీవు, ప్రియాయ = ఇష్టుడనగు నాకొఱకు (సర్వం = సమస్తాపరాధములను) సోఢుం = సహించుటకు, అర్హసి = తగుదువు.

తా॥ శ్రీకృష్ణా ! నీవీప్రపంచమునకు తండ్రివిని గురుడవును గాన నీకు నేను సాష్టాంగముగ నమస్కరించి జగదీశ్వరుడవును స్తోత్రార్హుడవును నగు నిన్ను ప్రసన్నుడవగుటకై వేడుకొనుచున్నాను. తప్పుచేసిన పుత్రుడుగాని మిత్రుడుగాని నమస్కరించి దీనముగా యాచించిన తండ్రిగాని సఖుడుగాని యెట్లు ప్రసన్నులై క్షమింతురో అట్లే నాకు ప్రియుడవును పరమ దయామయుడవగు నీవును నీకు ప్రియుడనగు నాయొక్క సమస్తాపరాధములను క్షమించి ప్రసన్నుడవగుము.

(43, 44 శ్లోకములు భక్తులు భగవంతుని సన్నిధిలో విన్నవించ దగినవి.)

అవ. సుప్రసన్నరూపమును జూపమని వేడుచున్నాడు.

45. శ్లో. అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస! ॥

అర్థము :— దేవ = శ్రీకృష్ణా! అదృష్టపూర్వం = ఇంతకుముందు చూడబడని విశ్వరూపమును. దృష్ట్వా = చూచి. హృషితః = సంతోషించినవాడను. అస్మి = అగుచున్నాను. మే = నాయొక్క. మనః = మనస్సు. భయేన = భయముచేత. ప్రవ్యథితంచ = మిక్కిలి చలించబడినది. తత్ రూపం ఏవ = ఆ సౌమ్యరూపమునే. మే = నాకు. దర్శయ = చూపుము. దేవేశ = దేవతలకు అధిపతియైనవాడా! ప్రసీద = అనుగ్రహింపుము.

తా॥ కృష్ణా! ఇదివరకెన్నడును చూడబడని నీ యద్భుత విశ్వరూపమును సేవించి సంతసించుటయేగాక నా మనస్సు భయముచే కలతయు చెందినది. కావున సౌమ్యమగు నీ పూర్వరూపమునే నాకు జూపుము. బ్రహ్మాది దేవతలకు గూడ ప్రభువా! సకల లోకాధారభూతా! నా యం దనుగ్రహించుము.

అవ. పూర్వసిద్ధమైన సహజమగు చతుర్భుజరూపముతో దర్శన మిప్పింప వేడుచున్నాడు.

46. శ్లో. కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే॥

అర్థము :— సహస్రబాహో! = వేయిభుజములుగల, విశ్వమూర్తే = విశ్వరూపధారీ! తథా ఏవ = వెనుకటివలెనే, త్వాం = నిన్ను, కిరీటినం = కిరీటము కలవానినిగాను, గదినం = గద కలవానినిగాను, చక్రహస్తం = చక్రము చేతియందు కలవానినిగాను, ద్రష్టుం = చూచుటకు, అహం = నేను, ఇచ్ఛామి = కోరుచున్నాను, చతుర్భుజేన = నాలుగు భుజములుగల, తేన ఏవరూపేణ = ఆ వెనుకటిరూపముతోనే, భవ = ఉండుము.

తా॥ ఓ కృష్ణా! ఇప్పుడు వేయి భుజములతో విశ్వశరీరుడవై కనబడుచున్నావు. నేను కిరీట గదా చక్రములతోగూడిన మునుపటి నీ రూపమునే చూడగోరెదను. కనుక నాలుగు భుజములతోకూడిన వెనుకటి సౌమ్యరూపమునే ధరింపుము.

(శ్రీకృష్ణునకు చతుర్భుజరూపమే సహజమైనది. తండ్రి వేడుటచే కంసుని జంపువరకు నారెండు బాహువులను మరుగు పరచెను. పిమ్మట భక్తులకా చతుర్భుజరూపముతోనే దర్శన మిచ్చుచుండెను.)

అవ. అనన్యభక్తిలేని ఏ యుపాయములచేతను తనను నిజరూపముతో దర్శింపజాలరు. అట్లు దర్శించుట కాతని యనుగ్రహ మొక్కటియే సాధనమనుచున్నాడు.

శ్రీ భగవానువాచ = శ్రీకృష్ణుడు పలికెను.

47. శ్లో. మయా ప్రసన్నేన తవా ర్జునేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్
తేజోమయం విశ్వ మనన్త మాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్॥

అర్థము :— అర్జున ! = అర్జునుడా ! మే = నాయొక్క, తేజోమయం = తేజోరాశియైనదియు, విశ్వం = అంతటను వ్యాపించినదియు, అనన్తం = అంతములేనిదియు, ఆద్యం = అన్నిటికిని మొదటిదియు, పరం = గొప్పదియు, త్వదన్యేన = నీకంటె నితరునిచే, న దృష్టపూర్వం = పూర్వమెన్నడును చూడబడనిదియునగు, యత్‌రూపం = ఏ రూపముకలదో (అట్టి.) ఇదం, ఈ విశ్వరూపము, ప్రసన్నేన = అనుగ్రహముకల, మయా = నాచేత, తవ = నీకు, ఆత్మయోగాత్ = నా సంకల్పమువలన, దర్శితం = చూపించబడినది.

తా॥ అర్జునా ! తేజోనిధియును, అంతటను వ్యాపించునదియును, ఆదిమధ్యాంత రహితమును, మిక్కిలి గొప్పదియు నన్నిటికిని ఆదియైనదియు నీవు తప్ప ఇతరులెవ్వరును ఇదివరలో చూడనట్టిదియు నగు నా రూపము నీయందనుగ్రహబుద్ధిచే నా సంకల్పము వలన నీకు చూపబడినది.

అవ. ఇతరమైనవేవియు భగవంతుని సాక్షాత్కరించుకొనుటకు సాధనములు
కావనుచున్నాడు.

48. శ్లో. న వేదయజ్ఞాధ్యయనైర్న దానై
ర్న చ క్రియాభిర్న తపోభి రుగ్రైః
ఏవం రూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ! ॥

అర్థము :— కురుప్రవీర ! = కురుశ్రేష్ఠా ! అర్జునా ! ఏవం రూపః = ఇట్టి రూపముగల అహం = నేను. నృలోకే = మనుష్యలోకమునందు. త్వదన్యేన = నీకంటె ఇతరునిచేత, వేదయజ్ఞాధ్యయనైః = వేదము, యజ్ఞము అధ్యయనముల సహాయముచేత, ద్రష్టుం = చూచుటకు, న శక్యః = శక్యమైన వాడనుకాను. క్రియాభిః చ = వైదిక క్రియలచేతను, న = శక్యమైన వాడనుకాను, ఉగ్రైః = తీక్ష్ణములైన, తపోభిః = తపస్సులచేతను, న = శక్యమైనవాడను కాను.

తా॥ ఓ అర్జునా ! నీకంటె ఇతరులెవ్వరు కూడా ఈ లోకమున కేవల వేదాధ్యయనము చేతనేగాని, యజ్ఞాదులచేతనేగాని, అధ్యయనముచేతనేగాని, అగ్నిహోత్రము చేతనేగాని, దానముల చేతనేగాని, ఉగ్రములైన తపస్సుల చేతనేగాని, నా నిజరూపమును చూడజాలరు.

అవ. శ్రీకృష్ణు డర్జునుని నోదార్చి తన సౌమ్యరూపమును జూపెద
ననుచున్నాడు.

49. శ్లో. మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వారూపం ఘోర మీదృఙ్మ మేదమ్
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య॥

అర్థము :- ఈదృక్ = ఇటువంటి, ఘోరం = భయంకరమైన, మమ = నాయొక్క, ఇదం, రూపం = ఈ, విశ్వరూపమును, దృష్ట్వా = చూచి, తే = నీకు, వ్యథా = భయము, మా = వలదు, విమూఢభావః చ = తెలివి లేకుండు టయు, మా = వలదు, త్వం = నీవు, వ్యపేతభీః = పోగొట్టబడిన భయముకలవాడవై, ప్రీతమనాః = సంతోషించిన మనస్సుకలవాడవగుచు, మే = నాయొక్క, తత్ = ఆ పరిచితమైన, ఇదం, రూపం, ఏవ = ఈ సౌమ్యరూపమునే, పునః = తిరిగి, ప్రపశ్య = చూడుము.

తా॥ ఇట్టి భయంకరమైన నా విశ్వరూపమును జూచి నీవు భయపడ కుము. తెలివి తప్పకుము. నేను నీకు వెనుక పరిచితమైన సౌమ్య రూపమునే చూపెదను. నీవు భయమును వీడి సంతుష్టచిత్తుడవై ఆ రూపమునే మరల చూడుము.

అన. అర్జునుడు వేడినట్లే శ్రీకృష్ణుడు తన సౌమ్యరూపమును జూపి ఓదార్చె
నని సంజయుడు ధృతరాష్ట్రునితో జెప్పుచున్నాడు.

సఞ్జయ ఉవాచ = సంజయుడు పలికెను.

50. శ్లో. ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా॥

అర్థము :– వాసుదేవః = శ్రీకృష్ణుడు, అర్జునం = అర్జునునిగూర్చి. ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, తథా = అట్లే. స్వకం = తనదైన, రూపం = పూర్వ రూపమును, భూయః = తిరిగి. దర్శయామాస = చూపించెను. మహాత్మా = శ్రీకృష్ణుడు, పునః చ = తిరిగియు, సౌమ్యవపుః = శాంతరూపము కలవాడు, భూత్వా = అయి, భీతం = భయమునుచెందిన, ఏవం = ఈ యర్జునుని, ఆశ్వాసయామాస = ఓదార్చెను,

తా॥ శ్రీకృష్ణు డర్జునునితో నిట్లు పలికి యాతడు కోరినట్లే తిరిగి తన వెనుకటి సౌమ్యరూపమును జూపెను. తన విశ్వరూపమునుజూచి భయపడిన అర్జునునకు పరిచితమైన తన సౌమ్యరూపమును జూపి ఓదార్చెను.

అవ. పరిచితరూపమును దర్శించి అర్జునుడు శాంతించెననుచున్నాడు.

51శ్లో. . దృష్ట్వేదం మానుషం రూపం । తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీ మస్మి సంవృత్తః । స్సచేతాః ప్రకృతిం గతః॥

అర్థము :- జనార్దన = కృష్ణా, తవ = నీయొక్క, సౌమ్యం = ప్రసన్నమైన, మానుషం = మనుష్యసంబంధమైన, ఇదం = ఈ, రూపం = ఆకారమును, దృష్ట్వా = చూచి, ఇదానీం = ఇప్పుడు, సచేతాః = తేటనొందిన మనస్సు కలవాడను, సంవృత్తః = అయితిని, ప్రకృతిం = స్వభావమును, గతః = పొందినవాడను, అస్మి = అగుచున్నాను.

తా॥ ఓ కృష్ణా ! మనుష్యాకారముతో గూడి మిక్కిలి సౌమ్యమై యుండెడి నీ రూపమును జూచి ఇప్పటికి మనస్సు తేటచెంది పూర్వపు స్వస్థతను పొందితిని.

అవ. భగవానుడీ విశ్వరూపముయొక్క అపూర్వతను జెప్పుచున్నాడు.

52. శ్లో. సుదుర్దర్శ మిదం రూపం । దృష్టవా నసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య । నిత్యం దర్శన కాఙ్క్షిణః॥

అర్థము :- మమ = నాయొక్క, యత్ = ఏరూపమును, దృష్టవాన్ అసి = చూచితివో, ఇదం, రూపం = ఈ, విశ్వరూపము, సుదుర్దర్శం = చూచుటకు మిక్కిలి కష్టమైనది. దేవాఃఅపి = దేవతలుకూడా, నిత్యం = ఎల్లప్పుడును, అస్య, రూపస్య = ఈవిశ్వరూపముయొక్క, దర్శనకాఙ్క్షిణః = దర్శనమునుకోరువారు (భవన్తి = అగుచున్నారు.)

తా॥ ఓ అర్జునా ! నీ విప్పుడు జూచిన నా విశ్వరూప మెవ్వరికిని చూడ నలవికానిది. దేవతలు దీనిని చూడవలెనని నిత్యమును గోరుచునే యుందురు.

అవ. ఎందువల్లననగా—

53. శ్లో. నాహం వేదైర్న తపసా । న దానేన న చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం । దృష్టవా నసి మాం యథా॥

అర్థము :— మాం = నన్ను, యథా = ఏప్రకారము, దృష్టవాన్ = చూచినవాడవు, అసి = అగుచున్నావో, ఏవంవిధః = ఇట్టి స్వరూపముగలవాడనుగా, అహం = నేను, వేదైః = వేదాధ్యయనాదులచేతను, ద్రష్టుం = చూచుటకు, న శక్యః = సాధ్యుడనుకాను, తపసా = తపస్సుచేత, న = కాను, దానేన = దానముచేత, న = కాను, ఇజ్యయా చ = యాగముచేతను, న = సాధ్యుడనుకాను.

తా॥ నా నిజస్వరూపమును నీవిప్పుడు చూచినట్లు చూచుటకు భక్తి లేని కేవల వేదాధ్యయనముగాని, యాగదానహోమ తపస్సులు గాని సాధనములు కానేరవు.

అవ. ఇక ముఖ్యకారణమును దెలుపుచున్నాడు.

54. శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య । అహ మేవం విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన । ప్రవేష్టుం చ పరన్తప ! ॥

అర్థము :— అర్జున = అర్జునుడా ! ఏవంవిధః = ఇట్టివాడనగు, అహం = నేను, అనన్యయా = ఇతరఫలములనపేక్షించని, భక్త్యా తు = భక్తిచేతనైతే, తత్త్వేన = యథార్థముగా, జ్ఞాతుం = తెలిసికొనుటకును, ద్రష్టుంచ = ప్రత్యక్షముగాజూచుటకును, ప్రవేష్టుంచ = పూర్ణముగాపొందుటకును, శక్యః = శక్యుడను.

తా॥ ఇతర ఫలాశలేని భక్తిచే నన్ను నిజరూపముతో తెలియుటకును, నిజరూపముతో జూచుటకును, నిజరూపముతో పూర్ణముగా అనుభవించుటకును శక్యమగును.

అవ. భక్తి అంగముగా గలిగియున్న వేదాధ్యయన యాగదానహోమాదుల ఉపయోగమును జూపుచు పరిపూర్ణానుభవమునకు కారణమైన భక్తి యొక్క అవస్థావిశేషమును దెలుపుచున్నాడు.

55. శ్లో. మత్కర్మ కృన్మత్పరమో । మద్భక్త స్సఙ్గవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు । య స్స మా మేతి పాణ్డవ ! ॥

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూపసందర్శన యోగోనామ ఏకాదశోఽధ్యాయః

అర్థము :- పాణ్డవ ! = అర్జునా ! మత్కర్మకృత్ = తనధర్మములను నాయారాధన బుద్ధితోచేయువాడును, మత్పరమః = నేనేప్రధానోద్దేశముగా గలవాడును, మద్భక్తః = పరమప్రీతితో నన్నేధ్యానించువాడును, సఙ్గవర్జితః = నాకంటె వేరైనవస్తువులతో తనకు సంబంధములేనివాడును, సర్వభూతేషు = సకల ప్రాణులయందును, నిర్వైరః = విరోధములేనివాడును, యః = ఎవడో, సః = వాడు, మాం = నన్ను, ప్రాప్నోతి = పొందుచున్నాడు.

తా॥ తనవర్ణాశ్రమ ధర్మములను ఫలాశను విడిచి నా యారాధనయను బుద్ధితో నాచరించువాడును, నా సాయుజ్యమును బడయుటయే ప్రధానోద్దేశముగా గలవాడును, పరమ ప్రీతితో నన్ను ధ్యానించనిచో బ్రతుకలేని యావేశముతో ధ్యానించువాడును, నాకంటె వేరైన సకల ఐహికాముష్మిక పదార్థములయందును తనకు సంబంధము లేకుండ జేసికొనినవాడును, సకల జీవరాశియెడల విరోధము లేక ప్రేమభావమును నెరపువాడును నగు నా ప్రియ భక్తుడు నన్నే పొందుచున్నాడు.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన శ్రీభగవద్గీత యందలి విశ్వరూపసందర్శనయోగమనెడు పదునొకండవ అధ్యాయము.

| | | | |
|---|---|---|---|
| సంజయుని శ్లోకములు | 8 | మొత్తం శ్లోకములు | 55 |
| అర్జునుని శ్లోకములు | 33 | ఇంతవరకైన మొత్తం శ్లోకములు | 469 |
| శ్రీకృష్ణుని శ్లోకములు | 14 | | |

## ద్వాదశాధ్యాయార్థ సంగ్రహము

శ్లో॥ భక్తే శ్శైష్ఠ్య ముపాయోక్తి
రశక్తస్యాత్మనిష్ఠతా
తత్ప్రకారా స్త్వతిప్రీతి
ర్భక్తే ద్వాదశ ఉచ్యతే॥

అర్థము :– భక్తేః = భక్తియోగముయొక్క, శ్రైష్ఠ్యం = ఉత్తమ మగుటయు, ఉపాయోక్తిః = భక్త్యుపాయమున్ను, అశక్తస్య = దానికి శక్తిలేనివానికి, ఆత్మనిష్ఠతా = శుద్ధాత్మనిష్ఠయు, తత్ప్రకారాః = వానికుండవలసిన గుణములరీతులున్ను, భక్తే తు = భక్తునియందైతే అతిప్రీతిః = భగవంతునకు గల మిక్కిలి ప్రేమయు, ద్వాదశే = ద్వాదశాధ్యాయములో, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ ఆత్మప్రాప్తికి సాధనమైన ఆత్మోపాసనముకంటె భగవదుపాసన మగు భక్తి ఫలము నొసంగుటలో శీఘ్రమైనదియు, ఆచరించుటకు సుకరమైనదియు నగుటచే శ్రేష్ఠమైనదనియు, భక్త్యుపాయమున్ను, దానికి శక్తిలేనివానికి ఆత్మనిష్ఠయు, వానికుండవలసిన గుణములున్ను, భక్తునియందు భగవంతునకు గల ప్రీతియు, పండ్రెండవ యధ్యాయమున చెప్పబడుచున్నవి.

# శ్రీ భగవద్గీత - ద్వాదశాధ్యాయము

## వి ష య సూ చి క

శ్రీ హయగ్రీవాయ నమః

## సహాయ సంపాదకీయము

# లక్ష్మీపూజలు

మన శ్రీ జియ్యరు స్వామివారిచే నెలకొల్పబడిన శ్రీయతిరాజ సేవామహిళా సమితులు, వారిచే నిర్వహింప బడుచున్న శ్రీ శుక్రవార లక్ష్మీపూజలు దినదినాభివృద్ధిగా వార్షికోత్సవములతో ప్రతివత్సరము ప్రవర్ధిల్లుచున్నందుకు పరమానందముగానున్నది.

మత ప్రచార దృష్ట్యా స్త్రీ సంఘములతోపాటు పురుషసంఘములనుగూడ శ్రీ స్వామివారు నెలకొల్పిరి. కాని కొన్నిచోట్ల పురుషసంఘములు పురిటిలోనే సంధిదోషము తగిలి యంతరించినవి. కాని బందరులో మాత్రము అద్యాపి పట్టుదలతో పురుషసంఘము పనిచేయుచు మొన్ననే పంచమ వార్షికోత్సవము జరుపుకొన్నది.

వాస్తవముగా విజ్ఞాన తృష్ణ పురుషులకన్న స్త్రీలలో విశేష్య మున్నదనుటలో సందేహములేదు. స్త్రీలకు భక్తికుదురుట సులభము, కనుకనే కలిలో స్త్రీలు సాధువులనిరి.– "వందే నంద వ్రజ స్త్రీణాం పాదరేణుమభీక్ష్ణశః" అనుటవలన భగవద్భాగవతాచార్య శ్రీ పాదరేణులవలె భగవంతుని యందు తైలధారావద వచ్ఛిన్నస్మృతి సంతానరూపముగా ప్రేమప్రవాహమును ప్రవహింపజేయుచున్న నందవ్రజస్త్రీల శ్రీ పాదరేణువులు శిరసావహింపదగినవని వ్యాసునివంటి మహర్షి వ్రాసెను.

ఏతావతా స్త్రీలలో ఆధ్యాత్మికజ్ఞాన ప్రవాహమంతర్లీనముగా ప్రవహించుచుండుననుటలో ఏ మాత్రము సందియములేదు.

ఇప్పటికి మాకు చేరిన సాంఘిక వార్తలనుబట్టి మహిళామండలి వారి లక్ష్మీపూజా శుక్రవార వార్షికోత్సవములు సర్వత్ర నవంనవముగా నవసంఖ్యదాక వచ్చినవి. బరంపురం, శ్రీకాకుళం, శ్రీకూర్మం, టెక్కలి, అముదాలవలస, విజయనగరం, విశాఖపట్నం, రాజమండ్రి, అర్తమూరు, పెంటపాడు, ఏలూరు, బందరు, గుడివాడ, విజయవాడ, చావలి, రేపల్లె, ముక్తిపల్లి, భట్టిప్రోలు, శ్రీవాసుదాసాశ్రమం, చుండూరు, హైద్రాబాద్ ఇత్యాది గ్రామములో మహిళామండలివారు మహత్తర వైభవముతో మన శ్రీ జియ్యర్‌స్వామివారు ప్రబోధించిన, ఆచరింపజేసిన, లక్ష్మీపూజలను మహోత్సాహముతో గావించుచూ లక్ష్మీకటాక్షమునకు పాత్రులగుచున్నారు.

ఈ లక్ష్మీపూజా ప్రభావము చేతనే మద్రాసులో మహిళామండలివారు 50వేల రూపాయిలతో గీతామందిరమును నిర్మించి ఆధ్యాత్మిక ప్రచారమును లక్ష్మీపూజలను గావించుచున్నారు. బందరులోకూడ శ్రీయతిరాజసేవా మహిళామండలివారు మొన్న మొన్ననే 12వేల రూపాయిలతో నొక ఇందిరా మందిరమును కొన్నట్లు తెలియవచ్చినది.

మతమేదైన కావచ్చును– వర్ణమేదయిన కావచ్చును– ఆశ్రమమేదైన కావచ్చును– వ్యక్తులెవరైన కావచ్చును– కాని లక్ష్మి అక్కరలేదను వారెవ్వరుండరు. అందరకును, అన్ని మతముల వారికిని లక్ష్మి కావలయును. పరమాత్మోపాసనలో భావభేదములుండవచ్చునుగాని లక్ష్మి ఉపాసనలో అందరు అన్వయించవలసినదే.

తప్పులు వెదకి దండించువాడు తండ్రి. తప్పులున్నను దయచూపునది తల్లి. మనకు తల్లిదండ్రులు లక్ష్మీనారాయణులు.

నిరంకుశ స్వాతంత్ర్యముతో శిక్షాశాస్త్రమును అమలుచేయుచున్న భగవంతుని యెదుట నిలుచుటకు మనకు గుండెలులేవు. మనమా - కనురెప్పపాటులో కల్పకోటి శతములు నరకము లనుభవింపగల పాపములు చేయుచుందుము. కనుక ఇక మనగతి లక్ష్మీదేవియే. ఆమె నిరుపాధిక మాతృత్వముగల తల్లి. ఆమెను ఆశ్రయించితీరవలసినదే. ఆమె పురుషకారము చేయకున్న మనగతి అధోగతియే. ఈ మహార్థమునే ద్వయమంత్రము బోధించుచున్నది. కనుకనే ఆమంత్రము మంత్రరత్నమైనది.

ఆమె పతితో విశ్లేషించినప్పుడు జీవులను దిద్దుబాటుచేయును; సంశ్లేషదశలో పతినిదిద్దుబాటుచేయును- ఇది పరమరహస్యమైన సంప్రదాయవిషయము అనాదినుండి అనుస్యూతముగా ఆచార్య పరంపరయా అనుగృహీతమైన పరమార్థము. ఇది ప్రపన్నులపాలిటి కొంగుబంగారము.

రామదాసంతటి మహాభక్తుడుకూడ "రామా! రామా!" యని ఎన్నేండ్లుపిలచెను. ఎంతగా ఘోషించెను. ఎంతకూ ఫలితము కానరాకనేగదా తుదకు తమ ఆచార్యులగు రఘునాథభట్టాచార్యులవారు అనుగ్రహించిన ద్వయమంత్రమును జ్ఞప్తికితెచ్చుకొని "ననుబ్రోవమని చెప్పవే సీతమ్మా" యని పిలచెను. ఆ పిలుపుతో ఆమె పురుషకారముతో ఋణవిముక్తుడై కారాగృహము నుండి బైటపడెను. అర్ధాపరాధుడైన కాకాసురుని గాచిన దీమెయేగదా. ఈ రహస్యము నెఱింగినవారు లక్ష్మీదేవి నారాధింప కెట్లుందురు! ఇందుకొరకే దివ్యసన్నిధులలో లక్ష్మీసన్నిధి ప్రత్యేకముగానుండును. ఆలయములో ముందుగా లక్ష్మినిసేవించి, పిదప ఆళ్వారాచార్యులను సేవించి వారి పురుషకారముద్వారా ప్రసన్నుడైనవాడు భగవంతుని సేవించవలెను.

ఇట్టి పరమరహస్యమును మన శ్రీ జియ్యర్‌స్వామివారు ప్రతి పల్లీ పట్టణ గ్రామములో పాదయాత్రగా పర్యటించునప్పుడు మహిళామణులను సమావేశపరచి, లక్ష్మీపూజా మాహాత్మ్యమును బోధించి వారిచే పూజాకార్యక్రమమును చేయించి తరించుమార్గమును జూపిరి.

లౌకికదృష్ట్యాకూడ యీ లక్ష్మీపూజా కార్యాక్రమము స్త్రీలలో విశేషించి వ్యాప్తి చేయవలసియున్నది. కొన్నిచోట్ల అమాయకులైన స్త్రీలు ఆసుపత్రులలో ప్రసవించుటకు వెళ్ళినప్పుడు అచ్చటున్న అన్యమతస్థులగు పరిచారికలు పుట్టిన బిడ్డలకు తమ దేవతలపేర్లు పెట్టించుచు వారి హృదయములో దుర్మత సంస్కార బీజములను నాటుచుందురు. కొన్నాళ్లకాబీజము మహావృక్షమై ఇల్లాండ్రద్వారా ఇల్లంతయు వ్యాపించును. ఈ దుర్మత దుష్ప్రచార దుర్వాసనాశాంతికై స్త్రీలలో లక్ష్మీపూజా సువాసనలు వ్యాపింపజేయవలెను. ఇల్లాండ్రద్వారా ఇంటింట యీ లక్ష్మీపూజలు సమష్టిగాను, వ్యక్తిగతముగాను ఇండ్లలోను, ఆలయములలోను, ప్రచారముగావించినచో కొంతవరకైన కొన్నిండ్లు బాగుపడునని మాయాశ. కాన స్త్రీలందరు ఈ లక్ష్మీపూజలింటింట నాచరించుచు, ఇతరులచేత నాచరింపజేయుచు లక్ష్మీకటాక్ష పాత్రులై సంప్రదాయాభివృద్ధిని చేయుదురుగాక యని కోరుచున్నాము.

శ్లో॥ సర్వకామప్రదాం రమ్యాం। సంసారార్ణవతారిణీం
క్షిప్రప్రసాదినీం, లక్ష్మీం। శరణ్యామనుచింతయేత్.

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
| --- | --- | --- | --- |
| 138 | కృతాకృతిః | అనిత్య నిత్య ఫలదా ।<br>ప్రవర్తకని వర్తకా ।<br>దదా యస్య స్వరూపం సః ।<br>కృతాకృత ఇతీరితః ॥ | కృతమనగా అనిత్యమైన సాంసారిక ఫలంబుల నొసంగు ప్రవృత్తి ధర్మము. అకృతమనగా నిత్యమైన మోక్ష ఫలంబు నొసంగు నివృత్తి ధర్మము. ఈ రెండింటిని స్వరూపముగాగల అనిరుద్ధ స్వరూపుడు. |
| 139 | చతురాత్మా | వాసుదేవాది రూపత్వా ।<br>చ్చతురాత్మేతి కథ్యతే । | వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధా అనబడు నాలుగు రూపములు కలవాడు, |
| 140 | చతుర్వ్యూహః | జాగ్రత్స్వప్న సుషుప్త్యాదా ।<br>వ్యూహా వస్థాచతుష్టయే ।<br>ఏతై ర్విశిష్టమూర్తిత్వాత్ ।<br>చతుర్వ్యూహ ఇతీరితః । | జాగ్రత్స్వప్న సుషుప్తిమొదలగు అవస్థల యందును, వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధులనబడు వ్యూహావస్థలయందును కల్యాణగుణాదులతో గూడిన నాలుగు విధములుగా నున్న ఆకారములతో గూడి యున్నవాడు. |
| 141 | చతుర్దంష్ట్రః | దంష్ట్రా చతుష్కయుక్తత్వాత్ ।<br>చతుర్దంష్ట్ర ఇతి స్మృతః । | మహాపురుష లక్షణమగు నాలుగు కోరలు గలవాడు. |
| 142 | చతుర్భుజః | మహాపురుష రూపత్వా ।<br>దుచ్యతేహి చతుర్భుజః । | మహాపురుష లక్షణమగు నాలుగు భుజములు కలవాడు. |
| 143 | భ్రాజిష్ణుః | ఉపాసితృభ్యో భ్రాజిష్ణుః ।<br>స్వప్రకాశన శీలతః । | స్వయంప్రకాశ స్వరూపుడగుటచే తన నుపాసించు భక్తులకు ప్రకాశించువాడు. |
| 144 | భోజనః | సుఖేన భోజనం ప్రాహుః ।<br>యోభక్తై రనుభూయతే । | ఉపాసించు భక్తులచే ఆనందముగా ననుభవింప బడువాడు, |
| 145 | భోక్తా | భోక్తాఽర్పితస్య భోక్తృత్వాత్ ।<br>భోక్తాస్యా దమృతస్య వా । | భక్తులు ప్రేమతో ప్రీతితో నర్పించుపదార్థ మల్పమైనను ఆనందముతో ననుభవించువాడు. |

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 146 | సహిష్ణుః | స్వభక్త విషయాణాం చ ।<br>నిర్మర్యాద కృతైన సామ్ ।<br>సహనైక స్వశీలత్వాత్ ।<br>సహిష్ణు రితి విశ్రుతః । | తన భక్తులు హద్దుమీరి గావించిన పాపముల నన్నిటిని సహించు స్వభావము కలవాడు. |
| 147 | జగదాదిజః | జగతా మాదిభూతాసు ।<br>మూర్తిష్వన్య తమత్వతః ।<br>జాతత్వా ద్విష్ణురూపేణ ।<br>ప్రోచ్యతే జగదాదిజః । | జగత్తున కాదిగానుండు బ్రహ్మవిష్ణు మహేశ్వరులలో నొకడగు రక్షకుడైన విష్ణువుగా నవతరించువాడు. |
| 148 | అనఘః | పాపప్రతి స్పర్ధ్యనఘః । | పాపములకు సత్రువైనవాడు. |
| 149 | విజయః | విజయో జగతాం జయీ । | సమస్త బ్రహ్మ రుద్రేన్ద్రాది సమస్త దేవతలయొక్క జయము నకు నిదానమైనవాడు. |
| 150 | జేతా – | స్వాభిప్రాయే స్థాపయితా ।<br>జేతాస్యాద్విధి శఙ్కరా । | బ్రహ్మరుద్రులను తన ఇష్టానుసారముగ స్థిరముగ నుంచు వాడు. |
| 151 | విశ్వయోనిః | విశ్వం తత్కార్య వర్గస్యాత్ ।<br>యోని స్తస్యతు కారణమ్ ।<br>తస్య బ్రహ్మాది ముఖతః ।<br>విశ్వయోని రితీరితః । | విశ్వమనగా శ్రియఃపతి చేసృష్టింపబడినసంసారము. యోని యనగా ఆ సంసారమునంతకు కారణమైనవాడు. అనగా సమస్త ప్రపంచమునకును బ్రహ్మాది మూలముగా కారణ భూతుడై యుండువాడు. |
| 152 | పునర్వసుః | బ్రహ్మాదిష్వపి దేవేషు ।<br>అన్తరాత్మ తయాచయః ।<br>పునర్వివసనా న్నిత్యం ।<br>పునర్వసు రుదాహృతః । | ఇట్లు పుట్టించుటయేగాక మరల నా బ్రహ్మాది దేవతలకు అంతరాత్మగా నివసించువాడు. |
| 153 | ఉపేన్ద్రః | ఇన్ద్రస్యాప్యనుజత్వేన<br>జాతశ్చో పేన్ద్ర ఉచ్యతే ! | ఇంద్రునకు తమ్ముడై యవతరించువాడు. |

శ్రీ హయగ్రీవాయనమః

# కీర్తనము

శ్రీమాన్. ఉ. వే. విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు

(వెనుకసంచిక తరువాయి)

శ్రీకృష్ణ కర్ణామృతమున తరించుటకే స్మరణమే చాలును. ఇతర నిత్యకర్మలుకూడ పని లేదని స్తుతించిన శ్లోకమును చూడుడు –

శ్లో॥ సంధ్యావందన భద్రమస్తు భవతే భోస్స్నాన తుభ్యంనమః
భోదేవాః! పితరశ్చ! తర్పణవిధౌ నాహం క్షమః క్షమ్యతాం
యత్ర క్వాపి నిషీద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః
స్మారం స్మార మఘం హరామి తదలం మన్యే కిమన్యేనమే॥

నాకు సంధ్యావందన స్నానతర్పణాదులతో ప్రయోజనములేదు. వాటినన్నిటిని విడచి యేదో యొకమూల గూర్చొని శ్రీకృష్ణుని ధ్యానించి నా పాపముల బాపుకొందును.

అంబరచుంబి జ్వాలలతో ప్రజ్వలించు అగ్నినుండి సీతామాతను, ప్రహ్లాదుని, కాపాడిన దీ స్మరణ భక్తియేకదా! చూడుడు,

శ్రీరామచంద్రుని నిందావాక్యములనువిని భరింపజాలక 'చితాం మే కురు సౌమిత్రే! వ్యసనస్యాస్య భేషజం'

లక్ష్మణా! ఈ దుఃఖమునకు మందు నా కింక చితియేగాన దానిని సిద్ధపరచుమని యాదేశింప దానిని భ్రూసంజ్ఞతో శ్రీరాము డామోదింప లక్ష్మణస్వామి క్షణములో చితిని రగుల్కొలుప నా తల్లి చేతులు జోడించుకొని —

శ్లో॥ యది మే హృదయం నిత్యం నాపసర్పతి రాఘవాత్ ।
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః॥

రామా - యు -120 సం 24 శ్లో

ఈ యగ్నిహోత్రుడు లోకసాక్షి. ఈత డెరుంగని రహస్యము లేదు. కావున నా హృదయము నిరంతరము శ్రీరామ ధ్యానమునుండి తప్పదేని నన్నన్ని యాపదలనుండియు కాపాడుగాక! యని యగ్నికి ప్రదక్షిణము గావించి యందు ప్రవేశించగనే—

శ్లో॥ అక్లిష్ట మాల్యాభరణాం తథారూపాం మనస్వినీమ్ ॥

అప్పుడు ధరించియున్న పుష్పమాలికలుగాని, ఆభరణములుగాని కందనైనను కందక ఎట్లున్న వట్లుగనే ప్రకాశించుచుండ అగ్నిహోత్రు డామెను తన తొడయం దిడుకొని ప్రత్యక్షమె

శ్లో॥ విశుద్ధభావాం నిష్పాపాం ప్రతిగృహ్ణీష్వ రాఘవ ।
న కించి దభిధాతవ్యా మహ మాజ్ఞాపయామి తే ॥

ఓ రామా ! నిర్మలహృదయ, పాపరహిత యగు నీ సీతామాతను, స్వీకరింపుము. ఈమె యందే కళంకమునుగాని యారోపింప వలదు. నేను నిన్నాజ్ఞాపించుచున్నాను. గ్రహింపుము అని యామెను సమర్పించెను.

ప్రహ్లాదు డెన్ని మారణోపాయముల కైనను చావకునికి తండ్రి విసిగి యాతని పాశబద్ధుని గావించి యాతనిపై పర్వతాకారముగ కట్టెల బేర్పించి దహింపజేయ జ్వాల లాకసము నంటు చుండ 'నిక దీనితో వీడు భస్మమై తీరున'ని తండ్రి సంతసించుచుండ ప్రహ్లాదు డా జ్వాలలమధ్య యుం దుండియే

శ్లో॥ తాతైష వహ్నిః పవనేరితోఽపి
న మాం దహత్య త్ర సమన్తతోఽహమ్
పశ్యామి పద్మాస్తరణాస్తృతాని
శీతాని సర్వాణి దిశాం ముఖాని॥ (విష్ణు పు.)

తండ్రీ ! వాతాహతుడగు నీహుతాశనుడు నన్నొకింతయు గాల్చుట లేదు సరికదా నేను నా చుట్టును చల్లని పద్మములు పరచినట్లు జూచుచున్నాను. దిక్కులన్నియు చల్లగ గోచరించు చున్నవని ఎలుగెత్తి వినిపించగనే ఇదేమి చిత్రమని యందరితోపాటు హిరణ్యకశిపుడును ఆశ్చర్య పడుచుండ, తిరిగి ప్రహ్లాదుడు – 'తండ్రీ ! ఈ చతుర్దంతుల దంతములు చూర్ణమగుటకును, ఈయగ్ని పద్మమువలె చల్లనగుటకును, నా ప్రభావమో ! మంత్రమో ! యని భ్రమింపకుము.

శ్లో. మహావిపత్పాప వినాశనోఽయం
జనార్దనాను స్మరణానుభావః ।

ఇది యాపదల బాపునట్టియు, పాపముల పోద్రోలునట్టియు భగవత్స్మరణ వైభవమేసుమా ! యని తెలిపెను.

మరణ సమయ మాసన్నమైనతరి శ్రీభీష్మ పితామహులు శ్రీకృష్ణుని ధ్యానించగా పాండవులమధ్య కూర్చొని ప్రసంగించుచున్న శ్రీకృష్ణు డొక్క క్షణకాలము మౌనియై యాలో చించి వారితో 'ఆహా !' శరతల్పగతో భీష్మః శామ్య న్నివ హుతాశనః మాం ధ్యాతి పురుష వ్యాఘ్రః తతో మే తద్గతం మనః భీష్ము డారుచున్న యగ్నిహోత్రస్థితిలో నుండి శరతల్పగతుడై నన్ను ధ్యానించుచున్నాడు. కావున నామనస్సచ్చట కరిగినది. లెండు. ఆమహాత్మునివలన ధర్మోప దేశముల నాలకించ వలసియున్నదని వారిని తోడ్కొని యచ్చట కేగగా నా మహామహు డా కృష్ణభగవానుని సేవించి ఒక వరముగా నిట్లు ప్రార్థించెను.

ప॥ త్రిజగన్మోహన నీలకాంతితను వుద్దీపింప, ప్రాభాత నీ
రజబంధు ప్రభమైన చేలముపయింరంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడువన్నె కాడుమది నావేశించు నెల్లప్పుడున్ ॥

అని ఇట్లు మూడుపద్యములతో ముమ్మాటికిని నాకు దీనినే ప్రసాదింపుమని వేడెను.

ఇట్లు ప్రమాణగ్రంథములలో సనకాదులు, ధ్రువుడు, భీష్మపితామహులు, కుంతి, మొద లగు భక్తులెందరో యీ స్మరణభక్తిచేతనే తరించినట్లు ఉదాహరణములు కలవు.

# పాద సేవనము

స్వరూపము:—

దివ్య దేశములలో వేంచేసియున్న దివ్యమూర్తియొక్కగాని, అనూచానముగ నారాధింప బడుచు వచ్చిన గృహారాధ్యమూర్తి యొక్కగాని, తానుస్వయముగ తనరుచికి తగునట్లేర్పరచు కొనిన మూర్తియొక్కగాని, అట్టిమూర్తియు లేనిచో తనకభీష్టమైన చిత్రపట మూర్తియొక్క గాని పాదారవిందములను శ్రద్ధతో దర్శించి, పూజించి, ధ్యానించి భగవత్ప్రేమయందు తన్మయు డగుటయే పాద సేవనము.

దీనికే భక్తులు తమతమ యభీష్టానుసార మనేక రీతుల నాచరించుచున్నారు.

మాటిమాటికిని, తనివితీరని దృష్టితో చరణారవిందముల దర్శించుట, పూజించుట, చరణోదకమును త్రాగుట, మానసికముగనైనను పూజలు సలుపుట, భగవత్పాద ముద్రికలను లభించి వాటిని పూజించుట, భగవచ్చరణ సంచార స్థలముల యందలి రజస్సును శిరమునదాల్చుట, గంగోదకమును సాక్షాచ్చరణోదకమని విశ్వసించి భగవంతుని పూజించి నటులనే దానిని పూజించుట మొదలగున వన్నియు పాదసేవన రూపమునే దాల్చును.

ఇట్లు గావించుటచే నహంకారము, మమకారము, అభిమానము, మొదలగు పాపబీజములు నశించి భగవచ్చరణారవిందముల యం దనన్య ప్రేమవృద్ధి యగును. ప్రమాణము—

శ్రీమద్భాగవత తృతీయ స్కంధమునందలి యిరువదియెనిమిదవ యధ్యాయమున—

శ్లో॥ సఞ్చిన్తయే ద్భగవత శ్చరణారవిందం।

వజ్రాఙ్కుశధ్వజ సరోరుహలాఞ్ఛనాఢ్యమ్।

21 శ్లో

వజ్రము, అంకుశము, ధ్వజము, పద్మము మొదలగు చిహ్నలతో నొప్పుచున్న శ్రీమన్నారాయణుని పాదపద్మమును ధ్యానించవలెను. అని పాదదాస్యము విధింపబడెను.

ప్రసన్న జనకూటస్థులగు పరాంకుశ మునీంద్రులు సామవేదసారమైన తమచరమ ప్రబంధమగు తిరువాయ్‌మొళి దివ్య ప్రబంధము నందాది మధ్యావసానము లందంతటను పాదసేవనే తాము ప్రార్థించి లోకుల కుపదేశించిరి. మొదటి పాశురమునందే 'తుయరఱు శుడరడి తొళుదెళు ఎన్మననే' దుఃఖమును నిర్మూలించు నుజ్వలమైన శ్రీపాదమును నాశ్రయించి యుజ్జీవింపుమా' యని తమ మనస్సును ప్రబోధించిరి.

ఇతరులకు హితము నుపదేశించు రెండవదశకము నందును 'వణ్ పుకழ் నారణన్ తిణ్ కழల్ శేరే' 10 పా. కల్యాణగుణ ఖనియగు శ్రియఃపతియొక్క ఆశ్రితులను విడువక రక్షించుటలో-దృఢమైన శ్రీపాదముల నాశ్రయింపుమని హెచ్చరించిరి.

భగవంతుడు వారిమొరనువిని కనికరించి సాక్షాత్కరించి 'మీయభీష్టమేమి? పరమపదము నొసంగుదునా? యని నిష్కర్షగా ప్రశ్నింపగా—

'ఏమ్మావీట్టు త్తిఱముం శెప్పమ్ నిన్

శెమ్మా॥ పాదపఱ్పు॥ తలై శేర్తో॥ శ్లో॥' 2 ప. 9 తి। పా. పరమపద మెంతగొప్పదైనను నాకవసరములేదు. నీ యొక్క శ్రేష్ఠమైన యెఱ్ఱనిపాదపద్మమును నా తలపై శీఘ్రముగా నుంచుము, అని ప్రార్థించిరి.

ఓ రామా ! నిర్మలహృదయ, పాపరహిత యగు నీ సీతామాతను, స్వీకరింపుము. ఈమె యందే కళంకమునుగాని యారోపింప వలదు. నేను నిన్నాజ్ఞాపించుచున్నాను. గ్రహింపుము అని యామెను సమర్పించెను.

ప్రహ్లాదు డెన్ని మారణోపాయముల కైనను చావకునికి తండ్రి విసిగి యాతని పాశబద్ధుని గావించి యాతనిపై పర్వతాకారముగ కట్టెలు బేర్పించి దహింపజేయ జ్వాల లాకసము నంటు చుండ 'నిక దీనితో నీవు భస్మమై తీరుద'ని తండ్రి సంతసించుచుండ ప్రహ్లాదు డా జ్వాలలమధ్య యం దుండియే

శ్లో॥ తాతైష వహ్నిః పవనేరితోఽపి
న మాం దహత్యత్ర సమన్తతో ఽహమ్
పశ్యామి పద్మాస్తరణాస్తృతాని
శీతాని సర్వాణి దిశాం ముఖాని॥ (విష్ణు పు.)

తండ్రీ! వాతాహతుడగు నీహుతాశనుడు నన్నొకింతయు గాల్చుట లేదు సరికదా నేను నా చుట్టును చల్లని పద్మములు పరచినట్లు జూచుచున్నాను. దిక్కులన్నియు చల్లగ గోచరించు చున్నవని ఎలుగెత్తి వినిపించగనే ఇదేమి చిత్రమని యందరితోపాటు హిరణ్యకశిపుడును ఆశ్చర్య పడుచుండ, తిరిగి ప్రహ్లాదుడు – 'తండ్రీ! ఈ చతుర్దంతుల దంతములు చూర్ణమగుటకును, ఈ యగ్ని పద్మమువలె చల్లనగుటకును, నా ప్రభావమో! మంత్రమో! యని భ్రమింపకుము.

శ్లో. మహావిపత్పాప వినాశనోఽయం
జనార్దనానుస్మరణానుభావః।

ఇది యాపదల బాపునట్టియు, పాపముల పోద్రోలునట్టియు భగవత్స్మరణ వైభవమేనుమా! యని తెలిపెను.

మరణ సమయ మాసన్నమైనతరి శ్రీభీష్మ పితామహులు శ్రీకృష్ణుని ధ్యానించగా పాండవులమధ్య కూర్చొని ప్రసంగించుచున్న శ్రీకృష్ణు డొక్కక్షణకాలము మౌనియై యాలోచించి వారితో 'అహా!' శరతల్పగతో భీష్మః శామ్యన్నివ హుతాశనః మాం ధ్యాతి పురుష వ్యాఘ్రః తతో మే తద్గతం మనః భీష్ము డారుచున్న యగ్నిహోత్రస్థితిలో నుండి శరతల్పగతుడై నన్ను ధ్యానించుచున్నాడు. కావున నామనస్సచ్చట కరిగినది. లెండు. ఆమహాత్మునివలన ధర్మోప దేశముల నాలకించ వలసియున్నదని వారిని తోడ్కొని యచ్చట కేగగా నా మహాముహు డా కృష్ణభగవానుని సేవించి ఒక వరముగా నిట్లు ప్రార్థించెను.

ప॥ త్రిజగన్మోహన నీలకాంతితను వుద్దీపింప, ప్రాభాత నీ
రజబంధు ప్రభమైన చేలముపయింరంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడువన్నె కాడుమది నావేశించు నెల్లప్పుడున్॥

అని ఇట్లు మూడుపద్యములతో ముమ్మాటికిని నాకు దీనినే ప్రసాదింపుమని వేడెను.

ఇట్లు ప్రమాణగ్రంథములలో సనకాదులు, ధ్రువుడు, భీష్మపితామహులు, కుంతి, మొదలగు భక్తులెందరో యా స్మరణభక్తిచేతనే తరించినట్లు ఉదాహరణములు కలవు.

## ఆచార్యుని యాశ్రయించుట

"జ్ఞానాన్మోక్షః" అని యున్నది గాన, జ్ఞానము వలన మోక్షమును, అజ్ఞానము వలన సంసారమును తటస్థించుచున్నవి. మోక్షమును లభింపజేయు జ్ఞాన మెట్టిదనగా 'అనుష్ఠాన పర్యంతమగు అర్థపంచక జ్ఞానము మాత్రమే అయి యున్నది. అట్టి జ్ఞానము లేకుండినచో సంసారదుఃఖము ప్రాప్తించునే తప్ప, మరి యుజ్జీవించుట కుపాయము లేదు. ఈ విషయమును గుర్తెరిగిన మోక్షార్థి యగు చేతనుడు

శ్రు. తద్విజ్ఞానార్థం స గురు మేవాభి గచ్ఛేత్ ।
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ।
తస్మై స విద్వా నుపసన్నాయ సమ్యక్ ప్రశాన్తచిత్తాయ
శమాన్వితాయ యేనాక్షరం పురుషం వేద సత్యం
ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యాం ॥

అని శ్రుతియందు తెలుపబడినటుల అట్టి యర్థపంచక జ్ఞానమును లభించుటకుగాను గురు సేవా శుశ్రూషా తత్పరుడై వేదవేదాన్త సారార్థ వేత్తయు, పరమాత్మేతరములయందు వైరాగ్యము గలవాడై పరమాత్మానుభవైక నిష్ఠుడై జ్ఞానానుష్ఠాన సంపన్నుడైన సదాచార్యుల నాశ్రయింప వలయును.

## ఆచార్యకృత్యము - అజ్ఞాత జ్ఞాపనము

అట్టి యాచార్యుడు తన నాశ్రయించినట్టియు, తన యందు పరిపూర్ణ యధ్యవసాయ నిష్ఠుడై యున్నట్టియు, శమ దమాద్యాత్మగుణ సంపన్నుడైనట్టియు ఈ చేతనుని మనస్సును బాగుగా పరిశోధించి, బ్రహ్మప్రాప్తికి సాధనభూతమగు అర్థ పంచకజ్ఞానమును ఉపదేశించి, అట్టి విజ్ఞానమున కనుకూలమగు యనుష్ఠానమును తెలిపి ఈతనిని దిద్దుబాటు చేయును. ఇటుల యాచార్యుడు కటాక్షించగా శిష్యుడు వాటిని లభించి కృతకృత్యుడై, మోక్షాధికారియై యుజ్జీవింప గలడు.

పైన తెలిపిన శ్రుతి యందు 'సమ్యక్ప్రశాన్త చిత్తాయ' అనియు 'శమాన్వితాయ' అనియు యుండుటచే శిష్యున కుండవలసిన యాత్మగుణములలో, విశ్వాసము, శమదమములు; ఇవి ప్రధానములని తెలియుచున్నవి. సచ్ఛిష్యుని కుండవలసిన లక్షణములన్నియును యిచ్చట సూచిత మగుచున్నవి. మరియు 'శ్రోత్రియం' అనియు 'బ్రహ్మనిష్ఠం' అనియు తెలిపియున్నందున సదాచార్యుని కుండవలసిన లక్షణము లన్నియును సూచింపబడినవి.

## సచ్ఛిష్య లక్షణములు

సచ్ఛిష్యున కుండవలసిన లక్షణములేవి యనగా :—

శ్లో॥ శరీరం వసు విజ్ఞానం, వాసః కర్మ గుణా నసూన్ ।
గుర్వర్థం ధారయే ద్యస్తు, స శిష్యః నేతర స్స్మృతః ॥

అని చెప్పబడినటుల శరీరము, ధనము, విజ్ఞానము, గృహము, భూములు భార్య బిడ్డలు ప్రాణము మున్నగు వానిలో నొక్కటియును తనవి యని భావింపక, ఇవి యన్నియును ఆచార్యునికే చెందినట్టివే యని భావించుచు, తాను వేరే యితరప్రయత్నముల నేవియు చేయక ఆచార్యుల యిష్టానుసారముగ వారి యాజ్ఞ ప్రకారముగ నడుచుకొనుచు వారికి క్రియ విక్రయార్హుడుగా నుండువాడును;

శ్లో॥ సద్బుద్ధి స్సాధుసేవీ సముచితచరిత స్తత్త్వబోధాభిలాషీ,
శుశ్రూషు స్త్యక్తమానః ప్రణిపతనపరః ప్రశ్నకాల ప్రతీక్షః,
శాన్తో దాన్తోఽనసూయః శరణ ముపగత శ్శాస్త్ర విశ్వాసశాలీ,
శిష్యః ప్రాప్తః పరీక్షాం కృత విదభిమతః తత్త్వత శ్శిక్షణీయః ॥

(అని చెప్పియున్నటుల సద్విషయములయందు ఆసక్తి కలవాడై, సత్పురుషుల సాంగత్య సేవలు గలవాడై, సదనుష్ఠాన సంపన్నుడై, తత్త్వజ్ఞానాపేక్షగలవాడై, గురుశుశ్రూషా తత్పరుడై, అహంకారరహితుడై, దండప్రణామపరుడై, ప్రశ్నకాలమును నిరీక్షించుచుండువాడై, బాహ్యేంద్రియ అంతరింద్రియ నిగ్రహము గలవాడై, అసూయారహితుడై, శరణాగతుడై, శాస్త్రమునందు విశ్వాసముగలవాడై యుండు శిష్యుడు లభించినచో, అట్టివానిని యథావిధిగ దిద్దుబాటు చేయ వలసినది) అని యున్నట్టి సచ్ఛిష్యలక్షణములు గలవానికి హితము నుపదేశింపగలడు.

## విలక్షణులుగాని శిష్యుల జేర్చుకొనుట యనర్థకము

ఇట్టి గుణములు లేనివారిని శిష్యునిగా చేర్చుకొన కూడదు. తనకు ఖ్యాతియో, లాభమో, గౌరవమో, అనువర్తనమో కలుగునను తలంపుతో దేవతాంతర సాధనాంతర విషయాంతర పరులగు వారిని శిష్యులుగ జేర్చుకొని "తన్నెజ్జిత్ తోత్తినతే శొల్లి" అనినటుల పూర్వాచార్యుల శ్రీసూక్తులను, వారి యనుష్ఠానములను విడచి తనకు గల దుర్వాసనా మూలముగ తోచిన విపరీతార్థములను ఉపదేశించుచు, వారిమూలముగ ద్రవ్యాదులను సంపాదించుకొనుచు, దేహ పోషణపరుడై కాలముగడుపునట్టి యాచార్యుడు "యజమానకృతం పాపం ద్రవ్యం మాశ్రిత్య తిష్ఠతి" (చేతనునికిగల పాపము వాని ద్రవము నాశ్రయించి యుండును) అనినటుల "శిష్య పాపం గురో రపి" శిష్యుని పాపము శిష్యుని ద్రవ్యము ద్వారా గురువునకు సంప్రాప్తించి, ఇదివర లోనే తన కున్నట్టియు, యిపుడు శిష్యుని ద్రవ్యముద్వారా ప్రాప్తించినట్టియు రెండు పాపములును చేరి మిగుల వృద్ధిబొంది గురువును బాధించగలవు.

## విలక్షణ శిష్యసంబంధము ఉత్తారకము

శిష్యుడైనప్పటికిని విలక్షణుల సంబంధమే కోరతగినది. గాన సదాచార్య సంబంధము వలెనె సచ్ఛిష్య సంబంధమును ఉపాదేయమే గాన విలక్షణులైనవారినే శిష్యులుగ జేర్చుకొన వలెను.

"సోఽయం రామానుజముని రపి, స్వీయముక్తిం కరస్థాం।
యత్సంబంధా దమనుత కథం, వర్ణ్యతే కూరనాథః"

పూర్వాపర యాచార్యవర్గమున కంతకును మోక్ష మిచ్చువారుగ ప్రసిద్ధిజెందిన భగవద్రామానుజులు వారును గురువు యొక్క యాజ్ఞ నతిక్రమించి తిరుకొట్టియూరు కోవిలలో అపేక్షించిన శ్రీవైష్ణవుల కందరికిని తిరుమంత్రార్థమును బహిరంగముగ నుపదేశించినందువలన వచ్చిన యపచారము వలన తమకు అథోగతి కలుగునని నిశ్చయించుకొని రనియు, పిమ్మట తమ సచ్ఛిష్యులగు కూరత్తాళ్వార్లు యొక్క సంబంధము వలన తమకు మోక్షము అరచేతిలో నున్నదిగ నిశ్చయించుకొని తన కాషాయవస్త్రమును పై కెగురవేయుచు నృత్యము చేసిరను విషయము ప్రసిద్ధము గదా.

శ్లో॥ గురో ర్వచోతిక్రమణే, నిశ్చిత్య స్వస్య దుర్గతిం।
పరానర్థాస హిష్ణుత్వాత్, మంత్రం ప్రోవాచ భాష్యకృత్ ॥

(ఆచార్యుల యాజ్ఞాతిక్రమణవలన తమకు దుర్గతి కలుగునని నిశ్చయించుకొనినను, ఇతరుల కష్టములను జూచి సహించజాలక శ్రీభాష్యకారులు తిరుమంత్రార్థమును అందరకును ఉపదేశించిరి.) అని యున్నది గదా.

## విలక్షణుడుకాని శిష్యునితో సంబంధము అనర్థహేతువు

ఇటుల విలక్షణుడగు శిష్యునితో గల సంబంధము ఉజ్జీవనకు హేతువగునటులనే, విలక్షణుడు కానట్టి శిష్యునితో గల సంబంధము అనర్థమునకు హేతువగును. సత్పుత్రునితో గల సంబంధము తండ్రికి పున్నామ నరకోత్తారక మైనటులనే, దుర్గతి నడవడికగల పుత్రునితో గల సంబంధము అట్టి పుత్రుడొనర్చిన నిషిద్ధకార్యముల మూలమున "పితౄన్ ప్రాశయతే యమః" అనునటుల పితృవర్గమున కంతకును వినాశహేతు వగునని గదా శాస్త్రములు తెలుపుచున్నవి.

శ్లో "స హి విద్యాత స్తం జనయతి,
తచ్ఛ్రేష్ఠం జన్మ గరీయాన్,
బ్రహ్మదః పితా గురుః పితా ముముక్షో స్తు"।

(ఆచార్యుడు విద్యద్వారా శిష్యుని కన్నవాడగుచున్నాడు, అట్టి జన్మమే శ్రేష్ఠమైనది. జ్ఞానము నిచ్చిన తండ్రి గొప్పవాడే, కాని ముముక్షువునకు ఆచార్యుడే తండ్రి యగుచున్నాడు) అను శాస్త్రమున గురుశిష్యులకు పితాపుత్ర సంబంధమున్నదని చెప్పబడుచున్నది. కావున దుర్నడవడిక గల శిష్యునితో గల సంబంధము, వాని ద్రవ్యమును స్వీకరించుట మూలముగ నది యన్ని యనర్థములకును హేతువై ఆచార్యుల స్వరూపమును నశింపజేయును. ఇట్లు శిష్యునితో గల సంబంధమే యపాయము గలుగజేయునదగుటవలన జ్ఞానానుష్ఠానములు లేని యాచార్యునితో గల సంబంధము శిష్యునికి వినాశహేతువు అగుటలో సంశయ మేముండును ?

శ్లో॥ జ్ఞానహీనం గురుం ప్రాప్య కుతో మోక్ష మవాప్నుయాత్,
భిన్ననావాశ్రయ స్తబ్ధో యథా పారం న గచ్ఛతి"!

(పగిలిపోయిన పడవ నెక్కినవాడు దరిని చేరజాలనటులనే, జ్ఞానహీనుడగు ఆచార్యుని యాశ్రయించినవాడు మాత్రము ఎటుల మోక్షమును పొందగలడు? మోక్షమును పొందజాలడని తాత్పర్యము) అని శాస్త్రమున నిది యనర్థహేతువుగ తెలుపబడినది కదా.

# వార్తామాల

## ఎనిమిదవవార్త

ఆత్మకు ధర్మి-ధర్మముల యొక్క స్వరూపమనియు, స్వరూప నిరూపక ధర్మమనియు నిరూపిత స్వరూప విశేషణ మనియు, వ్యాపారమనియు, లక్షణ మనియు, ద్రవ్యత్వ మనియు, వివిధములైన ప్రకారములు యుండును. ఇందు స్వరూపమనునది:— సత్యమై - జ్ఞానమై - ఆనన్దమై, అమలమునై యుండును.

స్వరూప నిరూపక ధర్మమనునది:— సత్యత్వము - జ్ఞానత్వము ఆనన్దత్వము, అమలత్వము అనునవి.

నిరూపిత స్వరూప విశేషణ మనునది :- స్వస్మైస్వయమ్ప్రకాశత్వము. అనగా— తనను తానే తెలుసుకొనుట- తెలుసుకొను కర్తయు తానేయై. తెలియజేయు నట్టి జ్ఞానమును తానేయై, తెలియబడునట్టి జ్ఞేయమున్ను తానేయై యుండుట యనియర్థము. ఈ విధముగ తననుతానే తెలిసికొనునట్టి జ్ఞానము "అహం - నేను" అని యుండును. "ఇదం- ఇది" అని యుండును. (అనగా వేరుగ భాసించునది తాత్పర్యము.) "ఇదం - ఇది అని భాసించినచో అట్టి స్థితిలో తనకంటె వ్యతిరిక్త విషయమున దర్శనము తటస్థించును అపుడు తనను జ్ఞేయముగ తెలుసుకొనుట సంభవింప నేరదు. అందువలన జ్ఞేయరూపమైన తెలివి లేకపోవలశి వచ్చును. జ్ఞేయ రూపమైన తెలివి లేకపోయినచో జ్ఞానత్వము లేక పోవలశివచ్చును. ఇవి లేకపోయినచో జ్ఞానాశ్రయత్వము లేకపోవలశి వచ్చును. జ్ఞానాశ్రయత్వము లేకపోయినచో జ్ఞానమునకు హాని వాటిల్లును. గనుక తనను తానే తెలుసుకొను తెలివి అహమర్థమునకు విషయమగు చున్నదని తెలుపబడినది.

నిరూపిత స్వరూప విశేషణము :— అనంతజ్ఞానాది గుణములు.

వ్యాపారము:— అపరిచ్ఛిన్నమైన స్వరూపా నందానుభవము-

లక్షణము:— అణుత్వము, ద్రవ్యత్వము, గుణములకు ఆశ్రయమై యుండుటయును ;

ధర్మము యొక్క స్వరూపము:— సత్యమై, జ్ఞానమై, అనంతమై, ఆనందమై, అమలమై, యుండును.

స్వరూప నిరూపక ధర్మము:— సత్యత్వము, జ్ఞానత్వము, అనంతత్వము, ఆనందత్వము, అనునవి.

నిరూపిత స్వరూప విశేషణము:— పరస్మై స్వయంప్రకాశము (ఇతరులకై తాను ప్రకాశించుట.)

మరియు 'పరస్మై విషయప్రకాశమునై' (ఇతరులకై విషయములను ప్రకాశింప జేయుటయునై) ఉండుట( ఇందువలన నిది తనన్ను, తనకంటె నితరములగు వానిని తెలుసుకొన జాలనిది యని తెలియుచున్నది.

నిరూపిత స్వరూప విశేషము:— క్రియావిశేషములు.

వ్యాపారము:— ఆత్మకు అవిచ్ఛిన్నమైన యానందమును కలుగ జేయుట.

లక్షణము:— విభుత్వము, ద్రవ్యత్వము, క్రియా-గుణములకు ఆశ్రయమై యుండుట యనునవి.

కావున స్వరూపము స్వస్మై 'స్వయంప్రకాశకమై' యుండును. స్వభావము 'పరస్మై స్వయం ప్రకాశమునై పరస్మై విషయ ప్రకాశమునై' యుండును.

అప్రాకృత మగు అచిత్తు ఇతరులకు తాను స్వయముగ ప్రకాశించునదై యుండును. ప్రాకృతమగు అచిత్తు యొక్క వికారములగు ఘటపటాదులు అన్యాధీన ప్రకాశకములు అనగా తనకంటె ఇతరములైనవానివలన తెలియబడునట్టివి. అనగా తనకంటె ఇతరులకు ఇతరముల వలన తెలియబడునట్టివి యని యర్థము.

స్వరూపమునకు స్వభావము కంటెను గల భేదమేమనగా:- తనకు తానే యగుటయును, విషయములను ప్రకాశింప జేయునది గాకపోవుటయును, తనకొరకున్ను తానే యగుట యున్ను అయియున్నది.

స్వభావమునకు స్వరూపము కంటెను గల భేద మేమి యనగా:— ఇతరులకై తాన గుటయును, విషయ ప్రకాశత్వమున్ను అయి యున్నవి.

ఘటాదులను బట్టి దీనికి గల భేద మేమనగా.— తనకై తానుగానుండుట –

ఘటాదులకు స్వరూపమును బట్టి భేద మేమనగా ఇతరమైన వాటివలన ప్రకాశించునవై యుండుటయును, విషయములను ప్రకాశింపజేయ జాలకపోవుటనై యున్నది.

స్వరూపానుభవ సమయమున స్వరూపమున కాధిక్య ముండును. తనకంటెను వేరగు దాని ననుభవించు సమయమున స్వభావమున కాధిక్యముండును.

ధర్మి – ధర్మముల యొక్క చేరికయందు స్వరూపము విశేషణముగా నుండును. స్వరూప నిరూపకమగు ధర్మమునకు శేషమైయుండుట నిరూపిత స్వరూప విశేషణముగా నుండును, శేష త్వము వలన కలుగు లాభము ఈ చేతనునిదై గాకుండగ, నిరూపిత-స్వరూప-విశేషము కైంకర్య మాత్రమునందే పూర్తి ప్రీతిని కలిగియుండుట, వ్యాపారము:- ఆయనయొక్క యానందమును జూచి తానును ఆనందించు చుండుట.

లక్షణము:— అనన్యార్హత్వము. అనగా వానిచే ప్రకాశింప చేయబడునదై యుండుట.

ద్రవ్యత్వము:— కైంకర్య రూపమగు గుణమునకు యాశ్రయమై యుండుట.

జ్ఞానత్వమున్ను, స్వయం ప్రకాశత్వమున్ను, ధర్మి-ధర్మములు రెండింటికిని సమాన ములే. ధర్మమునకు విషయిత్వ మధికము, ధర్మికి ప్రత్యక్త్వ మొకటి యధికము.

జ్ఞానత్వ మనగా:- దేనినైన నొకదానిని ప్రకాశింప జేయుట, అనగా తనకు సంబం ధించిన దానిని గాని లేక ఇతరులకు సంబంధించిన దానిని గాని వ్యవహారాను గుణముగునటుల జేయుట.

స్వయంప్రకాశ మనగా:— తాను తెలియవచ్చుటకుగాను వేరొక జ్ఞానము నపేక్షింపక తనకు తానే ప్రకాశించుట.

ధర్మమునకు విషయిత్వ మనగా:- తనను తప్ప వేరొక దానిని తెలియజేయుట,

ధర్మికి ప్రత్యక్ష మనగా:— తనకు తాను ప్రకాశించుట, అనగా తనంతట తానే తెలియ జేయుట, అనగా తన ప్రకాశమునకు తానే ఫలితమై యుండుట యని తాత్పర్యము.

ఏదైన నొక వస్తువునకు ఫలి యనెడి సామాన్య కారమును తన ప్రకాశమునకు ఫలి యని విశేషింప జేసినచో ప్రత్యక్ష మగును. ధర్మమునకు ఇట్టి విశేషము లేనట్లు సామాన్యత్వమును, దీనిననుసరించి యుండునట్టి చేతనత్వమున్ను లేవు. ఈ ధర్మి - ధర్మాలు రెండును స్వయంప్రకాశములే అయియున్నను, నిత్యత్వాది ధర్మవిశేషములతో గూడి యుండున వగుటచే వేరొకజ్ఞానముచే తెలియదగినట్టివై యున్నవి.

ధర్మభూత జ్ఞానము వేరొకజ్ఞానముచే తెలియబడు నపుడు, ప్రసరణ భేదమువలన అది వేరొకజ్ఞానముగ బిలువబడు చున్నది.

సంసారమున బడియుండుటకు స్వరూప యోగ్యత:- పరతంత్ర చేతనత్వము, సహకారి కారణము:- అనాదియగు ఆజ్ఞాతి లంఘన రూపమగు అపరాధము. ప్రధాన కారణము - సర్వేశ్వరుని యొక్క నిరంకుశ స్వాతంత్ర్యము -

పరమ ప్రాప్యమగు కైంకర్యమునకు స్వరూప యోగ్యత:- శేషత్వముతో కూడి యున్నట్టి చేతనత్వము, సహకారి కారణము:- భక్తి - ప్రపత్తు లనబడు అనుకూలవృత్తులు, ప్రధానకారణము:- సర్వేశ్వరుని యొక్క సహజమైన కారుణ్యము.

## తొమ్మిదవవార్త

చేతనుడు ఏ తలంపును తలంప వలయునన్నను సర్వేశ్వరుని తిరువుళ్ళమున అరు విధములైన తలంపులు తటస్థించునపుడు మాత్రమే యీతడు అట్టి తలంపుగలవాడగును.

అవి యేవి యనగా:—

| | |
|---|---|
| 1. కర్తృత్వము | 2. కారయితృత్వము |
| 3. ఉదాసీనత్వము. | 4. అనుమన్తృత్వము |
| 5. సహకారిత్వము. | 6. ఫలప్రదత్వము. |

అనునట్టివి -

1. కర్తృత్వమనగా:- తాను ముందుగా తలంచుట.

2. కారయితృత్వ మనగా:- ఆ తలంపును ఈ చేతనునికి కలిగించుట.

3. ఉదాసీనత్వ మనగా:- ఆ తలంపును కలుగ జేయునపుడు ఈ చేతనుని యొక్క కర్మానుగుణముగ మాత్రమే కలిగింపజేయుట

4. అనుమన్తృత్వమనగా:- ఈ చేతనుడు తలంచునట్టి తలంపును తొలగింపజేయగల సమర్థుడై యున్నప్పటికిని తొలగింప జేయకుండుట.

5. సహకారిత్వమనగా:- ఈ చేతనుడు సర్వేశ్వరుని సహాయమున్ననే తప్ప ఏవిధమైన ప్రవృత్తిని కలిగియుండుటకు గాని, లేక నివృత్తిని కలిగియుండుటకుగాని సమర్థుడుకాజాలకుండుట।

6. ఫలప్రదత్వ మనగా:- ఇవన్నియును ఈ చేతనుడు గావించిన కర్మము యొక్క ఫలస్వరూపములై యుండుట.

## పదియవవార్త

తిరుమల యందు జీయరువారు ఇట్టుల సాయించిరి. అహంకార మనునది ఒక చండాలుడు, మమకార మనునది ఆ చండాలునియొక్క భార్య రాగ ద్వేషములనునవి వారలయొక్క సంతానము. ఈ అహంకార మొక్క దానిని చంపితిమేని, ఇవి యన్నియును నశించును. ఎట్లనగా:- పతివ్రత యగుటచే భార్య భర్తతోకూడ కలసిమరణించును. పాలిచ్చువారు లేకపోవుటచే బిడ్డలు గొంతుక యెండిపోయినశించుదురు.

## పదునొకండవ వార్త

అహంకార మనునది యొక సర్పము. మమకార మనునది దాని యొక్క దేహము. రాగ ద్వేషములు దాని యొక్క కోరలు. ఈ కోరల నూడబెరుక కలిగినచో ఆసర్పము నశింపగలదు.

## పన్నెండవవార్త

సంసారియగు చేతనులు అవిద్యతో గూడి యుందురు. అవిద్య యనగా:- అహంకారము మమకారము అనునవి వీనివలన రాగద్వేషములు కలుగును. వీనివలన నాలుగు విధములైన శరీరములు తటస్థించును. శరీరముల ననుసరించి అయిదు విషయముల యందును రుచికలుగును.

ఆ విషయముల ననుభవించుటకై దారితప్పి ప్రవర్తింతురు. అది యెట్లనగా:- అబద్ధములాడుట, దొంగలించుట, పరుల హింసించుట. నీచులను సేవించుట.

ఇట్లు నడచుకొనునట్టి వానికి సర్వేశ్వరుని కృపాకటాక్షము వలన ఈతనికి తెలియకుండగనే ఒక్క సుకృత విశేషము కలుగును. ఆ సుకృత విశేషము వలన ఇతనికంటెను కూడ ఈతని యనర్థములకు ఖేదపడుచున్న సర్వేశ్వరుడు చల్లగా కటాక్షించును. అదిమొదలు సర్వేశ్వరుని ద్వేషించుటను మానును. దానిచే సర్వేశ్వరునికి ఆనందము కలుగును. ఆ ఆనంద కారణమున ఈ చేతనునికి సత్త్వగుణము వృద్ధిజెందును. దానివలన తనకు మంచి కలుగవలయునని తలంచును. అందుకొరకై సాత్వికులతో స్నేహము జేయును. తద్వారా సదాచార్యుల నాశ్రయించకలుగును. సదాచార్యులు వీనికి ఉజ్జీవన కరములగు విషయముల నుపదేశించుదురు.

అవి యెవ్వి యనగా.- కంటికి కనిపించు శరీరము కంటెను వేరుగ 'నేను' అనబడు వాడు కలడు యనియు, నేనుయను వాడు స్వతంత్రుడు గాడు పరతంత్రుడనియు, ఆ పారతంత్ర్యము దేవతాంతరములకు గాక సర్వేశ్వరునికి మాత్రమే పరతంత్రుడనియు. ఆ సర్వేశ్వర పారతంత్ర్యమునకు ఆఖరిహద్దు (శ్రీ) వైష్ణవులకు పరతంత్రుడై యుండుట యనియు, ఇందులకు ఫలము (శ్రీ) వైష్ణవులకు సర్వేశ్వరుని తిరువడిగళ్ల యందు కైంకర్యమును జేయుట యనియు, అటుల కైంకర్యమును జేయుటలో అడ్డుకొను విరోధులు అహంకార – మమకారములును, శరీర సంబంధము యనియును, వాటిని బోగొట్టుకొనుటకు ఉపాయము వాని తిరువడి కళ్లు యనియును, ఈ విషయముల నన్నిటిని తెలుసుకొనుటకు ప్రమాణము రహస్యత్రయ మనియు, ఆచార్యులుపదేశింతురు.

అటువిమ్మట, ఈ అర్థవిశేషముల నుపదేశించునట్టి యాచార్యుల విషయమున కృతజ్ఞుడై సాత్వికులతో సహవాసము గలవాడును, తరువాత ఆచార్య కైంకర్యమె దేహయాత్రగా గలవాడగును.

ఆచార్యకైంకర్య మనగా:- అనిష్టములైన వాటిని వదలుటయును, ఇష్టమైనవాటి నాచరించుటయును, ఈ రెండింటిలోను అనిష్టమైన వాటిని విడుచుటయే ప్రధానమైనది. అందులకు కారణమేమనగా - ఇష్టమైనవాటిని జేయనిచో యాచార్యులు ఉపేక్షించి యూరకుందురు. అనిష్టమైన వాటిని విడువనిచో స్వయముగ కోపగించినవాడై వీనిని విడిచిపెట్టి వైతురు. ఆచార్యులు చేయివదలినచో సర్వేశ్వరుడు చేయివదలివేయును. అటుపిమ్మట ఈతనికి సహాయమొనర్చువారలు పూర్వపు కర్మలున్ను, యమభటులున్ను, అయియుందురు.

ఈతనికి ఇష్టములైనవాటిని, అనిష్టములైనవాటిని తెలుసుకొనుట యెటుల ననగా:- శాస్త్రములద్వారాను, ఆచార్యుల కృపావిశేషము వలనను, తెలియగలవు ఇదియే పురుషార్థ ప్రాప్తికి సాధనమై, కైంకర్యమునై, స్వరూపమునై యుండును. వీటిని సాధనముగా తలంచకూడదు.

ఆచార్యులకు సంతోషకరముగ భగవత్కైంకర్యమును, భాగవతకైంకర్యమును చేయుచుండవలయును. ఈ విధముగ నడచుకొనునట్టి యోగ్యునికి ప్రాప్యసిద్ధి కలుగును.

స్వస్వరూపము యొక్క ఆఖరిహద్దు - భాగవత శేషత్వము.

పరస్వరూపము యొక్క ఆఖరిహద్దు - అర్చావతారము. విరోధిస్వరూపము యొక్క ఆఖరిహద్దు - అహంకార మమకారములు-

ఉపాయస్వరూపము యొక్క ఆఖరిహద్దు - భగవత్కృప.

ఉపేయస్వరూపము యొక్క ఆఖరిహద్దు - భగంవతుని తిరుముఖ మండలము వికసించుట, అని నంబిళ్లగారు సాయించిరి.

పదమూడవవార్త

ఉభయవిభూతియును సర్వేశ్వరునికి శేషభూతమై యుండును. ఇందుండువారు:- బద్ధులు, నిత్యులు, ముక్తులున్ను.

బద్ధులు రెండువిధములుగ నుందురు:- ముముక్షువులనియును, సంసారులనియును.

వీరలు అహంకార- మమకారములు లేనివారున్ను, అహంకార - మమకారములకు వశ్యులమై యున్నామె యనుకొనువారున్ను, అహంకార మమకారములతో కలసిపోయి యున్నవారునై యుందురు.

ఇందు అహంకార మమకారమును లేనివారు నిత్యులును,ముక్తులును, అహంకారము మమకారములకు వశ్యులమై యున్నామె యని యనుకొనువారు - ముముక్షువులు, అహంకార మమకారములతో కలసిపోయి యున్నవారు నిత్యసంసారులు.

వీరిలో అహంకార -మమకారములు లేనట్టివారిని సర్వేశ్వరుడు మిక్కిలి యభిమానించును. అహంకార మమకారములకు వశులమై యున్నామె యని యనుకొనువారలను తన దయతో కటాక్షించును, అహంకార మమకారములతో కలసిపోయి యున్న వారలను తన లీలకు విషయభూతులుగ నొనర్చును. అని మొదలియాండాన్ సాయించిరి.

శ్రీమతే రామానుజాయ నమః



# ప్రచార విభాగము

## సాంఘిక వార్తలు

### బందరు

ఇచ్చట శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు 9, వ శుక్రవారోత్సవ వార్షికసభలు 18-9-59 మొదలు 20-9-59 వరకు 3 రోజులు మహావైభవముగా జరిపిరి. ఈ సభకు పెక్కురు విద్వాంసులు, విదుషీమణులు, విచ్చేసిరి. ఉదయము శ్రీ భద్రాద్రి రాములవారి సన్నిధిలోను సాయంత్రము చల్లరిస్తా శ్రీవేణుగోపాల స్వామివారి ఆలయములోను పండితోపన్యాసములు జరిగెను. ఈ సభలను కార్యదర్శినులగు శ్రీమ॥ సీతమ్మగారు శ్రీ కం॥ తాయారమ్మగారు చక్కగా నిర్వహించిరి. ఏలూరు శ్రీ అండాళ్ సేవామహిళాసమితి అధ్యక్షురాలగు శ్రీ తె. కం. సీతమ్మ గారు తామురచించిన పద్యములను సంఘమున కానుకగా ఇట్లు చదివిరి.

ఉ॥ శ్రీ యతిరాజపాద సరసీజ మరందర సైకభోగ్యులై
తీయని సుస్వరమ్ములను, దివ్యగుణావళి లాలపించుచున్
పాయని సర్వ సంపదల భాసుర కీర్తిచెలంగి ధన్యలౌ
శ్రీయతిరాజ సేవికల చెల్వాల నెన్నతరంబె యేరికిన్.

ఉ॥ శ్రీయతిరాజపాద సరసీరుహభృంగములార! వంచమో
పాయ సుసంపదన్ వెలుగు భాగవతోత్తములార! శౌరికిన్
వేయివిధాల సేవలను వేడ్కనొనర్చెడు ధన్యులార! యా
ప్యాయత సర్వులన్ దనుపు పావనులార! శుభంబు మీకగున్.

చ॥ మగువలతోడ సద్గురుని మాన్యత గన్న సమాజ మిద్ది తా
సిగను ధరించు పుష్పముల శ్రీశుని బద్ధుని జేసి, వేదవేల్
నిగమపు సూక్తులన్ దెలిపి నిద్దురమాన్పి ప్రబోధజేయు, మా
సొగసరి దివ్యవాణి జయశోభల నెప్పుడొసంగు గావుతన్

### మద్రాసు

ఇచ్చట శ్రీయతిరాజసేవా మహిళామండలివారు గీతామందిరములో 27-8-59 మొదలు 31-8-59 వరకు వరుసగా 5 రోజులు శ్రీకృష్ణ జననోత్సవములను మహావైభవముగా జరిపించిరి

ఆ 5 దినములు ప్రముఖులైన విద్వాంసులు శ్రీకృష్ణావతార వైభవమును గురించి యుపన్యసించిరి. మరియు ప్రతిదినము ఈ మందిరములో, ప్రభాతసేవ, పిల్లలకు పాలదానము నిత్యతిరువా రాధన ప్రబంధ సేవాకాలములో సంగీతపాఠములు, హిందీపాఠములు శ్రీమద్రామాయణ కాలక్షేపములు విలక్షణముగా జరుగుచున్నవి. శుక్రవార లక్ష్మీపూజలు మహావైభవముగా జరుగుచున్నవి. కార్యదర్శిని శ్రీమతి॥ చంద్రమ్మగారి యొక్క కృషిప్రశంసనీయము. శ్రీ పార్థసారథిగారి సేవ నన్య మన్నిటికన్నా మిన్నగానున్నవి.

## బరంపురం

ఇచ్చట శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు ప్రతినిత్యము సాయంత్రము గం 4.0 మొదలు సమిష్ఠిగా శ్రీ విష్ణు సహస్రనామ పారాయణమున్ను, 108 పర్యాయములు హరేరామ జపమున్ను, చాతుర్మాస దీక్షగా శ్రీ తిరువెంగడ ముడయాన్ సన్నిధిలో జరుపుచున్నారు. ఏకాదశి శుక్రవార పూజాసందర్భములలో దాదాపు 100 మందిదాక మహిళలు పాల్గొను చున్నారు. ఇటీవల ఈ సంఘపు 9, వార్షికోత్సవ సభలు 3 రోజులు ముచ్చటగా జరిపిరి. ఆ సందర్భములో రు 3/ లు సంఘ కట్నముగా సమర్పించిరి. మరియు నిచ్చట శ్రీ పెదతాయారమ్మ గారి సన్నిధిలో శ్రీ గాదె యశోదా లలితాదేవిగారు తిరునెడందాండం ముఖపరీక్ష నీయగా యీసంఘము వారామెకు తిరువాయి మొళి శ్రీకోశమును సత్కరించిరి. స్థానికముగా నిచట స్త్రీలలో సంప్రదాయాభివృద్ధి విశేష్య జరుగు చున్నందులకు మాకెంతయో సంతోషముగా నున్నది.

## ఏలూరు

ఇచ్చట శ్రీ జనార్థన స్వామివారి కోవెలలో శుక్రవారోత్సవ భక్తబృందమువారు శరన్నవ రాత్రోత్సవ సందర్భములో శ్రీ రాజ్యలక్ష్మీతాయారుకు నిత్యసహస్రనామ పూజలు తిరువంజనములు జరిపించుచు ప్రముఖులైన విద్వాంసులను పిలపించి వారిచే ఆధ్యాత్మికోపన్యాసముల నిప్పించి ప్రజలలో నొకవిధమైన భక్తిచైతన్యమును ఉద్భవింపజేసిరి.

## బందరు

ఇచ్చట శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తక సంఘమువారు పంచమవార్షికోత్సవమును 16-10-59 మొదలు 18-10-59 వరకు 3 రోజులు పరమవిలక్షణముగా జరిపిరి సుప్రసిద్ధులైన విద్వాంసులీసభకు పెక్కురు విచ్చేసిరి. ఉదయము సర్కిలుపేటలో శ్రీ వేణుగోపాలస్వామివారి సన్నిధిలోను సాయంత్రం శ్రీరాజేశ్వరీ రామకృష్ణమందిరములోను సభలు జరిగినవి. ఈ సభలను డాక్టర్ శ్రీ M. శేషాచార్యులుగారు (అధ్యక్షులు) ప్రధాన కార్యదర్శి యస్. టి-జి-యల్- పెరుమాళ్లాచార్యులుగారు సహాయకార్యదర్శి శ్రీ చక్రవర్తుల శ్రీచనభూషణం నరసింహాచార్యులుగారు మంచిఉత్సాహముతో యీ సభలను నిర్వహించిరి.

## ఏలూరు

ఇచ్చట శ్రీ ఆండాళ్ సేవామహిళా సమితివారు శుక్రవార లక్ష్మీపూజా కార్యక్రమమును మహోత్సాహముతో [illegible]గావించుచున్నారు. ఇటీవలనే ప్రథమవార్షికోత్సవము జరిపిరి.

## చుండూరు

ఇచ్చట శ్రీ యతిరాజసేవామహిళా మండలివారు శుక్రవారపూజలు, ఏకాదశినాడు అఖండ హరినామ సంకీర్తనలు జరుపుచు, శ్రీ కవిగారిద్వారా ప్రపన్నామృత పురాణ కాలక్షేపము ననుభవించుచున్నారు.

## శ్రీ వాసువాసాశ్రమం

ఇచ్చట శ్రీ కోదండస్వామివారి సన్నిధిలో శరన్నవరాత్రోత్సవ సందర్భమున ప్రతి నిత్యము శ్రీ లక్ష్మీఅమ్మవారికి సహస్రనామపూజలు, తీర్థప్రసాదగోష్టులు జరిగినవి. ప్రతినిత్యము అఖండ హరినామ సంకీర్తన జరుగుచున్నది.

## విజయవాడ

ఇచ్చట శ్రీమాన్ తూపురాణి వెంకటాచార్యస్వామివారు ప్రతిదినము సాయంత్రము భగవద్విషయ కాలక్షేపము క్రొత్తగుళ్లలో సాయించుచున్నారు

## రాజమండ్రి

ఇచ్చట తులసీరామానుజ కూటములో శ్రీమాన్. తె. కం. కుమార రామానుజాచార్యులు గారు ప్రతినిత్యము సంప్రదాయ రహస్యగ్రంథ కాలక్షేపమును గావించుచున్నారు.

## కట్నములు

శ్రీకూర్మములో శ్రీ వద్దిరాజు సత్యవతీదేవిగారు శ్రీ జియ్యర్ స్వామివారి తిరునక్షత్రోత్సవమును తమస్వగృహములో జరిపి ఆచార్యకట్నముగా రు 5/ లు సమర్పించిరి.

బందరు శ్రీ యతిరాజసేవామహిళా మండలివారు, తమ 9 వ శుక్రవార వార్షికోత్సములు జరిపి సంఘమునకు కట్నముగా సమర్పించినది. - రు 5/ లు

శ్రీ విశిష్టాద్వైత ప్రవర్తకసంఘము (బందరు) వారు తమ సంఘ పంచమ వార్షికోత్సవమును జరిపి ప్రచారకసంఘ కట్నముగా పంపినది - 5/ లు

విజయవాడ శ్రీ కోదండ రామస్వామివారి సన్నిధిలో భక్తులు శరన్నవరాత్రోత్సవమును జరిపి శ్రీమతి మా. రాధాదేవిగారిద్వారా సంఘమునకు పంపిన కట్నం 2/ లు

## సంభావనలు

రెడ్డిగూడెం— శ్రీమాన్ అరవిల్లి వెంకటాచార్యులుగారు తమ తల్లిగారి పరమతోత్సవ సందర్భములో సంఘసంభావనగారు పంపినది. రు 5/ లు

## శాశ్వతపూజా విరాళములు

శ్రీ తాటికొండ గెల్లయ్యగుప్తగారు గోదూరు బదరి శ్రీనివాస రామానుజ శాశ్వతార్చనకు పంపినది - రు 29/ లు

శ్రియఃపతి వీరికి సమస్త సన్మంగళములు ప్రసాదించు గాక !

ఓం

# బదరి వార్తలు

బదరికానాథులో మన అష్టాక్షరిక్షేత్రములోని రామానుజ కూటము యొక్క పను లన్నియును చాలవరకు పూర్తిఅయినవి. ఉత్తరపు వైపు వసారా పనులుమాత్రము మిగిలియున్నవి.

వెనుకవైపున కట్టుచున్న పనిమిది వంటగదులుకూడ కట్టుబడిపూర్తి అయినది. పైన కప్పువేయుట అయినది. సిమెంటు ప్లాస్టరింగులు అలమర్లు, కిటుకీలకు తలుపులుకట్టుటయు మిగిలి యున్నవి.

సత్సంగ సదనములో క్రింది అంతస్థు పైఅంతస్థు, అంతటను లోపల బయట సిమెంటు ప్లాస్టరింగు వగైరాలు పూర్తిఅయినవి. పైకప్పు పూర్తిగ వేయబడినది. పైనబల్ల సరంబి సగము అయినది. శ్రీనివాసరామానుజ సన్నిధిగది కట్టుబడి పూర్తిఅయినది. ఇక దీని ప్లాస్టరింగులు మొత్తమున కంతకును రంగులు మిగిలియున్నవి.

కాంపౌండునకు శంఖచక్రములు స్వరూపము శిరియ-పెరియ తిరువడిబొమ్మలు-కైంకర్య పరుల తిరునామములు-రామానుజ శ్రీమన్నారాయణ నామములతో అత్యద్భుతనిపుణతతో శ్రీ జలగం సుబ్రహ్మణ్యంనాయుడుగారు మద్రాసులో సుమారు రూ 3000/లు భక్తులయొక్క విరాళములతో బహుప్రయాసతో మంచిరంగులతో 21, యినుపచట్రములను తయారుచేయించి పంపినారు. వీటిని యిచ్చటకుచేర్చుటకు సుమారు రూ 1000/లు ఖర్చుఅయినది. ఆ చట్రము లన్నియునుకూడీ యిచ్చటికి యిప్పుడే సురక్షితముగా చేరినవి. వాటిని బిగించుట ప్రారంభమైనది.

ఈమధ్య నిచ్చట చాల వానలుకురిసి నారులన్నియును పాడైనవి. అడవినుండి కలపగాని, క్రింద ఋషీకేశాదులనుండి, సున్నముగాని, సిమెంటుగాని, యితరసామగ్రిగాని సకాలములో రాలేదు. చాల వ్యయప్రయాసలకులోనై కావలసిన సామానునంతను యిప్పటి కిచ్చటికి చేర్చ గలిగితిమి. అందుచే ఈపాటికి పూర్తికావలశిన పనులింతవరకు పూర్తిగాకుండగ యింకనునిలిచి యున్నవి. చాలవరకే ఈ సంవత్సరమున పనులు పూర్తికాగలవు. మిగిలినకొద్ది పనులు వచ్చే సంవత్సరమున పూర్తిచేయబడగలవు. ఇంకను కొంతసామాను పేపలుకోటినుండి యిప్పటికిని వచ్చుచునేయున్నది.

బదరినాథుని కోవిలతలుపులు వచ్చేనవంబరు పదునారవతేదిని మూసివేయుటకు దసరా పండుగనాడు అధికారులచే నిర్ణయింపబడినది.

ఇప్పుడే యిచ్చట చలి అతిదుర్భరముగనున్నది. చుట్టు ప్రక్కల కొండలమీద మంచు పడుచు క్రమముగా క్రిందకు వచ్చుచున్నది. ఇంతవరకు పచ్చగనున్నకొండలు మంచుచే మారి పోయి అడుగున నల్లగను, పైన మంచునిలబడి తెల్లగను మారుచున్నవి. ఈ రోజులో అధిక కాలము మబ్బు, చలిగాలియు, కొద్దికాలము మాత్రము చల్లని సూర్యరశ్మియు, యుంటూ యున్నది. గ్రామములో, కోవిలకు సంబంధించిన కైంకర్యపనులు, పోలీసుపోస్టు హాస్పత్రి వీని యొక్క కొద్దిమంది నౌకరులున్న గ్రామము మొత్తముమీద సుమారు 10మంది పండాలున్ను,

4,5 దుకాణదారులు మాత్రము మిగిలియున్నారు. తక్కినవారందరును కూడ క్రిందకువెళ్ళి పోయిరి. పనిచేయు కూలీలు మెస్త్రీలుకు అనేక సదుపాయములను జేసి హెచ్చుకూలీలనిచ్చి అప్పు జేసి పనిచేయింపబడుచున్నది.

మన శ్రీనివాస రామానుజస్వామివారి కైంకర్యము వైభవముగా జరుగుచున్నది. నవరాత్ర్యుత్సవములు, శ్రీ చూర్ణార్చనలతోను, ప్రబంధస్తోత్రపాఠగోష్ఠితోను అతిలక్షణముగ పదిదినములు జరుపబడినవి. ఆశ్వీయుజ శుద్ధఏకాదశి లగాయతు అయిదురోజులు లక్షార్చన అతి వైభవముగా జరుపబడినది. పదిమంది ఋత్విక్కులు శ్రీవిష్ణు సహస్రనామములను ప్రతినిత్యము ఉదయమున రెండావృత్తులు (ఒకరుచెప్పగా మిగతవారందరును ఆనామములను తిరిగి అనువదించి జెప్పుచుండుట) జెప్పుచు తులసీపూజయు, ప్రతినిత్యము సాయంకాలము రోజునకు రెండేసి పత్తాలు చొప్పున తరువాయి మొళిసేవకాలము, స్తోత్రపాఠములుతోను మందిరములోను, రామానుజ కూటములోను తదయారాధనలతోను ఈ ఉత్సవము అతివైభవముగా జరుపబడినది.

మన జీయరుస్వామియు శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తే. కం. గోపాలాచార్యస్వామియు దగ్గరనుండి అన్నిఉత్సవములను వైభవముగా జరిపించుచున్నారు.

ఇచ్చట శ్రీ ఉభయవేదాంతపాఠశాలయు వైభవముగా జరుగుచున్నది. శ్రీ ఉ.వే. శ్రీమాన్ తే. కం. గోపాలాచార్యస్వామివారు శ్రీభాష్యము ద్వితీయాధ్యాయము కాలక్షేపము సాయించుచున్నారు. ప్రస్తుతమున ముగ్గురు విద్యార్థులు కాలక్షేపమగుచున్నారు.

శ్రీ జీయరుస్వామివారు మంత్రార్థమును కాలక్షేపమును సాయించుచున్నారు. శ్రీనివాస రామానుజస్వామివారికి ఈ సంవత్సరమున ఉభయదారుల గోత్రనామములతో పూజలన్నియును పూర్తిగ జరుపబడి, అందరికిని ప్రసాదములు పోస్టులో పంపబడినవి. కొద్దిమంది చిరునామాలు అసమగ్రముగ నున్నవని పోస్టువారు ప్రసాదపుకవరలను D. O. నుండి త్రిప్పివేయుచున్నారు. గాన యింతవరకు ప్రసాదము అందని ఉభయదారులు తమ చిరునామాలను పూర్తిగ సమగ్రముగ మాకిచ్చుటకు వ్రాశినచో అట్టివారందరికిని తిర్గి ప్రసాదమును పోస్టులో పంపగలము.

మన జీయరుస్వామివారి చాతుర్మాస్యదీక్ష నిర్విఘ్నముగ బదరిలో పూర్తిచేయబడి ఆశ్వీయుజ శు. ౧౨తో దీక్షాశాంతి వైభవముగా జరుపబడినది.

ఈ సంవత్సరము గీతాజయంత్యుత్సవము రాబోవు మార్గశీర్ష శుద్ధఏకాదశి డిశెంబరు 10తేది గురువారమున అయినది. మరియు మార్గశీర్ష, బహుళ పాడ్యమి డిసెంబరు 16తేది బుధ వారము మధ్యాహ్నము ఘ. ౧౨. ౦ (గం. 11. 0) నుండి ధనుర్మాసోత్సవము ప్రారంభము గానున్నది.

ఈ సంవత్సరమున బొంబాయి, పనసవాడి శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానములో, శ్రీ మన జీయరుస్వామివారును, శ్రీ. ఉ. వే. శ్రీమాన్ తే. కం. గోపాలాచార్యస్వామివారును డిశెంబరు 10 గురువారము నుండి 18 రోజులు గీతాజయంత్యుత్సవమును, ధనుర్మాసోత్సవమును జరుపదలంచుచున్నారు.

తే. కం. గోపాలాచార్యులు

శ్రీ హయగ్రీవాయనమః



# శ్రీ ఉభయ వేదాన్త పాఠశాల - బదరినారాయణము

బదరీనాథులో శ్రీ ఉ. వె. శ్రీమాన్ తె. కం, గోపాలాచార్య స్వామివారిచే శ్రీ మనుభయ వేదాన్తపాఠశాల అతివైభవముగా నిర్వహింపబడుచున్నది. – ప్రతిదినము ఉదయమున తాత్పర్య చంద్రికా విశేషములతో శ్రీ గీతాభాష్యమున్ను; మరియు శ్రీభాష్యమున్ను మధ్యాహ్నమున ద్రావిడ వేదాధ్యయనము, (నిత్యానుసంధానము సంతలు.) తర్క–పాఠములు జరుపబడుచున్నవి –

శ్రీ భాష్యవిద్యార్థు లిద్దరుకును రెండుపూటల సాపాటున్ను - యథోచిత ఉచిత విద్యార్థివేతనము మిగతవిద్యార్థులు ఆరుగురికి రాత్రిపూట మాత్రము రొట్టెలున్ను మరియు అవసర యవకాశానుసారముగా విద్యార్థులకు గ్రంథములు బట్టలు – దీపముల వగైరాలున్ను ఉచితముగ సప్లై చేయబడుచున్నవి – శ్రీ. ఉ. వె. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్య స్వామివారు మనఅష్టాక్షరిక్షేత్ర రామానుజకూటము యొక్కయు సత్సంగ సదనము యొక్కయు పనులన్నిటిని అతిచురుకుగా జరిపించుచు, ఈ పాఠశాలను నడిపించుచు, అహోరాత్రములు భగవద్భాగత కైంకర్యమున నిమగ్నులై ఆరోగ్యముగ కులాసాగా కాలక్షేపమును జేయుచున్నారు.

---

# శ్రీ మన జీయరు స్వామివారు

శ్రీ మన జీయరుస్వామివారు బదరి కాశ్రమములో ఈ శ్రావణ శుద్ధ ద్వాదశి ఆదివారమున చాతుర్మాస దీక్షను ప్రారంభించి, రామానుజ కూటమున ఏకాంతముగ కాలక్షేపమును సాగించుచున్నారు —

# శ్రీ గుణరత్నకోశము

## 4వ శ్లోకము

శ్లో॥ యద్భ్రూభంగాః ప్రమాణం స్థిరచరరచనా - తారతమ్యే మురారేః ।
వేదాన్తా స్తత్త్వచిన్తాం మురభిదురసి యత్పాదచిహ్నై స్తరన్తి ।
భోగోపోద్ఘాతకేళీ - చుళుకిత - భగవదైశ్వరూప్యానుభావా ।
సా న శ్శ్రీ రాస్తృణీతా మమృత లహరి ధీ లఙ్ఘనీయై రపాఙ్గైః॥

### అర్థము :

మురారేః = మురాన్తకుడగు శ్రీమన్నారాయణుని ;

స్థిరచర రచనా తారతమ్యే :

స్థిర = స్థావరపదార్థములయొక్కయు;

చర = జంగమ పదార్థములయొక్క ;

రచనా = సృష్టియొక్క ;

తారతమ్యే = హెచ్చుతగ్గులయందు;

యద్భ్రూభఙ్గాః =

యత్ = ఏ లక్ష్మీదేవియొక్క

భ్రూ = కనుబొమలయొక్క

భఙ్గాః = విక్షేపములు ;

ప్రమాణం = నియామకములో ;

వేదాన్తాః = ఉపనిషత్తులు,

మురభిదురసి :

మురభిత్ = మురాంతకుడైన శ్రీమన్నారాయణునియొక్క

ఉరసి = వక్షస్థలమందలి;

యత్పాదచిహ్నైః =

యత్ = ఏలక్ష్మీదేవియొక్క

పాద = పాదములయొక్క

చిహ్నైః = గుర్తులచేత

తత్త్వచిన్తాం = తత్వవిచారమును,

తరన్తి = దాటుచున్నవో (సిద్ధాంతీకరించుచున్నావో),

యా = ఏలక్ష్మీదేవి ;

భోగోపోద్ఘాతకేళీచుళుకితభగవదైశ్వరూప్యానుభావా :

భోగ = భోగములయొక్క

ఉపోద్ఘాత = ప్రారంభమందలి;

కేళీ = విలాసముచేత,

చుళకిత = అల్పముగా చేయబడిన,

భగవత్ = భగవంతునియొక్క

వైశ్వరూప = విశ్వరూపమందలి,

అనుభావా = మహిమను గలదియో ;

సా = అటువంటి

శ్రీ = లక్ష్మీదేవి,

అమృతలహరిధీ :

అమృత = అమృతముయొక్క

లహరి = తరంగములవెడి,

ధీ = బుద్ధిచేత

లంఘనీయైః = దాటతగిన,

అపాంగైః = క్రీగంటిప్రసారములచేత

నః = మమ్ములను

ఆస్తృణీతాం = కప్పివేయుగాక.

### తాత్పర్యము :

ఏ శ్రీ లక్ష్మీదేవియొక్క భ్రూభంగవిక్షేపముల ననుసరించియే, ముర యను రాక్షసిని సంహరించిన శ్రీమన్నారాయణుడు లోకమందలి స్థావరజంగమముల యొక్క సృష్టిని నీచ-ఉచ్చ స్థితులు-తరతమములు కలవానిగ చేయు

చున్నాడో, ఉపనిషత్తులు "హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ" అనియు, "శ్రియం లోకే దేవజుష్టా ముదారాం" అనియు ఇత్యాది వాక్యములచే లక్ష్మీవక్షస్థలమునందు గలవారే పరాత్పరుడని, తెలుపుటద్వారా శ్రీమన్నారాయణుకే పరతత్త్వమని నిర్ణయించుచున్నవో, సర్వేశ్వరుని యొక్క భోగవిలాసములద్వారా ఏ శ్రీ లక్ష్మీదేవి యొక్క మహిమ శ్రీమన్నారాయణుని విశ్వరూప మహిమనుగూడ అల్పమైనదానిగ పరిగణింప జేయజాలుచున్నదో, అట్టి శ్రీ లక్ష్మీదేవి అమృత తరంగముల వంటి తన కృపాకటాక్షములచే మమ్ములను కటాక్షించుగాక!

# ప్రకటన

శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులవారిచే క్రొత్తగా రచింపబడిన కావ్యములు:-

ధనుర్దాసుడు:- (పద్యకావ్యము) రు 1-00 (శ్రీ భగవద్రామానుజవైభవమింపు చక్కగా నిరూపింపబడినది.)

సరమ:— (విభీషణుని భార్య) 0-75 (పద్యకావ్యము - విభీషణ శరణాగతి. ఇందు విభీషణ శరణాగతి విపులముగా నిరూపింపబడినది)

వలయువారు:-

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము
శ్రీ వాసుదాసాశ్రమం-నడిగడ్డపాలెం (P. O.)
(Via) చేబ్రోలు (గుంటూరుజిల్లా)

సాలుచందా రు 5 లు భక్తినివేదన — BOOK POST రి. నెం. A 195

వాసుదాసాశ్రమం — నడిగడ్డపాలెం (పోష్టు) (వయా చేబ్రోలు) గుంటూరు



... ఓరియంటల్ లైబ్రరీ
Tirupathi, (Chithur dt.)

Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and printed at Bharati ... Tenali For Sriman Press, Nadigaddapalem.

శ్రీమతే రామానుజాయ నమః





శ్లో॥ శ్రుతి [illegible] శ్రీనివాసే । [illegible] భక్తి [illegible]



# భక్తినివేదన

[వేదాంత మాసపత్రిక]


సంపుటి ౧౨ || వికారి - మార్గశిరము || సంచిక ౯


## జీవస్వరూపము

శ్లో॥ శ్రుతిపథ విపరీతం క్ష్వేళకల్పం శ్రుతౌ చ । ప్రకృతిపురుష భోగ ప్రాపకాంశో నపథ్యః ॥
తదిహ విబుధగుప్తం మృత్యుభీతా విచిన్వ । న్త్యుపనిష దమృతాబ్ధే రుత్తమం సారమార్యాః ॥

### తాత్పర్యము

వేదశాస్త్రవిరుద్ధములైన కర్మముల ననుష్ఠించుట విషభక్షణము వంటిది. సంసార భోగములు గాని, కైవల్యానుభవములు గాని, కలుగజేయునట్టి సాధనముల నవలంబించుట, యివి యెంతమాత్రము హితకరములు కావు

కావున, సంసారమునుండి భయపడి భగవదనుభవము గోరునట్టి ముముక్షువులు ఉపనిషత్తులను, అమృతవార్ధినుండి తీయబడి ఆచార్య పరంపరయా అద్యాపి పరమరహస్యముగా గాపాడుకొని వచ్చుచున్న సారభూతమగు అర్థములను తెలిసికొని తదనుష్ఠానమునందు ప్రవర్తించుదురుగాక.

అనగా, ముముక్షువులకు. రహస్యత్రయమే, ఉపాదేయమని, సారాంశము.


జనవరి సంపాదకులు : విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు 1960

సహాయ సంపాదకులు : కవిరత్న గుడిమెళ్ళ రామానుజాచార్యులు

# గోపికా గీతము

## 6 వ శ్లోకము

శ్లో॥ వ్రజజనార్తిహన్ వీర యోషితాం
నిజజనస్మయ ధ్వంసన - స్మిత ।
భజ సఖే భవ త్కింకరీ స్మనో ।
జలరుహాననం చారు దర్శయ ॥

## —* అర్థము *—

హే వ్రజజనార్తిహన్ = వ్రజనివాసుల యార్తిని బోగొట్టువాడా!
హే వీర = ఓ వీరుడా!
హే నిజజన స్మయ ధ్వంసన స్మిత = స్వజనుల గర్వమును పోగొట్టు యానందించువాడా!
హే సఖే = ఓ చెలికాడా!
భవత్కింకరీః = నీకు దాసీజనులమైన,

నః = మమ్ములను;
భజ = పొందుమా;
స్మ = తప్పకుసుమా!
చారు = సుందరమైన;
జలరుహాననం = ముఖపద్మమును;
యోషితాం = స్త్రీలమైన మాకు;
దర్శయ = చూపుమా!

## —♦ తాత్పర్యము ♦—

జగద్వ్యాపకుడవగు నీవు వ్రజనివాసుల యార్తిని పోగొట్టుటకొరకే గదా యిచ్చట యవతరించితివి. పూతన, కంసాదులపై జూపవలసిన నీ వీరత్వమును, నీకు చెలులమై, కింకరులమై మాపై ప్రయోగించుట న్యాయమా, నీ స్నేహముచే కలిగిన గర్వమును పోగొట్టి యానందించగల వీరత్వమును, సఖీత్వమును శేషిత్వమును, గలవాడవుగదా! నీ శరీరభూతులమైన మాకు నీ దర్శనము లేనిచో మా స్వరూపము నిలుచునా? గాన (యాతి పుంసా యోషిత్) నీ యొక్కయు, మా యొక్కయు స్వరూపములు నిలుచుటకు గాను నీ ముఖపద్మమును మాకు జూపుమా యని ఒక గోపిక ప్రార్థించుచున్నది.

శ్లోక సంఖ్య





అస్మద్గురుభ్యోనమః

# శ్రీ భగవద్గీతా - త్రయోదశోఽధ్యాయః

# క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగః

అవ. ఈ యధ్యాయము మొదలు మూడధ్యాయముల వఱకును మోక్షాపేక్ష గల వాడెఱుంగదగిన చిత్-అచిత్-ఈశ్వరస్వరూపములను క్రమముగ నెఱింగించుచున్నాడు. మొదటనే దేహములను గురించిగాని ఆత్మలను గురించిగాని పండితులు దుఃఖించరని తెలిపిన క్రమమును బట్టియు, సప్తమాధ్యాయారంభమున అపర-పరప్రకృతులు రెండును తనవియేయని యుపదేశించిన క్రమమును బట్టియు నీ యధ్యాయముచే శరీరములుగా పరిణమించిన ప్రకృతితత్వమునుగూర్చి యుపదేశించుచున్నాడు. పూర్వోక్తవిషయములను విశోధించుటయేగదా యీ షట్క-ప్రధానాశయము.

1. శ్లో. ఇదం శరీరం కౌన్తేయ ! క్షేత్ర మిత్యభిధీయతే
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః । క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥

అర్థము :- కౌన్తేయ ! = అర్జునా ! ఇదం = ఈ, శరీరం = దేహము, క్షేత్రం ఇతి = క్షేత్రమని, అభిధీయతే = చెప్పబడుచున్నది. ఏతత్ = ఈ దేహమును, యః = ఎవడు, వేత్తి = ఎఱుంగుచున్నాడో, తం = వానిని, క్షేత్రజ్ఞః ఇతి = క్షేత్రజ్ఞుడని, తద్విదః = ఆత్మతత్వము నెఱింగినవారు, ప్రాహుః = చెప్పుచున్నారు.

తా॥ శరీర తత్వము నెఱింగిన ప్రాజ్ఞులు ఆత్మచేకూడ నెఱుంగబడుచున్న నీ దేహమును ఆత్మకు పుణ్యపాపఫలములగు సుఖదుఃఖముల ననుభవించుటకు ఆధారమైనదని తెలుపుచున్నారు.

ఆత్మతత్వము నెఱుంగు వివేకులీ యాత్మను తెలుసుకొనువాడగుటచే తెలియబడు దేహముకంటె వేరైనవాడని చెప్పుచున్నారు. (బీజముల నాటుటకును అవి వృద్ధిపొంది ఫలముల నొసంగుటకును ఆధారమగు భూమి క్షేత్రమనబడు నటులనే, కర్మబీజముల నాటుటకును అవి సుఖదుఃఖరూపమగు ఫలముల నొసంగుటకును ఈ దేహమే యాధారమగుటచే నిదియును క్షేత్రమనబడుచున్నది.)

అవ. పరస్పరము విలక్షణమైన చేతనాచేతనములు రెండును పరమాత్మకంటె వేఱైనవని తెలుపుటకై రెండును అతనికి *శేషభూతములనియు నిట్లెఱుంగుట తన కిష్టమనియు నీ జ్ఞానమును ప్రశంసించుచున్నాడు.

2. శ్లో. క్షేత్రజ్ఞ ఞ్చాపి మాం విద్ధి । సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్ర-క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం । యత్త్ జ్ఞానం మతం మమ॥

అర్థము :- హే భారత = ఓ యర్జునా, సర్వక్షేత్రేషు = సకల దేహములయందుండెడి, క్షేత్రజ్ఞం అపి = (శరీరమువలె) జీవునికూడ, మాం = నే నాత్మగా కలవానినిగా, విద్ధి = తెలుసుకొనుము. క్షేత్రక్షేత్రజ్ఞయోః = శరీరాత్మల యొక్క, జ్ఞానం = ఎఱుక, యత్ = ఏదికలదో, తత్ = అదియే, జ్ఞానం = తెలియదగిన జ్ఞానమని, మమ = నాయొక్క, మతం = అభిప్రాయము.

తా॥ అర్జునా! శరీరములెట్లు నేనాత్మగా కలవియో నిఖిలశరీరముల యందునున్న జీవులుగూడ నేనాత్మగా కలవనియే యెఱుంగుము. ఇట్లే దేహాత్మలు రెండును వేరువేరనియు, ఇవి రెండును పరమాత్మయే యాత్మగా కలవనియు నెఱుంగుటయే ఉత్తమమైన జ్ఞానమని నాయభిప్రాయము.

(శ్రీవిష్ణు సహస్రనామ ఫలశ్రుతిలోని 'వాసుదేవాత్మకా న్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞమేవచ' అను శ్లోక మీగీతాశ్లోకమునకు సమానార్థకమని గుర్తించవలెను.

* ఇచ్చట శేషమనగా - తనచే యథేష్టముగా నియమింపబడదగినదియు, తనచే ధరింపబడదగినదియు, తనకతిశయము

అవ. శరీరమును గూర్చియు, ఆత్మను గూర్చియు సంగ్రహముగా దెల్పెద
నని శ్రీకృష్ణు డర్జునునకు ప్రతినజేయుచున్నాడు.

3. శ్లో. తత్క్షేత్రం యచ్చ యాదృక్చ । యద్వికారి యత శ్చ యత్
స చ యో యత్ప్రభావ శ్చ । తత్సమాసేన మే శృణు॥

అర్థము :— తత్ క్షేత్రం = ఆ శరీరము, యత్ చ = ఏ ద్రవ్యముతో చేయబడి నదియో, యాదృక్ చ = వేటికి ఆశ్రయమైనదో, య ద్వికారి = దాని వికారములెవ్వియో, యతః చ = ఏ ప్రయోజనము కొఱకది పుట్టినదో, యత్ = ఏ స్వరూపమైనదో, స చ = క్షేత్రజ్ఞుడును, యః = ఏ స్వరూపము కలవాడో, యత్ ప్రభావః చ = ఏవి ప్రభావముగా కలవాడో, తత్ = దానిని, సమాసేన = సంక్షేపముగా, మే = నానుండి, శ్రుణు = వినుము.

తా॥ ఆశరీర మేద్రవ్యముతో చేయబడినదియో, వేటికి ఆశ్రయమైన దియో, దాని వికారములెవ్వియో, అది ఏప్రయోజనమునకై సృష్టింపబడినదో, ఏస్వరూపమైనదో, ఆజీవు డేస్వరూపముగల వాడో, వాని యాశ్చర్యకరములైన స్వభావ విశేషము లెవ్వియో వాటిని సంగ్రహముగా జెప్పెదను శ్రద్ధగా వినుము.

అవ. తాను జెప్పదలంచు నర్థములు ఇతిహాస పురాణ మీమాంసాదులచే నుపబృంహితములైన శ్రుతిప్రమాణ సిద్ధములని తెలుపుచున్నాడు.

4. శ్లో. ఋషిభి ర్బహుధా గీతం । చన్దోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్ర పదై శ్చైవ । హేతుమద్భి ర్వినిశ్చితైః॥

అర్థము :— ఋషిభిః = ఋషులచేత, బహుధా = అనేకవిధములుగాను, వివిధైః = వేరువేరు రీతులుగ దెలుపునట్టి, ఛన్దోభిః = వేదములుచేతను, హేతుమద్భిః = హేతువులతో కూడినవియు, వినిశ్చితైః = లెస్సగా నిశ్చయింపబడినవైన, బ్రహ్మసూత్రపదైః = శారీరకసూత్రములచేతను, పృథక్ పృథక్ = వేరువేరుగా, గీతం = వర్ణింపబడినది.

తా॥ ఈశరీరాత్మల తత్త్వము పరాశరవ్యాసాది మహర్షులచేతను, అనేకమైన వేరువేరు రీతులుగా దెలుపునట్టి వేదములచేతను, సహేతుకముగా నిశ్చయింపబడిన శారీరక సూత్రములచేతను వేరువేరుగా వర్ణింపబడినది.

అవ. శరీరమునకు సంబంధించిన ఐదువిషయములను రెండు శ్లోకములచే సంగ్రహముగ జెప్పుచున్నాడు.

5. శ్లో. మహాభూతా న్యహఙ్కారో । బుద్ధి రవ్యక్త మేవ చ
ఇన్ద్రియాణి దశైకం చ । పఞ్చ చేన్ద్రియ గోచరాః॥

అర్థము :- మహాభూతాని = పృథివ్యాది పంచభూతములున్ను, అహఙ్కారః = అహంకారతత్వమున్ను, బుద్ధిః = మహత్తత్వమున్ను, అవ్యక్తం ఏవచ = మూలప్రకృతియును, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, దశ ఏకంచ = పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు మనస్సు అనెడు పదునొకండును, ఇన్ద్రియగోచరాః = ఇంద్రియములచే నెఱుంగ దగిన విషయములును.

తా॥ భూమి నీరు నిప్పు గాలి, ఆకసమనెడు పంచభూతములున్ను, అహంకార తత్వమ్ను, మహత్తత్త్వము, మూలప్రకృతియు ననెడు ఎనిమిది ద్రవ్యములచే దేహము నిర్మింపబడినది. చెవి చర్మము కన్ను ముక్కు నాలుక యనెడు ఐదు జ్ఞానేంద్రియము లున్ను, వాక్కు చేయి, కాలు, మలమూత్రవిసర్జన ద్వారముల నెడు ఐదు కర్మేంద్రియములు, మనస్సు అనెడు పదునొకం డింద్రియములున్ను, జ్ఞానేంద్రియములచే గ్రహింపబడు, శబ్ద స్పర్శరూపరస గంధములనెడు ఐదు విషయములును.

(ముందుశ్లోకముతో దీనికి సంబంధము)

6. శ్లో. ఇచ్ఛాద్వేష స్సుఖం దుఃఖం । సఙ్ఘాత శ్చేతనాధృతిః
ఏత త్క్షేత్రం సమాసేన । సవికార ముదాహృతమ్॥

అర్థము :— ఇచ్ఛా = కోరికయు. ద్వేషః = విరోధమును, సుఖం = ఆనందము, దుఃఖం = దుఃఖమున్ను, చేతనాధృతిః = జీవులకు సుఖదుఃఖ భోగానుభవమునకు ఆధారమైన, సఙ్ఘాతః = పంచభూతముల కూడికయైన, క్షేత్రం = శరీరమనబడు, ఏతత్ = ఇది, సవికారం = కార్యములతో కూడ, సమాసేన = సంగ్రహముగా, ఉదాహృతం = చెప్పబడినది.

తా॥ జ్ఞానేంద్రియాదులేగాక కోరిక ద్వేషము ఆనందము, దుఃఖము అనునివి శరీరవికారములుగా జెప్పబడుచున్నవి. ఈశరీరము జీవుడు గావించిన పుణ్యాపాపముల ఫలములగు సుఖదుఃఖము లనుభవించుటకై యాధారముగా నిర్మింపబడినది. ఇది పంచభూతముల యొక్క కూడికయేగాని వేరొక పదార్థముకాదు. ఇదియే క్షేత్రమనబడు శరీరము. ఇది నీకు వికారములతో గూడ సంగ్రహముగా జెప్పబడినది.

అవ. శరీరసంబంధముచే నాత్మయందు పుట్టునట్టి గుణములలో నాత్మజ్ఞానము నకు సాధనములుగా గైకొనదగిన గుణములు చెప్పబడుచున్నవి.

7. శ్లో. అమానిత్వ మదమ్భిత్వ । మహింసా క్షాన్తి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం । స్థైర్య మాత్మవినిగ్రహః॥

అర్థము :- అమానిత్వం = గర్వములేకుండుట. అదమ్భిత్వం = దంభములేకుండుట. అహింసా = పరులను పీడించకుండుట. క్షాన్తిః = ఓర్పుకలిగియుండుట. ఆర్జవం = మనోవాక్కాయము లేకరూపముగ నుండుట. ఆచార్యోపాసనం = ఆచార్యులను సేవించుట. శౌచం = సదాచారసంపత్తి కలిగియుండుట. స్థైర్యం = వేదాంతవిషయములయందు చలింపకుండుట. ఆత్మవినిగ్రహః = మనస్సును నిగ్రహించుట.

తా॥ పెద్దలను తిరస్కరింపరాదు. కీర్తినికోరి ధర్మములను జేయరాదు. కరణత్రయముచేతను పరులను పీడించరాదు. పరులు తనను పీడించుచున్నను చిత్తవికారమును జెందరాదు. తలంచినటులనే చెప్పుట, చెప్పినటులనే చేయుట యుండవలెను. ఆత్మజ్ఞానమును ప్రసాదించిన ఆచార్యులకు నమస్కారము, సేవ తప్పక చేయుచుండవలెను. శాస్త్రోక్తమైన సదాచారము లలవరచుకొని తన మనోవాక్కాయములను ఆత్మజ్ఞాన, తత్సాధనానుష్ఠానములకు తగినస్థితిలో నుంచుకొనవలయును తాను వినిన సమంజసమగు వేదాంతార్థములనుండి చలించరాదు. ఆత్మ స్వరూపమునందే మనస్సునుంచి యితరమైన వాటినుండి దానిని మరల్చవలెను.

8. శ్లో. ఇన్ద్రియార్థేషు వైరాగ్య । మనహఙ్కార ఏవ చ
జన్మ మృత్యు జరా వ్యాధి । దుఃఖ దోషాను దర్శనమ్॥

అర్థము :– ఇన్ద్రియార్థేషు = శబ్దాదివిషయములయందు. వైరాగ్యం = విరక్తియు, అనహఙ్కారః ఏవచ = దేహాత్మ భ్రాంతిలేకుండుటయు. జన్మమృత్యుజరా వ్యాధి దుఃఖదోషానుదర్శనం = పుట్టుట. చచ్చుట. ముసలితనము, రోగము, దుఃఖము అనెడు దోషములు తప్పనిసరిగా వచ్చెడివని తలంచవలెను.

తా॥ ఆత్మకంటె వేరైనవన్నియు దోషయుక్తములేగాన వాటియం దనహ్యాము కలిగియుండవలెను, దేహమే ఆత్మయనెడు అభిమానముకాని, దేహమునకు సంబంధించిన పుత్ర మిత్ర కళత్ర గృహ క్షేత్రాదులు తనవనెడు బుద్ధిగాని యుండరాదు. పుట్టుట గిట్టుట ముసలితనము రోగము మొదలగు వాటివలన పుట్టెడు దుఃఖము దోషము గాన వాటినితలంచి ఆత్మను వాటిబారినుండి తప్పించుటకై ప్రయత్నించవలెను. శరీరముండగ నవి త్రోసి పుచ్చనలవికానివి గాన శాంతముగా సహించుచు శరీరసంబంధ మిక నెప్పుడును రాకుండునట్లు ప్రయత్నించవలెను.

9. శ్లో. అసక్తి రనభిష్వఙ్గః । పుత్రదార గృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వ । మిష్టానిష్టోపపత్తిషు॥

అర్థము :– అసక్తిః = ఆత్మేతరములయందు మమకారము లేకుండవలెను. పుత్రదార గృహాదిషు = కుమారుడు. భార్య. యిల్లు మొదలగువాటియందు. అనభిష్వఙ్గః = ఆసక్తిలేకుండవలెను. ఇష్టానిష్టోపపత్తిషు = ఇష్టములుగాని అనిష్టములుగాని సంభవించినప్పుడు. నిత్యం = ఎల్లప్పుడును. సమచిత్తత్వం చ = మనస్సు నేకరీతిగా నుంచుకొనవలెను.

తా॥ ఆత్మకంటె మరియే యితర సాంసారిక పదార్థములయందును సంగముండరాదు. భార్యాపుత్రాదులను శాస్త్రీయకర్మలకు వారుపయోగించు నంతవరకు మాత్రమే వాడుకొనవలయును గాని వారియందు మిక్కిలి యనురాగ ముంచరాదు. తన సంకల్పముచే నిష్టములుగగాని యనిష్టములుగగాని భావింపబడు పదార్థములు తటస్థించినయడల మనస్సును పొంగునుగాని క్రుంగును గాని చెందనీయక ఏకరీతిగా నుంచవలెను.

10. శ్లో. మయి చానన్య యోగేన । భక్తి రవ్యభిచారిణీ
వివక్త దేశ సేవిత్వ । మరతి ర్జనసంసది॥

అర్థము :– మయి = నాయందు, అనన్యయోగేన = దేవతాన్తర ఫలాన్తరాది పరిత్యాగరూపమగుటచే, అవ్యభిచారిణీ=స్థిరమైన, భక్తిః = భక్తియును, వివిక్తదేశసేవిత్వం = జనులులేని ప్రదేశమునందు నివసించుట, జనసంసది = జనులునివసించు ప్రదేశమునందు, అరతిః = అసహ్యమున్ను.

తా॥ ఇతర దేవతలనందరను విడిచి, ఇతర ఫలములను వేటినిగాని యాశించక కేవల సర్వేశ్వరునియందే స్థిరమైన భక్తికలిగి యుండవలెను. । జనులు లేని ప్రదేశమునందే నివసించవలెను. జనులు వసించుచోట నివసించుట కసహ్యాపడవలెను.

11. శ్లో. అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం । తత్వజ్ఞానార్థ చిన్తనమ్
ఏతజ్జ్ఞాన మితి ప్రోక్త । మజ్ఞానం య దతోఽన్యథా॥

అర్థము .– అధ్యాత్మజ్ఞాన నిత్యత్త్వం=ఆత్మనుగూర్చిన జ్ఞానమునందు నిష్ఠగలిగియుండుట. తత్వజ్ఞానార్థచిన్తనం = తత్వజ్ఞానమే ప్రయోజనముగాగల చింతనము (నందాసక్తిగలిగియుండుట) ఏతత్ = ఇదియే, జ్ఞానం = ఆత్మజ్ఞానసాధనమని, ప్రోక్తం = చెప్పబడినది. అతః = దీనికంటె, అన్యథా = వ్యతిరేకముగా, యత్ = ఏదికలదో (తత్ = అది) అజ్ఞానం = ఆత్మజ్ఞానవిరోధి. (భవతి = అగుచున్నది).

తా॥ ఆత్మజ్ఞాన సంపాదనయందు నిష్ఠకలిగియుండవలెను. తత్వజ్ఞానమును బడయుటకై నిరంతరము చింతించుటయందే ఆసక్తికలిగి యుండవలెను. ఈ చెప్పబడిన యనుష్ఠానమంతయు ఆత్మజ్ఞానమును బడయుటకు ముఖ్యసాధనముగా చెప్పబడుచున్నది. ఇంతకు మించినదంతయు నాత్మజ్ఞానమునకు విరోధియే యగుచున్నది.

అవ. తెలిసికొనుటయే లక్షణముగా జెప్పబడిన క్షేత్రజ్ఞుడనబడు జీవుని స్వరూపము విమర్శింపబడుచున్నది.

12. శ్లో. జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి । యజ్జ్ఞాత్వాఽ మృత మశ్నుతే
అనాది మత్పరం బ్రహ్మ న స త్త న్నాస దుచ్యతే॥

అర్థము :- యత్ = ఏ జీవాత్మస్వరూపము; జ్ఞేయం = అమానిత్వాదిగుణసంపత్తిచే పొందదగినదో, తత్ = దానిని, ప్రవక్ష్యామి = చెప్పెదను. యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొని, అమృతం = శుద్ధాత్మస్వరూపమును, అశ్నుతే = పొందుచున్నాడో, తత్ = అది, అనాది = పుట్టుకలేనిది, మత్పరం = నన్నే ముఖ్యునిగా గలది బ్రహ్మ = జ్ఞానముద్వారా సర్వవ్యాప్తికలది, తత్ = అది, సత్ = సత్తుఅనియు, అసత్ = అసత్తనియు న ఉచ్యతే = చెప్పబడదు.

తా॥ అమానిత్వాది సాధనములచే పొందదగిన జీవాత్మ స్వరూపమును జెప్పెదను. దాని నెఱింగినచో పుట్టుకచావులు లేని శుద్ధాత్మస్వరూపమును బడయనగును-ఈశుద్ధాత్మకు పుట్టుక లేదు. అందుచే నాశమునులేదు. దానికి నేను ప్రభువును. అది యణువైనను దీపము తన కాంతిచేవలెనే తన జ్ఞానముచే నంతటను వ్యాపించి యుండును. ఇది కార్యావస్థలో సత్ అనియు, కారణావస్థలో 'అసత్' అనియు చెప్పబడును. ఈరెండు అవస్థలును ఆత్మకు కర్మమూలములేగాని సహజములుకావు గాన సత్ అసత్ శబ్దములచే శుద్ధాత్మ చెప్పబడదు.

13. శ్లో. సర్వతః పాణిపాదం త । త్సర్వతోఽక్షి శిరోముఖమ్
సర్వత శ్శ్రుతిమ ల్లోకే । సర్వ మావృత్య తిష్ఠతి॥

అర్థము :— తత్ = ఆ శుద్ధాత్మస్వరూపము, సర్వతః = అంతటను, పాణిపాదం = చేతులును కాళ్లునుగలది. సర్వతః = అంతటను, అక్షిశిరోముఖం = కన్నులు, తలలు, ముఖములు కలది. సర్వతః = అంతటను, శ్రుతిమత్ = చెవులుకలది. లోకే = లోకమందు, సర్వం = సమస్తమును, ఆవృత్య = వ్యాపించి, తిష్ఠతి = ఉన్నది

తా॥ శుద్ధాత్మ స్వరూపము పరబ్రహ్మాశోడి సామ్యముకలది. కావున పరబ్రహ్మకుగల స్వాభావిక శక్తిసామర్థ్యములు దీనికినికలవు. పరబ్రహ్మవలెనే ఆయా యింద్రియములు లేకున్నను ఆ యా యింద్రియముల కార్యములనంతటను సహజముగనే చేయగలదు. శుద్ధాత్మ స్వరూపము దేశకాలాదిహద్దులు లేనిదిగాన నిది సర్వత్రనుండును.

14. శ్లో. సర్వేన్ద్రియ గుణాభాసం । సర్వేన్ద్రియ వివర్జితమ్
అసక్తం సర్వభృచ్చైవ । నిర్గుణం గుణభోక్తృ చ॥

అర్థము :— సర్వేన్ద్రియ గుణాభాసం = స్వయముగనేగాక ఇంద్రియవృత్తులచేతను గూడ విషయములను తెలిసికొనునదియును. సర్వేంన్ద్రియ వివర్జితం = స్వయముగనే (ఇంద్రియవృత్తులు లేకయే) సర్వమును నెఱుంగునదియును, అసక్తం = సహజముగ దేవాదిదేహములతోడి సంబంధములేనిదియును. సర్వభృత్ చఏవ = దేవాదిసమస్తదేహములను భరించునదియును, నిర్గుణం = సహజముగ సత్త్వాదిగుణములు లేనిదియును, గుణభోక్తృ చ = సత్త్వాదిగుణములను అనుభవించునదియును (భవతి = అగుచున్నది).

తా॥ శుద్ధాత్మస్వరూపము, సహజముగనే గాక సమస్తేంద్రియ వృత్తులచేగూడ విషయములను తెలిసికొన సమర్థమైనది. స్వాభావికముగ నింద్రియవ్యాపారములు లేనిది. దానికి దేవాది దేహసంబంధము కర్మవలన కలిగినదేగాని సహజముకాదు. కర్మవలన బద్ధదశయందును, తన సంకల్పమువలన ముక్తదశయందును దేవాది సర్వదేహములను భరించుటకు సమర్థమైనది. అది స్వాభావికముగ సత్త్వాదిగుణములు లేనిదైనను ఆ గుణముల ననుభవించుటకు సమర్థమైనది.

15. శ్లో. బహి రన్తశ్చ భూతానా । మచరం చర మేవ చ
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం । దూరస్థం చాన్తికేచ తత్॥

అర్థము :– భూతానాం = పంచభూతములయొక్క, బహిః = వెలుపలను, అన్తః చ = లోపలను (వర్తతే = ఉంటున్నది) అచరం = సహజముగ కదలనిది, చరం ఏవచ = దేహసంబంధముచే కదలునది, తత్ = అ యాత్మతత్త్వము, సూక్ష్మత్వాత్ = మిక్కిలి సూక్ష్మమైనదగుటవలన, అవిజ్ఞేయం = దేహముకంటె వేరై నదని తెలియశక్యముకానిది, తత్ = = అది, దూరస్థం = దూరముననున్నదియు, అన్తికే చ = సమీపమున నున్నదియు (భవతి = అగుచున్నది).

తా॥ శుద్ధాత్మ, పృథివ్యాది భూతములను వదలి శరీరము లేక ఆభూతములకు బయటనుండును. ముక్తదశలో స్వేచ్ఛావ్యాపారములు నిర్వహించుటకొఱకు ఆభూతములలోపల వర్తించును. దానికి కర్మేంద్రియములు లేకుండుటచే చలింపకుండును. శరీరమును ధరించినచో చరించును. ఇది మిక్కిలి సూక్ష్మమైన దగుటచే సర్వజ్ఞత్వాది గుణములచే దేహముకంటె వేరైనను అట్లు తెలియబడదు. అది యందరి దేహమునందే యుండినను అమానిత్వాది గుణములు లేనిచో మిక్కిలి దూరమున నున్నదియే యగును. అవియున్నచో నదియే దగ్గరగా నున్నదియగును.

16. శ్లో. అవిభక్తం చ భూతేషు । విభక్త మివ చ స్థితమ్
భూత భర్తృ చ తజ్జ్ఞేయం । గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥

అర్థము :– భూతేషు = దేవాదిభూతములయందు, అవిభక్తం = వేఱువేఱుగా గ్రహింపబడనిదియు, విభక్తం ఇవ = దేవాద్యాకారములచే విభజింపబడిన దానివలె, స్థితం చ = ఉన్నదియు, భూతభర్తృ = దేహరూపములు దాల్చిన పృథివ్యాదిభూతములను భరించునట్టి, తత్ = ఆ యాత్మ, జ్ఞేయం = వాటికంటె వేరైనదిగా తెలియదగినదియు, గ్రసిష్ణు చ = అన్నాదుల ననుభవించునదియు, ప్రభవిష్ణు చ = పుట్టుటకు కారమైనదియు (భవతి = అగుచున్నది).

తా॥ దేవాది శరీరములయందున్నను ఏకాకారముతోనే యుండును గాని వేఱువేఱుగా నుండునదికాదు. ఈరహస్యము నెఱుంగని వారికి వేఱు వేఱుగా నున్నట్లుతోచును. దేహరూపమును దాల్చిన పృథివ్యాదిభూతములను భరించునది గాన భరింపబడు నా భూతములకంటె వేఱైనదని తెలియదగినది. అన్నాకారము గనున్న పృథివ్యాది భూతముల ననుభవించునదిగాన అనుభవింప బడు నాభూతములకంటె వేఱైనదని తెలియదగినది. ఆ యన్నాదులు రేతోరూపమునుదాల్చి తిరిగి పుట్టుకకు కారణమగునట్లు చేయునదీ యాత్మయే గాన పుట్టునట్టివాటికంటె వేఱైనది. మృతశరీరమునందీ శక్తులు లేవు గాన నివి శరీరమునకు సంబంధించినవి కావనియు ఆత్మకే సంబంధించినవనియు నెఱుంగదగును.

17. శ్లో. జ్యోతిషా మపి తజ్జ్యోతి । స్తమసః పర ముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం । హృది సర్వస్య విష్ఠితమ్॥

అర్థము :- తత్ = ఆ యాత్మస్వరూపము, జ్యోతిషాం అపి = వెలుగునిచ్చు సూర్యాదులనుగూడ, జ్యోతిః = ప్రకాశింపచేయునది, తమసః = సూక్ష్మప్రకృతి కంటె, పరం = వేరైనదిగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది. జ్ఞానం = జ్ఞానాకారమైనదని, జ్ఞేయం = తెలియదగినది. జ్ఞానగమ్యం = జ్ఞానసాధనములగు అమానిత్వాది గుణములచే పొందదగినది. సర్వస్య = అన్ని ప్రాణులయొక్క, హృది = హృదయమునందు, విష్ఠితమ్ = సన్నిహితమై యుండునదియు (భవతి = అగుచున్నది).

తా॥ ఆత్మస్వరూపము, వెలుగునిచ్చు సూర్యాదులకున్ను వెలుగు నిచ్చును. ఇది సూక్ష్మావస్థయందున్న ప్రకృతికంటె వేరైనది. కేవలజ్ఞానమే ఆకారముగాకలది. అది జ్ఞానసాధనములగు అమానిత్వాదిగుణములచే పొందదగినది. మనుష్యాది సమస్తప్రాణుల యొక్క హృదయమునందు భోక్తృస్వరూపముతో సన్నిహితమై యుండును.

అవ. ఇట్లు క్షేత్రస్వరూపమును. ఉపాయస్వరూపమును. క్షేత్రజ్ఞస్వరూపమును. కల రూపముతో నెఱుంగుటకు ఫలమును జెప్పి ముగించుచున్నాడు.

18. శ్లో. ఇతి క్షేత్రం తథా జ్ఞానం । జ్ఞేయం చోక్తం సమాసతః
మద్భక్త ఏతద్విజ్ఞాయ । మద్భావా యోపపద్యతే॥

అర్థము :- ఇతి = ఇట్లు, క్షేత్రం = క్షేత్రతత్త్వమును, తథా = అట్లే, జ్ఞానం = ఆత్మజ్ఞానసాధనమును, జ్ఞేయం చ = క్షేత్రజ్ఞయాథాత్మ్యమున్ను, సమాసతః = సంగ్రహముగా, ఉక్తం = చెప్పబడినది. మద్భక్తః = నా భక్తుడు, ఏతత్ = ఈచెప్పబడినదంతను, విజ్ఞాయ = తెలిసికొని, మద్భావాయ = నా స్వరూపమును పొందుటకు, ఉపపద్యతే = తగుచున్నాడు.

తా॥ ఈవిధముగ క్షేత్రతత్త్వమున్ను, జ్ఞానసాధనమైన అమానిత్వాది గుణసంపత్తి క్షేత్రజ్ఞతత్త్వమున్ను సంగ్రహముగా జెప్పబడెను. నాభక్తుడగు వాడు వీటిని యెఱింగెనేని నాస్వభావమును పొందనర్హుడగును.

అవ. ఇకమీదట మిక్కిలి విలక్షణస్వభావముగల ప్రకృత్యాత్మల సంబంధ మనాదియగుటను, అట్టి సంబంధముచే కలుగు కార్యభేదములను, ఆ సంబంధమునకు కారణమును జెప్పుచున్నాడు.

19. శ్లో. ప్రకృతిం పురుషం చైవ । విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ । విద్ధి ప్రకృతి సమ్భవాన్॥

అర్థము :- ప్రకృతిం = ప్రకృతిని. పురుషంచ ఏవ = ఆత్మనున్ను. ఉభౌ అపి = కలసియున్న రెంటింటినిన్ని. అనాదీ = అనాదిగా కలసినవిగా. విద్ధి = తెలుసుకొనుము. వికారాన్ చ = ఇచ్ఛాద్వేషాది వికారములనున్ను, గుణాన్ చ ఏవ = అమానిత్వాది గుణములనున్ను. ప్రకృతి సమ్భవాన్ = ప్రకృతివలన బుట్టినవిగా. విద్ధి = ఎఱుంగుము

తా॥ ప్రకృతి పురుషు లిద్దరున్ను అనాదిగా నొకరితో నొకరు కలిసియున్నారని తెలియుము. బంధహేతువులైన ఇచ్ఛాద్వేషాదులున్ను, మోక్షహేతువులైన అమానిత్వాది గుణములున్ను ప్రకృతివల్లనే పుట్టుచున్నవి.

అవ. ఇట్లన్యోన్యము కలసియున్న ప్రకృతి పురుషులయొక్క యీ కలయికచే జనించు వ్యాపారభేదముల నుగ్గడించుచున్నాడు.

20. శ్లో. కార్యకారణ కర్తృత్వే । హేతుః ప్రకృతి రుచ్యతే
పురుష స్సుఖదుఃఖానాం । భోక్తృత్వే హేతు రుచ్యతే॥

అర్థము :- కార్యకారణ కర్తృత్వే = శరీరము, ఇంద్రియములు తమతమ పనులు చేయుటయందు. ప్రకృతిః = పురుషాధిష్ఠితమైన ప్రకృతి. హేతుః = కారణముగా. ఉచ్యతే = చెప్పబడుచున్నది. పురుషః = ప్రకృతితో కలసియున్న జీవుడు. సుఖదుఃఖానాం = సుఖదుఃఖములయొక్క. భోక్తృత్వే = భోక్తయగుటయందు, హేతుః = కారణముగా, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ శరీరముగాని, దాని యింద్రియములుగాని చేయునట్టి పనులలో పురుషాధిష్ఠితమైన ప్రకృతియే కారణము. ప్రకృతితో కలిసిన జీవుడే సుఖదుఃఖానుభవమునకు కారణము.

అవ. పురుషుడు (జీవుడు) తనను తాననుభవించుటయే సుఖముగా కలవాడై యుండియును విషయములవలన కలుగు సుఖదుఃఖముల ననుభవించుటకు కారణమెట్లగుచున్నాడో తెలుపుచున్నాడు.

21. శ్లో. పురుషః ప్రకృతిస్థోహి । భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్॥

అర్థము :– పురుషః = జీవుడు, ప్రకృతిస్థః = ప్రకృతిపరిణామమైన దేహసంబంధము కలవాడగుచు, ప్రకృతిజాన్ = దానిసంబంధముచే బుట్టిన, గుణాన్ = సత్త్వాదిగుణములను, భుఙ్క్తేహి = అనుభవించుచున్నాడుగదా!

తా॥ తనను తాననుభవించుటయే సుఖముగాగల జీవుడు శరీరముతో తనకు సంబంధముండుటవలన పుట్టిన సత్త్వాదిగుణ కార్యములగు సుఖదుఃఖాదుల ననుభవించుచున్నాడు.

అవ. అయినచో నాతనికాశరీరముతో సంబంధ మెట్లుకలిగినది ?

21. శ్లో. కారణం గుణ సఙ్గోఽస్య । సదసద్యోని జన్మసు॥

అర్థము :– అస్య = ఈ జీవునకు, సదసద్యోనిజన్మసు = మంచి, చెడుజన్మలెత్తుటకు, కారణం = హేతువు, గుణసఙ్గః = సత్త్వాది గుణములయందలి ఆసక్తియే.

తా॥ జీవు డేశరీరముతో సంబంధించియుండునో ఆ శరీరప్రయుక్తమైన సత్త్వాదిగుణములవలన పుట్టినట్టి సుఖాదులయం దాతని కభిలాష జనించును. దానిచే నా సుఖాది సాధనములగు పుణ్యా పాప కర్మల నాచరించి వాటిఫలముల ననుభవించుటకు తగిన జన్మల నెత్తుచుండును. ఇట్లే తిరిగి యాజన్మయందును కర్మల నాచరించి తిరిగి పుట్టుచుండును. అమానిత్వాదిగుణములు పుట్టువరకిట్లే తిరుగుచుండును.

అవ. ఇట్లు మంచి చెడ్డజన్మల నెత్తిన పిమ్మట అతనికికలుగు స్వభావములను జెప్పుచున్నాడు.

22. శ్లో. ఉపద్రష్టానుమన్తా చ । భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో । దేహేఽస్మిన్ పురుషః పరః॥

అర్థము :– పరః = గొప్పవాడగు. పురుషః = జీవుడు. అస్మిన్ దేహే = ఈ దేహ విషయమున ఉపద్రష్టా = చూచువాడును. అనుమన్తా చ = అంగీకరించు వాడును. భర్తా = భరించువాడును. భోక్తా చ = సుఖదుఃఖముల ననుభ వించువాడును. మహేశ్వరః = యజమానియు. పరమాత్మా ఇతి చ = పరమాత్మయనియును. ఉక్తః = చెప్పఁబడెను.

తా॥ జీవుడీ శరీరములోనుండి కర్మానుగుణముగా సంకల్పించి శరీర మును నడిపించుచున్నాడు. అట్లే దీనిని నిలబెట్టుచున్నాడు. దాని నడవడికవలన కలిగెడు సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు. ఇట్లీ వ్యాపారములకు బాధ్యుడగుటచే నీ దేహము, ఇంద్రియ ములు, మనస్సులకును ప్రభువగుచున్నాడు. ఆత్మ యనగా దేహము మనస్సుకూడ యగుచున్నవిగాన వాటికంటె నీతడు గొప్పవాడగుటచే పరమాత్మయనియు చెప్పబడుచున్నాడు.

అవ. ఇట్టి దేహాత్మలయొక్క వివేకానుసంధానప్రకారమును చెప్పఁబూని దానియం దాదరము కలుగుటకై ఆయను సంధానమునకు ఫలమును ముందుగా జెప్పుచున్నాడు.

23. శ్లో. య ఏనం వేత్తి పురుషం । ప్రకృతిం చ గుణైస్సహ
సర్వథా వర్తమానోఽపి । న స భూయోఽభి జాయతే॥

అర్థము :– యః = ఎవడు ఏనం = ఇట్టి స్వభావముగల. పురుషం = జీవుని. ప్రకృతిం చ = ప్రకృతిని. గుణైః సహ = సత్త్వాదిగుణములతో. వేత్తి = వేరువేరుగా నిజస్వరూపములతో నెఱుంగుచున్నాడో. సః = వాడు. సర్వథా = ఏదేహమున ఏవిధముగా, వర్తమానః అపి = ఉన్నవాడైనను. భూయః = మఱల న అభిజాయతే = పుట్టడు.

తా॥ ప్రకృతి – పురుషుల నిరువురను, ఇంతవరకు చెప్పబడిన స్వభావ ములతో వేరువేరుగా నెవ్వడెఱుంగుచున్నాడో, సత్త్వాదిగుణ ములనిక మీఁద జెప్పబడు స్వభావము కలవాటినిగా నెఱుంగు చున్నాడో వాడేజన్మయందే కష్టములతో నున్నను ఆ దేహ మును విడిచినతోడనే శుద్ధాత్మ స్వరూపమును బడయును.

అవ. ఈ విషయమునే రెండు శ్లోకములచే వివరించుచు, నాత్మజ్ఞానమున కవస్థాభేదములను చెప్పుచున్నాడు.

24. శ్లో. ధ్యానేనా త్మని పశ్యన్తి । కేచిదాత్మాన మాత్మనా
అన్యే సాఙ్ఖ్యేన యోగేన । కర్మయోగేన చాపరే॥

అర్థము :— కేచిత్ = కొందఱు. ఆత్మని = శరీరమందున్న. ఆత్మానం = ఆత్మను. ధ్యానేన = ధ్యానయోగ సహకారముచేత ఆత్మనా = మనస్సుచేత పశ్యన్తి = చూచుచున్నారు. అన్యే = ఇతరులు. సాఙ్ఖ్యేన యోగేన = జ్ఞాన యోగముచేతను. అపరే = మరికొందరు. కర్మయోగేన చ = కర్మయోగముచేతను. పశ్యన్తి = తెలుసుకొనుచున్నారు.

తా॥ యోగ పరిపాకముగల కొందరు శరీరమునందున్న ఆత్మను మనస్సున ధ్యానయోగ సహకారముచే గాంచుచున్నారు. అట్టి పరిపాకము లేని యితరులు మనస్సును యోగమునకు తగునట్లు చేసుకొని జ్ఞానయోగముచే నాత్మను చూతురు. ఆ జ్ఞానయోగమునకున్ను తగనివారున్ను తగినను సుకరోపాయము నపేక్షించువారున్ను, శిష్టులున్ను నిష్కామ కర్మయోగముచే మనస్సును యోగార్హముగా జేసుకొని ఆత్మను దర్శింతురు.

అవ. కర్మయోగమున నారితేఱని ముముక్షువులయొక్క కర్మయోగ ప్రారంభా వస్థను దెలుపుచున్నాడు.

25. శ్లో. అన్యే త్వేవ మజానన్తః । శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే
తేఽపి చాతితర న్త్యేవ । మృత్యుం శ్రుతిపరాయణాః ॥

అర్థము :– అన్యేతు = కొందఱైతే. ఏవం = ఇట్లు. అజానన్తః = కర్మయోగమునైన నెఱుంగనివారై. అన్యేభ్యః = జ్ఞానులవలన. శ్రుత్వా = విని. ఉపాసతే = ఆత్మోపాసనమును జేయుచున్నారు. తే అపి = వారున్ను. శ్రుతిపరాయణాః చ = వినుటయందుమాత్రమే నిష్ఠకలవారున్ను. మృత్యుం = సంసారమును. అతితరన్తి ఏవ = తప్పక దాటుచున్నారు.

తా॥ కర్మయోగమునైనను ఎఱుంగని మరికొందఱు, తత్త్వవేత్తలనుండి తెలుసుకొని కర్మయోగాదులచే నాత్మ నుపాసించుచున్నారు. వారును ఆత్మను సాక్షాత్కరించి సంసారమును దాటుదురు. కేవలము వినుటయందు మాత్రము నిష్ఠకలవారున్ను ఆ శ్రవణము వలననే పాపములను పోగొట్టుకొని క్రమముగా కర్మయోగము నాచరించి సంసారము నతిక్రమించుచున్నారు.

అవ. ఇకముందు శరీరముతో కూడియున్న ఆత్మయొక్క వివేకము నను సంధించురీతిని చెప్పబోవుచున్నాడు. అందులకై చరాచరాత్మకమైన జంతువులన్నియు చేతనాచేతనములయొక్క సంబంధముచేతనే పుట్టినవని చెప్పుచున్నాడు.

26. శ్లో. యావ త్సఞ్జాయతేకిఞ్చి । త్స_త్త్వం స్థావరజఙ్గమమ్
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా । త్తద్విద్ధి భరతర్షభ! ॥

అర్థము :– భరతర్షభ = అర్జునా, స్థావరజఙ్గమం = స్థావరజంగమరూపమైన సత్త్వం = జంతువు. కిఞ్చిత్ = ఏదియైనను. యావత్ = ఎంతైనను సఞ్జాయతే = పుట్టుచున్నదో (తావత్ = అంతయు) తత్ = అది (ఆపుట్టుట) క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ = ప్రకృతి పురుషు లొకటితోనొకటి కలియుటవల్లనే (ఇతి = అని) విద్ధి = ఎఱుంగుము.

తా॥ అర్జునా! జంతువులు స్థావరములుగను జంగమములుగను బుట్టుట క్షేత్రక్షేత్రజ్ఞు లొకరితో నొకరు కలియుటచేతనే యగును. అవియే కలిసి యట్లు పుట్టుచున్నవని భావము.

అవ. ఆత్మలన్నియు సమానాకారముగలవి. దేహములన్నియు విషమాకారము గలవి. ఆత్మ నియమించునది. దేహము నియమింపబడునది. ఆత్మ నిత్యమైనది. దేహమనిత్యమైనది. ఇట్లు రెండింటికిని గల తారతమ్యమును జెప్పుచున్నాడు. ఈ యనుసంధానమే తత్త్వాధ్యవసాయ మనబడుననియు అదియే పరమపురుషార్థసాధనమనియు కొనియాడుచున్నాడు.

27. శ్లో. సమం సర్వేషు భూతేషు । తిష్ఠన్తం పరమేశ్వరమ్
వినశ్యత్స్వవినశ్యన్తం । యః పశ్యతి స పశ్యతి॥

అర్థము :— సర్వేషు = సమస్తమైన, భూతేషు = ప్రాణులయందు, పరమేశ్వరం = దేహేన్ద్రియ మనస్సులకు నియామకుడై, తిష్ఠన్తం = ఉన్నట్టి యాత్మను, సమం = జ్ఞాతృత్వమనబడు ఒకే ఆకారముకలవానినిగాను, వినశ్యత్సు = అవి నశించినను, అవినశ్యన్తం = నశింపనివానినిగాను, యః = ఎవడు, పశ్యతి = చూచుచున్నాడో, సః = వాడు, పశ్యతి = చూచుచున్నాడు.

తా॥ సకల ప్రాణులయందును నియామకుడైయున్న ఆత్మను, సమానాకారముకల దానినిగాను, అవి నశించినను నశించని దానినిగాను తెలుసుకొనువాడు ఆత్మను నిజరూపముతో నెఱుంగువాడే యగును. అట్లుగాక పైకి గాన్పించు ఆకార తారతమ్యము ఆత్మదే యనుకొనువాడు నిత్యసంసారి యగును.

అవ. ఈ సమదర్శనమునే సమర్థించుచు ఫలద్వారా ప్రశంసించుచున్నాడు.

28. శ్లో. సమం పశ్యన్ హి సర్వత్ర । సమవస్థిత మీశ్వరమ్
న హినస్త్యాత్మనాఽఽత్మానం । తతో యాతి పరాం గతిమ్॥

అర్థము :— సర్వత్ర = అంతటను సమవస్థితం = ఉన్నట్టి. ఈశ్వరం = నియామకుడైన ఆత్మను. సమం = సమానాకారము కలవానినిగా, పశ్యన్ = చూచుచున్నవాడు ఆత్మనా = మనస్సుచేత. ఆత్మానం = ఆత్మను. న హినస్తి = హింసింపడు తతః = అట్లెఱుంగుటవలన, పరాం = ఉత్తమమైన, గతిం = ఆత్మస్వరూపమును. యాతి = పొందుచున్నాడు.

తా॥ దేవాది శరీరములలో నియామకుడైయుండియు ఆ దేవాది వికారములు తనకంటకయుండు ఆత్మను అంతటను జ్ఞానాకారముతో నుండునని యెఱుంగువాడు తన మనస్సుచే తన యాత్మను సంసారమునుండి విముక్తునిగా జేయును వాడు యథావస్థితాత్మస్వరూపమును బొందుచున్నాడు. అట్లు కానిచో తన యాత్మను సంసార సాగరమున ద్రోయుచున్నాడని భావము.

అవ. సాక్షాత్తుగా క్రియల కాధారమైనది ప్రకృతియు. అట్లుకానిది ఆత్మయనియు వైధర్మ్యమును తెలుపుచున్నాడు.

29. శ్లో. ప్రకృత్యైవ చ కర్మాణి । క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాఽఽత్మాన । మకర్తారం స పశ్యతి॥

అర్థము :— కర్మాణి = కర్మలను, సర్వశః = అన్నివిధములుగ, ప్రకృత్యా ఏవ = ప్రకృతిచేతనే, క్రియమాణాని = చేయబడుచుండువానినిగాను, తథా = అట్లే, ఆత్మానం = ఆత్మను, అకర్తారం = కర్తకానివానినిగాను, యః = ఎవడు, పశ్యతి = చూచుచున్నాడో, సః = వాడు, పశ్యతి = ఆత్మను వాస్తవముగ నెఱుంగుచున్నాడు.

తా॥ దేహేంద్రియ రూపముగమారిన ప్రకృతిచేతనే సర్వకర్మలును చేయబడుచున్నవనియు, ఆత్మ కర్తకాడనియు, వానికి ప్రకృతి సంబంధమున్ను దాని నధిష్టించుటయు, దానిచేగలుగు సుఖదుఃఖానుభమున్ను కర్మచే గావింపబడినవనియు నెఱుంగువాడే ఆత్మను నిజరూపముతో నెఱుంగువాడు.

అవ. ఇప్పుడు పరిణమించునది దేహమనియు, పరిణామములేనిది ఆత్మ యనియు వైషమ్యమును జెప్పుచున్నాడు.

30. శ్లో. యదాభూత పృథగ్భావ । మేకస్థ మనుపశ్యతి
తత ఏవ చ విస్తారం । బ్రహ్మ సమ్పద్యతే తదా॥

అర్థము :– యదా = ఎప్పుడు, భూతపృథగ్భావం = ప్రాణులయొక్క వేరైయుండుట, ఏకస్థం = ఒకే ప్రకృతితత్వమునందున్నదానినిగా, అనుపశ్యతి = తెలిసికొనుచున్నాడో, తతః ఏవ = ఆ ప్రకృతివలననే, విస్తారం చ = పుత్ర పౌత్రాది విస్తారమునున్ను, (అను పశ్యతి = తెలిసికొనుచున్నాడో) తదా = అప్పుడు, బ్రహ్మ = శుద్ధాత్మస్వరూపమును, సమ్పద్యతే = పొందుచున్నాడు.

తా॥ దేవాది భూతములు ప్రకృతి పురుషుల కలయికచే పుట్టినవి. పైకి గాన్పించు వైషమ్యములు ప్రకృతికి సంబంధించినవిగాని ఆత్మకు చెందినవికావు. పుత్రపౌత్రాది విస్తారమున్ను ఆప్రకృతి వలననే కలుగుచున్నది. ఇట్లెఱుంగువాడు శుద్ధాత్మస్వరూపమును బడయుచున్నాడు.

అవ. నిత్యత్వము, అకర్తృత్వము, అపరిణామిత్వము మొదలగు ధర్మములచే నాత్మకు జెప్పబడిన వైలక్ష్యమును సహేతుకముగా సమర్థించుచున్నాడు.

31. శ్లో. అనాదిత్వా న్నిర్గుణత్వా । త్పరమాత్మాఽయ మవ్యయః
శరీరస్థోఽపి కౌన్తేయ । న కరోతి న లిప్యతే॥

అర్థము :– కౌన్తేయ ! = అర్జునా ! అయం = ఈ, పరమాత్మా = జీవుడు, శరీరస్థః అపి = శరీరమునందున్నవాడైనను, అనాదిత్వాత్ = ఆరంభములేనివాడు గావున, అవ్యయః = నాశములేనివాడు, నిర్గుణత్వాత్ = సత్త్వాదిగుణములు లేనివాడుగావున, న కరోతి = కర్మలను జేయువాడుకాడు, నలిప్యతే = దేహస్వభావములచే తగులువడడు.

తా॥ దేహముకంటె వేఱుగా నిజరూపముతో నిరూపింపబడిన ఆత్మ శరీరమునందున్నను ఆతనికాది లేదుగాన అంతమును లేదు. సత్త్వాదిగుణము లాతనికి లేవుగాన కర్మల నాతడు జేయడు. కావుననే దేహధర్మము లాతనికిలేవు.

అవ. నిర్గుణుడగుటచే కార్యములను జేయకపోయినను శరీరముతో నిత్య సంబంధముండుటచే వాని స్వభావములచే లిప్తుడుకాకుండుటకు దృష్టాంతమును జూపుచున్నాడు.

32. శ్లో. యథా సర్వగతం సౌక్ష్మ్యా । దాకాశం నోపలిప్యతే
సర్వత్రావస్థితో దేహే । తథాఽఽత్మా నోపలిప్యతే.

అర్థము :– యథా = ఎట్లు, ఆకాశం = ఆకాశము, సర్వగతం అపి = అంతటను వ్యాపించినదైనను, సౌక్ష్మ్యాత్ = సూక్ష్మమగుటవలన, న ఉపలిప్యతే = ఆయా వస్తుస్వభావములచే నంటబడదో, తథా = అట్లే, ఆత్మా = జీవాత్మ సర్వత్ర దేహే = అన్నిదేహములయందును, అవస్థితః అపి = ఉన్నవాడైనను, న ఉపలిప్యతే = ఆయా దేహస్వభావములచే నంటబడడు.

తా॥ ఆకాశ మన్నివస్తువులలో గలసియున్నను సూక్ష్మమగుటచే వాటి స్వభావములచే నంటబడనట్లు ఆత్మయు దేవాది దేహములయందున్నను అతి సూక్ష్మమగుటవలన ఆయా దేహస్వభావములచే నంటబడదు.

అవ. అధ్యాయారంభమున దేహము తెలియబడునదియు, ఆత్మ తెలియునదియు నగుటచేతను, దేహము భూతముల కలయికరూపమైనదగుటచే నానారూపమైనదియు గాన నా రెండింటికినిగల భేదము నిశ్చితమైనదియే యని దృష్టాంతమును జూపుచున్నాడు.

33. శ్లో. యథా ప్రకాశయ త్యేకః । కృత్స్నం లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం । ప్రకాశయతి భారత ॥

అర్థము :– హే భారత ! = ఓ యర్జునా ! యథా = ఏ ప్రకారముగా, ఏకః = ఒక్కడైన, రవిః = సూర్యుడు, కృత్స్నం = సమస్తమైన, ఇమం లోకం = ఈలోకమును, ప్రకాశయతి = ప్రకాశింపజేయుచున్నాడో, తథా = అట్లే క్షేత్రీ = ఆత్మ, క్షేత్రం = శరీరమును, కృత్స్నం = అంతటను, ప్రకాశయతి = ప్రకాశింపజేయుచున్నాడు.

తా॥ సూర్యు డొక్కడయ్యు తన కాంతిచే ప్రపంచమునంతను వెలుగొందించునట్లు జీవుడును శరీరమునంతను తన జ్ఞానముచే ప్రకాశింపజేయును – కావున శరీరముకంటె జీవుడు వేరని స్పష్టముగ దెలియుచున్నది.

అవ. ఈ యధ్యాయమునకు ప్రధానార్థమైన హేయ (త్యాజ్యములు) ఉపాదేయ (పరిగ్రాహ్యములు) ములయొక్కయు, వాటి యుపాయముల యొక్కయు విజ్ఞానమునకు ఫలమును జెప్పి ముగించుచున్నాడు.

34. శ్లో. క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ । మన్తరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతిమోక్షం చ । యే విదు ర్యాన్తి తే పరమ్॥

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగోనామ త్రయోదశోఽధ్యాయః

అర్థము :— ఏవం = ఇట్లు, జ్ఞానచక్షుషా = జ్ఞానమనెడి నేత్రముచేత, క్షేత్రక్షేత్రజ్ఞయోః = ప్రకృతి పురుషులయొక్క, అన్తరం = భేదమును, భూతప్రకృతిమోక్షం చ = భూతములుగా మారిన ప్రకృతియొక్క మోక్షోపాయమగు అమానిత్వాదికమును, యే = ఎవరు, విదుః = తెలిసికొని యాచరించుచున్నారో, తే = వారు, పరం = శుద్ధాత్మస్వరూపమును, యాన్తి = పొందుచున్నారు,

తా॥ ఇట్లు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క భేదమును, జీవునకు శరీర విమోచనోపాయమగు అమానిత్వాదిగుణ సంపత్తిని వివేకమనెడు నేత్రముతో జూచి ఆచరించువారు బంధురహితమైన శుద్ధాత్మను బడయుదురు.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన శ్రీభగవద్గీత యందలి క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగమనెడు పదమూడవ యధ్యాయము.

| | |
|---|---|
| ఈ యధ్యాయమందలి శ్లోకసంఖ్య | 34 |
| ఇప్పటికైన మొత్తము శ్లోకములు | 522 |



శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణే నమః

# గాయత్రీ క్రతువు

## ఉచితోపనయనములు - గాయత్రీ మహామంత్ర జపానుష్ఠానములు

## కార్యక్రమ పత్రిక

నల్లగొండ జిల్లా భువనగిరి తాలూకా యాదగిరి గుట్టపై శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి క్షేత్రమున స్వస్తిశ్రీ వికారినామ సంవత్సర ఫాల్గుణ శు. ౫ మీ బుధవారము (ది. 2-3-1960) నుండి వరుసగ పది దినములు "గాయత్రీ క్రతువు" శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి పర్యవేక్షణమున జరుగగలదు. 11-3-1960 తేదీని పూర్ణాహుతియు, ఆమర్నాడు అవభృథము జరుగును.

ఇందు గాయత్రీ మహామంత్రానుష్ఠానము, చతుర్వేదములు, అష్టాదశపురాణములు, నాలాయిరదివ్యప్రబంధములు, ఇతిహాసద్వయములు, శ్రీవిష్ణు సహస్రనామాది స్తోత్రముల పారాయణాదులున్ను, పంచాగ్ని కుండహవనము, తదనుగుణ తర్పణ-పుష్పాంజలి తదితరారాధనాదులు జరుగును.

మరియు

మొదటినాటినుండియును కూడ (ది. 2-3-1960) నుండియు కోరిన యోగ్యులగు వటువులకందరకును విధ్యుక్త విధానమున ఉచితముగ ఉపనయన సంస్కారములు జరుపబడును. సంధ్యావందనము నేర్పబడును.

మరియు అభిలషించు యోగ్యులగు వారందరకును (వయోనియమములేకుండగ) సంధ్యావందనము, గాయత్రీ మంత్రజపానుష్ఠానముల నేర్పి, యథాశక్తిగ గాయత్రీ మహామంత్ర జపానుష్ఠానములు చేసుకొనుటకు ప్రోత్సహింపబడును.

మరియు సుప్రసిద్ధ పండిత ప్రకాండులచే సంధ్యావందనము - గాయత్రీ మాహాత్మ్యము - సనాతన ధర్మము మున్నగు విషయములగూర్చి ఉపన్యాసములు జరుగును.

కావున భక్తులందరును యిందు పాల్గొని శ్రీయఃపతికటాక్షపాత్రులై యానందింతురు గాక.

ఈ క్రతువునకు యజ్ఞసంభారములు, హవనము, ఋత్విగ్దక్షిణ, ఇత్యాదులన్నిటికిని కలిపి రోజు 1 కి రూ 2500 మొదలు రూ 5000 వరకు ఖర్చు కాగలదు. ఈ విధముగ క్రతువు మొత్తమునకు రూ 25000 మొదలు 50000 వరకు ఖర్చు కావచ్చును. కనుక ఉదారులగు దాతలు తమ తమ ఉత్సాహానుసారముగ యథాశక్తి ఈ క్రతువునకు ధనదానముగను, బియ్యము వగైరా దానముగను, నేయి వగైరా వస్తుదానముగను సమర్పింపవచ్చును.

విరాళములు పంపవలసిన విలాసము :

శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి
దేవస్థాన ముంతజము
యాదగిరిపల్లె
భువనగిరి తాలూకా, నల్లగొండ జిల్లా

ఇట్లు,
శ్రీమన్నారాయణ రామానుజ జీయర్
పన్నాలాల్ పిత్తి, హైదరాబాదు
శిర్నాం సత్యనారాయణగుప్త, మేదక్, సికింద్రాబాదు
సేట్ రామదయాల్, భువనగిరి

---

సూచన: యాదగిరిగుట్టకు వచ్చుటకు బెజవాడ - హైదరాబాదు లైనులోగల రాయగిరి అను స్టేషను 3 మైళ్లలో గలదు. ఇచ్చట ప్యాసింజరుమాత్రమే ఆగును. మరియు దానిప్రక్క భువనగిరి స్టేషను 6 మైళ్లలో గలదు. ఇచ్చట మెయిలు ఎక్స్‌ప్రెస్సు అన్నియు ఆగును. రెండుస్టేషనుల వద్దను బండ్లు, రిక్షాలు, బస్సులు దొరకును. కాన ఈ స్టేషనులలో దిగి రావలసి యుండును. ఈ కార్యక్రమ పత్రికను మీ బంధు మిత్రులకు కూడ నందజేయుడు.

అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.



శ్రీ లక్ష్మీనృసింహ పరబ్రహ్మణే నమః

# బ్రహ్మతేజో బలం బలం

బ్రహ్మ తేజస్సు మాత్రమే బలమైనది. తదితరములైనవన్నియు, దీనిముందర నిహీనము లైయున్నవి.

బ్రహ్మ తేజస్సు లేక బ్రహ్మబలము అనగా గాయత్రీ మహామంత్రానుష్ఠాన విశేషమే.

జగత్తుయొక్క సృష్టి- స్థితి, సంహారాది శక్తి సమన్వితమైనది గాయత్రీ మంత్రమే.

సకల వేదసారభూతమై, సర్వులకు, భుక్తి ముక్తి విధాయకమైనది గాయత్రీ మంత్రమే.

వశిష్ఠ మహామునియొక్క ప్రతిభా ప్రభావముల కాధారభూతమైనది గాయత్రీ మంత్రమే.

విశ్వామిత్ర మహామునియొక్క ప్రతిభా ప్రభావముల కాధారభూతమైనది గాయత్రీ మంత్రమే.

సామాన్య మానవమాత్రునకు సంస్కారముద్వారా ద్విజత్వము కలిగించునది గాయత్రీ మంత్రమే.

సకలదోష ప్రాయశ్చిత్తాత్మకమై, సకల శ్రేయః ప్రాపకమై, పరమపావనమైనది గాయత్రీ మంత్రమే.

అట్టి మహామంత్ర విశేషానుష్ఠానాత్మకమైనదీ యపూర్వ యజ్ఞవిశేషమగు గాయత్రీక్రతువు. దీనిని దర్శించుటయు, ఇందు పాల్గొనుటయు ఇందు నిమిత్తమై సేవనొనర్చుటయు, మహాభాగ్య విశేషము. అత్యంతాదృష్ట విశేషము.

కాన, మీకీ పత్రికను మీగ్రామ పరిసరములోని భక్తులకందరకును అందజేసియు, ఈ విషయములను మీ బంధు మిత్రులకును పరిసర ప్రజలకును తెలియజేసియు, మీకు ఉచితమని తోచిన కైంకర్యములను చేయగోరుచున్నాము.

ఈ యజ్ఞమందలి అన్నశాంతికై యింకను కనీసము 100 బస్తాల బియ్యమున్ను, అందులకు వలయు తదితర తదీయారాధన, పప్పులు, చింతపండు, మిర్చి వగైరా సామగ్రిలున్ను, మరియు కనీసము 100 డబ్బాల నెయ్యియు కావలసియున్నవి. వీనిలో మీకు తోచిన వస్తుసామగ్రినిగాని, లేక ధనమునుగాని, ఇందులకై సమర్పించినచో సంతోషముతో స్వీకరించి ఈ యజ్ఞకార్యమందు వినియోగింపగలము.

శ్రీ గీతా పవర్ ప్రెస్, ముకరంజాహీరోడ్, వరంగల్.

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 194 | సుపర్ణః | ...శోభన పర్ణత్వాత్<br>సుపర్ణ ఇతి కథ్యతే।<br>సంసారపార నయనాత్<br>సుపర్ణ ఇతి వా, మతః। | లేక<br>సంసార సాగరమునుండి దరిజేర్చువాడు. |
| 195 | భుజగోత్తమః | (ప్రాదుర్భావేషు ప్రథమః<br>పద్మనాభోఽథ ఉచ్యతే।)<br>భుజగస్యోత్తమ శ్శేషీ<br>భుజగోత్తమ ఉచ్యతే | ఆదిశేషునకు కూడ ఉత్తమమైన నాథుడగు (శేషి యగు) వాడు |
| 196 | హిరణ్యనాభః | హిరణ్య నాభ స్సౌన్దర్య<br>నాభిర్యస్యేతి సంస్మృతః। | సుందరమైన బొడ్డు గలవాడు. |
| 197 | సుతపాః | తపోబుద్ధి స్సైవ తనుః।<br>సుతపాయస్య సంస్మృతః | తపస్సనగా జ్ఞానమే. దానినేతనకు శరీరముగా కలవాడు. |
| 198 | పద్మనాభః | పార్థివం భూరి పద్మన్తు।<br>నాభావష్టదళం మహత్<br>యస్య హేమమయి దివ్యా<br>కర్ణికా మేరు రుచ్యతే।<br>యస్యనాభౌ తదుత్పత్తిః<br>పద్మనాభ స్స ఉచ్యతే | బంగారువికారమైన దివ్యమగు మేరుపర్వతము దుద్దగా కలిగి, ఎనిమిది దళములతో నలరారును గొప్పదైన పృథివీసంబంధముగల తామరపుష్పము నాభియందు కలవాడు |
| 199 | ప్రజాపతిః | నైమిత్తికే తు యే సృష్టాః<br>ప్రజా బ్రహ్మముఖా స్సదా<br>తేషాం చైవ పతి స్స్వామీ।<br>ప్రజాపతి రిహోచ్యతే। | నైమిత్తికసృష్టియందు సృష్టింపబడిన బ్రహ్మ మొదలగు ప్రజలకు ప్రభువైనవాడు, |
| 200 | అమృత్యుః | మృత్యో ర్విరోధి రూపో యో<br>మృత్యు మృత్యు స్వరూపతః।<br>అమృత్యురితి తం ప్రాహుః।<br>సర్వార్ణో మృత్యునాశకః | మృత్యువునకు విరోధియగుటచే తనభక్తులకు మృత్యువు లేకుండ జేయువాడు పుట్టినగాని గిట్టుట! దీనిని ఓమ్ అమృత్యవే నమః అని మంత్రము గానాదరించినచో మృత్యువును లేకుండునట్లు చేయును. |

—♦ ద్వితీయ శతకం సమాప్తమ్ ♦—

శ్లో॥ నిరాసకస్యాపి న తావదుత్సహే మహేశ హాతుం తవ పాదపంకజం
రుషా నిరస్తోపి శిశు స్తనంధయో న జాతు మాతు శ్చరణౌ జిహాసతి॥

తల్లి కోపముతో తన చంటిబిడ్డను కసిరి దూరముగా త్రోసివేసినను ఆబిడ్డ గుడగుడ పాకి వచ్చి తల్లిపాదములు పట్టుకొనును గాని విడువగోరునా? అట్లే నీవునాపాపములవల్ల కోపముతో నన్ను నానాయోనులతో త్రోసివైచినను నేను నీపాదపద్మముల నెన్నడు విడువనుసుమా,

శ్లో॥ తవా మృతస్యందిని పాదపంకజే నివేశితాత్మా కథ మన్యదిచ్ఛతి
స్థితే ఽరవిందే మకరందనిర్భరే మధువ్రతో నేక్షురకం హి వీక్షతే॥

అమృతరస నిష్యందియగు నీపాదపద్మములను మరిగిన నా మనస్సు వేరొకపదార్థము నేల యాసించును? తేనెతో నిండిన తామరపువ్వునుమరిగిన తేనెటీగ ముళ్ళగోరింటపువ్వునాశించునా? యని స్తుతించిరి ఇట్లు మహానుభావులకు గల తనపాద ప్రావణ్యము నారసి సర్వేశ్వరునకొక సంశయము పొడమెను.

శ్లో॥ విహాయ పీయూషరసం మునీశ్వరాః మమాంఘ్రిరాజీవరసం పిబంతి కిమ్
ఇతి స్వపాదాంబుజపానకౌతుకీ స గోపబాల శ్శ్రియ మాతనోతు వః॥

మునీశ్వరు లందరును పీయూషరసాభిలాషతో జ్యోతిష్టోమాదులను చేయక నా పాదారవింద మకరందాభిలాషతో తపస్సులతో కాలమును పుచ్చుటేమి? అని యాలోచించి అంతకుమించిన రుచి యేదో నాపాదమునందుండ నోపునని,

శ్లో॥ కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతమ్
వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకుందం మనసా స్మరామి॥

ఎవ్వరును చూడకుండ జగత్తుల నన్నిటిని తనపొట్టనిడుకొని లేతనైన మఱ్ఱియాకు నడ్డము పెట్టుకొని తనచేతులతో పాదాంబుజమును నోటనిడుకొని పరిశీలించుచున్నాడు.

కావున ఆనందమునకు ఫలమేమని యడిగినటుల నిదియే ఫలమగుచుండ దీనికి వేరేమి ఫల ముండును?

ఆహా! ఏమి ఈ పాదమహిమ. భిక్షావృత్తితో జీవించు ఉత్తమభక్తుని విశ్వాసమును గాంచుడు.

శ్లో॥ కా చింతా మమ జీవనే యది హరిర్విశ్వంభరో గీయతే
నోచే దర్భకజీవనాయ జననీ స్తన్యం కథం నిస్సరేత్
ఇత్యాలోచ్య ముహు ర్ముహు ర్యదుపతే! లక్ష్మీపతే! కేవలం
త్వత్పాదాంబుజసేవనేన సతతం కాలో మయా నీయతే॥

శ్రీ ప్రసంగమే యెట్లనగా యీ భక్తుడొకయింటికి భిక్షకేగి పదునెనిమిదేండ్ల బాలిక భిక్షనిడ రాగా చీరాంతర్గతమగు ఎత్తైన ఉరోజములను, పైన పమిటకప్పును జూచి అమ్మాయీ! వ్రణములకిట్లు కట్టుకొని యెట్లు బాధపడుచున్నావు? అని యడుగగా నాయిల్లాలీతని యమాయకత్వమున కచ్చెరువొంది 'అన్నా! అవి భావి నా సంతానోజ్జననకై సర్వేశుడేర్పాటొనర్చిన పాల గుండీలు అసమయమునకవి యీబిడ్డ బ్రతుకులకు సరిపడు పాలను తమంతనే స్రవించునని చెప్పగా విని యాతడు తిన్నగ నొక యాలయమూలభాగమున కూర్చొని "ఆహా! నేనెంత తెలివిలేనివాడను. విశ్వంభరుడగు సర్వేశ్వరుడెప్పుడో పుట్టబోవు బిడ్డకే జీవనోపాధి నిప్పటినుండికల్పించి పోషించుచుండ నేను నాజీవనముకొరకింత పాటుబడనేల? తండ్రీ! నేనింక భిక్షాటనము జేయను నీపాదారవింద సేవతో నా జీవనమును గడపుము"నని యానాటినుండి భిక్షావృత్తినిమాని భగవత్పాదసేవ జేయుచు భగవంతుడయాచితముగ నర్చకులచే నిప్పించు కబళముల భుజించుచు కొలదిరోజులలో పరమపదము నలంకరించెను.

## —: అర్చనము :—

### భగవంతుని భక్తితో పూజించుట

ఇయ్యది బాహ్యము, అభ్యంతరము అని రెండువిధములు అందు బాహ్యము - విగ్రహారాధనము వైశ్వరూప్యారాధనమని రెండువిధములు.

ఈ రెంటింటిలో విగ్రహారాధనము గురించి విపులముగా నిదివరకొకవ్యాసమున విమర్శించి యుంటిమి. ఇదియే భగవద్గీతలో భగవానుడుపదేశించిన ముఖ్యవిషయము. ఇదియే ఆళ్వారాదు లవలంబించిన రాజమార్గము ఇదియే పూర్వాచార్యు లుపదేశించిన ముక్తి ఘంటాపథము దీనికి శ్రుతిస్మృతి ఆగమ పురాణేతిహాస శిష్టాచార ప్రమాణములు పరస్సహస్రములు కలవు. వాటినన్నిటి నావ్యాసములో యథావకాశము ప్రకటించియుంటిమి

ఈ యారాధన పరిపూర్ణ శేషవృత్తి అనగా పూర్ణకైంకర్యమని పెద్దలు వివరించిరి

ఇది ఔపచారికము, సాంస్పర్శికము. అభ్యవహారికము. సాందృష్టికము నను ప్రధానాంగములతో గావింపదగియుండును ఔపచారికములనగా— భగవన్మూర్తిని స్పృశింపకయే కొలది దూరమునుండి గావింపబడు కర్పూర నీరాజనము, వింజామర విసురుట, మొదలగునవి.

వీటివలనను భగవంతుడెంతయో ప్రసన్నుడగును. శ్రీ తిరుకచ్చినంబిగారు గావించినది వింజామర కైంకర్యమేకదా? జగదాచార్యులగు భగవద్రామానుజులు కూడ వర్ణవ్యత్యాసము నారయకయే వీరికి శిష్యులుగావలెననియు, వీరి శ్రీపాదతీర్థ తళియప్రసాదముల నుపయోగింపవలె ననియు, వాంఛించిరికదా! వేయేల శ్రియఃపతినడిగి తెలుసుకొనమని ప్రార్థించి తమ సంశయములను తీర్చుకొన్నది వీరిమూలముననేకదా! భగవద్రామానుజులకు-

(1) జగత్కారణమైన పరతత్వ మెయ్యది ?

(2) జీవేశ్వరులకు భేదమా? అభేదమా?

(3) సకలమానవ సాధారణమైన మోక్షోపాయమేది?

(4) ప్రపన్నుల కంతిమస్మృతి యుండవలెనను నిర్బంధముగలదా?

(5) ప్రపన్నులకు ప్రారబ్ధ మంతరాయమా? లేక ఆ శరీరావసానముననే మోక్షము లభించునా?

(6) తాము పంచసంస్కారముల నెవరినుండి బడయవలెను? అనేక ఆగుసం దేహములుండగ వాటి నెవ్వరివలన పరిహరించుకొందుమా యని యాలోచించు చుండగ శ్రీ తిరుక్కచ్చినంబి గారితో శ్రీ కంచి వరదరాజస్వామి స్వయముగ ప్రేమతో మాటలాడుదురని విని వారి ననువర్తించి శ్రియఃపతిమూలమున నీశంకలను దీర్చుమని ప్రార్థింపగా వారు చామర కైంకర్యమును చేయుచు శ్రీ వరదరాజస్వామి ప్రసన్నముఖులై సేవసాయింప నీప్రశ్నల నతివినయముతో విన్నవించిరి. అంత నా భగవానుడు స్పష్టవాక్కులతో —

శ్లో॥ అహ మేవ పరంబ్రహ్మ జగత్కారణకారణమ్
క్షేత్రజ్ఞేశ్వరయో ర్భేదః సిద్ధ ఏవ మహామతే॥
మోక్షోపాయో న్యాస ఏవ జనానాం ముక్తి మిచ్ఛతాం
మద్భక్తానాం జనానాం చ నాన్తిమస్మృతి రిష్యతే
దేహావసానే భక్తానాం దదామి పరమం పదం
పూర్ణాచార్యం మహాత్మానం సమాశ్రయ గుణాశ్రయం
ఇతి రామానుజాార్యాయ మయోక్తం వద సత్వరం॥

(1) జగత్కారణ భూతమైన పరతత్వమగు పరాత్పరుడను నేనే.

(2) జీవేశ్వరులకు భేదమే యదార్థము. ఇది శాస్త్రసిద్ధము

(3) ముముక్షువు లందరకు ప్రపత్తియే (శరణాగతియే) స్వరూపానుగుణమైన సాధారణ ముఖ్యసాధనము.

(4) అంతిమస్మృతి మిక్కిలి ప్రబలమైనదః నేను గీతలో విధించినను అయ్యది ఉపాయభక్తి పరులకేగాని ప్రపన్నుల కవసరములేను

భక్తిశబ్దము సాధ్యభక్తి పరము. సాధ్యభక్తి యనగా ప్రపత్తి, ఉపాయభక్తి యనగా సాధన. సప్తకముచే సిద్ధించుభక్తి ఈవిషయము —

శ్లో॥ ఉపాయభక్తిః ప్రారబ్ధవ్యతిరిక్తాఘనాశినీ॥
సాధ్యభక్తి స్తుసాహన్త్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ॥

సాధనభక్తి ప్రారబ్ధముకంటె వేరైన సంచిత ఆగామి పుణ్యపాపముల నశింపజేసియు, నంటకుండజేసియు, నుపకరించును. సాధ్యభక్తి (ప్రపత్తి) యన్నచో ప్రారబ్ధమునుకూడ నశింపజేయును అని శ్లోకమున స్పష్టపరచబడెను.

శ్రీమతే రామానుజాయ నమః



# అనుష్ఠాన విశేషములు

[ గతసంచిక తరువాయి ]

పరిశుద్ధ ఆహారస్వీకారముచే సత్త్వగుణము పరిశుద్ధతజెందుననియు, పరిశుద్ధ సత్త్వగుణముచే నిశ్చలమైన స్మరణ అనగా భక్తి కలుగుననియు తెలుపబడినది.

కేవల సాత్త్వికాహార స్వీకారమాత్ర నియమము లేకుండగ స్వేచ్ఛావిహారియై రాజస, తామసాహారియై యుండువాడు, తదితరమైన యెన్ని మంచిగుణములున్నను అట్టివాడు భక్తుడు కాజాలడు డాంబికాచారపరుడై మాత్రమే యుండును. అట్టివాడు తాను భ్రష్టుడగుట మాత్రమే గాకుండగ లోకభ్రష్టుడుకూడ నగుచున్నాడు.

భక్తునకు ఆహారవిషయమున యింత కఠిననియమము మేలయనిచో:—

భ. గీ. 3-14, "అన్నాత్ భవన్తి భూతాని"

(జీవునితో కూడియున్న శరీరములు అన్నమువలన కలుగుచున్నవి)

ఆనం:- "అన్నాద్వై ప్రజాః ప్రజాయంతే, యాః కాశ్చ పృథివీగ్ శ్రితాః. అథో అన్నేనైవ జీవంతి, అథైనదపి యంత్యంతతః అన్నగ్ హి భూతానాం జ్యేష్ఠం తస్మాత్ సర్వౌషధ ముచ్యతే. సర్వం వై తేఽన్నమాప్నువంతి యేఽన్నం బ్రహ్మోపాసతే, అన్నగ్ హి భూతానాం జ్యేష్ఠం, తస్మాత్ సర్వౌషధ ముచ్యతే।
అన్నాద్భూతాని జాయంతే, జాతాన్యన్నేన వర్ధన్తే। అద్యతేఽత్తి చ భూతాని, తస్మాదన్నం తదుచ్యతి ఇతి.

భృగు:- "అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, అన్నేన జాతాని జీవంతి, అన్నం ప్రయత్యభిసంవిశంతీతి" అని శరీరమునకు ఆహారమునకు గల సంబంధము పలుతావులందు తెలుపబడియున్నది మరియును ఛాందోగ్య 6 ప-: 5 ఖ మందిట్లు తెలుపబడినది—

"అన్న మశితం త్రేధా విధీయతే, తస్య యః స్థవిష్ఠో ధాతు
స్తత్పురీషం భవతి, యో మధ్యమ స్తన్మాగ్ంసం యోఽణిష్ఠ స్తన్మనః।
ఆపః పీతా స్త్రేధా విధీయన్తే తాసాం యః స్థవిష్ఠో ధాతు
స్తన్మూత్రం భవతి, యో మధ్యమ స్తల్లోహితం యోఽణిష్ఠ స్సప్రాణః।
తేజోఽశితం త్రేధా విధీయతే, తస్య యః స్థవిష్ఠో ధాతు స్తదస్థి
భవతి, యో మధ్యమ స్స మజ్జా యోఽణిష్ఠః సా వాక్,
అన్నమయగ్ హి సోమ్య మన ఆపోమయః ప్రాణస్తేజోమయీ వాగ్,

మనము తినిన అన్నము (ఘనపదార్థము) శరీరములో స్థూల - మధ్యమ - సూక్ష్మరూపమున మూడువిధములుగ విభజింపబడుచున్నది. అందలి స్థూలధాతువు మలరూపమును చెందుచున్నది. మధ్యమధాతువు మాంసరూపమును జెందుచున్నది. సూక్ష్మధాతువు మనస్సున కాప్యాయక మగుచున్నది. మనము త్రాగిన నీరు (ద్రవపదార్థము) శరీరములో స్థూల - మధ్యమ - సూక్ష్మరూపమున మూడువిధములుగ విభజింపబడుచున్నది. అందలి స్థూలధాతువు మూత్రరూపమును చెందుచున్నది. మధ్యమధాతువు రక్తరూపమును జెందుచున్నది. సూక్ష్మధాతువు ప్రాణమునకు కాప్యాయక మగుచున్నది. మనము అనుభవించిన తేజః పదార్థములు శరీరములో స్థూల - మధ్యమ - సూక్ష్మరూప

మున మూడు విధములుగ విభజింపబడుచున్నది. అందలి స్థూలధాతువు ఎముకల రూపమును నెందుచున్నగి మధ్యమ ధాతువు మజ్జరూపమును జెందుచున్నది – సూక్ష్మధాతువు వాక్కునకు కారణమగుచున్నది

గావున మనస్సు అన్నమయమైనది. ప్రాణము జలమయమైనది. వాగ్ తేజోమయమైనది

కావున మన శరీరేంద్రియము లన్నియును మనము తిను, త్రాగు పాంచభౌతిక పదార్థముల యొక్క గుణముల ననుసరించియే యుండును.

"మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః"

(సంసారబంధమునందు చిక్కుపడియుండుటకును, లేక తద్బంధవిముక్తిని జెందుటకును మనస్సుమాత్రమే కారణము.) కాబట్టి రాజస – తామసాహారములను విడిచి కేవల సాత్త్వికమైన ఆహారమును స్వీకరించువాని మనస్సును ఇతర ఇంద్రియములును, దేహమును సాత్త్వికమై మోక్షప్రాప్తికి సాధనములు కాగలుగును. అటులగాక రాజస తామసాహారములను గ్రోలుచు, తదితర వేషభాషలు – గుణములు – ప్రవర్తనలు సరియైనవాటిని ఎన్ని కలిగియున్నను అవి ప్రయోజనకారి కాజాలవు. ఆహారము సాత్త్వికమైనదై యున్నచో తదితర వేష – భాష – గుణ – ప్రవర్తన లన్నియును కూడ క్రమముగ కొంతకాలమునకైనను కూడ అవంలటి అవియే తప్పక రాగలవు.

శ్రీకృష్ణపరమాత్మ భ. గీ. 7. 8, 9, 10 శ్లోకములలో సాత్త్విక – రాజస – తామసాహారముల గురించి స్థూలముగ యిటుల తెలిపియున్నాడు.

శ్లో॥ ఆయుస్సత్త్వ బలారోగ్య – సుఖప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధా స్థిరా హృద్యా, ఆహారా సాత్త్వికప్రియాః ॥

ఆయుర్వివర్ధనకారులును, బలారోగ్యవృద్ధికారులును, సుఖప్రీతి వృద్ధికారులును, మధురరసోపేతములును, చమురుతో కూడుకున్నవియును, స్థిరపరిణామము గలవియును, రమణీయ విశేషములును అయిన పదార్థములు సాత్త్వికములై సాత్త్వికులైనవారికి ప్రియములై యుండును

శ్లో॥ కట్వామ్లలవణాత్యుష్ణ – తీక్ష్ణరూక్ష విదాహినః ।
ఆహారా రాజసస్యేష్టా, దుఃఖశోకామయప్రదాః ॥

చేదు – పులుపు రసములు కలిగినట్టియు, అధిక ఉప్పైనట్టియు, అత్యుష్ణత కలిగినట్టియు, కారమైనట్టియు శోషకరమైనట్టియు, అధికదాహమును – తాపమును కలిగించునట్టియును, శరీరమునకు కష్టమును, మనస్సునకు వ్యాకులతను, దేహమునకు రోగమును కలుగజేయునట్టియు పదార్థములు రాజసములై రాజసులైనవారికి ప్రియములై యుండును.

శ్లో॥ యాతయామం గతరసం, పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥

వండినతరువాత నొకరాత్రి గడచినట్టియు (అనగా వండిచాలాసేపయినదియు) స్వాభావికమైన రుచి పోయి నట్టియు, దుర్గంధము కలిగినట్టియు, ప్రాతదగుటచే మరియొకరుచిని పొందినట్టియు, (అనగా పాసిపోయినదియు) గురువులు భర్త మున్నగువారికంటె నితరులు భుజింపగా మిగిలినట్టియు, భగవన్నివేదితము కానట్టియు, పదార్థములు తమోమయములై తామసులైనవారికి ప్రియములై యుండును.

గావున హితైషులైనవారు సత్త్వవృద్ధికై సాత్త్వికాహారములనే సేవించుచుండవలయును.



# వార్తామాల

## పదునెనిమిదవ వార్త

1) భగవంతుని స్వరూపమెట్టిది ?
అందలి యాథాత్మ్యమెట్టిది?
2) జీవుని స్వరూపమెట్టిది?
అందలి యాథాత్మ్యమెట్టిది?
3) జీవునిచే కోరబడదగిన పురుషార్థ స్వరూపమెట్టిది ?
అందలి యాథాత్మ్యమెట్టిది?
4) ఇట్టు ఫలమును పొందకుండగ నాటంకపరచు విరోధియొక్క స్వరూపమెట్టిది ? అందలి యాథాత్మ్య మెట్టిది ?
5) ఇట్టి ఫలమును పొందుటకు ఉపాయమైనదాని స్వరూపమెట్టిది ? అందలి యాథాత్మ్యమెట్టిది ?

—: సమాధానములు :—

1) భగవంతుని స్వరూప మెట్టిదనగా చేతనాచేతనాత్మకములగు ఉభయ విభూతులకును తానొక్కడే నిరుపాధిక సర్వనియామకుడుగ నుండుట యనెడి నియంతృత్వమే ఆయన స్వరూపము. అట్టి సర్వనియంతయే యైనప్పటికిని కూడ "అతు నమతు విధితకై అనునటులను "అర్చక పరాధీనాఖిలాత్మ స్థితిః" అనునటులను తన యాశ్రితులకు అత్యంత పరతంత్రుడై యుండి వారిని సంతోషపెట్టుచు రక్షించుచుండుటయే భగవత్స్వరూప మందలి యాథాత్మ్యము.

2) జీవుని స్వరూప మెట్టిది యనగా:- ప్రకృతికంటెను భిన్నమైనదై యుండుటయును, జ్ఞానమును, ఆనందమును సామాన్యస్వరూపము గలదై యుండుటయును, నిత్యమైనదై యుండుటయును, ఎల్లప్పుడును ఒకే రూపమైనదై యుండుటయును, జ్ఞానమును గుణముగా గలిగినదై యుండుటయును, సర్వేశ్వరుని కొక్కనికిమాత్రమే శేషభూతమైనదై యుండుటయును, తదితరులెవరికినికూడ శేషభూతము కాదగనిదై యుండుటయును, తనను తాను స్వయముగ రక్షించుకొన జాలని పరతంత్రమైనదై యుండుటయును జీవుని స్వరూపము.

ఇచ్చట భగవంతుడనగా భగవంతుని కుటుంబమని యర్థము. అనగా పురుషకార భూతురాలగు శ్రీదేవియు, పురుషకార భూతులును ఘటకులును, ఉపదేశకులై దిద్దుబాటొర్చిన భగవత్పుత్రులగు భాగవతోత్తములు, స్వాచార్యులు అని అర్థము. అనగా "అరుళ్ పెరువారడియార్ తమ్మడియనేఱ్కు" అనియు, "మెయ్ మ్మైయె మిక వుణర్న్దు" అనియు సాయించినటుల

శ్రీ. శ్రియఃపతి భాగవతాచార్య పర్యంతము తాను అనన్యార్హ శేషభూతుడై యుండుటయే జీవునియొక్క స్వరూపమందలి యాథాత్మ్యము

3) జీవునిచే కోరబడదగిన పురుషార్థ స్వరూప మెట్టిదనగా భగవంతుని యొక్క దివ్య మంగళ విగ్రహమును, కల్యాణగుణములను అనుభవించుటచే కలిగినట్టి యానందము వలన ప్రీతి ప్రేరితుడై ప్రేమచే ఆయనకు జేయునట్టి కైంకర్యమే పురుషార్థ స్వరూపము

"ప్రహర్షయిష్యామి ఎపుడు సంతోషప పరతువా" అని ఆళ్వందారుస్తోత్రమున సాయించిన టుల ఈ కైంకర్యమును అంగీకరించునట్టి శేషియగు సర్వేశ్వరుని మనస్సునందు కలుగునట్టి సంతోషాతిశయము ఈ పురుషార్థమందలి యాథాత్మ్యము అనగా తన తృప్తికొరకైగాక భగవంతుని తృప్తికై ఆయన సంకల్పాను సారముగ కైంకర్యమొనర్చుటయని తాత్పర్యము.

4) పురుషార్థమును పొందకుండగ నాటంకపరచు విరోధియొక్క స్వరూపమెట్టిది యనగా దేహముకంటె ఆత్మ భిన్నమైనదను విశ్వాసము లేకుండగ దేహమే యాత్మ యను అహంకార భావనయను, దేహమునకు సంబంధించిన పదార్థములయెడల అవి 'నావి' యను ( మమకారరూప ) తలంపును, దేహము కంటెను భిన్నమైన యాత్మవిషయ అది స్వతంత్రమైనదను తలంపును విరోధియొక్క స్వరూపము తనయొక్క స్వరూపానుగుణముగ జేయునట్టి కైంకర్య విషయమున అహంకార మమకారములను కలిగి యుండుటయె విరోధి స్వరూపమందలి యథాత్మ్యము.

5) ఇట్టి విరోధి తొలిగిపోవుటకును, పురుషార్థము సిద్ధించుటకును ఉపాయమెట్టిది యనగా సిద్ధస్వరూపుడును సౌలభ్యాది సమస్త కల్యాణగుణ పరిపూర్ణుడు నగు సర్వేశ్వరుని శ్రీపాదములే ఉపాయ స్వరూపము,

సర్వేశ్వరుడు శరణాగతుడైన ఈజీవుని కటాక్షించుటయందు ఈ జీవునియందు ఏ ఒక్క గుణమును కూడ అపేక్షించడనునట్టి సహకారినైరపేక్ష్యము ఉపాయస్వరూపమందలి యాథాత్మ్యము.

—: 19 పందొమ్మిదవ వార్త :—

అర్థపంచక జ్ఞానముగలవారే అయినను తదనుగుణమగు నిష్ఠ అనుష్ఠానమును కొంతమంది కలిగియుండజాలక పోవుటకు కారణము ఏమిఅని యడుగగా నంబిళ్ళగారిట్టుల సమాధానమును సాయించి యున్నారు సర్వేశ్వరుని ఆయన యొక్క కల్యాణగుణములను తెలుసుకొని యున్నప్పటికిని కూడ శబ్దాది విషయములయందు గల ప్రీతిగనుక నశించినచో, గట్టున వకకాలు పడవపై నొకకాలు యుంచినవాడు పడవలో సుఖ ప్రయాణ మొనర్చి యావలిగట్టును చేరజాల నటులనే, సర్వేశ్వరుని గుణానుభవమును తదనుగుణానుష్ఠానమును పొందజాలడు

'నాది' యనెడు మమత కలవాడు సర్వేశ్వరుని కైంకర్యరూపమైన సాహ్యమును పొందజాలడు

తాను కర్తయను తలంపుగలవాడు సర్వేశ్వరుని సాధనముగ యనుభవింపజాలడు.

ఇట్టి ఈ మూడు విరోధులకును మూలకారణము అహంకారము, భగవత్కైంకర్యమునకు విరోధి తన స్వాతంత్ర్యము భగవద్గుణముల విషయమున ప్రీతి కలగకుండ జేయు విరోధి శబ్దాది విషయములయందాసక్తి సర్వేశ్వరుని ప్రాప్యముగ నాశ్రయింపకుండగ ఆటంకపరచు విరోధి దేవతాంతరములు పరతత్త్వమనుకొను భ్రాంతి.

భగవంతునియొక్క శరణాగతిని జేయకుండగ నడ్డుకొను విరోధి తదితరోపాయముల నవలంబించుట జీవునికి స్వరూపోజ్జీవనము గలగకుండగ నాటంకపరచు విరోధి. భాగవతోత్తముల విషయమున జరిపిన యపచారములు.

భగవత్కైంకర్యరూప పురుషార్థము లభింపకుండగ జేయువిరోధి విషయప్రావణ్యము.

ఇట్టి విరోధులు పూర్తిగ నశించిననే గాని అర్థపంచక జ్ఞానానుకూలనిష్ట అనుష్టానములు సిద్ధింపజాలవు.

## ఇరువదవవార్త

ప్రపన్నుడైనవాడు మొదట నడుచుకొనవలసిన పద్ధతి ఎట్టిదని శ్రీరామానుజులవారు అడుగగా తిరుకొట్టియూర్ నంబిగారిట్లు సాయించిరి.

"ప్రపన్నుడు ముందు ముఖ్యముగ ఆరురకములుగనుండు విరోధులను నశింపజేసుకొనవలయును, ఆవిరోధు లేవియనగా

1 ఆశ్రయణ విరోధి
2. శ్రవణ విరోధి
3. అనుభవ విరోధి
4 స్వరూప విరోధి
5. పరత్వ విరోధి
6. ప్రాప్తి విరోధి యనునవి.

1) ఆశ్రయణవిరోధియనగా:- నేనే కర్తననుకొను యహంకారమును, నాది యను మమకారమును, ఫలమునాశించి పనిచేయుటయును, పురుషకారము నపేక్షించకుండగ వర్తించుటయును, మోక్షవిషయమున సంశయగ్రస్తుడై యుండుటయున్ను-

2) శ్రవణవిరోధియనగా:- దేవతాంత కథలను గాథలను ప్రీతితో వినుచుండుటయును-

3) అనుభవ విరోధియనగా:- భోగద్రవ్యమును గొని లోపలికిపోయి స్నానద్రవ్యమును జేతనుంచుకొని బయటకు వచ్చుట యను విషయముల ననుభవించుట యందు యిచ్ఛకలిగి యుండుట యును-

4) స్వరూప విరోధియనగా:- సృష్టి-స్థితి-లయ-నియమన అంతః ప్రవేశ - మోక్షప్రదత్వములకు కర్తయు, కారణుడనగు సర్వేశ్వరునకు అత్రి- పరత్రచ పరతంత్రుడగు తాను ఆ విషయమును మరచి, తన పారతంత్ర్యమును వప్పుకొనక పైగా తాను స్వతంత్రుడని భావించి చేయియాడించుట

5) పరత్వవిరోధియనగా:- జీవకోటిలో చేరియున్న బ్రహ్మ - రుద్రుడు - మున్నగు దేవతాంతరములను సర్వేశ్వరునిగను పరతత్త్వముగను, భావించుట.

6) ప్రాప్తివిరోధియనగా:- కేవలులతో తానుకూడ చేరియుండుట

ఇవి భగవన్నిత్య, నిరవద్య, నిరుపాధిక కైంకర్యరూప అనాందాత్మక మోక్షమును పొందదలచిన ప్రపన్నునకు విరోధకములు. గాన వీనిని ప్రప్రథమున నశింపచేసుకున్న నే గాని భగవత్కటాక్షరూప కిరణములు తనపై ప్రసరించజాలవు

గాన విరోధకములైనవాటిని పోగొట్టుకొనిన పిమ్మటనే గాని ప్రపన్నుని విశ్వాసము అను స్థానములు నిలువజాలవు.

ఇ రు వ దొ క ట వ వా ర్త

తిరునగరిప్పిళ్ళై యను పూర్వాచార్యులు పైనతెలిపిన విరోధివిషయములను గూర్చియిటుల తెలిపిరి

భగవంతుని యాశ్రయించుటను అడ్డుకొనునట్టి ప్రతిబంధకము శరీరము. ఆచార్యుని యాశ్రయించుట నాటంకపరచునట్టి ప్రతిబంధకము పుత్ర మిత్ర కళత్రాదులు.

శ్రీ వైష్ణవుల నాశ్రయించుటను నివారించు ప్రతిబంధకము శ్రీ వైష్ణవేతరులతో గల సహవాసము.

సర్వేశ్వరుడే ఉపాయమను విషయమును గ్రహించకుండగ ప్రతిబంధించు ప్రతిబంధకము ధనమందుగల యాశ. భగవద్భాగవతాచార్య కైంకర్యమున ప్రీతిని కలుగకుండగ చేయునట్టి ప్రతిబంధకము శబ్దాది విషయములయెడలగల ప్రీతి.

1) జీవుడు స్వస్వరూపజ్ఞానమును పొందకుండగ జేయునట్టి విరోధులేవియనగా స్వరక్షణము స్వస్వాతంత్ర్యము- అన్య శేషత్వము- దేహాత్మాభిమానము-మమకారము అనునవి. ఇవి పోగొట్టుకొనుట యెటులననగా - సర్వేశ్వరుడే రక్షకుడను విషయమును సర్వదా మననము జేయుచుండినచో తనను తానే రక్షించుకొనగల భ్రాంతి తొలగిపోగలదు.

స్వస్వాతంత్ర్యబుద్ధి యెటులనశించుననగా- సర్వేశ్వరుడు సర్వశేషి. నేనాయనకు శేషభూతుడను మాత్రమే నని సర్వదా మననము జేయుచుండినచో తాను స్వతంత్రుడనుకొను అంధత్వము తొలగిపోవును

# ప్రచార విభాగము

## బదరీ సత్సంగ సదన విరాళములు

బదరీనారాయణ క్షేత్రములో శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారు నిర్మించుచున్న సత్సంగ సదనమునకు మద్రాసు వాస్తవ్యులగు శ్రీమాన్ మొగిలి రాధాకృష్ణయ్యగారు శ్రీ మట్టపల్లి రంగనాథయ్య గారిద్వారా 500/లు సమర్పించిరి. శ్రీయఃపతి సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక!

పై సత్సంగ సదనమునకు మద్రాసు వాస్తవ్యురాండ్రగు శ్రీమతి ఊరా శమంతకమణి అమ్మగారున్ను శ్రీమతి B. ధనమ్మగారున్ను వాగ్దానం 1600/లకుగాను 400=0=0 నాలుగు వందల రూపాయలు సమర్పించిరి. శ్రీయఃపతి సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక

---

## బదరీ శ్రీనివాస రామానుజ స్వామివారల

### శాశ్వత, తాత్కాలిక పూజా విరాళాలు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీమతి కోట రామలక్ష్మమ్మగారు | (విశాఖపట్నం) | 32/ |
| 2. | ,, మోంద్రేటి అచ్చయ్యమ్మగారు | ,, | 12/ |
| 3. | శ్రీ కోదాట వీరభద్రరావుగారు | ,, | 12/ |
| 4. | శ్రీ పువ్వాడ సత్తిరాజుగారు | ,, | 5/ |
| 5. | శ్రీ ముత్తంగి రాయలమ్మగారు | ,, | 20/ |
| 6. | శ్రీ మరియొకభక్తులు | ,, | 3/ |

ఇందులకు కృషిసలుపుచున్న శ్రీ దాసరి ఆండాళమ్మగారికి మేము చాలాకృతజ్ఞులము.

| | | |
|---|---|---|
| శ్రీ యం. రాణమ్మగారు | మద్రాసు | 58/ |
| శ్రీ వి. జగదీశ్వరమ్మగారు, వెంకటగిరి కుమారరాణీగారు | | 1.6/ |
| శ్రీ తుయ్యూరు చినరాణీగారు | | 60/ |

ఈ సొమ్ము శ్రీ జి. వి. యల్. పాపాయమ్మగారిద్వారా జమవచ్చెను. శ్రీ మట్టపల్లి రామమూర్తిగారి పేరుతో పూజ చేయించుటకు శ్రీమతి మట్టపల్లి చంద్రమ్మగారిద్వారా జమవచ్చినది. రు. 58లు

శ్రీ యతిరాజసేవా మహిళామండలి వారు (విజయనగరం) తమ సంఘ వార్షికోత్సవ సందర్భములో సంఘమునకు శ్రీ యన్ ఆండాళమ్మగారిద్వారా పంపిన బదరీవిరాళము రు 29లు

### కట్నములు

శ్రీ విజయనగరం శ్రీ యతిరాజ సేవామహిళామండలివారు తమ సంఘ వార్షికోత్సవములో సంఘమునకు పంపిన కట్నం రు 30 లు

శ్రీ మట్టపల్లి పాండురంగ వివాహ సందర్భములో (మద్రాసు) సంఘమునకు పంపినకట్నం రు. 11లు

శ్రీ వల్లభనేని భూషణయ్యగారికుమారుడు కృష్ణదాసుపరీక్షప్యాసైనందున పంపిసంఘకట్నం(గండిగుంట) రు 4లు

శ్రీమాన్ శ్రీభాష్యం రామాచార్యులుగారి ప్రథమపుత్రుని నామకరణసందర్భములో పంపినసంఘకట్నం రు. 1

శ్రీమాన్ కందాళ శ్రీనివాసాచార్యులుగారు తమ తృతీయ పుత్రిక చి॥సౌ॥ కాంతిమతి వివాహ సందర్భములో పంపిన సంఘకట్నం రు. 2 లు

గండిగుంటలో హరిరామ సంకీర్తన జరిపిన సందర్భములో శ్రీ భగవన్నామం గారిద్వారా శ్రీ వల్లభనేని వీరభద్రయ్య దంపతులు వగైరా భక్తులు సంఘమునకిచ్చిన కట్నం రు. 13 లు

### మార్కాపురంనుండి శ్రీ సుగ్రీవ శివయ్యగారు పంపిన కట్నాలు

శ్రీ జియ్యర్‌స్వామివారి తిరునక్షత్రం జరిపినప్పుడు సమర్పణం 1–0–0

వీరి ఆచార్యులు శ్రీ భట్టరు ఆచార్యులవారి తిరునక్షత్రోత్సవ సందర్భములో 1–0–0

వీరి యింటిలో భాగవత కాలక్షేపము 6మాసములు జరిపించి శ్రీకృష్ణపరమాత్మకు అష్టభార్యల కల్యాణములు జరిపిన సందర్భములో పంపిన కట్నం 2–0–0

వీరికి శ్రీయఃపతి సమస్త సన్మంగళములు ప్రసాదించుగాక!

## సంభావనలు

కపిలేశ్వరపురం శ్రీ వెంకట కస్తూరిరంగ బ్రహ్మకపాల పూజనిమిత్తం జమవచ్చినది 36—0—0

## సాంఘిక వార్తలు

మన శ్రీ జియ్యర్‌స్వామివారు నైజాం యిలాకా యాదగిరి గుట్టమీద శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి సన్నిధిలో 10 దినములు "గాయత్రీ మహాయజ్ఞము"ను జరుప సంకల్పించి యున్నారు. ఇందులకు వలయు కార్యక్రమమును సిద్ధము చేయుచున్నారు. వివరములు రాబోవుపత్రికలో ప్రకటింపబడును.

వరంగల్లులో 10–12–59వ తేదిన మొదలుకొని మన శ్రీ జియ్యర్‌స్వామివారు గీతాజయంతి ధనుర్మాసముల నిమిత్తమై వేంచేసి ఆ కార్యక్రమములు కృషిచేయుచున్నారు. శ్రీవారివెంట మన సంఘకవిగారైన శ్రీమాన్ కవిరత్న గుడిమెళ్ళ రామానుజాచార్యులుగారు అన్వయించియున్నారు.

శ్రీకాకుళములో మన సంఘ ప్రధాన కార్యదర్శులగు శ్రీమదిత్యాది శ్రీమాన్ విద్వాన్ ఉ. వే. తే. కం. గోపాలాచార్యస్వామివారు గీతా ధనుర్మాసోత్సవములకై వేంచేసియున్నారు

ఋషికేశములో శ్రీమాన్ వే. కం. విద్వాన్ గోపాలాచార్య స్వామివారు బదరికాశ్రమములో ఉత్తరదేశీయ విద్యార్థులకు ప్రారంభించిన శ్రీభాష్యగీతాభాష్య పాఠప్రవచనమునకు కార్తీక బహుళ విదియనాడు ఋషీకేశములో శాత్తుమొరై చాలా వైభవముగా జరపించినారు.

రాజమండ్రిలో శ్రీ కొప్పర్తి వారి తులసీ రామానుజ కూటములో శ్రీ విశిష్టాద్వైతప్రచారక సంఘమువారి ఆధ్వర్యమున శ్రీమాన్ ఉ. వే. గొడవర్తి శఠకోపాచార్యస్వామివారి అధ్యక్షతను 1–12–59 మొదలు 10–2–59వ తేదీ వరకు గీతాజయంతి మహోత్సవ కార్యక్రమములు శ్రీమాన్ తె. కం. కుమార రంగరామానుజాచార్య స్వామివారి ఆధ్వర్యమున కార్యనిర్వాహక వర్గమువారు చాలా వైభవముగా జరిపిరి.

## విజయనగరం

ఇచ్చట శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు గత జ్యేష్ఠమాసములో తమ సంఘముయొక్క వార్షికోత్సవమును పరమ విలక్షణముగా జరిపిరి.

## వరంగల్లు

ఇచ్చట శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి ఆధ్వర్యమున శ్రీ వేంకటేశ్వర స్వామివారి దేవస్థానములో గీతాజయంతి, ధనుర్మాసోత్సవములు పరమవిలక్షణముగా మహా వైభవముగా జరుగుచున్నవి. ఉదయము 18 మంది స్వాముల గీతాపారాయణములు హోమము, సాయంత్రము ఉపన్యాసములు జరుగుచున్నవి.

## బందరు

ఇచ్చట శ్రీమాన్ పండిత నడాదూరు గోపాలకృష్ణమాచార్య స్వామివారి ఆధ్వర్యమున శ్రీ వంకాయల రామకృష్ణారావుగారి గీతామందిరములో గీతాజయంతి 18 రోజులు చాలా వైభవముగా జరిగినది పారాయణములు, ఉపన్యాసములు, హోమములు, తదియారాధనలు జరిగినవి

## బెజవాడ

ఇచ్చట కొత్తగుళ్ళలో గీతాజయంతి స్థానికభక్తులు మహోత్సాహముతో గావించిరి.

## శ్రీకాకుళము

ఇచ్చట శ్రీమాన్ విద్వాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు శ్రీమాన్ న్యాపతి బాలకృష్ణమూర్తిగారి సహకారముతో గీతాజయంతిని విలక్షణముగా జరిపిరి ధనుర్మాసోత్సవ సందర్భములో ఉదయం తిరుప్పావైకాలక్షేపం సాయంత్రం గీతోపన్యాసములు శ్రీ గోపాలాచార్యస్వామివారు గావించుచున్నారు.

1–12–59 విజయవాడ శ్రీ యతిరాజ సేవా మహిళామండలి వారు శ్రీ యం, రాధమ్మ ద్వారా పంపిన కట్నం 2—0—0

4–12–59 మార్కాపురం శ్రీ సుగ్రీవ శివయ్యగారు పంపిన కట్నం 4—0—0

16–12–59 చావలి శ్రీ యతిరాజ సేవామహిళామండలివారు శ్రీ గీతాజయంతిజరిపి ఇచ్చినకట్నం 2—0—0

22–12–59 కవులవరం శ్రీ అట్లూరి వెంకట రంగనాయకమ్మగారు సమారాధన జరుపుకొని పంపినకట్నం 5—0—0

# శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ

## —: ప్రకటన :—

శ్రీ వైష్ణవులకు ముఖ్యముగ కావలసిన పుస్తకములను, వస్తువులను అందజేయు నుద్దేశముతో 'గ్రంథవిక్రయశాఖ'ను ఒకదానిని ఇదివరకే ఏర్పాటు చేసియున్నాము. దాని నిప్పుడు బాగుగా నభివృద్ధి చేయదలంచి అవకాశ మున్నంతవరకు మన సంఘము తరఫున యున్న ఆశ్రమములలోను, శాఖా సంఘములలోను, శ్రీచూర్ణము, తిరుమణి, యజ్ఞోపవీతములు, తులసిమాలికలు మున్నగువాటిని యథావిధిగ తయారుచేయించి విధ్యుక్తరీతిగా ప్రతిష్ఠాదులను చేయించి వలయు వారికి అందజేయుచున్నాము ఇందువలన బీదలగు ఆశ్రమవాసులకున్ను, శాఖాసంఘములకున్ను కొద్ది ఆర్థికలాభమున్ను, వలయు వారికి స్వచ్ఛమైన వస్తుసామాగ్రి చౌకగ దొరకుటయు, రెండులాభములు సిద్ధించును.

పై వస్తువు లన్నియు శాస్త్రోక్తరీతిగా ప్రతిష్ఠాదులు చేయక ధరించరాదు. కాని విధానము తెలియకయు, తెలిసినను చేసుకొను అవకాశము లేకయు ప్రతిష్ఠించకయే ధరించుచున్నారు.

కావున కావలసినవారు వీటిని తెప్పించుకొని ఉపయోగింతురుగాక.

| | రూ-న పై | | రూ-న. పై |
|---|---|---|---|
| గురుపరంపరాది | 0-12 | గీతాసందేశం | 0-50 |
| శ్రీ విష్ణు సహస్ర నామస్తోత్రము | 0-12 | సుదర్శన వైభవము | 0-37 |
| శ్రీ విష్ణు సహస్ర నామస్తోత్ర వైభవము | 0-19 | గోదాకళ్యాణము | 0-37 |
| శ్రీ కృష్ణాష్టోత్తర శతనామస్తోత్రం | 0-12 | శ్రీ రంగనాయకీ వైభవము | 0-25 |
| శ్రీ గోదాష్టోత్తర శతనామస్తోత్రం | 0-12 | శ్రీ వామన వైభవము | 0-50 |
| నిత్యానుసంధానము (పెద్దది) | 3-50 | శుక్రవారోత్సవము | 0-12 |
| నిత్యానుసంధానము (చిన్నది) | 0-19 | స్తుతిమాలికా | 0-25 |
| రామానుజ చరిత్రము | 0-12 | తిరుప్పావై (టీకా తాత్పర్యములతో) | 0-62 |
| ప్రపన్న సంధ్యానుష్ఠానము | 0-12 | మంగళాద్రి నృసింహస్తోత్రం | 0-25 |
| ప్రపన్న తిరువారాధన క్రమము (లఘుతర) | 0-12 | చరమార్థ దీపికా | 0-25 |
| భజయతి రాజస్తోత్రం (మూలం) | 0-06 | శ్రీరామాయణ తిథులు | 0-12 |
| భజయతి రాజస్తోత్రం (అర్థసహితము) | 0-25 | శఠగోప గీతామృతము | 2-00 |
| చతుశ్శ్లోకి | 0-12 | అళవందార్ స్తోత్రము (చిన్నది) | 0-12 |
| ద్వయమంత్రార్థ ప్రకాశిక (పద్యములు కవిరత్నకృతం) | 0-25 | సప్తాత్మిక వ్యాఖ్యానము | 0-12 |
| | | శ్రీమద్రామానుజ చరిత్ర (ద్విపద) | 0-25 |
| శ్రీ రంగరాజ వైభవము | 0-37 | గీతార్థ సంగ్రహం (తాత్పర్యముతో సహా) | 0-12 |
| ముముక్షుప్పడి (చిన్నది) | 0-12 | లక్ష్మీ అష్టోత్తరములు | 0-12 |
| ముముక్షుప్పడి (ఆంధ్రానువాదముతో) | 1-25 | తిరుప్పల్లాండు ,, | 0-75 |
| సారసంగ్రహము ,, | 0-50 | ముముక్షుప్పడి మూలం— | 0-12 |
| తనిప్రణవము ,, | 0-50 | సంధ్యావందనం (త్రికాలమునది) | 0-6 |
| అర్థపంచకము ,, | 0-75 | తిరునామ వైభవము. | 0-25 |
| నిగమనప్పడి ,, | 0-50 | శ్రీరామనామ వైభవము | 0-25 |
| యాదృచ్ఛికప్పడి ,, | 0-50 | సాధుపరిత్రాణము | 0-25 |
| తత్త్వత్రయము ,, | 0-62 | అర్చావతార వైభవము | 0-24 |

| | |
|---|---|
| భగవద్గీత (పెద్దసైజు) | 4-00 |
| శ్రీ రంగరాజ స్తవం | 0-37 |
| గీతాచార్యస్తుతి (తాత్పర్య సహితం) | 0-06 |
| గీతాపారాయణకు ముందు చదువవలసిన శ్లోకములు | 0-06 |
| శబరి (పద్యకావ్యం కవిరత్న విరచితం) | 0-75 |
| భగవద్గీతా ప్రశ్నోత్తరావళి 3 భాగములు | [illegible]-00 |
| (ప్రథమభాగము 6 అధ్యాయములు | 1-00 |
| ఆళ్వారాచార్యుల చరిత్ర (తెలుగు వచనము) | 1-50 |
| అర్థపంచకము | 0-75 |
| గోదాచతుశ్లోకి (తాత్పర్యముతో) | 0-9 |
| 82 వార్తలు | 0-12 |
| అష్టశ్లోకి (అర్థముతో) | 0-25 |
| రామాష్టోత్తర శతనామస్తోత్రం | 0-12 |
| బ్రాహ్మణుల నేరమేమి | 0-06 |
| ప్రాతస్నానానుసంధేయము | 0-19 |
| శ్రీ రామానుజ అష్టోత్తర శతనామస్తోత్రము | 0-12 |

## శ్రీ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యుల వారి కావ్యములు

| | |
|---|---|
| శబరి | 0-75 |
| మాండవి | 0-75 |
| భరతము | 0-75 |
| ధనుర్దాసుడు | 1-00 |
| పండిత గోష్ఠి | 1-00 |
| శరద్రాత్రి | 1-00 |
| గీతాసందేశము | 0-50 |
| ద్వయమంత్రార్థము | 0-25 |
| మంగళాశాసన వైభవము | 0-50 |
| ఋష్యశృంగకము | 0-75 |
| కవితావిహారము | 0-25 |
| యతిరాజవైభవము | 0-25 |
| శ్రీ కాకుళస్వామిశతకము | 0-25 |

పై పుస్తకములన్నిటికి పోస్టేజి ప్రత్యేకం చెల్లించవలెను

### యజ్ఞోపవీతములు మేలురకం

శ్రీరంగమువి, రెండుముళ్ళు, విధ్యుక్తముగా ప్రతిష్ఠ చేయబడినవి 0-25

### యజ్ఞోపవీతములు మధ్యరకం

శ్రీరంగమువి రెండుముళ్ళు. విధ్యుక్తముగా ప్రతిష్ఠ చేయబడినవి 0-19

### మూడురంగుల పఠములు

| | |
|---|---|
| సైజు "10 14" రామానుజులవారు | 0-25 |
| నమ్మాళ్వార్లు | 0-25 |
| మణవాళ మామునులు | 0-25 |
| శ్రీ వేదాంత దేశికులు | 0-25 |
| శ్రీ అండాళ్ | 0-25 |

| | |
|---|---|
| పరమార్థదీపిక | 0-25 |
| శ్రీ జియ్యరస్వామి అష్టోత్తర నామస్తోత్రం | 0-12 |
| శంఖుచక్రములు స్వరూపము (చిన్నది) | 0-10 |
| వడగలబొట్టు తెంగలిబొట్టు కలది (పెద్దది) | 0-20 |
| కార్డుసైజు మూడురంగుల పఠములు | 0-06 |
| రామానుజులవారు | 0-05 |
| నమ్మాళ్వార్లు | 0-06 |
| మణవాళ మామునులు | 0-06 |
| శ్రీ వేదాంత దేశికులు | 0-06 |
| శ్రీ అండాళ్ | 0-06 |

### పవిత్రములు

శ్రీరంగమువి విధ్యుక్తముగా ప్రతిష్ఠ చేయబడినవి 2-37

### తులసిమాలికలు

ఆశ్రమములో పెరిగిన తులసిచెట్ల కర్రతో ఆశ్రమములో తయారుచేయించి గోమూత్రములోను మంచినూనె పసుపులోను సంస్కరించి పంచసూక్తవిధానమున హోమములో ప్రతిష్ఠ చేయబడినవి. ధరించుటకుగాని, జపము చేయుటకుగాని అత్యంత యోగ్యమైనవి.

| | |
|---|---|
| పెద్దది | 1-00 |
| మధ్యరకం | 0-75 |
| చిన్నది | 0-50 |

### తిరుమణి

శ్రీరంగమువి విధ్యుక్తముగ ప్రతిష్ఠ చేయబడినవి.

| | |
|---|---|
| మేలురకం కణిక | 0-06 |
| ,, మధ్యరకం | 0-03 |
| ,, సాధారణం | 0-02 |

### శ్రీచూర్ణము

మేలురకం (కేవలం పచ్చిపసుపుతోమాత్రం చేయబడినది) పచ్చకర్పూరం కుంకుమపువ్వు చేర్చబడి విధ్యుక్తముగా ప్రతిష్ఠింపబడినది. తు. 1 కి 0-06

## వస్తువులు పుస్తకములు దొరకు స్థలము

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము,
కార్యాలయము
వాసుదాసాశ్రమము – నడిగడ్డపాలెం
చేబ్రోలు పోస్టు (వయా) తెనాలి – గుంటూరు జిల్లా,
(లేక)
(కాంచి) శ్రీ నిడుముక్కల రామానుజకూటం
కొత్తగుళ్ళవద్ద – విజయవాడ (కృష్ణాజిల్లా)

కాంచి – లిబర్టీ ప్రెస్
సైన్సుస్టేషను రోడ్డు
మారీసుపేట, తెనాలి – 2

# శ్రీ గుణరత్న కోశము

6 వ శ్లోకము

శ్లో॥ స్తోతారం తముశన్తి దేవి కవయో
యో విస్తృణీతే గుణాన్,
స్తోతవ్యస్య తతశ్చతే స్తుతిధురా
మయ్యేవ విశ్రామ్యతి,
యస్మా దస్మదమర్షణీయభణితి
స్వీకారత స్తే గుణాః.
క్షాన్త్యౌదార్య దయాదయో భగవతి
స్వాం ప్రస్తువీరన్ ప్రథామ్ !

—* అర్థము *—

హే దేవి = ఓ, శ్రీరంగనాయకీ !
స్తోతవ్యస్య = స్తుతింపబడువారి యొక్క,
గుణాన్ = గుణములను,
యః = ఎవడు,
విస్తృణీతే = విస్తరించి చెప్పునో,
తం = అట్టివానిని,
కవయః = కవీశ్వరులు,
స్తోతారం = స్తుతిచేయువానినిగ,
ఉశన్తి = చెప్పుచున్నారు,
తతశ్చ = అందువలనను,
తే = నీయొక్క.
స్తుతిధురా = స్తోత్రభారము,
మయి ఏవ = నాయందే,
విశ్రామ్యతి = నిలిచియున్నది.
యస్మాత్ = ఎందుకలవనగా,

అస్మద మర్షణీయభణితి స్వీకారతః
అస్మత్ = మా యొక్క,
అమర్షణీయ = కోపింపతగిన,
భణితి = వాక్యములను.
స్వీకారతః = స్వీకరించుటవలన,
తే = నీయొక్క,
క్షాన్త్యౌదార్య దయాదయః
క్షాన్తి = ఓర్పు.
ఔదార్య = ఔదార్యము,
దయా = దయ.
ఆదయః = మున్నగు,
గుణాః = గుణములు,
స్వాం = తమసంబంధమైన,
ప్రథాం = ప్రకాశమును,
ప్రస్తువీరన్ = ప్రకాశింపజేయకలుగుచున్నవో,

—* తాత్పర్యము *—

ఓ శ్రీరంగనాయకీ:- స్తుతింపబడువారి యందలి గుణములను ఎవరైతే తన వాక్కులద్వారా అందరకిని విస్తారముగ విపులముగ తెలియునటుల జేయగలుగుచున్నాడో అట్టివానిని 'స్తోత = స్తుతించువాడు' అని పండితులు లోకములో చెప్పుచున్నారు. గాన నిన్ను స్తుతించుటకు బ్రహ్మాదులకంటెను కూడ నేనె తగినవాడనై యున్నాను ఏలననగా నీవు వాఙ్మనోతీతమైన కల్యాణగుణవంతురాలవు. నేనా కుత్సితమైన అల్పవాక్కుల గలవాడను. అట్టి నేను నిన్ను స్తుతించుచున్నప్పటికిని నీవు కోపింపకుండగ నా వాక్కులను క్షమించి ఆదరించి వినుటవలన నీయందలి క్షమాగుణము- ఔదార్యగుణము. దయాగుణము- మున్నగు గుణములు లోకమున వెల్లడికాగా విస్తారముగ ప్రకాశించుచున్నవిగదా !

భక్తి నివేదన — (సాలుచందా రు 5 లు) Regd No. A 195

# భక్తి నివేదన

[ వేదాన్త మాసపత్రిక ]

ఇందు భక్తిజ్ఞాన వైరాగ్యబోధకములగు వ్యాసములు ప్రతినెలయు ప్రకటింపబడును.

స్థాపకులు :

శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీమాన్ శ్రీ తె. కం. గోపాలాచార్యస్వామివారు

సహాయ సంపాదకులు :

శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యస్వామివారు

| | | | |
|---|---|---|---|
| సాధారణ చందా | 5—0—0 | రాజపోషకులు | 58—0—0 |
| ద్వితీయ చందా | 10—0—0 | మహారాజపోషకులు | 116—0—0 |
| పోషకులు, సం॥ ఒకటికి | 25—0—0 | | |

శ్రీ విశిష్టాద్వైత ప్రచారిణీ సంఘము

భక్తి నివేదన

శ్రీ వాసుదాసాశ్రమము, నడిగడ్డపాలెం (P. O.)

(Via) చేబ్రోలు

[ తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా ]

సాలుచందా రు 5 లు భక్తి నివేదన – BOOK-POST రి. నం A. 195

వాసుదాసాశ్రమం — నడిగడ్డపాలెం (పోస్టు) [వయా చేబ్రోలు] గుంటూరుజిల్లా.

శ్రీ ......

గారికి

Edited and Published by Sri T. K. Gopalacharyulu Garu and printed at Liberty Press, Tenali For Sriman Press, Nadigaddapalem.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# గోపికాగీతలు

## 8 వ శ్లోకము.

శ్లో॥ మధురయా గిరా వల్గువాక్యయా ।
బుధ మనోజ్ఞయా పుష్కరేక్షణ ।
విధికరీ రిమా వీర ముహ్యతీ
రధరశీధునా ఽఽ ప్యాయయస్వ నః ॥.

## :– ♦♦ అర్థము ♦♦ :–

హే పుష్కరేక్షణ = ఓపద్మదళాయితాక్షుడా!
బుధమనోజ్ఞయా = జ్ఞానుల మనస్సునకు దెలియు నట్టియు;
వల్గువాక్యయా = రమణీయములగు వాక్యములు గలిగినట్టియు;
మధురయా = మధురమైనట్టియు;
గిరా = నీయొక్క మాటలచేత,
ముహ్యతీః = మోహితులమై;
విధికరీః = నీ యాజ్ఞానువర్తులమైనట్టి;
ఇమాః = ఈ
నః = మమ్ములను;
హే వీర = ఓవీరుడా
అధరశీధునా = అధరామృతముచేత;
ఆప్యాయయస్వ = తృప్తి నొందింపుము ।

## ;–* తాత్పర్యము *;–

"ఓ శ్రీకృష్ణా! నీ నేత్రములు గంభీరాంతః పయుద్భూత గలికవికసిత పద్మదళాయితేక్షణములు గలవి. ఆ నేత్రదృష్టి బాణములై మా స్త్రీత్వాభిమానమును, మానమును కారణము ఛేదించి నశింపజేసి మమ్ముల మోహితుల జేసి నీకు దాసీలనుగ జేసివైచినది. ఆ పైని నీ వాగ్వర్షము వర్షించినది. దాని స్వరూపస్వభావ మాధుర్యములు జ్ఞానులమానస చాతకములకు మాత్రమే అనుభవైక వేద్యమైనవి. అయినను, నాని రమణీయాకృతి మరియు మాధుర్యములు మాత్రము మమ్ముల సమ్మోహితుల నొనరించి, మమ్ముల నీ కింకరిణులగ జేసి వేసినది. ఈ నీ దృష్టిచేతను, వాక్కులచేతను వివశాత్ములమై అనురాగ ఆప్తులమై మేము అకించనులమై, అగతికులమై త్వదేకశేషభూతులమై, త్వదేకశరణులమై, త్వదేకభోగ్యులమై, యున్నాము. అనాదికాల విద్యాకర్మవాసనారుచులచే కట్టుకట్టిన కతిపాశ్యులమగు మమ్ము మోహింపజేసి వశపరచుకున్న వీరుడా! శ్రీకృష్ణా నీ యధరామృతము ననుగ్రహించి మమ్ముల సుఖింపజేయుము". క్షీరసముద్రమును మథన మొనరించి అందలి ఉప్పుచారును (అమృతమును) అన్యప్రయోజనులకే నిత్తువు గాక. అందలి అసలు దివ్యామృతమును (శ్రీ లక్ష్మీదేవిని) నీవే స్వయముగ గైకొందువుగాక. ఆత్మస్వామృతమును (భగవద్విషయమును) ఆళ్వారులకే యనుగ్రహింతువు గాక. నీ దాసీలమైన మాకు నీ యధరామృతము మాత్రమే చాలును గాన దానిని మాకనుగ్రహించుమా. శ్రీ దేవికి నీ హృదయము నే యిచ్చుము. భూదేవికి నీ కోరలనే యిమ్ము నీళాదేవికి నీ చేతులనే కలుపుము. గోదాదేవికి నీ చూపులనే చూపుము గాని ఓ స్వామి మాకు నీ అధరము మాత్రమే యనుగ్రహించుము చాలును. అని ఒక గోపిక మొరపెట్టుకున్నది.

శ్రీ హయగ్రీవాయనమః

## శ్రీ భగవద్గీతా - పంచదశోఽధ్యాయః

# పురుషోత్తమప్రాప్తియోగః

అవ. భోగముల యందాసక్తిలేకుండుట యనెడు శస్త్రముచే నరికివేయదగిన బంధముగల తన అక్షరవిభూతిని చెప్పుటకై బంధాకారముతో వ్యాపించియున్న ప్రకృతి పరిణామమునంతను ఛేదింపదగిన అశ్వత్థవృక్షము పోల్చి నైమిత్తి సృష్టిక్రియగా చెప్పుచున్నాడు.

శ్రీ భగవానువాచ = శ్రీకృష్ణుడు పలికెను.

1. శ్లో. ఊర్ధ్వమూల మధశ్శాఖ । మశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛన్దాంసి యస్య పర్ణాని । యస్తం వేద స వేదవిత్॥

అర్థము :– శ్రుతయః = శ్రుతులు, యం = ఏ, అశ్వత్థం = సంసారమనెడు అశ్వత్థమును, ఊర్ధ్వమూలం = ఊర్ధ్వభాగమున బ్రహ్మయను మొదలుకలదిగాను, అధశ్శాఖం = క్రిందిభాగమున మనుష్య క్రిమికీటకాదులను కొమ్మలుకలదిగాను, అవ్యయం = (ప్రవాహతః)నిత్యమైనదిగాను, ప్రాహుః = వివరించిచెప్పుచున్నవో, యస్య = ఏసంసారమను అశ్వత్థవృక్షమునకు, ఛన్దాంసి = కామ్యకర్మ ప్రతిపాదకశ్రుతులు పర్ణాని = ఆకులో, తం = అట్టి సంసారరూప అశ్వత్థవృక్షమును, యః = ఎవడు, వేద = తెలుసుకొనునో, సః = అట్టివాడు, వేదవిత్ = వేదార్థజ్ఞాని, భవతి = అగుచున్నాడు.

తా॥ సంసారము అశ్వత్థవృక్షమువంటిది. దీని మొదలు బ్రహ్మ, ఈయన ఊర్ధ్వలోకమున నుండును. దీనికి కొమ్మలు క్రిందిలోకముల యందలి సుర నర తిర్యక్ స్థావరములు. జీవనదియొక్క నీటి ప్రవాహమువలె ఈ వృక్షము నిత్యమైనది. దీనిని అభివృద్ధిపరచు ఆకులు కామ్యకర్మలు. దీనిని ఛేదించు నుపాయము వేదమున కలదు. గాన ఈ వృక్షజ్ఞానము వేదార్థజ్ఞానమున కుపయోగించును.

అవ. ఆ విషయములే యిప్పుడు నిత్యసృష్టి ప్రక్రియగా జెప్పుచున్నాడు.

2. శ్లో. అధశ్చోర్ధ్వం చ ప్రసృతా స్తస్యశాఖా
గుణప్రవృద్ధా విషయ ప్రవాలాః
అధశ్చమూలా న్యనుసన్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే॥

అర్థము :- తస్య = ఆ వృక్షముయొక్క, శాఖాః = కొమ్మలు, అధః చ = క్రింది కిన్నీ, ఊర్ధ్వంచ = పైకిన్ని, ప్రసృతాః = వ్యాపించియున్నవి. గుణ ప్రవృద్ధాః = సత్వాదిగుణములచే బాగుగా వృద్ధిపొందియున్నవి. విషయ ప్రవాలాః = శబ్దాది విషయములనెడు చిగుళ్లుగలవై, భవంతి = ఉన్నవి. మూలాని = వ్రేళ్లు, అధః చ = క్రిందనున్న మనుష్యలోకమునను, అను సంతతాని = విస్తరించినవై, మనుష్యలోకే = మానవలోకమున, కర్మాను బన్ధీని = కర్మలతో సంబంధించినవై, భవన్తి = ఉన్నవి.

తా॥ ఆ వృక్షముయొక్క శాఖలు క్రిందనుండు మనుష్యలోకమునను, పైననుండు స్వర్గాదిలోకమునను వ్యాపించియున్నవి. అవి సత్వ రజస్తమో గుణములచే వృద్ధిపొందుచు శబ్దాదివిషయములనెడు చిగుళ్ళను కలిగియున్నవి. దాని కర్మరూపమైన వ్రేళ్ళుక్రింద నున్న మనుష్యలోకమున కర్మలతో సంబంధించియున్నవి.

అవ. అందరును ప్రత్యక్షముగ జూచుచుండగ నీ సంసారము నెఱింగినవాడే యొక్కడోయని 'య స్తంవేద సవేదవి త్'ని స్తుతింపనేల ? యను శంక పరిహరించుచున్నాడు.

2½. శ్లో. నరూప మస్యేహ తథో పలభ్యతే ।
నాన్తో న చాది ర్నచ సమ్ప్రతిష్ఠా॥

అర్థము :– ఇహ = ఈలోకమున, అస్య = ఈ సంసారవృక్షముక్క, రూపం = స్వరూపము, తథా = ఇదివరలో తెలిపినవిధముగా, న ఉపలభ్యతే = తెలుసుకొనబడుటలేదు. అన్తః = దీని నాశనము, న = తెలుసుకొన బడుటలేదు. ఆదిః చ = దీని మొదలున్ను, న = తెలిసికొనబడుటలేదు. సమ్ప్రతిష్టా చ = దీనిఉనికియున్ను, న = తెలిసికొనబడుటలేదు.

తా॥ ఈవృక్షమునకు బ్రహ్మ మూలము. మనుష్యాదులు శాఖలు. విషయాదులు చిగుళ్లు, అని ఈలోకస్థులైన సంసారు లెఱుంగరు. దీని స్వరూపముగాని అంతముగాని ఆదిగాని, దీని స్థితిగాని ఈ లోకస్థులచే తెలిసికొనబడుటలేదు.

(అనగా – దీనికి తండ్రి మూలము కొడుకులు మనమలు శాఖలు, దారాదులు చిగుళ్లు అని యెఱుంగుదురుగాని బహ్మ మూలము, మనుష్యాదులు కొమ్మలు, విషయములు చిగుళ్ళు అని సంసారు లెఱుంగరు. ప్రళయమే దీనికి నాశక మనుకొందురు గాని భోగమునందలి యసంగము నాశకమని యెఱుంగరు, గర్భ వాసము నాదిగా నెఱుంగుదురుగాని గుణ సంగ మాది యని యెఱుంగరు.)

3. శ్లో. అశ్వత్థ మేనం సువిరూఢమూల। మసంగశస్త్రేణదృఢేనఛిత్వా
తతఃపదంతత్పరిమార్గితవ్యం।యస్మిన్ గతాననివర్తన్తిభూయః॥

అర్థము :- సువిరూఢమూలం = చక్కగను వివిధములుగను మొలచిన వ్రేళ్ళుగల. ఏనం = ఈ. అశ్వత్థం = అశ్వత్థవృక్షమును. దృఢేన = దృఢమైన. అసంగశస్త్రేణ = విషయవైరాగ్యమను ఆయుధముచే. ఛిత్వా = ఛేదించి. తతః = ఆ వైరాగ్యకారణమున. యస్మిన్ = ఏ స్థానమున. గతాః = ప్రవేశించినవారు. భూయః = తిరిగి. ననివర్తన్తి = మరలరారో. తత్ = అట్టి. పదం = ఆత్మయాథాత్మ్య సాక్షాత్కార రూపస్థానము. పరిమార్గితవ్యం = వెదుకవలసినదై యున్నది.

తా॥ స్థిరముగను నాలుగు ప్రక్కలకును వ్యాపించియున్న ఈసంసార రూప అశ్వత్థవృక్షమును ఆత్మజ్ఞానముచే దృఢమైనదగు విషయ వైరాగ్యమను ఆయుధముచే ఛేదించి తద్ద్వారా పునరావృత్తి రహితమైన ఆత్మయాథాత్మ్య సాక్షాత్కారమును గూర్చి కను గొనవలసియున్నది.

అవ. గుణమయభోగములతోడి సంగము అనాదికాలమునుండియు దాపరించి నది. దానిచే విపరీతజ్ఞాన మువయించి నాటుకొనియున్నది. ఇయ్యది దృఢమగు నసంగశస్త్రము లభించినగదా ఛేదింపబడును? అదియే సంసా రులకు దుర్లభమే. ఇక దీనిబారినుండి తప్పించుకొనుట యెట్లు, అనగా చెప్పుచున్నాడు.

4. శ్లో. తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
ద్యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥

అర్థము :- తం ఏవ = పూర్వోక్తమైన. ఆద్యం = ఆదికారణుడైన. పురుషం ఏవచ = పరమపురుషునిమాత్రమే. ప్రపద్యేత్ = శరణుజొచ్చవలెను. యతః = ఏ పరమపురుషునివలననుండి. పురాణీ = పురాతనమైన. ప్రవృత్తిః = గుణమయ భోగసంగప్రవృత్తి. ప్రసృతా = ప్రసరించినదో.

తా॥ ఏ పరమపురుషునివలన పురాతనమైన ఈ గుణమయ భోగసంగ మునందు ప్రవృత్తి కలిగినదో అట్టి ఆదికారణుడైన పరమపురు షునే శరణుజొచ్చవలసి యున్నది. ఆతనియాజ్ఞ నుల్లంఘించు టచే బంధము కలిగినది గాన నాతనినే ప్రసన్నునిగా జేసుకొనిన యెడల నాతడా బంధమునుండి విడిపించును.

అవ. వెనుకటి శ్లోకమున 'యతః ప్రవృత్తిః' యను దానినే యీ శ్లోకముచే వివరించుచున్నాడు.

5. శ్లో. నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మ నిత్యా వినివృత్తకామాః
ద్వంద్వై ర్విముక్తా స్సుఖదుఃఖ సంజ్ఞైః
గచ్ఛన్త్య మూఢాః పదమవ్యయం తత్॥

అర్థము :— నిర్మాణమోహాః = దేహాత్మాభిమానరూపమోహము లేనివారలై, జితసంగదోషాః = జయింపబడిన భోగాసక్తి రూపదోషముగలవారలై, అధ్యాత్మనిత్యాః = ఆత్మజ్ఞాననిరతులై, వినివృత్తకామాః = కోరికలు పూర్తిగా నశించినవారలై, సుఖదుఃఖసంజ్ఞైః = సుఖదుఃఖములను పేరుగల, ద్వంద్వైః = ద్వంద్వములచే, విముక్తాః = పూర్తిగా విడువబడినవారలై, అమూఢాః = భ్రమాదిరహితులగు జ్ఞానులు, తత్ = ఆ, అవ్యయం = నాశరహితమైన, పదం = ఆత్మయాథాత్మ్య సాక్షాత్కారపదవిని, గచ్ఛన్తి = పొందుచున్నారు.

తా॥ నన్ను శరణు జొచ్చుటచే క్రమముగ దేహాత్మాభిమానము పోవును. దానివలన భోగాసక్తి యనబడు దోషము హరించును. ఆత్మ సాక్షాత్కారాసక్తి కలుగును. దానిచే నితర కోరికలు నశించును. దానివలన సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతులై నాశరహితమైన పరిశుద్ధాత్మ సాక్షాత్కారరూపస్థితిని పొందుదురు.

అవ. ఆ పరిశుద్ధాత్మ స్వరూపమెట్టిదో వర్ణించుచున్నాడు. ఫలము యొక్క తత్త్వమెఱింగినగదా దానిని పొందుటకై త్వర జనించునది.

6. శ్లో. న తద్భాసయతే సూర్యో । న శశాఙ్కో న పావకః
యద్గత్వా న నివర్తన్తే । తద్ధామ పరమం మమ॥

అర్థము :- తత్ = పరిశుద్ధాత్మను, సూర్యః = సూర్యుడు, నభాసయతే = ప్రకాశింపజేయజాలడు. శశాఙ్కః = చంద్రుడు. న భాసయతే = ప్రకాశింపజేయజాలడు. పావకః = అగ్నిహోత్రుడు, నభాసయతే = ప్రకాశింపజేయజాలడు. యత్ = ఏ పరిశుద్ధాత్మ స్వరూపమును, గత్వా = పొంది, న నివర్తన్తే = మరలజాలరో, తత్ = అట్టి, పరమం = సర్వోత్కృష్టమైన, ధామ = జ్యోతి, మమ = నాయొక్క అంశయై యున్నది.

తా॥ ఆపరిశుద్ధాత్మ స్వరూపజ్యోతిని సూర్యుడుగాని, చంద్రుడుగాని, అగ్నిహోత్రుడుగాని ప్రకాశింపజేయజాలరు. అది పరమోత్కృష్టమైన స్థానము. దానిని పొందినవారు తిరిగి ప్రకృతి సంబంధమును చెందరు. ఆగొప్ప తేజోరూపమైన ఆత్మస్వరూపము నాయొక్క అంశయే అయియున్నది.

అవ. ఆత్మలన్నియు భగవంతుని యంశలేయనియు అయిన నందరును పరిశుద్ధాకారములతో వెలుంగకుండుటకు కారణమంచు కొన్ని యవిద్యాప్రవృత్తములై యుండుటయేయని చెప్పుచున్నాడు.

7. శ్లో. మమైవాంశో జీవలోకే । జీవభూత స్సనాతనః
మనష్షష్ఠానీన్ద్రియాణి । ప్రకృతిస్థాని కర్షతి॥

అర్థము :- సనాతనః = అనాదియగు నీఆత్మ, మమ = నాయొక్క, అంశ ఏవసన్ = అంశమె అగుచు. జీవలోకే = సంసారమునందు, జీవభూతః = బద్ధజీవుడై, ప్రకృతిస్థాని = ప్రకృత్యాత్మకమైన శరీరమందున్న, మనష్షష్ఠాని = మనస్సు ఆరవదిగాగల, ఇంద్రియాణి = ఇంద్రియములను, కర్షతి = ఆకర్షించుచుండును.

తా॥ ఆత్మ అనాదియైనది. ఇది నాయంశమే. ఇది అజ్ఞానముచే సంసారమున బద్ధమై ప్రకృతి పరిణామమైన ఈ శరీరమందుండి అచ్చటనేయున్న మనస్సుతోసహా మిగిలిన జ్ఞానేంద్రియము లైదింటిని తన స్వాధీనములోనికి ఆకర్షించి వాటిని కర్మానుగుణముగా నిటునటు లాగుచు విషయముల ననుభవించుచున్నది. (అంశ, ప్రకార, విశేషణ, శరీరాది శబ్దములన్నియు సమానార్థకములు)

అవ. జీవుడు శరీరమునుండి యుత్క్రమించునపుడు మనతో గొనిపోవు సామగ్రి నుగ్గడించుచున్నాడు.

8. శ్లో. శరీరం యదవాప్నోతి । యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి । వాయుర్గంధా నివాశయాత్॥

అర్థము :— ఈశ్వరః = శరీరేంద్రియాధిపతియైన జీవుడు. యత్ = ఏ. శరీరం = శరీరమును, అవాప్నోతి = పొందుచున్నాడో. యత్ చ = ఏ శరీరము నుండి. ఉత్క్రామతి = బయటికి పోవుచున్నాడో. తతః = అచ్చటనుండి వాయుః వాయువు. ఆశయాత్ = పుష్పమునుండి. గంధాన్ ఇవ = పరిమళమునువలె. ఏతాని = ఈ ఇంద్రియములను. గృహీత్వా = తీసికొని. సంయాతి = పోవుచున్నాడు.

తా॥ జీవుడు శరీరేంద్రియములకు నియంతయై యున్నాడు. అతను ఏ శరీరమును పొందునో, ఏశరీరమును విడిచిపోవునో, అపుడెల్ల వాయువు పుష్పాదులనుండి వాటి సూక్ష్మావయవములతోగూడ పరిమళాదులను తీసికొని పోవునటుల ఈశరీరమునందలి ఇంద్రియములను, భూత సూక్ష్మములతోసహా తనతో తీసికొనిపోవును.

అవ. ఆ సామగ్రిని వివరించి పేరులతో చెప్పుచున్నాడు.

9. శ్లో. శ్రోత్రం చక్షు స్స్పర్శనం చ । రసనం ఘ్రాణ మేవచ
అధిష్ఠాయ మనశ్చాయం । విషయా నుపసేవతే॥

అర్థము :— అయం = ఈ జీవుడు. శ్రోత్రం = శ్రోత్రేంద్రియమును. చక్షుః = నేత్రేంద్రియమును. రసనం = జిహ్వేంద్రియమును. ఘ్రాణం = ఘ్రాణేంద్రియమును. మనః చ = మనస్సును. అధిష్ఠాయ = స్వాధీనపరచుకొని. విషయాన్ = శబ్దాది విషయములను. ఉపసేవతే = చక్కగా అనుభవించుచున్నాడు.

తా॥ ఈ బద్ధుడైన జీవుడు శ్రోత్రచక్షుస్త్వక్ జిహ్వాఘ్రాణములను నింద్రియములను వశపరచుకొని వాటిని తమ తమ విషయములయందు ప్రవర్తించుటకు తగినవాటినిగా జేసి శబ్దాది విషయములను చక్కగా అనుభవించుచున్నాడు.

అవ. ఇంతవరకు కొందరు కర్మకలాపమనెడు సంకెలలచే బంధింపబడి కళేబరకారాగారమునబడి అటనుండి యుత్క్రమించుట తిరిగి ప్రవేశించుట యనెడుక్లేశములను అచ్చట యనుభవించు తేనెబూసిన విషమువంటి విషయానుభవములను జూపి ఇప్పుడీశ్లోకమున దీనికంతకును కారణము పరమపురుషునకు పరతంత్రమగు నీయాత్మను స్వతంత్రమని భావించుటయే యని తెలుపుచు ఆత్మయున్నచో కాన్పించదేలయనెడు నాస్తిక ప్రశ్న కుత్తరమొసంగుచున్నాడు.

10. శ్లో. ఉత్క్రామన్తం స్థితం వాపి । భుంజానం వాగుణాన్వితమ్
విమూఢానాను పశ్యన్తి । పశ్యన్తి జ్ఞాన చక్షుషః॥

అర్థము :- విమూఢాః = దేహాత్మాభిమానులైన అజ్ఞానులు, ఉత్క్రామన్తం = శరీరము నుండి వెడలుపోవునట్టియు, స్థితం వా = శరీరమునందుండునట్టియు, (ఆత్మను) న అను పశ్యన్తి = తెలుసుకొనలేకున్నారు. జ్ఞానచక్షుషః = ఆత్మజ్ఞాన దృష్టికలవారు, పశ్యన్తి = తెలిసికొనుచున్నారు.

తా॥ మూఢులు ఈపాంచ భౌతిక శరీరమునే ఆత్మగ తలంచుదురు. వారు సత్వాదిగుణములుకల దేహముతో కలసియున్న ఈ ఆత్మను, ఈ శరీరమును, విడుచునపుడుగాని ఈశరీరములోనున్నపుడుగాని, విషయముల ననుభవించునపుడుగాని ఈశరీరముకంటె విలక్షణమైనదనియు, జ్ఞానైకాకారమనియు తెలిసికొన జాలరు. ఆత్మ యాథాత్మ్యజ్ఞానము గలవారు మాత్రము తెలిసికొనగలరు.

అవ. వెనుకచెప్పిన యర్థమునే సహేతుకముగ సమర్థించుచున్నాడు.

11. శ్లో. యతన్తో యోగినశ్చైనం । పశ్యన్త్యాత్మ న్యవస్థితమ్
యతన్తో ప్యకృతాత్మానో । నైనం పశ్యన్త్యచేతసః॥

అర్థము :- యతన్తః = ప్రయత్నశీలులైన, యోగినః = యోగులు, ఆత్మని = శరీరమునందు, అవస్థితం = ఉన్నట్టి, ఏనం = ఈ ఆత్మను, పశ్యన్తి = చూడకలుగుచున్నారు. అకృతాత్మానః = నిర్మలాంతఃకరణములేనివారై, అచేతసః = చిత్తవృత్తిలేనివారు, యతన్తః అపి = ప్రయత్నించిన వారలైనప్పటికి, ఏనం = ఈ ఆత్మను, న పశ్యన్తి = చూడజాలరు.

తా॥ నన్ను ప్రపత్తిజేసి కర్మయోగాది ప్రయత్నశీలురైన యోగులు ఈశరీరమునందలి ఆత్మయొక్క యాథాత్మ్య స్వరూపమును జూడగలరు. అంతఃకరణకు నిర్మలత్వము లేక చిత్తైకాగ్రత లేని వారు ప్రయత్నశీలురైనను ఈయాత్మను చూడజాలరు.

అవ. ఇంతకుముందు లోకమునకు వెలుంగునొసంగు సూర్యచంద్రాగ్నులు కన్నుగాంచుట కాటంకమైన చీకటినిమాత్రమే పోగొట్టుదురుగాని వాటిని కూడ వెలిగొందించునది యాత్మయేయనియు నది బద్ధావస్థలో నున్నను ముక్తావస్థలోనున్నను భగవంతునికి పరతంత్రమేయనియు చెప్పబడెను. ఇప్పుడు అచిత్తుయొక్క పరిణామమగు సూర్యాదులకాంతియు భగవంతుని యధీనమైనదియేయని చెప్పుచున్నాడు.

12. శ్లో. య దాదిత్యగతం తేజో । జగద్భాసయతేఽఖిలమ్
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ । తత్తేజో విద్ధి మామకమ్॥

అర్థము :- ఆదిత్యగతం = సూర్యునియందలి, యత్ = ఏ. తేజః = తేజస్సు, అఖిలం = సమస్తమైన, జగత్ = జగత్తును, భాసయతే = ప్రకాశింపజేయుచున్నదో, చంద్రమసి = చంద్రునియందు, యత్ = ఏ, తేజః = తేజస్సు, అస్తి = కలదో, తత్ = ఆ, తేజః = తేజస్సును, మామకమ్ = నాదిగా, విద్ధి = తెలిసికొనుము.

తా॥ సమస్త జగత్తును ప్రకాశింపజేయుచున్న సూర్యునియందలి తేజస్సును చంద్రునియందలి తేజస్సును, అగ్నియందలి తేజస్సును వారు నన్నారాధించగా వారికి నాచే నియ్యబడినదని తెలిసికొనుము.

అవ. సకల భూతములను ధరించు భూమియందలి ధరణశక్తియు చంద్రుని యందలి ఓషధుల పోషించుశక్తియు తనదే యనుచున్నాడు.

13. శ్లో. గా మావిశ్యచ భూతాని । ధారయా మ్యహ మోజసా
పుష్ణామి చౌషధీ స్సర్వా । స్సోమో భూత్వా రసాత్మకః॥

అర్థము :– అహం = నేను. గాం = భూమిని, ఆవిశ్య = ప్రవేశించి, ఓజసా = నా యసాధారణశక్తిచే, భూతాని = సమస్త భూతములను, ధారయామి = ధరించుచున్నాను రసాత్మకః = అమృతరసమయుడైన, సోమః = చంద్రుడను, భూత్వా = అయి, సర్వాః = సమస్తమైన, ఔషధీః = ఓషధులను, పుష్ణామి = పోషించుచున్నాను.

తా॥ నేను భూమియందు ప్రవేశించి చరాచర రూపములైన సమస్త భూతములను నా యప్రతిహతశక్తిచే ధరించుచున్నాను. అటులనే నేను అమృత రసాత్మకమగు చంద్రుడనై ఓషధుల నన్నింటిని రసముచే వృద్ధిని పొందించుచున్నాను.

అవ. జఠరాగ్నియందలి పాచనశక్తియు తనదే యనుచున్నాడు.

14. శ్లో. అహం వైశ్వానరో భూత్వా । ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః । పచామ్యన్నం చతుర్విధమ్॥

అర్థము :– అహం = నేను, వైశ్వానరః = జఠరాగ్నిగా, భూత్వా = అయి, ప్రాణినాం = ప్రాణులయొక్క, దేహం = దేహమును, ఆశ్రితః = ప్రవేశించినవాడనై, ప్రాణాపాన సమాయుక్తః = ప్రాణవాయువు అపానవాయువులతో కూడుకొన్నవాడనై, చతుర్విధం = ఖాద్య, చోష్య, లేహ్య, పేయ, రూపములగు నాలుగువిధములైన, అన్నం = అన్నమును, పచామి = పక్వము చేయుచున్నాను.

తా॥ నేను జఠరాగ్నినై సమస్తప్రాణుల దేహమును, ఆశ్రయించి ప్రాణాపాన వ్యాపారభేదములతో గూడినవాడనై నమలబడు, జుర్రబడు, నాకబడు, త్రాగబడు నాలుగువిధములైన యన్నములను పక్వముజేయుచున్నాను.

అవ. సర్వభూతములును భగవంతునితో సామానాధికరణ్యముచే నభేదముగా
చెప్పబడుటకు కారణమును జెప్పుచున్నాడు.

15. శ్లో. సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్త స్స్మృతిర్జ్ఞాన మపోహనం చ
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో
వేదాన్త కృ ద్వేదవిదేవ చాహమ్॥

అర్థము :– అహం = నేను, సర్వస్య = సమస్త భూతములయొక్క, హృది = హృదయమునందు, సన్నివిష్టః = అంతరాత్మగా ప్రవేశించియున్నాను. మత్తః = నావలన, స్మృతిః = స్మృతియు, జ్ఞానం = జ్ఞానమున్ను, అపోహనం చ = ఊహయు, భవన్తి = కలుగుచున్నవి. సర్వైః = సమస్తములైన, వేదైః చ = వేదములచేతను, అహం ఏవ = నేనే, వేద్యః = తెలియబడుచున్నాను. వేదాన్తకృత్ = వేదాన్తఫలము నిచ్చువాడను. వేదవిత్ చ = వేదతత్వార్థమును తెలిసినవాడను, అహం ఏవ = నేనే.

తా॥ నేను సమస్త భూతములయొక్క సకలప్రవృత్తులకు మూలమైన జ్ఞానముబుట్టునట్టి హృదయమందును అంతరాత్మగా ప్రవేశించియున్నాను. నావలననే అందరకును స్మృతియు, జ్ఞానము, ఊహ కలుగుచున్నవి. సమస్త వేదములచేతను తెలియబడువాడను. వేదవేదాంతములయందు తెలుపబడిన ఫలముల నిచ్చువాడను వేదతత్త్వార్థవేత్తను నేనుమాత్రమే.

(ఊహయనగా :– 'ఈ ప్రమాణ మీ విధమున ప్రవర్తింపదగిన'దని ఆయా ప్రమాణములయొక్క గమనికను గుర్తించుట. ఇది సకల ప్రమాణములకు నుపకరించును.)

అవ. కావున సకలవేద సారభూతమైన యర్థమును నావలననే వినుమని జెప్పుచున్నాడు.

16. శ్లో. ద్వావిమౌ పురుషౌలోకే । క్షర శ్చాక్షర ఏవ చ
క్షర స్సర్వాణి భూతాని । కూటస్థోఽక్షర ఉచ్యతే॥

అర్థము:— లోకే = లోకమునందు, క్షరః చ = క్షరుడనియు, అక్షరః చ = అక్షరుడనియు, ఇమౌ = ఈ, ద్వౌ = ఇద్దరు, పురుషౌ = పురుషులు, స్తః = కలరు, సర్వాణి = సమస్తమైన, భూతాని = బద్ధాత్మలు, క్షరః = క్షరణ స్వభావము కలవి, ఇతి = అని, ఉచ్యతే = చెప్పబడును. కూటస్థః = ముక్తాత్మవర్గము, అక్షరః = అక్షరుడనియు, ఉచ్యతే = చెప్పబడును.

తా॥ ఈ లోకమున క్షరుడు అక్షరుడు అని పేరుగల రెండు పురుష వర్గములున్నవి. అందు మారునట్టి స్వభావముకలిగి బ్రహ్మాది స్తంభపర్యంతమైన జీవవర్గము క్షరుడనియు, స్వస్వరూపావిర్భావము చెంది కూటస్థులైయున్న ముక్తాత్మవర్గము అక్షరుడనియు చెప్పబడుచున్నారు.

(కూటవత్ తిష్ఠతీతి కూటస్థః :— కూటమనగా కమ్మరివాని సమ్మెట. దానిపై నెన్నియో పదార్థములు నామరూపముల నొందుచున్నను అదిమాత్ర మొకేరీతిగా నుండును. అట్లే ముక్తాత్మయు ననేక దేహములతో నిదివరకు సంబంధించియుండినను తానా వికారముల కిపుడు లోనుగాక సంకోచములేని నిర్మల జ్ఞానాకారముతో వెలుంగుచుండును. కావున ముక్తాత్మ కూటస్థ మనబడును.)

అవ. బద్ధావస్థలోను. ముక్తావస్థలోను నుండు ఆత్మలకంటె పరమాత్మ వేరైనవాడని తెలుపుచున్నాడు.

17. శ్లో. ఉత్తమః పురుష స్త్వన్యః । పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య । బిభ ర్త్యవ్యయ ఈశ్వరః॥

అర్థము :– ఉత్తమః = ఉత్తముడైన. పురుషః తు = పురుషుడైతే. అన్యః = మరి యొకడు. పరమాత్మా ఇతి = పరమాత్మయని. ఉదాహృతః = చెప్పబడు చున్నాడు. యః = ఏ పరమాత్మ. లోకత్రయం = మూడువర్గములను. ఆవిశ్య = ప్రవేశించి. అవ్యయః = నాశరహితుడై. ఈశ్వరః = అధి పతియై (అస్తి = ఉన్నాడు)

తా॥ బద్ధముక్తాత్మలకంటె ఉత్తముడైన పరమాత్మ యనబడువాడు మరియొకడున్నాడు. ఆయన అచేతన, బద్ధాత్మ, ముక్తాత్మవర్గ ములు మూడింటియందును అంతరాత్మగా ప్రవేశించి నాశన రహితుడై వాటి కధిపతియై యున్నాడు.

అవ. ఆ విషయమునే తిరిగి 'సమాఖ్య' యనబడు మీమాంసా ప్రమా ణముచే సిరీకరించుచున్నాడు.

18. శ్లో. యస్మాత్క్షర మతీతోఽహ । మక్షరాదపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదే చ । ప్రథితః పురుషోత్తమః॥

అర్థము :– యస్మాత్ = ఏకారణమువలన. అహం = నేను. క్షరం = బద్ధపురుషవర్గ మును. అతీతః = అతిక్రమించినవాడనో. అక్షరాత్ అపిచ = ముక్తపురుష వర్గముకంటెను.ఉత్తమః = ఉత్కృష్టుడనో. అతః = ఆకారణమువలననే. లోకే = స్మృతులయందును. వేదేచ = వేదమునందును. పురుషోత్తమః = పురుషోత్తముడు. ఇతి = అని. ప్రథితః = ప్రసిద్ధికలవాడను. అస్మి = అగుచున్నాను.

తా॥ నేను క్షరుడనబడు బద్ధ పురుషవర్గముకంటెను, అక్షరుడనబడు ముక్త పురుషవర్గముకంటెను గొప్పవాడను. అందుచే స్మృతుల యందును, శ్రుతులయందును పురుషోత్తముడనని ప్రసిద్ధి కల వాడనైయున్నాను. (సమాఖ్యయనగా పేరు. 'పురుషోత్తముడ'ని శ్రుతులలోను, స్మృతులలోను పరమాత్మ వాడబడుచున్నాడు. ఆ శబ్దార్థమును పరిశీలించగా నాతడన్ని యవస్థలలోనున్న జీవుని కంటె వేరైనవాడని స్పష్టమగుచున్నది.)

అవ. ఇట్లు ప్రసిద్ధమగు పురుషోత్తమ శబ్దార్థమును వివరించుట యట్లు నిరంతరమను సంధించుటకొఱకే యగుచున్నదని తెలుపుచు దీని నెఱుంగుటను ప్రశంసించుచున్నాడు.

19. శ్లో. యో మా మేవ మసమ్మూఢో । జానాతి పురుషోత్తమమ్
స సర్వవి ద్భజతి మాం । సర్వభావేన భారత! ॥

అర్థము :—భారత! = అర్జునా! యః = ఎవడు, పురుషోత్తమం = పురుషోత్తముడనగు, మాం = నన్ను, అసమ్మూఢః = సమ్మోహము లేనివాడై, ఏవం = ఈ ప్రకారముగా, జానాతి = తెలిసికొనుచున్నాడో, సః = వాడు, సర్వవిత్ = అన్నిటినియెఱింగినవాడగుచు, మాం = నన్ను, సర్వభావేన = అన్ని రీతులచేతను, భజతి = భజించుచున్నాడు.

తా॥ క్షరాక్షరపురుషులకంటె భగవంతుడు వ్యాపన ఐశ్వర్యాదులచే వేఱైనవాడని నిశ్చయించినవాడు భగవత్ప్రాప్తికై నెఱుంగవలసిన నుపాయములనెల్ల నెఱింగినవాడగును. అన్ని విధములగు భజన ప్రకారములచే భజించువాడును అగుచున్నాడు. నన్నెఱుంగుటచే, నాకేప్రీతిగలుగనో, నన్ను భజించుటచే నాకేప్రీతి కలుగునో ఆ రెండువిధములగు ప్రీతులును ఈ పురుషోత్తమత్వము నెఱుంగుటచేతనే నాకు కలుగుచున్నవి.

అవ. ఇట్టీ పురుషోత్తమతత్వజ్ఞానము మిక్కిలి రహస్యముగా దాచదగిన దనియు, పరమార్థమైనదనియు. సర్వోత్తమపురుషార్థ ప్రదమనియు దెలుపుచు దానిని పూజించుచున్నాడు.

20. శ్లో. ఇతి గుహ్యతమం శాస్త్ర। మిద ముక్తం మయాఽనఘ
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా । త్కృతకృత్యశ్చ భారత॥

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే గుణత్రయ విభాగ యోగోనామ చతుర్దశోఽధ్యాయః

అర్థము :- అనఘ = పాపరహితుడవైన, భారత = అర్జునా! ఇతి = ఈ ప్రకారముగా, గుహ్యతమం = మిక్కిలి రహస్యమైన, ఇదంశాస్త్రం = ఈ పదునేనవయధ్యాయము, మయా = నాచేత, ఉక్తం = చెప్పబడెను. ఏతత్ = దీనిని. బుద్ధ్వా = తెలిసికొని. బుద్ధిమాన్ = నన్ను పొందుటకు వలయు జ్ఞానముకలవాడును, కృతకృత్యఃచ = నన్ను పొందుటకై చేయ వలసినది చేసినవాడును, స్యాత్ = అగును.

తా॥ అర్జునా! మిక్కిలి రహస్యమైన యీ పురుషోత్తమతత్వమును తెలియజేయు నీ శాస్త్రమును నీవు పాపరహితుడవగుటచే నీకు జెప్పితిని. దీని నెఱింగినవాడు బుద్ధిమంతుడును కృతకృత్యుడు నగును.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన శ్రీభగవద్గీత యందలి గుణత్రయ విభాగ యోగమనెడు పదునేనవ యధ్యాయము.

| | |
|---|---|
| ఈ యధ్యాయమందలి శ్లోకసంఖ్య | 20 |
| ఇప్పటికైన మొత్తము శ్లోకములు | 569 |

షోడశాధ్యాయార్థ సంగ్రహము.

శ్లో. దేవాసురవిభాగోక్తి । పూర్వికా శాస్త్రవశ్యతా
తత్వానుష్ఠాన విజ్ఞాన । స్థేమ్నే షోడశ ఉచ్యతే॥

అర్థము :- దేవాసురవిభాగోక్తిపూర్వికా = దేవతలనియు, ఆసురులనియు మానవులను విభజించి చెప్పుటద్వారా, శాస్త్రవశ్యతా = శాస్త్రమునకు విధేయులు కావలసినదేయని, తత్వానుష్ఠానవిజ్ఞానస్థేమ్నే. తత్వవిజ్ఞాన = ప్రాప్యమగు తత్వమునుగుఱించిన జ్ఞానమున్ను, అనుష్ఠానవిజ్ఞాన = పొందుటకుపాయమగు కర్మానుష్ఠానజ్ఞానమున్ను. స్థేమ్నే = దృఢముగా నుండుటకై, షోడశే = పదునారవ యధ్యాయమున, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ మనుష్యులలో శాస్త్రమునకు కట్టుబడియుండువారు దేవతలనియు, కాని వారు ఆసురులనియు విభజించి, ప్రాప్యమగు తత్వమును గుఱించిన జ్ఞానమున్ను, దానికుపాయమైన కర్మానుష్ఠానమును గురించిన జ్ఞానమున్ను వేదమువలననే కలుగవలసినవిగాన నా జ్ఞానములు దృఢముగా గలుగుటకై యా శాస్త్రమునకు వశ్యులైయుండవలెనని ఈ పదునారవ యధ్యాయమున జెప్పబడుచున్నది.

# శ్రీ భగవద్గీత - షోడశాధ్యాయము

# వి ష య సూ చి క



శ్రీ హయగ్రీవాయనమః

శ్రీ భగవద్గీతా - షోడశోఽధ్యాయః

# దైవాసురసంపద్విభాగయోగః



అవ. దైవీసంపన్నుల కుండవలసిన గుణములను జెప్పుచున్నాడు. (ఈ గుణములనుబట్టి దైవీసంపన్నుల నెఱుంగదగును.)

1. శ్లో. అభయం సత్త్వసంశుద్ధి । ర్జ్ఞానయోగ వ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ । స్వాధ్యాయ స్తప ఆర్జవమ్॥

అర్థము :- అభయం = భయరాహిత్యమున్ను, సత్త్వసంశుద్ధిః = అంతఃకరణ పరిశుద్ధియు, జ్ఞానయోగవ్యవస్థితిః = ఆత్మయాథాత్మ్యవివేకనిష్ఠయు, దానం = సత్పాత్రదానమున్ను. దమః చ = మనోనిగ్రహమున్ను. యజ్ఞః చ = ఫలాభిసంధిరహిత భగవదారాధనయు. స్వాధ్యాయః = వేదాధ్యయననిష్ఠయు, తపః = భగవత్ప్రీతికర కృచ్ఛ్రచాంద్రాయణాదులున్ను. ఆర్జవం = ఋజుప్రవర్తనయున్ను.

తా॥ భయములేకుండుట, అంతఃకరణశుద్ధి ఆత్మయాథాత్మ్య వివేక నిష్ఠ, సత్పాత్రదానము, మనోనిగ్రహము, ఫలాపేక్షలేని భగవదారాధన రూపయజ్ఞాచరణ, వేదాధ్యయననిష్ఠ, భగవత్ప్రీతి కర కృచ్ఛ్రచాంద్రాయణ ఏకాదశ్యుపవాసా ద్యనుష్ఠానము, ఋజుప్రవర్తనయు,

2. శ్లో. అహింసా సత్యమక్రోధ । స్త్యాగశ్శాన్తి రపైశునమ్
దయాభూతే ష్వలోలుప్త్వం । మార్దవం హ్రీ రచాపలమ్॥

అర్థము :- అహింసా = పరుల పీడింపకుండుట, సత్యం = భూతహితముగ చూచినది చూచినట్లు చెప్పుట, అక్రోధః = పీడించబడినను చిత్తవికారము చెందకుండుట, త్యాగః = ఆత్మహితమునకు విరుద్ధమైనదానిని త్యజించుట, శాన్తిః = బహిరింద్రియనిగ్రహము. అపైశునం = అనర్థవాక్యములు పలుకకుండుట, భూతేషు = సర్వప్రాణులవిషయమున, దయా = దుఃఖమును సహించజాలకుండుట, అలోలుప్త్వం = విషయములయందు స్పృహలేకుండుట, మార్దవం = మృదుస్వభావము, హ్రీః = అకార్యముల చేయుటలో లజ్జ, అచాపలం = కోరతగిన వస్తువు ఎదుటనున్నను చలింపకుండుట.

తా॥ ఇతరులకు బాధ కలిగించకుండుట, చూచిన విషయమును చూచినట్లు భూతహితముగ తెలుపుట, తాను పీడించబడినను చిత్తవికారమును జెందకుండుట, ఆత్మహితమునకు విరుద్ధమైనదానిని విడచుట, బహిరింద్రియ నిగ్రహము, పరుల కనర్థమును కలిగించు వాక్యముల నితరులతో జెప్పకుండుట, భూతదయ, విషయాసక్తి లేకుండుట, సజ్జన సాంగత్యమున కర్హమైయుండుట, కూడని పనుల జేయుటలో సిగ్గుపడుట, విషయము లెదుటనున్నను చలింపకుండుట.

3. శ్లో. తేజః క్షమాధృతి శ్శౌచ । మద్రోహో నాతిమానితా
భవన్తి సమ్పదం దైవీ । మభిజాతస్య భారత ! ॥

అర్థము :— హే భారత ! = ఓ అర్జునా ! తేజః = పరాభిభవనసామర్థ్యము. క్షమా = సాపరాధులపట్ల చిత్తవికారరాహిత్యము. ధృతిః = ఆపదలయందును విధ్యుక్త ధర్మనిర్వహణము. శౌచం = బాహ్యాభ్యంతరేంద్రియముల నేక రూప మునునుంచుట. అద్రోహః = ఇతరుల స్వేచ్ఛ నరికట్టకుండుట. అతిమానితా = గర్వరాహిత్యము. దైవీం = దేవతాసంబంధమైన. సంపదం = సంపత్తును. అభిజాతస్య = అభిముఖముగ జేసికొని జన్మించినవానికి. భవన్తి = కలుగుచున్నవి.

తా॥ ఓ అర్జునా ! శత్రువులచే నెదిరింపబడజాలని సామర్థ్యము, తన కపరాధము చేసినవారల విషయమున తన చిత్తములో క్రోధ విషాదములు లేకుండుట, నిశ్చయించుకొనిన పనిని ఎన్ని విఘ్నములు వచ్చినను నిర్వహించుట, శాస్త్రీయకృత్యముల నాచరించుటలో బాహ్యేంద్రియములను అంతరింద్రియములను యోగ్యమగునటులయుంచుట, ఇతరుల సక్రమస్వేచ్ఛ నరికట్టకుండుట, గర్వపడకుండుట, ఇవియన్నియు భగవదభిముఖుడైన వానియొక్క సంపత్తనబడును.

అవ. ఆసురసంపన్నుల గుణములను సంగ్రహముగా జెప్పుచున్నాడు.

4. శ్లో. దమ్భో దర్పోఽభిమానశ్చ । క్రోధః పారుష్య మేవచ
అజ్ఞానం చాభిజాతస్య । పార్థ ! సమ్పద మాసురీమ్॥

అర్థము :— హే పార్థ! = ఓ అర్జునా! దమ్భః = ప్రసిద్ధికై దానాదులచేయుట, దర్పః = గర్వమున్ను, అభిమానః చ = దురభిమానము, క్రోధః = కోపము, పారుష్యంచ ఏవ = సజ్జనుల కుద్రేకము కలిగించు స్వభావము, అజ్ఞానం = తెలివిలేమియు, (అనునివి) ఆసురీం = అసురసంబంధమైన, సమ్పదం = సంపత్తును, అభిజాతస్య = అభిముఖముగ జేసికొని జన్మించినవానికి, భవన్తి = కలుగుచున్నవి.

తా॥ ఓ అర్జునా! ధార్మికత్వ ప్రసిద్ధికై దానాదుల చేయుట, గర్వము కలిగియుండుట, అభిజన, విద్యా ధన దురభిమానము, పరులను బాధించు చిత్తవికారము కలిగియుండుట, సాధుశీలుర కుద్రేకము కలిగించు స్వభావము, పరావర-తత్త్వములను కృత్యా-కృత్యము లను నెఱుంగకుండుట, అనునివి భగవదాజ్ఞ నుల్లంఘించు ఆసురసంపత్తుతో జన్మించినవానికి కలుగును.

అవ. దైవీసంపద విషయమై శ్రద్ధయు, ఆసురసంపద విషయమై జుగుప్సయు పుట్టించుటకై వాటిఫలములను జెప్పుచు అర్జునుని దైవీసంపన్నుడవని ఓదార్చుచున్నాడు.

5. శ్లో. దైవీ సంపద్విమోక్షాయ । నిబన్ధాయాఽఽసురీ మతా
మాశుచ స్సమ్పదం దైవీ । మభిజాతోఽసి పాణ్డవ ! ॥

అర్థము :— దైవీ = దేవతాసంబంధమైన, సంపత్ = సంపత్తు, విమోక్షాయ = బంధనివృత్తికిన్ని, ఆసురీ = అసురసంబంధమైనసంపత్తు, నిబంధాయ = ప్రకృతి బంధమునకున్ను, మతా = నిశ్చయింపబడినది, హేపాణ్డవ = ఓ అర్జునా! దైవీం = దేవతాసంబంధమైన, సంపదం = సంపత్తును, అభిజాతః = ఉద్దేశించి జన్మించినవాడవు, అసి = అగుచున్నావు, మాశుచః = దుఃఖించకుమా!

తా॥ దేవతా సంబంధమైన సంపత్తు ప్రకృతిబంధమును పోగొట్టును. ఆసురసంబంధమైన సంపత్తు ప్రకృతి బంధమును కలిగించును. ఓ అర్జునా! నీవు దైవీసంపత్తుగలవాడవై జన్మించితివి. దుఃఖించకుము.

అవ. ఆసురసంపత్తు మిక్కిలి యనర్థదాయకమగుటచే సుతరాంవరి జేరనీయ రాదని దాని కార్యమును విస్తరించిచెప్ప బూనుచున్నాడు.

6. శ్లో. ద్వౌభూత సర్గౌలోకేఽస్మిన్ । దైవ అసుర ఏవ చ
దైవో విస్తరశః ప్రోక్తః । ఆసురం పార్థ ! మే శృణు ! ॥

అర్థము :– అస్మిన్ = ఈ, లోకే = లోకమున, దైవః = దేవతాసంబంధమైనది, ఆసురః ఏవచ = అసుర సంబంధమైనదనిన్ని, భూతసర్గౌ = ప్రాణులసృష్టులు, ద్వౌ = రెండు, స్తః = ఉన్నవి, దైవః = దేవతాసంబంధమైన సృష్టి, విస్తరశః = విస్తారముగా, ప్రోక్తః = చెప్పబడినది, హేపార్థ = ఓ అర్జునా ! ఆసురం = అసురసంబంధమైనసృష్టిని, మే = నావలన, శృణు = వినుము.

తా॥ ఈ కర్మలోకమున భగవదాజ్ఞను పాటించు దేవసృష్టియనియు భగవదాజ్ఞ నుల్లంఘించు అసురసృష్టియనియు ప్రాణులకు రెండురకముల సృష్టులున్నవి. ఇప్పటివరకు నీకు కర్మజ్ఞాన భక్తియోగరూపమగు ఆచారముగల దేవసృష్టిని విస్తారముగా దెలిపితిని. అసురసృష్టినిగూర్చి చెప్పెద వినుము. అనగా వారి పుట్టుక ఏ యాచారముకొరకో ఆయాచారమును చెప్పెదను.

7. శ్లో. ప్రవృత్తించ నివృత్తించ । జనా న విదు రాసురాః
న శౌచం నాపిచాచారో । న సత్యం తేషు విద్యతే॥

అర్థము :– ఆసురాః = అసురస్వభావులైన, జనాః = జనులు, ప్రవృత్తించ = ప్రవృత్తిరూప లౌకికధర్మమునుగాని నివృత్తించ = నివృత్తిరూప మోక్షధర్మమునుగాని, నవిదుః = ఎఱుగరు, తేషు = వారలయందు, శౌచం = బాహ్యాభ్యంతరపరిశుద్ధి, నవిద్యతే = ఉండదు, ఆచారః చఅపి = ఆచారమున్ను కూడ, నవిద్యతే = ఉండదు. సత్యంచ = సత్యమున్ను, నవిద్యతే = ఉండదు.

తా॥ భగవదాజ్ఞ నుల్లంఘించు అసురజనులు ఐహిక ఫలసాధనమైన ప్రవృత్తిరూప వైదికధర్మమునుగాని మోక్షఫలసాధనమైన నివృత్తిరూప వేదాంతరూపమునుగాని ఎఱుగరు. వీరలయందు దేహమనశ్శుద్ధులుగాని శౌచసాధనమైన అచారముగాని తెలిసిన దానిని భూతహితముగ తెలుపుటయను సత్యముగాని యుండవు.

అవ. అసురులు కేవలము సత్యమును పలుకకుండుటయేకాదు. అసత్యమున కెంతమాత్రమును జంకరని తెలుపుచున్నాడు.

8. శ్లో. అసత్య మప్రతిష్ఠం తే । జగదాహు రనీశ్వరమ్
అపరస్పర సమ్భూతం । కి మన్య త్కామ హైతుకమ్॥

అర్థము :– తే = ఆ యసురస్వభావులు. జగత్ = జగత్తును. అసత్యం = అబ్రహ్మాత్మక మనియు. అప్రతిష్ఠం = బ్రహ్మమునందుండనిదనియు. అనీశ్వరం = నియామకుడులేనిదనియు. ఆహుః = చెప్పుదురు. అపరస్పరసమ్భూతం = స్త్రీ. పురుష పరస్పర సంగమువల్ల పుట్టినట్టి. అన్యత్ = మరియొకటి. కిం = ఏదికలదు? జగత్ = జగత్తు. కామహైతుకం = కామమేకారణముగా కలది (యని). ఆహుః = చెప్పుదురు.

తా॥ ఇట్టి ఆసుర స్వభావులీ జగత్తును బ్రహ్మాత్మగా కలదనిగాని బ్రహ్మమునందే స్థితికలదనిగాని బ్రహ్మచేతనే నియమింపబడున దనిగాని అంగీకరించరు. కేవల స్త్రీ పురుషుల కామరూప సంభోగ జనితమైనదందురు. అంతకంటె దీనికి మరియొక హేతువేదియు లేదందురు.

9. శ్లో. ఏతాం దృష్టి మవష్టభ్య । నష్టాత్మానోఽల్ప బుద్ధయః
ప్రభవన్త్యుగ్ర కర్మాణః । క్షయాయ జగతోఽశుభాః॥

అర్థము :– ఏతాం = ఇట్టి. దృష్టిం = జ్ఞానమును. అవష్టభ్య = అవలంబించి. నష్టాత్మానః = దేహాత్మాభిమానులై. అల్పబుద్ధయః = అజ్ఞానులై. ఉగ్రకర్మాణః = క్రూరవ్యాపారులై. అశుభాః = పాపులై. జగతః = జగత్తు యొక్క. క్షయాయ = నాశనముకొఱకు. ప్రభవన్తి = పుట్టుచున్నారు.

తా॥ ఇదివరలో తెలిపినట్టి దుర్బుద్ధులు కలవారై దేహముకంటె అతిరిక్తమైన ఆత్మయున్నదను జ్ఞానము లేనివారలై దేహాత్మ భేదమును తెలియనివారలై పరహింసారూప క్రూరవ్యాపారులై పాపులై ప్రపంచమును నశింపజేయుటకై పుట్టుచున్నారు.

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
| --- | --- | --- | --- |
| 220 | అగ్రణీః | మహోదారతయా భక్తా<br>నగ్రిమం పశ్చిమం పదమ్।<br>నయతీ త్యగ్రణీః ప్రోక్తో<br>భక్తమోక్షప్రదో మనుః॥ | అందరును జీవించవలెననెడు గంభీర సంకల్పముకలవాడు. మిక్కిలిగొప్ప ఉదారస్వభావము కలవాడుగాన తన భక్తుల నందర నుత్తమస్థానమునకు గొనిపోవువాడు దీనిని ఓమ్ అగ్రణ్యే నమః యని మంత్రముగా నాదరించుచో నిది భక్తులకు మోక్షము ప్రసాదించును. |
| 221 | గ్రామణీః | గ్రామం సమాజం సూరీణాం<br>నయతి గ్రామణీశ్చ యః। | నిత్యసూరులగోష్ఠిలో జేర్చువాడు. |
| 222 | శ్రీమాన్ | మత్స్యరూపావతారేఽపి<br>శ్రీమాన్ కమల నేత్రతః। | మత్స్యరూపధారియైనను తన పరత్వమును సూచించునట్టి కమలములను బోలిన కన్నులుకలవాడు |
| 223 | న్యాయః | న్యాయోహి యుక్తకారిత్వాత్<br>భక్తేష్వేవ విశేషతః॥ | ముఖ్యముగ భక్తులపట్ల ఉచితముగ నాచరించువాడు. |
| 224 | నేతా | భక్తైర్నియుక్తం యత్కర్మ<br>నేతా తత్కరణాదపి | భక్తులు తనకాజ్ఞాపించిన పనులనెల్ల నేర్పుతో జేయువాడు. |
| 225 | సమీరణః | భక్తేష్టచేష్టా శీలత్వాత్<br>సమీరణ ఉదాహృతః॥ | తనభక్తుల కిష్టములగు పనుల నెల్లప్పుడును జేయుచుండుటయే స్వభావముగా కలవాడు. |
| 226 | సహస్రమూర్ధా | (సహస్ర సబ్దోహ్యేన న్త్వ<br>లక్ష్మకస్స ముదాహృతః॥)<br>సహస్రమూర్ధాసో నన్త<br>శిరస్కః కీర్త్య తేతతః।<br>సహస్రమూర్ధా సస్యార్వా<br>పుంసూక్తో ద్వ్యక్తనామవాన్. | అనేకములైన తలలు కలవాడు.<br>ఈ పేరు పురుషసూక్తములో వాడబడినది. |
| 227 | విశ్వాత్మా | ఆభ్యాం ఇచ్ఛా జ్ఞానకర్మాభ్యాం<br>విశ్వాత్మా వ్యాపనా త్స్మృతః॥ | ఈ చెప్పబోవు జ్ఞానకర్మలచే నంతటను వ్యాపించి యుండువాడు. |
| 228<br>229 | సహస్రాక్షః<br>సహస్రపాత్ | అక్షిపాదపదే జ్ఞాన<br>కర్మేంద్రియ నిదర్శకే॥ | అక్షిపదము జ్ఞానమును పాదపదము కర్మను తెల్పును గాన హద్దుమీరిన జ్ఞానకర్మలు కలవాడు. |

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| | | తేనాన్త జ్ఞానకర్మా సహస్రాక్షః సహస్రపాత్। | |
| 230 | ఆవర్తనః | సంసారాఖ్యే ఘువేయన్త్రే పరివర్తన శీలతః॥ చక్రవచ్చ విశేషణ హ్యావర్తన ఇతీరితః | సంసారమను మోహయంత్రము నెక్కించి ప్రాణులను వారివారి కర్మానుగుణముగా చక్రమును త్రిప్పినచందమున త్రిప్పుచుండువాడు. |
| 231 | నివృత్తాత్మ | త్రిపాద్విభూతికత్వేన భవపాద విభూతితః॥ ఉద్గతాత్మ స్వరూపత్వాత్ నివృత్తాత్మేతి కథ్యతే॥ | వైకుంఠధాముడుగా సంసారవిభూతి నతిక్రమించిన తన స్వరూపము కలవాడు |
| 232 | సంవృతః | తామసానాన్తు మూఢానాం గూఢత్వాత్ సంవృత స్స్మృతః॥ | తామసులగు మూఢులకు తనరూపమును జూపనివాడు. |
| 233 | సంప్రమర్దనః | తమస్స్వ విద్యయాసమ్యక్ మర్దనాత్ సంప్రమర్దనః॥ | తనసెరింగిన భక్తులతమోగుణమును మొదలంట పెకలించి పారద్రోలువాడు |
| 234 | అహస్సంవర్తకః | అహర్లక్షితకాలస్య పరివృత్తేశ్చ సాధనమ్॥ (అహస్సంవర్తక ఇతి ప్రాహుర్వేదాన్త పారగాః॥) | పగలు మొదలగు కాలమునంతను ప్రవర్తింప జేయువాడు. |
| 235 | వహ్నిః | విశ్వస్య దేశరూపేణ వహనా ద్వహ్ని రుచ్యతే॥ | ప్రపంచమునంతను పరమపదము ఆకాశము దిక్కులు విదిక్కులు మొదలగు దేశరూపములతో బదముక్త నిత్యాదికమును వహించువాడు. |
| 236 | అనిలః | బద్ధాదే రననా ద్యోసా అనిలః పరికీర్తితః | బద్ధాదులను జీవింపజేయువాడు. |

# నవవిధభక్తులు

శ్రీమాన్ విద్వాన్ కె. కం. గోపాలాచార్యులుగారు

[వెనుక సంచిక తరువాయి]

అందులకు భగవానుడు బ్రహ్మదేవునితో ఏమి శెలవిచ్చెనో వినుడు :-

శ్లో॥ అన్నాద్యం పురతో న్యస్తం దర్శనా ద్గృహ్యతే మయా
రసాన్ దాసస్య జిహ్వాయా మశ్నామి కమలోద్భవ! ॥

చతుర్ముఖా! నాముందు భక్తులుంచెడు అన్నాదులను నేను దృష్టితోనే స్వీకరింతును. వినలేదా శ్రుతివాక్యము. 'న దేవా అశ్నన్తి న పిబన్తి ఏతదే వామృతసదృశం దృష్ట్వా తృప్యన్తి (ఛాందో) దేవతలు తినరు. త్రాగరు. అమృతమువలె భోగ్యమైన యీసోమరాజ శరీరధారియగు పుణ్యచేతనుని జూచి తృప్తిపడుదురని పంచాగ్ని విద్యాప్రకరణమున గలదు అయినచో నీవు రుచి నెట్లెరుంగుదువన్న నేను నాభక్తుల జిహ్వాగ్రమునుండి రుచుల నారయుదును అనిజెప్పెను ఈ రహస్యమును శ్రీజగన్నాథమున పూర్వము ప్రత్యక్షముగ నర్చకు లెఱుంగుచుండిరని ఐతిహ్యము. కలదు.

భగవంతుడు ప్రత్యక్షముగ వచ్చి తినుటకు సంశయమేమి. అయినది:-

శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజా మ్యహమ్॥ గీత- 4. అ॥ శ్లో

అనెడు నియమము. మఱికొంతటి దృఢాధ్యవసాయమున్నచో నెద్దియు నసంభవము కాదు.

ఒక మహాత్ముడు నందగోకుల పరిసరారణ్యమున పర్ణశాలలో నివసించుచు శ్రీకృష్ణుని బాలక్రీడలు గోపగోపీముఖమున కర్ణాకర్ణికగావిని దర్శించు కుతూహలముతో నేగ నందయశోదలాదరించి శ్రీకృష్ణునిచే నమస్కరింపజేసిరి. ఆ ఋషిహృదయము నా కృష్ణుడాకర్షించుకొని పోయెను, నందయశోదల ప్రార్థనచే నా ఋషి పరవశతతో నే క్షీరాన్నమును పక్వముజేసి కనులు మూసికొని పరమపురుషునకు భక్తితో పాయసాన్నమును నివేదించి కనులు తెరచుసరికి దేవతార్చనపీఠముపై నా కృష్ణుడే కూర్చుని తినుచుండుటగాంచి యాతని మహిమను గుర్తించజాలక యది బాలలీలగా పరిగణించి లేచిపోనుద్యుక్తుడుకాగా నంద యశోదలదివిని ఖిన్నహృదయులై తిరిగి వేరొకస్థలమున పక్వముగావింప వేడుకొని శ్రీకృష్ణుని తగు నట్టు బాలులో నుంచినను తిరిగి నివేదన సమయమున నా కృష్ణుడు సిద్ధము. కృష్ణుమాడు

సాన్ను జరుగుసరికా ఋషికాతత్వము తలకెక్కి ఆహా! నా యిష్టదైవము తెలిసె. తండ్రీ! నా ప్రార్థన ననుసరించి వేంచేసి యారగించితివా? ఆహా! నీమాయ నెఱుంగజాలని మూఢుడనై యిది బాల లీలయని యలిగితిని. క్షమింపమని పరి పరి ప్రార్థించి వేంచేసెనను పౌరాణికగాథయొకటి గలదు. సమర్పించినవారికన్నియు యదార్థములే భగవంతుడు అఘటితఘటనా పటుడుగదా! అట్లారగించిన ప్రసాదమమృతమగునని శాస్త్రము. ప్రహ్లాదునకు కాలకూటవిషమిశ్రాన్న మొసంగుచునే ఆతడు తనయభావిచ్చెగా :-

శ్లో॥ జరయామాస కృత్స్నర్యం। అనన్తోదారనిస సః॥ (వి. పు)

భగవంతునకు మానసికముగ నివేదించి యమృతమయ మొనర్చి జీర్ణించుకొనలేదా! కావుననే పెద్దలు ప్రసాదమును నివేదించునప్పుడు

శ్లో॥ యా ప్రీతిర్విదురార్పితే మురరిపో!
కున్త్యర్పితే యాదృశీ।
యా గోవర్ధన మూర్ధ్ని యా చ పృథుకే
స్తన్యే యశోదార్పితే।
భారద్వాజ సమర్పితే శబరికాదత్తే ఽ
ధరే యోషితామ్।
యా ప్రీతిర్మునిపత్నిభక్త్యంచితే
ప్రీత్యాపి తాంతాం కురు॥

అని భగవంతుడాయా యవతారములలో భక్తులర్పితిని ప్రీతితో నారగించిన ఉదాహరణలననుసంధింతురు.

ఈ ప్రసాదమహిమకొక నిదర్శనమును చూడుడు.

శ్లో॥ యానికానిచ పాపాని బ్రహ్మహత్యాదికానిచ।
అన్నమాశ్రిత్య తిష్ఠన్తి సంప్రాప్తే హరివాసరే॥

ఏకాదశి దివసమున బ్రహ్మహత్యాది మహాపాపము లన్నియు నన్నమునందుండును గాన ఆనాడన్నమును తినుట పాపమునే తినుటయని చెప్పబడినను :-

శ్లో॥ 'ఏకాదశ్యాం కణం గ్రాహ్యమ్'

అనగా మందిరమునకేగినపుడానాడునొక ప్రసాదకణమునైనను స్వీకరించనిచో ఆ పాపములన్నియు వీనికి సంక్రమించునని చెప్పుటచే భగవంతునకు నివేదించిన ప్రసాదమహిమ తెలియుటలేదా?

నాల్గవ ఉపచారము సాంధ్యష్టికము :—

సాంధ్యష్టికములనగా దీపాదులర్పించుట. భగవన్మందిరములలో నీపారాధనకు చెప్పబడిన ఫలమింతింతగాదు. అబుద్ధిపూర్వకముగా జేసిన నీకైంకర్యమునకే మహాత్మ్యము చెప్పబడియుండగా బుద్ధిపూర్వకముగా జేసినదాని ఫలమునకు హద్దేమికలదు.

శ్రీ విష్ణుధర్మమున :-

లలితాదేవియనెడు రాచకాంత తన సవతులచే నీపై భర్తకీ యపూర్వ వాల్లభ్యమేల యని ప్రశ్నింపబడి తన పూర్వచరిత్ర చెప్పదొడంగెను. తానొక మూషికమై భగవదాలయమున మిణుకు మిణుకు మనుచున్న దీపపువత్తిని తిననుద్యమించుసరికొక పిల్లియార్పు విన వచ్చెను ఆభయముతో క్రిందపడి ఆ పిల్లికి తానాహారమగులోపల తన మూతి తగిలి యాదీపము ప్రజ్వలించెను. అంతమాత్రమునకు తనకు ఈ రాజకాంతయగుట, ఇంతటి భర్తృవాల్లభ్యమును బడయుట, జన్మాంతరస్మృతి యివియన్నియు ఫలములని చెప్పెను.

ఇవియన్నియు విగ్రహారాధనా విధానమున నారయుదము.

ఇక బాహ్యార్చనలో రెండవదియగు వైశ్వరూప్యారాధనావిధానమును విమర్శింతము,

'చిన్తయ సర్వం చిదచిద్రూపం తను రితి తస్య హరే రనురూపమ్
తస్మాత్కస్మిన్ కలయసి కోపం పశ్చాద్భజసి దురాపం తాపమ్।

(భజయతిరాజః)

చేతనాచేతనాత్మక ప్రపంచమంతయు సర్వేశ్వరుని శరీరమేయని భావించుము. అట్టి తరి నీ వెవ్వరిపై కోపింతువు, ఎవ్వరిని దూరుదువు. ఎవరిని హింసింతువు. అట్లొకవేళ చేసితివా పైరహస్యము జ్ఞాపకమురాగానే భగవంతునకే యపచారములు చేసితినని మిక్కిలి పరితపింతువుసుమా' యని భజయతిరాజస్తోత్రమున హెచ్చరింపబడెను కావున సర్వమును భగవచ్ఛరీరమే. యనిభావించి యథోచితముగ ఆకలిగొన్నవారికన్న మిడుట, దాహముగొన్నవారికి తీర్థమిచ్చుట వస్త్రవిహీనులకు వస్త్రమొసంగుట, రోగులకు మందులనిచ్చుట మొదలగుపనులను యథాశక్తి శ్రద్ధాసత్కారములతో చేయుటయే విశ్వరూపారాధనా విధానము. దీనికి భాగవత దశమస్కంధమున గోవర్ధనోద్ధరణ ఘట్టమునందలి పూర్వగాథ గాంచనగును

ఇంద్రయాగమునకు నందాదులు గావించు ప్రయత్నములను గాంచి శ్రీకృష్ణపరమాత్మ ఇది కామ్యకర్మగాన దీనినుండి వీరలనుద్ధరించవలెనని సంకల్పించి తండ్రివలన వృత్తాంతము నంతను నారసి దాని ననేక శాస్త్రోక్తయుక్తులతో ఖండించి చివరకీ యర్చననుగూర్చి తన సిద్ధాంతమును వినిపించెను.

శ్లో॥ పచ్యతాం వివిధాః పాకాః సూపాన్తాః పాయసాదయః
హూయన్తా మగ్నయ స్సమ్యక్ బ్రాహ్మణై బ్రహ్మవాదిభిః।
అన్నం బహువిధం తేభ్యో దేయం వో ధేనుదక్షిణాః।
అన్యేభ్య శ్చాశ్వచణ్డాలపతితేభ్యో యథార్హతః।
యవసం చ గవాం దత్వా గిరయే దీయతాం బలిః॥
ఏత న్మమమతం తాత క్రియతాం యది రోచతే।
అయం గోబ్రాహ్మణాద్రీనాం మహ్యం చ దయితో మఖః॥

అనేకవిధములగు పక్వాన్నముల నన్నింటిని సిద్ధపరచుడు. వేదవేత్తలగు బ్రాహ్మణోత్తములచే నగ్నిహోత్రములు గావింపజేయుడు వారికిష్టములగు సదక్షిణ భోజనమిడుడు. గోవులకు గ్రాసము నొసంగుడు. పర్వతమునకు పూజలొనరించి బలియొసంగుడు ఇదినాయభీష్టము. గో బ్రాహ్మణులు సంతసింతురు. మీకిష్టమైనచో నాచరింపుడు! అని బ్రాహ్మణులు మొదలుకొని పశువులు పక్షులు, అభిశప్తులు, పతితులు, చివరకు స్థావరములవరకు జగత్తునందలి సకల చేతనాచేతనముల నారాధింపుమనియు, అది తనకిష్టమనియు సెలవిచ్చెను. ఇదియే విశ్వరూపారాధనము.

ఇక నాభ్యంతరారాధనముగా :—

శాస్త్రములలో వర్ణించబడినటుల తనకిష్టమగునొక యత్తాకిరరూప లావణ్యములు కలిగి సౌందర్య మాధుర్యమయమై పరమ తేజోమండితమై యలరారు విగ్రహమును ఆపాదమస్తకము వస్త్రాభరణ ఆయుధాదివిభూషితమై, యున్నట్లు మనస్సున సృష్టించుకొని యచ్చటనే నొక రత్నపీఠముపై వేంచేపుచేసికొని మానసిక షోడశోపచారములను శ్రద్ధాభక్తులతో సమర్పించుట అభ్యంతరారాధన యనబడును.

ఇట్టియారాధనను కంసునిపంపున శ్రీకృష్ణుని ధనుర్యాగనెపమున, తోడితెచ్చుటకేగు చున్న అక్రూరయానఘట్టమున శ్రీ విష్ణుపురాణములో చక్కగ వర్ణించెను.

శ్రీమద్భాగవతమున కేవల చరణార్చనకే సకలఫలములును జెప్పబడెను

శ్లో॥ స్వర్గాపవర్గయోః పుంసాం।
రసాయాం భువి సమ్పదామ్।
సర్వాసా మపి సిద్ధీనాం।
మూలం తచ్చరణార్చనమ్॥ (భాగ. 10. 18. 19)

స్వర్గసుఖానుభవమునకును, పరమపదప్రాప్తికిని, భూపాతాళాది అధోలోకసంపదలకును, సకలవిధసిద్ధులకును మూలమీ భగవదర్చనయే.

వేయేల తన వర్ణాశ్రమ ధర్మములు తాను నిష్కామబుద్ధితో నాచరించుటయే సులభతర భగవదర్చనా విధానమని భగవానుడు భగవద్గీతలో నానతిచ్చెను.

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం।
యేన సర్వ మిదం తతమ్।
స్వకర్మణా త మభ్యర్చ్య
సిద్ధిం విందతి మానవః॥ (గీ. 18 అ. 46 శ్లో)

ఎవనివలన సకలభూతములును పుట్టుచున్నవో, ఎవడీ సమస్త ప్రపంచమునందును వ్యాపించియున్నాడో అట్టి భగవానుని స్వవర్ణాశ్రమోచిత కర్మచే నారాధించిన మానవుడు భగవదనుగ్రహమువలన మోక్షమును బడయగల్గును.

—o—

# వార్తా మాల

[వెనుక సంచిక తరువాయి]

అన్య శేషత్వపుయలవాటు యెటుల నశించు ననగా సర్వేశ్వరుడు గొప్పవారందరి కంటెను గొప్పవాడు. దేవతలకందరకును దేవుడు అను విషయమును సదా మననము చేయుచుండినచో ఆయనకు తప్ప తదితరులకు తాను శేషభూతుడగుట సంభవించదు.

దేహాత్మాభిమానమెపుడు నశించుననగా - దేహము అనిత్యమైనది ప్రకృతి వికారమైనది, అది అచేతనము - జ్ఞానవిహీనమైనది. జీవుడు నిత్యమైనవాడు - ప్రకృతికంటె విలక్షణుడు. అతను చేతనుడు. జ్ఞానానందములు గలవాడు అని సదా భావనజేయుచున్నచో దేహమె యాత్మయను బుద్ధి నశించిపోవును.

మమకార మెటుల నశించుననగా :- ఈ విభూతి యంతయును కూడ సర్వేశ్వరునిది అందులో జేరిన నేనుకూడ సర్వేశ్వరుని సొత్తే. యని మననము చేయుటవలన దీనిలో దేనియందును 'ఇది నాది' యను మమకారము లేకుండగ నశించిపోవును.

2) సర్వేశ్వరుడే ఉపాయము యను ఉపాయజ్ఞానమును కలుగకుండ జేయునట్టి విరోధు లేవియనగా :- సాధనాంతరము, స్వయోగ్యత, ద్రవ్యము; అధికారి విశేషణము; **అభిమతము;** అనునవి.

వీటి విరోధమునుండి తప్పించుకొనుట యెటులననగా :-

ఈ జీవునికి ఈ శరీరము శేషభూతమైనటుల ఈ జీవాత్మయు పరమాత్మకు శేషభూతమైనది గాన ఆయనయందలి అతిశయమును అనుభవించి వెల్లడించి ప్రకటించుట మాత్రమె నా స్వరూపమను విషయమును స్మరించుకొనుచుండుట వలన సాధనాంతరములందలి బుద్ధి నశించును,

స్వయోగ్యత యెటుల నశించుననగా :- తాను కర్మ-అవిద్య-రుచి-వాసన ఇత్యాదులకే బద్ధుడై యుండు స్థితిని తలంచుకొనినచో తనంతట తాను విముక్తుడు కాగలుగుటకు వలయు యోగ్యత ఏదియు తనయందు లేదను నిశ్చయము గలుగును తద్వారా స్వయోగ్యతా బుద్ధి తొలగిపోవును. ద్రవ్యమువలన దోషమెటుల నశించుననగా- ద్రవ్యము అచేతనము గాను జ్ఞానవిహీనమైనదగుటచే ఇష్టానిష్టముల తెలుసుకొను యోగ్యత లేనిది గాన ద్రవ్యము సాధనము కాజాలదని తెలుసుకొనుట ద్వారా ఈ దోషము నశించును.

అధికారివిశేషణమువలన కలిగి విరోధమెటుల నశించు ననగా - అధికారికిగల యోగ్యత యనునది చైతన్యముండుటవలన గదా కలిగినదను విషయమును మననము చేయుట వలన అది సాధనము కాజాలదను విషయము తెల్లమగును. స్వాభిమతము వలన కలిగిన దోష

కోపము నశించునగా :- సర్వేశ్వరుడు సిద్ధసాధనుడు, వేరే యితరమైన వేనియొక్క యెట్టి సహాయమును అపేక్షించడు. సహించడు. అందుచే తనయొక్క యిష్టము ఎంతమాత్రముసాధనము కాజాలదను సత్యమును చక్కగ గ్రహించుటద్వారా స్వాభిమతను సాధనమను కొను దోషము నశించును.

6) సర్వేశ్వరుని నిత్యకైంకర్యరూప పరమపురుషార్థమును పొందకుండ జేయు విరోధులేవి యనగా - స్వదేహమందు భోగ్యబుద్ధియును, దేహసంబంధమును బట్టి తటస్థించు విషయములయందు కలి పురుషార్థబుద్ధియును; స్వర్గైశ్వర్యము నందు పురుషార్థ బుద్ధియును; బ్రహ్మలోక ప్రాప్తియందు పురుషార్థ బుద్ధియును, కైవల్య ప్రాప్తియందు పురుషార్థబుద్ధియును అయియున్నవి.

స్వదేహమందు భోగ్యతాబుద్ధి యెటుల నశించుననగా :-

దేహము స్వభావసిద్ధముగనే, ఎన్ని ఉపచారములు మార్పులు చేయబడినను దుర్గంధ భూయిష్టమైనదగుటచే. తదనుభవమును విచారించుటద్వారా స్వదేహమందలి భోగ్యతాబుద్ధి నశించును. దేహసంబంధమును బట్టి తటస్థించు విషయముల యందు పురుషార్థబుద్ధి యెటుల నశించుననగా :- విషయములు దేహసంబంధమును బట్టి వచ్చునవన్నియును ఆ దేహమునకు వానికనుకూలముగను, ఉపకారముగను, అనుగుణముగను, అనుభవయోగ్యముగను ఉన్నంతవరకు మాత్రమే అవివానిలో సంబంధముగలవై యుండును. అవి తనకుగానయినవి గావు గాన యిందుల కేమాత్రము విరుద్ధము తటస్థించినను ఆ సంబంధము తొలగి పోవును. ఈ విషయమును అనుభవపూర్వకముగ మననము జేయుట వలన దేహమును బట్టి తటస్థించు విషయములందలి పురుషార్థబుద్ధి తొలగిపోగలదు.

స్వర్గైశ్వర్యమునందలి పురుషార్థబుద్ధి యెటుల నశించుననగా:- స్వర్గైశ్వర్యము అల్పమైనది - అస్థిరమైనది. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" అని మనము సంపాదించుకున్న పుణ్యముపై ఆధారపడి యుండును. అది సంపాదించుటకు ముందు దుఃఖము. అది యనుభవించుచున్నపుడు ఆ సుఖము తిరిగి పోవుచున్నది గదా యికముందు ఇది యుండదు గదా యని దుఃఖము- ఆ పుణ్యము అయిపోయిన తరువాత మర్త్యలోకమునకు రాకతప్పదు గాన పుణ్యము పోయెనే స్వర్గసుఖము పోయెనే యని దుఃఖము. ఇటుల అన్ని విధముల దుఃఖానుభవ రూపమైనది, అని తెలుసుకొనుట ద్వారా స్వర్గైశ్వర్యమునందలి పురుషార్థ బుద్ధి నశించును.

బ్రహ్మలోకప్రాప్తియందలి పురుషార్థబుద్ధి యెటుల నశించుననగా :-

బ్రహ్మలోకమును పొందినవారుకూడ క్షుత్పిపాసలకు లోనై యుందురు. సక్రమదాన ధర్మములను జేయక తదితరపుణ్యవిశేషముల నాచరించినవారు బ్రహ్మలోకమును పొందిన తరువాతకూడ నీ లోకమునకు వచ్చి కుక్కమాంసమును తినిపోవుదురని శాస్త్రమున జెప్పియున్న

# ప్రచార విభాగము

## సాంఘిక వార్తలు

**బరంపురం**

ఇచ్చట శ్రీ యతిరాజసేవా మహిళామండలి వార శ్రీ తిరువేంగడము డయాన్ సన్నిధిలో చాతుర్మాస్య శాంత్యుత్సవ అష్టోత్తర శతసహస్రనామ కార్యక్రమమును పరమవిలక్షణముగా జరిపిరి. ఈ కార్యక్రమములో స్థానిక విద్వాంసులగు శ్రీమాన్. ఉ. వే. తి. పె. రాఘవాచార్య స్వామివారు శ్రీమాన్. ఉ. వే. తోగుమ్మి పార్థసారధి స్వామిగారు శ్రీమాన్. ఉ. వే. కందాళ వెంకట నరసింహాచార్య స్వామివారు ప్రాధాన్యము వహించిరి ఈ మహోత్సవమునందు శుక్రవార నిత్యవిధి సమయమున జరిగిన నవమ వార్షికోత్సవమున వాక్యపాఠర గ్రంథపరీక్ష జరిగినది. పరీక్షనిచ్చినవారికి శ్రీ యతిరాజ సేవామహిళా మండలివారు సంప్రదాయ గ్రంథములను బహూకరించిరి. ఈ పరీక్షలో శ్రీ. తి. పె. సీతమ్మ, శ్రీ గుండుమళ్ళ సీతారామమ్మ, శ్రీ గాదె సత్యవతమ్మ, శ్రీ గాదె యశోదాలలిత, శ్రీ ఆమంచ లక్ష్మీనరసమ్మ, శ్రీ న్యాపతి సీతారామమ్మ, శ్రీ గాదె లక్ష్మీనరసమ్మ, శ్రీ కాసూరి లక్ష్మీనరసమ్మ, శ్రీన్యాపతి లక్ష్మీనరసమ్మ, గార్లు అన్వయించిరి. ఈ కార్య నిర్వాహణములో దేవస్థానం ట్రస్టీ వర్గము వారు ఎంతయో తోడ్పడిరి.

శ్లో॥ యతిరాట్సేవా మహిళా, మండలీ శోభతే సదా
"తిర్వేంగడంబా" విదుషీ, సుగుణా" కార్యదర్శినీ॥

ఈ చాతుర్మాస శాంతుత్సవ కట్నముగా శ్రీవిశిష్టా ద్వైత ప్రచారసంఘమునకు బరంపురం శ్రీ యతిరాజ సేవా మహిళామండలి వారు 5/ అయిదురూపాయలు సమర్పించిరి. శ్రియః పతి యీసంఘమునితోఽధికాభివృద్ధి యగునట్లుగా కటాక్షించుగాక.

**విశాఖపట్నం :**

శ్రీమాన్. డాక్టరు నందూరి వెంకటాచార్యులుగారు 14–1–60 వ తేది ఉదయము 7 గం॥ లకు పరమపదించిరని తెలియజేయుటకు ఎంతయు విచారించుచున్నాము. వీరు గవర్నమెంటు వైద్యశాలలలో అచ్చటచ్చట R. M. O. గాను, అసిస్టెంటు సర్జెనుగాను పనిచేసిరి. బదరికాశ్రమములో మనసంఘమువారు నిర్మించిన అష్టాక్షరీ క్షేత్రమునకు రు 2000/ లు సమర్పించిరి. వీరు సింహాచలములో భగవద్రామానుజులవారి తిరునక్షత్రోత్సవములో తదీ యారాధనమున్ను విశాఖపట్నం A. V. N. కళాశాలలో చదువు శ్రీవైష్ణవ బాలికలకు సహాయముగా కొంత నిధిని ఏర్పాటు చేసి యున్నారు. వీరి పరమపదోత్సవమునాడు సంఘ సంభావనగా రు. 20/ లు శ్రీ నందూరు రామానుజా చార్యులు గారు పంపిరి.

**భట్టిప్రోలు :**

ఇచ్చట శ్రీ యతిరాజసేవా మహిళామండలివారు తమసంఘ ద్వితీయ వార్షికోత్సవమును 3 రోజులు మహా వైభవముగా జరిపిరి మొదటదినమున శ్రీ రాజ్యలక్ష్మి అమ్మవారిని బ్యాండుమేళములు భజనలతో ఊరేగింపుజరిగెను. రెండవనాడు ఏలూరు కాపురస్తురాలగు శ్రీమతి తెలికిచెర్ల కందాళ సీతమ్మగారి అధ్యక్షతలో సభజరిగెను శ్రీ సీతమ్మ గారు అర్థ పంచకజ్ఞానమును గురించి యుపన్యసించిరి. తరువాత శ్రీ చిలకమర్రి అండాళ్ తాయారు ఆధ్వర్యమున కృష్ణలీలను భరతనాట్యరూపమున ప్రదర్శింప బడెను. ఈ ఉత్సవమును శ్రీ చిలకమర్రి రామానుజమ్మగారు అత్యంత శ్రద్ధాభక్తులతో నిర్వహించి సంఘమునకు కట్నముగా రు. 5/ లు సమర్పించిరి.

**కొల్లూరు :**

శుక్రవారపూజా సందర్భములో శ్రీ తుమ్మల బసవమ్మగారు, గుమ్మడి హనుమాయమ్మగారు, గుమ్మడి పున్నమ్మగారు సంఘకట్నముగా రు. 3/ లు సమర్పించిరి.

**మద్రాసు :**

ఇచ్చట గీతామందిరములో శ్రీ యతిరాజసేవా మహిళా మండలివారు ధనుర్మాసోత్సవమును మహా వైభవముగా జరిపిరి. నాయఘనాయ్‌పాశురమునాడు శ్రీమాన్ మహావిద్వాన్ ఉ. వే. కాంచీ అణ్ణంగరాచార్యస్వామి వారు విచ్చేసి యుపన్యసించిరి. మరియు ప్రముఖులైన విద్వాంసులు పలువురు ఉపన్యసించిరి. కార్యదర్శిని అగు శ్రీమతి చంద్రమ్మగారి ఉత్సాహ శ్రద్ధాభక్తులు వాచామగోచరములు.

**ప్రొద్దుటూరు :**

ఇచ్చట శ్రీమతి కందాళ వెంకటనరసమ్మగారి యాజమాన్యమున శ్రీ శుక్రవార లక్ష్మీపూజలు చాలా వైభవముగా జరుగుచున్నవి. ఈ పూజలు శాశ్వతముగా జరుపుటకు తగిన ఏర్పాట్లు గూడా జరిగియున్నవి.

**కళింగపట్నం :**

ఇచ్చట గీతామండలి వారిచే నిర్వహింపబడిన గీతా జయంతి ఉత్సవ సందర్భములో విరివిగా అన్నదానము జరిగినది. ఈ ఉత్సవములను శ్రీమాన్ మ॥ వెం॥ రా॥ నరసింహాచార్యస్వామి వారు చాలా ఉత్సాహముగా జరిపించుచున్నారు.

శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు బందరులో శ్రీ యతిరాజ భవనమును కటాక్షించి అక్కడనుండి గాయత్రీ క్రతునిర్వహణార్థమై యాదగిరి క్షేత్రమునకు విచ్చేసిరి

యాదగిరిక్షేత్రములో 2—3—60 తేదీనుండి గాయత్రీ క్రతువు జరుగనున్నది.

శ్రీమాన్. న్యాయవేదాన్త విద్వాన్ తె కం. గోపాలాచార్యస్వామి వారు శ్రీకాకుళములో కాలక్షేపములు పూర్తిగావించి అక్కడనుండి బందరు విచ్చేసి అచ్చట శ్రీయతిరాజ భవనములో శ్రీమద్రామాయణోపన్యాసములను శ్రవణ చేయుముగా గావించి శ్రీ జీయ్యర్ స్వామివారితోపాటు గాయత్రీక్రతు నిర్వహణార్థమై యాదగిరికి విచ్చేసిరి వీరితోపాటుగా మనసంఘకవిగారైన శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యస్వామి వారున్నూ యాదగిరికి విచ్చేసి గాయత్రీక్రతు నిర్వహణప్రచారము పరిసరప్రాంతములందు గావించుచున్నారు.

**యాదగిరి క్షేత్రము :**

ఈ క్షేత్రము విజయవాడ హైదరాబాదు రైల్వేలైనులో రాయగిరి అను స్టేషనుకు 1 మైలు దూరములో నున్నది. స్టేషను వద్ద గుర్రపుబండ్లు సైకిలు రిక్షాలు దొరకును. కొండమీదనే గాయత్రీక్రతువు జరుగుచున్నది. కొండ మీద శ్రీ లక్ష్మీనృసింహస్వామివారు వేంచేసియున్నారు. దేవస్థానము వారు యాత్రికులకు వలయు సకలవిధ సౌకర్యములు సాధ్యమైనంతవరకు జరుపుచున్నారు.

ఈ గాయత్రీ క్రతువు 12—3—60 వ తేదీతో సమాప్తమగును. ఈ క్రతువునకు ప్రత్యేక ఆహ్వానితులైన మహారాజశ్రీ మదరాష్ట్రగవర్నరుగారున్నూ, శ్రీ దేవాదాయ మంత్రిగారగు శ్రీ కల్లూరి చంద్రమౌళి గారున్నూ శ్రీమండగుల నరసింగరావు గారున్నూ మరియు మరికొందరు ప్రముఖులు విచ్చేయుచున్నారు.

**చందాదార్లకు విజ్ఞప్తి**

భక్తినివేదన పత్రికకు చందాలు పంపవలసినవారు వెంటనే చందాలు పంపి పత్రికానిర్వహణలో సహకరించ గోరుతున్నాం.

సంపాదకులు
భక్తి నివేదన.

శ్రీయః పత్యే నమః

# శ్రీ గుణరత్న కోశము.

1 వ శ్లోకము

శ్లో॥ అనాఘ్రాతావద్యం బహుగుణపరీణాహి మనసో,
దుహానం సౌహార్దం పరిచిత మివాఢ్యాపి గహనం,
పదానాం సౌభ్రాత్రా దనిమిషనిషేవ్యం శ్రవణయోః,
త్వ మేవ శ్రీ ర్మహ్యం బహుముఖయ వాణీవిలసితమ్॥

:- అర్థము -:

హే శ్రీః = ఓ లక్ష్మీదేవి.
అనాఘ్రాతావద్యం.
అనాఘ్రాత = వాసన జూడఁబడని
అవద్యం = దోషములు కలిగినట్టియు,
బహుగుణ పరీణాహి =
బహు = అనేకములగు,
గుణ = గుణములయొక్క
పరీణాహి = వైశాల్యము గలిగినట్టియు,
మనసః = మనస్సునకు,
సౌహార్దం = ప్రీతిని,
దుహానం = పితుకునట్టిదియు,
పరిచితం + ఇవ = అభ్యసింపబడినది వలెనుండు నట్టిదియు;
ఆఢ్యా + అపి = అయినప్పటికిని;

గహనం = దుర్వగాహమైనట్టిదియు;
పదానాం = పదములయొక్క;
సౌభ్రాత్రాత్ = కలయికవలన,
శ్రవణయోః = చెవులకు,
అనిమిషనిషేవ్యం =
అనిమిష = అవిచ్ఛిన్నముగ,
నిషేవ్యం = అనుభవింపదగినట్టిదగు,
వాణీవిలసితం.
వాణీ = వాక్కులయొక్క,
విలసితం = విలాసమును,
త్వం + ఏవ = నీవే,
మహ్యం = నాకు,
బహుముఖయ = అన్నివిధములుగను యనుగ్రహింపుమా.

:— తాత్పర్యము :—

ఓ లక్ష్మీదేవి, ఏవిధమైన దోషగంధమైనను లేకుండునట్టియు, వుండవలసిన సమస్తగుణములతోను విలసిల్లునట్టియు, మనోరంజకమైనట్టియు, చిరపరిచితమైన శబ్దార్థములచే యనుభవింపబడునట్టి, స్వార్థములచే భావగంభీరతచే ఉపదేశగర్భార్థములతో గూడుకున్నట్టియు, వినుట కింపగు శబ్దార్థాలంకారాలంకృతమైనట్టియు, పూర్తియగు వరకు, మధ్యన వక్కనిమిషము నిలుపుటకుకూడ మనసొప్పకుండునటుల, పుస్తకోత్తర ఎడతెగని ఉత్సాహమును కలిగించునట్టియు, వాగ్వైభవమును, నిన్నాశ్రయించినట్టి నాకనుగ్రహించుమా.

గౌ [illegible] శ్రీ క్రతువునకు

[illegible]లు పంపవలసిన విలాసము

శ్రీ లక్ష్మీనృసింహస్వామి దేవస్థానము

ముంతజపు

యాదగిరిపల్లె:— (భువనగిరితాలూకా - నల్లగొండజిల్లా).

సాలుచందా రు. 5 లు భక్తినివేదన - BOOK POST ర. నం A 195

వాసుదాసాశ్రమం :— నడిగడ్డపాలెం (పోష్టు) [వయా–చేబ్రోలు] గుంటూరు జిల్లా.

శ్రీ

శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ లైబ్రరీ
Tirupathi, (Chithur dt.)

గా 8ి

Edited and Published by Sri T. K Gopalacharyulu Garu and Printed at Liberty press, Tenali For Sriman Press, Nadigaddapalem.

శ్రీమతే రామానుజాయనమః







శ్లో॥ శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి, శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా॥

# భక్తినివేదన

[ వేదాంతమాసపత్రిక ]


సంపుటి ౧౨ | వికారి — ఫాల్గుణము | సంచిక ౧౨




శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయరు స్వామివారు, హైదరాబాదులో గల సీతారాంబాగునందున్న శ్రీ వరదరాజస్వామివారి సన్నిధిలో జరిపించిన ఉచిత ఉపనయన మండలి వటువులు.


సంపాదకులు :- న్యాయవేదాన్త విద్వాన్ తె. కం. గోపాలాచార్యులు

సహాయసంపాదకులు :- కవిరత్న గుదిమెళ్ల రామానుజాచార్యులు

1960 ఏప్రియల్

# గోపికా గీతలు

## 9 వ శ్లోకము.

శ్లో॥ తవ కథామృతం తప్తజీవనం
కవిభి రీడితం కల్మషాపహం
శ్రవణమంగళం శ్రీమదాతతం
భువి గృణన్తి యే భూరిదా జనాః॥

## :— అర్థము :—

తప్తజీవనం = తాపత్రయాభితప్తులను జీవింపజేయు నదియును,
కవిభిః = బ్రహ్మాదులచే
ఈడితం = స్తుతింపబడునదియును,
కల్మషాపహం = పాపముల నశింపజేయునదియును,
శ్రవణమంగళం = వినినంతనే నిశ్రేయస్సు నిచ్చునదియును
శ్రీమత్ = శాంత్యాది సుగుణములను గలిగించు నదియునైన,
తవ = నీయొక్క,
కథామృతం = గుణచేష్టితముల నిరూపించు కథామృతమును,
ఆతతం = విస్తారముగా
భువి = భూలోకమున
యె = ఏభాగ్యశాలులు
గృణన్తి = నిరూపించుచున్నారో,
తే = అట్టి
జనాః = జనులు
భూరిదాః = ఉత్తమశ్రేయస్సు నొసగిన వారగుచున్నారు

## * :- తాత్పర్యము -: *

ఓ కృష్ణా! నీ గుణములను నీ చేష్టితములను తెలుపునట్టి నీ చరిత్రము అమృతమయమైనది. ఇది తాపత్రయాభితప్తులయొక్క తాపముల నణచి వారల నుజ్జీవింపజేయును. బ్రహ్మాదులుకూడ నీ కథామృతాస్వాదనమునే యపేక్షింతురు గాని ఆ యప్పుసారమగు నమృతము జోలికి బోరు. అది మాధుర్యమును గర్వమును పునర్జన్మమును గల్గించును, ఇదియో సత్త్వమును కైంకర్యమును జన్మరాహిత్యమును కలుగజేయును. దీనిని వినంతనే సకలమంగళములు నొనగూడును, శాంత్యాది సద్గుణములలవడును, భూలోకములో నీ కథామృతమును వ్యాపింపజేయువారు నిజముగా భూలోకవాసులగు చేతనుల కందరకును శ్రీవైకుంఠమును కరతలామలక మొనర్చినవారగుచున్నారు.

# గోపికా గీతలు

## 9 వ శ్లోకము.

శ్లో॥ తవ కథామృతం తప్తజీవనం
కవిభి రీడితం కల్మషాపహం
శ్రవణమంగళం శ్రీమదాతతం
భువి గృణన్తి యే భూరిదా జనాః॥

## :— అర్థము :—

తప్తజీవనం = తాపత్రయాభి తప్తులను జీవింపజేయు నదియును,
కవిభిః = బ్రహ్మాదులచే
ఈడితం = స్తుతింపబడునదియును,
కల్మషాపహం = పాపముల నశింపజేయునదియును,
శ్రవణమంగళం = విన్నంతనే నిశ్శ్రేయస్సు నిచ్చునదియును
శ్రీమత్ = శాంత్యాది సుగుణములను గలిగించు నదియునైన,
తవ = నీయొక్క,
కథామృతం = గుణచేష్టితముల నిరూపించు కథామృతమును,
ఆతతం = విస్తారముగా
భువి = భూలోకమున
యే = ఏభాగ్యశాలులు
గృణన్తి = నిరూపించుచున్నారో,
తే = అట్టి
జనాః = జనులు
భూరిదాః = ఉత్తమశ్రేయస్సు నొసగిన వారగుచున్నారు

## * :- తాత్పర్యము -: *

ఓ కృష్ణా! నీ గుణములను నీ చేష్టితములను దెలుపునట్టి నీ చరిత్రము అమృతమయమైనది. ఇది తాపత్రయాభితప్తులయొక్క తాపముల నణిచి వారల సుజీవింపజేయును. బ్రహ్మాదులుకూడ నీ కథామృతాస్వాదనమునే యపేక్షింతురు గాని ఆ యపూర్వసారమగు నమృతముజోలికి బోరు. అది మాధుర్యమున గర్వమును పునర్జన్మమును గల్గించును, ఇదియో సత్త్వమును కైంకర్యమును జన్మరాహిత్యమును కలుగజేయును. దీనిని వినంతనే సకలమంగళములు నొనగూడును, శాంత్యాది సద్గుణములలవడును, భూలోకములో నీ కథామృతమును వ్యాపింపజేయువారు నిజముగా భూలోకవాసులగు చేతనుల కందరకును శ్రీవైకుంఠమును కరతలామలక మొనర్చినవారగుచున్నారు.

అవ. సాత్త్వికాహారమును జెప్పుచున్నాడు. (ఈ యాహారములనే భుజించుటచే సత్త్వగుణము వృద్ధిపొందును లేక సాత్త్వికున కిట్టి యాహారము లిష్టమగును గాన దీనినిబట్టి సత్త్వగుణాభివృద్ధి నెఱుంగవచ్చును.)

8. శ్లో. ఆయు స్సత్త్వబలారోగ్య । సుఖప్రీతి వివర్ధనాః
రస్యాస్స్నిగ్ధాస్థిరాహృద్యా । ఆహారా స్సాత్త్వికప్రియాః॥

అర్థము :— ఆయు, స్సత్త్వ, బలా, రోగ్య, సుఖ, ప్రీతి, వివర్థనాః = ఆయుస్సును, జ్ఞానమును, బలమును, ఆరోగ్యమును; సుఖమును; ప్రీతిని, వృద్ధిపొందించునవియు; రస్యాః = మధురరసముకలవియు, స్నిగ్ధాః = చమురుగలవియు, స్థిరాః = స్థిరమగు ధాతుపరిణామమును గలిగించునవియు, హృద్యాః = మనోహరములైనవియునగు, ఆహారాః = ఆహారములు, సాత్త్వికప్రియాః = సత్త్వగుణనిష్ఠుల కిష్టమైనవి.

తా॥ సాత్త్వికునకు సాత్త్వికాహారములే యిష్టమగును. ఆ యాహారములు ఆయువును పెంచును. జ్ఞానమును వృద్ధి పొందించును. బలమును బెంచును. ఆరోగ్యమును వృద్ధిజేయును. సుఖము నిచ్చును. ఆనందము నొసంగు కార్యములను చేయించి ప్రీతిని వృద్ధి బొందించును. ఆహారములు జీర్ణమగునప్పుడు సుఖము నొసంగును. తినబడిన ఆహారము రక్తమాంసాది సప్తధాతువులుగా పరిణమించి అవి చిరకాలముండునట్లు జేయును. చూచినంతనే వాటియందు ప్రీతిని బుట్టించునదియై యుండును. మధురరసముతో గూడినదై యుండును. జిడ్డు గలిగియుండును.

అవ. రాజసాహారమును దెలుపుచున్నాడు. (ఈ యాహారమును భుజించినచో రజోగుణము వృద్ధిపొందును. రాజసున కిట్టియాహార మిష్టమగును గాన దీనివిబట్టి రజోగుణాభివృద్ధి నెఱుంగవగును.)

9. శ్లో. కట్వమ్ల లవణాత్యుష్ణ । తీక్ష్ణరూక్ష విదాహినః
ఆహారా రాజస స్యేష్టాః । దుఃఖశోకామయ ప్రదాః॥

అర్థము :— కట్వమ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః—కటు = కారముగాను, అమ్ల = పుల్లగాను, అతిలవణ = మిక్కిలి యుప్పగాను, (అతి) ఉష్ణ = మిక్కిలి వేడిగాను, (అతి) తీక్ష్ణ = తినినక్షణమునుండియు ప్రతికూలించునవిగాను, రూక్ష = శోషకరముగాను, విదాహినః = మిక్కిలి దాహమును బుట్టించు నవిగాను నుండునట్టి, ఆహారాః = ఆహారములు, రాజసస్య = రజోగుణ మధికముగా కలవానికి, ఇష్టాః = ఇష్టములై, దుఃఖశోకామయప్రదాః— దుఃఖ = కష్టమును, శోక = పశ్చాత్తాపమును, ఆమయ = రోగమును, ప్రదాః = కలుగజేయునవి (భవన్తి = అగుచున్నవి).

తా॥ కారము (లేకచేదు) గాను, పుల్లగాను, మిక్కిలి యుప్పగాను, మిక్కిలి వేడిగాను, తినినక్షణమునుండియు జలుబు వేడి మొదలగు దోషములను బుట్టించి ప్రతికూలించునట్టివిగాను, వాతమును వృద్ధిపొందించి శోషింపజేయునవిగాను, పైత్యమును వృద్ధిపొందించి తాపముతోపాటు విదాహమును బుట్టించునవిగాను నుండెడి యాహారములు రజోగుణ ప్రధానుల కిష్టములగును. ఇవి రజోగుణమును వృద్ధిబొందించి ధాతువైషమ్యముద్వారా శరీరమునకు దుఃఖమును, పశ్చాత్తాపాదులచే మనోవ్యాకులతను కాలక్రమమున రోగమును కలుగజేయును.

అవ. తామసాహారమును దెలుపుచున్నాడు. (ఈ యాహారమును భుజించి నచో తమోగుణము వృద్ధిపొందును. తామసున కిట్టియాహార మిష్ట మగునుగాన దీనినిబట్టి తమోగుణాభివృద్ధి నెఱుంగదగును).

10. శ్లో. యాతయామం గతరసం । పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం । భోజనం తామస ప్రియమ్॥

అర్థము :— యాతయామం = చిరకాలమున్నదియు, గతరసం = సహజరుచిని విడిచి నదియు, పూతి = దుర్గంధముకలదియు, పర్యుషితం చ = పాసినదియు, ఉచ్ఛిష్టం అపి = ఇతరులుభుజింపగా మిగిలినదియు, అమేధ్యం = అపవిత్రమైనదియునగు, యత్ భోజనం = ఏ యాహారము, (అస్తి = కలదో, తత్ = అది) తామసప్రియం = తమోగుణ స్వభావముగలవారికి యిష్టమైనది (భవతి = అగుచున్నది).

తా॥ వండినపిమ్మట చాలకాల ముంచబడినదియు, సహజమగు రుచిని విడిచినదియు, దుర్గంధము కలదియు, ప్రాతబడి రుచిమారి పాసి నదియు, గురువులు, పెద్దయన్న, భర్తగాక ఇతరులు భుజించగా మిగిలినదియు, భగవంతునకు భగవద్భక్తులకు నివేదింపతగనిదియు నివేదింపబడనిదియునగు నాహారము తామసాహారము. ఇది తమోగుణమును వృద్ధిపొందించును. తామసులకిట్టి యాహార మిష్టమగును.

—• గ మ ని క •—

హితమును కోరువారు సత్త్వగుణాభి వృద్ధికొఱకు రాజస తామసాహారములను విడిచి సాత్త్వికాహారమునే సేవించ

అవ. గుణభేదముచే కలుగు యజ్ఞభేదములను చెప్పబూని ముందుగా సాత్త్విక యజ్ఞమెట్టిదియో చెప్పుచున్నాడు.

11. శ్లో. అఫలాకాఙ్క్షిభి ర్యజ్ఞో । విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్యమేవేతి మన । స్సమాధాయ స సాత్త్వికః॥

అర్థము:- యష్టవ్యం ఏవ ఇతి = తప్పక చేయవలసినదియే యని, మనః = మనస్సును, సమాధాయ = నిశ్చలముగా జేసికొని, విధిదృష్టః = శాస్త్రముచే నియమింపబడిన, యః యజ్ఞః = ఏ యజ్ఞము, అఫలాకాఙ్క్షిభిః = ఫలమును గోఱనివారిచేత, ఇజ్యతే = యజింపబడుచున్నదో, సః = ఆ యజ్ఞము, సాత్త్వికః = సాత్త్వికమైనది (భవతి = అగుచున్నది)

తా॥ భగవదారాధన రూపముగను, చేయుటయే ప్రయోజనముగను "నాకిది తప్పక చేయవలసినది" యనెడు మనోనిశ్చయముతోను, భగవత్ప్రీతి మాత్రమే ఫలమనియెంచి శాస్త్రోక్తమైన మంత్ర క్రియాద్రవ్యములతో గూడినట్లు చేయబడు యజ్ఞము సాత్త్వికమనబడును.

అవ. రాజసయజ్ఞ మెట్టిదియో జెప్పుచున్నాడు.

12. శ్లో. అభిసన్ధాయ తు ఫలం । దమ్భార్థ మపి చైవ యత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ! । తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥

అర్థము :- భరతశ్రేష్ఠ! = ఓ యర్జునా! యః = ఏ యజ్ఞము, ఫలం = ఫలమును అభిసన్ధాయ = కోరి, దమ్భార్థం అపిచ = గొప్పవాడనిపించుకొనుట కొఱకును, ఇజ్యతే = యజింపబడుచున్నదో, తం = దానిని, రాజసం యజ్ఞం = రాజసమైన యజ్ఞముగా, విద్ధి = ఎఱుంగుము.

తా॥ అర్జునా! ఫలాపేక్షతో కీర్తికొఱకు ఆడంబరముతో చేయబడు యజ్ఞము రాజస మనబడును.

అవ. తామసయజ్ఞమెట్టిదో జెప్పుచున్నాడు.

13. శ్లో. విధిహీన మసృష్టాన్నం । మన్త్రహీన మదక్షిణమ్
శ్రద్ధావిరహితం యజ్ఞం । తామసం పరిచక్షతే ॥

అర్థము :- విధిహీనం = బ్రాహ్మణుల యనుజ్ఞలేనిదియు, అసృష్టాన్నం = అశాస్త్రీయమైన పదార్థములు కలదియు, మన్త్రహీనం = మంత్రములులేనిదియు, అదక్షిణం = దక్షిణలసీయక చేయబడినదియు, శ్రద్ధావిరహితం = శ్రద్ధలేక చేయబడినదియునగు, యజ్ఞం = యజ్ఞమును, తామసం = తామసమునుగా, పరిచక్షతే = చెప్పుచున్నారు.

తా॥ సదాచారపరులగు విద్వాంసులైన బ్రాహ్మణులచే 'యజింపు'మని యనుజ్ఞ నొసంగబడనిదియు, అశాస్త్రీయములైన వస్తువులతో చేయబడినదియు, మంత్రలోపము గలదియు, ఋత్విక్కులకుదక్షిణల నీయక నశ్రద్ధతో జేయబడినదియునగు యజ్ఞము తామసమనబడును.

అవ. తపస్సు సత్త్వాదిగుణములను బట్టి మూడువిధములని చెప్పబూని ముందుగా శరీరవాఙ్మనస్సులవలన బుట్టుటనుబట్టి యాతపస్సును మూడువిధములని చెప్పుచున్నాడు. అందు ముందుగా శారీరతపస్సునుగూర్చి చెప్పుచున్నాడు.

14. శ్లో. దేవద్విజ గురుప్రాజ్ఞ । పూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ । శారీరం తప ఉచ్యతే॥

అర్థము :- దేవద్విజ గురుప్రాజ్ఞపూజనం—దేవ = దేవతలను, ద్విజ = బ్రాహ్మణులను, గురు = ఆచార్యులను, ప్రాజ్ఞ = జ్ఞానులను, పూజనం = పూజించుటయు, శౌచం = పుణ్యనదీస్నానాది శుద్ధియును, ఆర్జవం = మనస్సు శరీరముల కేకరూపమైన నడవడికయు, బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యమును, అహింసాచ = ఏప్రాణిని హింసించకుండుటయు, శారీరం = శరీరసంబంధమైన, తపః = తపస్సని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ దేవతలనర్చించుట, బ్రాహ్మణుల నారాధించుట, గురుశుశ్రూష జేయుట, ప్రాజ్ఞులను సన్మానించుట, పుణ్యనదులలో గ్రుంకుట, మనస్సున తలచినట్లే శరీరముతో నాచరించుట పరస్త్రీలను భోగ్యతాబుద్ధితో జూచుట రహస్యముగా వారితో మాట్లాడుట మొదలైనవి చేయకుండుట ప్రాణులకు హింసను కలుగజేయకుండుట మొదలగునవి యన్నియు శరీరసంబంధమైన తపస్సులుగా జెప్పబడుచున్నవి.

అవ. వాఙ్మయ తపస్సును జెప్పుచున్నాడు.

15. శ్లో. అనుద్వేగకరం వాక్యం । సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ । వాఙ్మయం తప ఉచ్యతే॥

అర్థము :— అనుద్వేగకరం = పరులకు దుఃఖమును కలుగజేయనట్టియు, సత్యం = యదార్థమైనట్టియు, ప్రియహితంచ = ఇష్టమును హితమునైనదియు, యత్ వాక్యం = ఏ వాక్యముకలదో, (అదియును) స్వాధ్యాయాభ్యసనంచ ఏవ = వేదము నభ్యసించుటయును, వాఙ్మయం = వాగ్రూపమైన, తపః తపస్సుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ ఇతరులకు బాధను కలిగించకుండగ యథార్థముగను, ప్రియముగను హితముగను మాట్లాడుటయు, వేదము నభ్యసించుటయు (అష్టాక్షరీ మొదలగు ఉత్తమమంత్రములను జపించుటయు) వాచిక తపస్సుగా జెప్పబడుచున్నది.

(ఇచ్చట సంస్కృత వేదమును చదువుట కధికారములేని వారు ద్రావిడవేదము స్తోత్రములు మొదలగు వాటిని పెద్దలవలన ఉపదేశమునుపొంది చదువుకొన వచ్చునని తెలియవలెను)

అవ. మానసతపస్సు చెప్పబడుచున్నది.

16. శ్లో. మనః ప్రసాద స్సౌమ్యత్వం । మౌన మాత్మవినిగ్రహః
భావ సంశుద్ధి రిత్యేత । త్తపో మానస ముచ్యతే॥

అర్థము :— మనఃప్రసాదః = మనస్సుయొక్క నిర్మలత్వమును, సౌమ్యత్వం = మనస్సుతో పరసమృద్ధిని కోరుటయు, మౌనం = మనస్సుతో వాగింద్రియమును బంధించియుంచుటయు, ఆత్మవినిగ్రహః = ధ్యేయవస్తువునందు మనస్సును నిలుపుటయు, భావసంశుద్ధిః = ఆత్మేతరములను తలంచకుండుటయు. ఇతి ఏతత్ = అనునిదియంతయు, మానసం = మనస్సుతో నిర్వహింపబడు, తపః = తపస్సుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ మనస్సున క్రోధాదులు లేకుండుట, పరులసమృద్ధి యందాసక్తి, వాగింద్రియమును యథేష్టముగా సంచరింపనీయక నియమించి మితముగా భాషించుట, ధ్యేయవస్తువునందు మనస్సును నిలుపుట ఆత్మకంటె వేరైన నేవస్తువులనుగాని చింతింపకుండుట యను నివి యన్నియు మానసిక తపస్సనబడును—

అవ. ఇక సాత్త్విక తపస్సెట్టిదియో తెలుపుచున్నాడు.

17. శ్లో. శ్రద్ధయా పరయా తప్తం । తపస్తత్త్రివిధం నరైః
అఫలాకాఙ్క్షిభిర్యుక్తైః । సాత్త్వికం పరిచక్షతే॥

అర్థము :— అఫలాకాఙ్క్షిభిః = ఫలాపేక్షలేనట్టియు యుక్తైః = భగవదారాధనబుద్ధితో కూడినట్టివారునునగు, నరైః = మనుష్యులచేత, పరయా = గొప్పదియగు, శ్రద్ధయా = విశ్వాసముతో, తప్తం = చేయబడిన, తపః = తపస్సును, సాత్త్వికం = సాత్త్వికమునుగా, పరిచక్షతే = చెప్పుచున్నారు.

తా॥ ఫలాపేక్ష లేక పరమపురుషుని యారాధన యనెడు బుద్ధితో మిక్కిలి శ్రద్ధగా నాచరింపబడు కాయిక వాచిక మానసిక తపస్సులు సాత్త్వికము లనబడును.

అవ. రాజస తపస్సెట్టిదియో తెలుపుచున్నాడు.

18. శ్లో. సత్కారమాన పూజార్థం । తపో దమ్భేన చైవ యత్
క్రియతే తదిహ ప్రోక్తం । రాజసం చల మధ్రువమ్॥

అర్థము :— సత్కారమానపూజార్థం— సత్కార = ఇతరులు మనస్సులో తనను గొప్పవాడుగా తలంచుటకొఱకును, మాన = తనను నోటితో పొగడుట కొఱకును, పూజార్థం = శరీరముతో తనకు నమస్కరించుటకొఱకును, దమ్భేన చ ఏవ = దంభముతోను, యత్ = ఏ, తపః = తపస్సు, క్రియతే = చేయబడుచున్నదో, చలం = చంచలమైనదియు, అధ్రువం = స్థిరముకానిదియునగు, తత్ = ఆ తపస్సు, ఇహ = ఇచ్చట, రాజసం = రాజసమని, ప్రోక్తం = చెప్పబడినది.

తా॥ మనస్సులో గొప్పవాడని భావించుట సత్కారము. వాక్కుతో పొగడుట మానము. శరీరముతో నమస్కరించుట పూజ. ఇవి తనకు గలుగవలెనని దంభముతో నాచరింపబడు తపస్సు రాజస మనబడును. అది యస్థిరమగు స్వర్గాదిఫలసాధనమగుటచే నస్థిరమైనదియు, క్షయించునదియునగును.

అవ తామసతపస్సెట్టిదో తెలుపుచున్నాడు.

19. శ్లో. మూఢగ్రాహే ణాత్మనో య । త్పీడయా క్రియతే తపః
పరస్యోత్సాదనార్థం వా । తత్తామస ముదాహృతమ్॥

అర్థము :— మూఢగ్రాహేణ = అవివేకముచేనైన పట్టుతోడను, ఆత్మనః = తన యొక్క, పీడయా = శరీరకష్టముతోను, పరస్య = ఇతరునియొక్క, ఉత్సాదనార్థం వా = నాశముకొఱకును, యత్ = ఏ, తపః = తపస్సు, క్రియతే = చేయబడుచున్నదో, తత్ = ఆ తపస్సు, తామసం = తమోగుణసంబంధమైనదని, ఉదాహృతం = చెప్పబడినది.

తా॥ అవివేకులు మొండిపట్టుదలతో తమశక్తి మొదలగువాటి నాలోచింపక తమశరీరమును వ్యర్థోపవాసాదులచే కృశింపజేసుకొనుచు నితరుల వినాశముకొఱకు ఆచరించు తపస్సు తామస మనబడును.

అవ. సాత్త్వికదాన మెట్టిదియో తెలుపుచున్నాడు.

20. శ్లో. దాతవ్య మితి యద్దానం । దీయతేఽనుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ । తద్దానం సాత్వికం స్మృతమ్॥

అర్థము :— దేశే = పుణ్యక్షేత్రమునందును, కాలే చ = పుణ్యకాలమునందును, క్షేత్రే చ = సత్పాత్రయందును, అనుపకారిణే = ప్రత్యుపకారము చేయలేనివాని కొఱకు, యత్ దానం = ఏ దానము, దాతవ్యం ఇతి = ఈయవలసినదియే యని, దీయతే = ఇయ్యబడుచున్నదో, తద్దానం = ఆ దానము, సాత్త్వికం = సత్త్వగుణసంబంధమైనదని, స్మృతం = తలంచబడుచున్నది.

తా॥ దానమునకు తగినవిగా శాస్త్రమున జెప్పబడిన పుణ్యదేశ పుణ్యకాలములలో ప్రత్యుపకార మెుకింతయును చేయజాలని సత్పురుషునకు ఫలమును కోరక నీయబడు దానము సాత్త్విక మనబడును.

అవ. రాజసదాన మెట్టిదో చెప్పుచున్నాడు.

21. శ్లో. యత్తు ప్రత్యుపకారార్థం । ఫల ముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం । త ద్రాజస ముదాహృతమ్॥

అర్థము :- యత్ తు = ఏదానమైతే, ప్రత్యుపకారార్థం = తిరిగి ఉపకారమును పొందుటకొఱకును, పునః = తిరిగి, ఫలం = ఫలమును, ఉద్దిశ్య = ఆశించియు, పరిక్లిష్టం = మనస్సున బాధపడుచు, దీయతే = ఈయబడు చున్నదో, తత్ = ఆ దానము, రాజసం = రాజసమని, ఉదాహృతం = చెప్పబడినది.

తా॥ ప్రత్యుపకారమును పొందవలెననెడి యభిప్రాయముతోగాని, ప్రతిఫలమును కోరిగాని, అమంగళకరమగు ద్రవ్యము నొసంగి గాని మనస్సులో నిచ్చుటకు బాధపడుచుగాని చేయబడిన దానము రాజస మనబడును.

అవ. తామసదాన మెట్టిదో తెలుపుచున్నాడు.

22. శ్లో. అదేశకాలే యద్దాన । మపాత్రేభ్య శ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం । త త్తామస ముదాహృతమ్॥

అర్థము :- అదేశకాలే = కూడనిదేశమునందును కూడని కాలమునందును, అపాత్రేభ్యఃచ = కూడనివారికొఱకు, అసత్కృతం = గౌరవములేకుండగను, అవజ్ఞాతం = ఉపచారములు లేకుండగను, యత్ దానం = ఏ దానము, దీయతే = ఈయబడుచున్నదో, తత్ దానం = ఆ దానము, తామసం (ఇతి) = తామసమని, ఉదాహృతం = చెప్పబడినది.

తా॥ శాస్త్రోక్తములు కాకపోవుటచే తగని దేశకాలములయందు మూర్ఖతస్కరాది దుష్టులకు పాదప్రక్షాళనాది గౌరవములు లేకయే అవమానముతో నీయబడిన దానము తామస మన బడును.

అవ. ఇట్లు వైదికములైన యజ్ఞ తపోదానములకు సత్త్వాది గుణభేదములచే కలుగుభేదమును చెప్పి, ఇప్పుడవి ప్రణవముతో నన్వయించుటయు, 'తత్, సత్' అను శబ్దములచే నిర్దేశింపబడుటయును జెప్పుచున్నాడు.

23. శ్లో. ఓం తత్స దితి నిర్దేశో । బ్రహ్మణ స్త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ । యజ్ఞా శ్చ విహితాః పురా॥

అర్థము :— బ్రహ్మణః = వేదమునకు, నిర్దేశః = నిర్దేశించు శబ్దము, ఓమ్ తత్ సత్ ఇతి = ఓమ్ అనియు తత్ అనియు సత్ అనియు, త్రివిధః = మూడువిధములు కలదిగా, స్మృతః = నిశ్చయింపబడెనది. తేన = ఆ మూడువిధములు గల శబ్దముతో (అన్వితాః = కూడినవారైన) బ్రాహ్మణాః = బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులును, వేదాః చ = వేదములున్ను, యజ్ఞాః చ = యజ్ఞములున్ను, పురా = పూర్వము, విహితాః = నిర్మింపబడినది.

తా॥ ఓమ్ తత్ సత్ అను నీమూడు శబ్దములున్ను బ్రహ్మముతో నన్వయించును. బ్రహ్మ మనగా వేదము. వేదమనగా కేవలశబ్ద రాశియేగాక వైదికమగు యజ్ఞాదికర్మయే చెప్పబడుచున్నది. వేదాధికారులగు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులును, వేదములును; యజ్ఞములును ఓమ్ తత్ సత్ అనెడు మూడు విధములైన శబ్దములతో నన్వయించునవిగా నాచేత పూర్వము నిర్మింపబడినవి.

అవ. బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములును ఓమ్ తత్ సత్ అను శబ్దము లతో నన్వయించు ప్రకారమును చెప్పదలంచి మొదట ఓమ్ అను శబ్దముయొక్క అన్వయప్రకారమును చెప్పుచున్నాడు.

24. శ్లో. తస్మా దోమి త్యుదాహృత్య । యజ్ఞ దాన తపః క్రియాః
ప్రవర్తన్తే విధానోక్తాః । స్సతతం బ్రహ్మవాదినామ్॥

అర్థము :- తస్మాత్ = అట్లు నిర్మింపబడుటవలన, బ్రహ్మవాదినాం = వేదము నుచ్చరించు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులయొక్క, విధానోక్తాః = శాస్త్రోక్తములైన, యజ్ఞదాన తపఃక్రియాః = యజ్ఞము దానము తపస్సులనెడు సత్కర్మలు, సతతం = ఎల్లప్పుడును, ఓమ్ ఇతి = ఓమ్ అని, ఉదాహృత్య = ఉచ్చరించి, ప్రవర్తన్తే = ప్రారంభింపబడుచున్నవి.

తా॥ బ్రాహ్మణులును, వేదములును, యజ్ఞములును, ఓమ్, తత్, సత్ అనెడు శబ్దములతో నన్వయించునవిగా నాచే నిర్మింపబడుటవలన త్రైవర్ణికులు చేయునట్టి యజ్ఞ దాన తపస్సులనెడు క్రియలు మొదట 'ఓమ్' అని ఆరంభించియే ప్రవర్తించుచున్నవి. వేదములును 'ఓమ్' అని చెప్పియే ప్రారంభింపబడుచున్నవి. ఇట్లు ఓమ్ శబ్దముతో నన్వయించు వేదములను వర్ణించి ధరించుటచేతను, అట్లన్వయించిన యజ్ఞాదులను చేయుటచేతను, బ్రాహ్మణులనబడు త్రైవర్ణికులకును ఓమ్ శబ్దముతో నన్వయము వర్ణించబడినది.

అవ. ఇక నా మూడును 'తత్' శబ్దముతో నన్వయించురీతి చెప్పబడుచున్నది.

25. శ్లో. తది త్యనభిసన్ధాయ । ఫలం యజ్ఞ తపః క్రియాః
దానక్రియా శ్చ వివిధాః । క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః॥

అర్థము :— మోక్షకాఙ్క్షిభిః = మోక్షమును కోరువారిచేత, తత్ ఇతి = తత్ అని (ఉదాహృత్య = ఉచ్చరించి) ఫలం = ఇతరఫలమును, అనభిసన్ధాయ = కోరక, వివిధాః = అనేకవిధములైన, యజ్ఞతపః క్రియాః = యజ్ఞములు తపస్సులనెడు క్రియలున్ను, దానక్రియాః చ = దానములనెడు కర్మలున్ను క్రియన్తే = చేయబడుచున్నవి.

తా॥ మోక్షాపేక్షగల త్రైవర్ణికులు, పరమాత్మ వాచకమైన తచ్ఛబ్దము నుచ్చరించి ఇతర ఫలములను గోరక వేదాధ్యయనము యజ్ఞము దానము తపస్సుల నాచరింతురు. అవి బ్రహ్మప్రాప్తికి సాధనములుగాన బ్రహ్మను తెలిపెడు 'తత్' శబ్దముచే దెలుపబడును. ఇదియే వీటికి తచ్ఛబ్దాన్వయము—ఇట్టివాటి ననుష్ఠించుటచే త్రైవర్ణికులకు తచ్ఛబ్దాన్వయము తగుచున్నది.

అవ. ఈ బ్రాహ్మణ వేద యజ్ఞాదులకు సచ్ఛబ్దాన్వయ విధానమును జెప్పుటకై లోకమున సచ్ఛబ్దము పుట్టినప్రకారమును చెప్పుచునాడు.

26. శ్లో. సద్భావే సాధుభావే చ । సదిత్యేత త్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా । సచ్ఛబ్దః పార్థ ! యుజ్యతే॥

అర్థము :— పార్థ ! = అర్జునా ! సద్భావే = ఉన్నదియనెడు అర్థమునందును, సాధుభావే చ = మంచిదియనెడి యర్థమునందును, సత్ ఇతి = సత్ అనెడి, ఏతత్ = ఈ శబ్దము, ప్రయుజ్యతే = ప్రయోగింపబడుచున్నది. తథా = అట్లే. ప్రశస్తే = మంగళకరమైన, కర్మణి = సత్కార్యమునందును, సచ్ఛబ్దః = సత్ అనెడి పదము, యుజ్యతే = ప్రయోగించబడుచున్నది.

తా॥ అర్జునా ! ఇది కలదు అనెడు భావమునందును ఇది మంచిదియనెడు నర్థమునందును 'సత్' అనెడు పదము లోకమునందును వేదమునందును వాడబడుచున్నది. అటులనే శుభకార్యములయందును 'ఇది సత్కర్మ' అని యీ సచ్ఛబ్దము ప్రయోగింపబడుచున్నది.

అవ. బ్రాహ్మణ-వేద-యజ్ఞాదులకు సచ్ఛబ్దాన్వయమును జెప్పుచున్నాడు.

27. శ్లో. యజ్ఞే తపసి దానే చ । స్థితి స్సదితి చోచ్యతే
కర్మ చైవ తదర్థీయం । స దిత్యే వాభిధీయతే॥

అర్థము :– యజ్ఞేచ = యజ్ఞమునందును, తపసి = తపస్సునందును, దానేచ = దానమునందును, స్థితిః = ఉనికి, సత్ ఇతి = సత్ అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది. తదర్థీయం = ఆ వైదికులకొఱకైన, కర్మచ ఏవ = యజ్ఞాదికర్మయున్ను, సత్ ఇతి ఏవ = సత్ అనియే, అభిధీయతే = చెప్పబడుచున్నది.

తా॥ త్రైవర్ణికులకు యజ్ఞ దాన తపస్సులయందలి స్థితి కల్యాణమైనది. అది సత్తని చెప్పబడుచున్నది. వారియొక్క యజ్ఞాదికర్మలున్ను సత్తనియే చెప్పబడును.

(ఇట్లు వేదములును, వైదికకర్మలును, త్రైవర్ణికులును 'ఓమ్ తత్ సత్' శబ్దములచే సంబంధము కలిగియుండుటచే వేదేతరములకంటెను అవైదికుల కంటెను వేరై ఉత్తమమైనవని యెఱుంగవలెను.)

అవ. శాస్త్రోక్త కర్మలైనను శ్రద్ధలేక ఆచరించుచో నసత్తులనియే చెప్పబడు ననుచున్నాడు.

28. శ్లో. అశ్రద్ధయా హుతం దత్తం। తప స్తప్తం కృతం చ యత్
అస దిత్యుచ్యతే పార్థ! । న చ త త్ప్రేత్య నో ఇహ॥

ఇతి శ్రీభగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే శ్రద్ధాత్రయ విభాగయోగోనామ సప్తదశోఽధ్యాయః

అర్థము :- హే పార్థ! = ఓ యర్జునా! అశ్రద్ధయా = అశ్రద్ధతో, కృతం = చేయబడిన, హుతం = హోమమున్ను, దత్తం = దానమున్ను, తప్తం = చేయబడిన, తపః చ = తపస్సున్ను (అన్యత్) యత్ = (ఇంకను) ఏదికలదో, తత్ = అది, అసత్ ఇతి = అసత్తని, ఉచ్యతే = చెప్పబడుచున్నది. ప్రేత్య = మరణానంతరము, న = ఫలముకొఱకు కానేరదు. ఇహచ = ఈ లోకమునందును, నో = నిష్ప్రయోజనము.

తా॥ అర్జునా! అశ్రద్ధతోఁ జేయుబడు హోమమును, దానమును, తపస్సును తక్కిన కర్మలును, శాస్త్రీయములైనను అసత్తనబడును. ఏలననగా– ఆ కర్మలు ఇహపరలోకములయందు ఫలప్రదములుం కానేరవు.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన శ్రీభగవద్గీత యందలి శ్రద్ధాత్రయ విభాగయోగ మనబడు పదునేడవ యధ్యాయము.

| | |
|---|---|
| ఈ యధ్యాయమున అర్జునుని శ్లోకము | 1 |
| శ్రీకృష్ణుని శ్లోకములు | 27 |
| ఇప్పటికైన మొత్తము శ్లోకముల సంఖ్య | 622 |

అష్టాదశాధ్యాయార్థ సంగ్రహము.

శ్లో. ఈశ్వరే కర్తృతాబుద్ధి
స్సత్త్వోపాదేయతాఽన్తిమే
స్వకర్మ పరిణామ శ్చ
శాస్త్రసారార్థ ఉచ్యతే॥

అర్థము :- ఈశ్వరే = సర్వేశ్వరునియందు, కర్తృతాబుద్ధిః = సమస్తకర్మలకును కర్తయను బుద్ధియు, సత్త్వోపాదేయతా = సత్త్వమే ఉపాదేయమనుటయును: స్వకర్మపరిణామః చ = తానుగావించునట్టి వర్ణాశ్రమోచితకర్మలయొక్క పరిణామమున్ను, శాస్త్రసారార్థః = గీతాశాస్త్రమునకుసారమైన భక్తియోగమున్ను, అన్తిమే = ఈచివర యధ్యాయమున, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా॥ సర్వేశ్వరుడే సమస్తకర్మలకును కర్తయని తలంచుటయు, సత్త్వాదిగుణముల కార్యములనుజెప్పి యందు సత్త్వగుణమే యాదరముతో పెంపొందించుకొనదగినదనియు, భగవదారాధనబుద్ధితో జేయబడు స్వవర్ణాశ్రమోచిత కర్మలు పరమపురుషప్రాప్తికి ఉపాయముగా పరిణమించుననియు, గీతాశాస్త్రమునకు సారభూతమైన యర్థము భక్తియే యనియు నీ పదునెనిమిదవ యధ్యాయమున జెప్పబడినది.

# శ్రీ భగవద్గీత - అష్టాదశాధ్యాయము

## వి ష య సూ చి క

శ్లోక సంఖ్య

శ్రీ హయగ్రీవాయనమః

శ్రీ భగవద్గీతా - అష్టాదశోఽధ్యాయః

# మోక్షసన్న్యాసయోగః

అర్జున ఉవాచ = అర్జునుడు పలికెను.

1. శ్లో. సన్న్యాసస్య మహాబాహో ! । తత్త్వ మిచ్ఛామి వేదితుమ్
త్యాగస్య చ హృషీకేశ ! పృథక్కేశి నిషూదన ॥1॥

అర్థము :– హృషీకేశ ! = ఇంద్రియములకు నియామకుడవును, కేశినిషూదన != కేశిని సంహరించినవాడవును, మహాబాహో ! = భుజబలమును కలవాడవును నగు నో కృష్ణా !, సన్న్యాసస్య = సన్న్యాసము యొక్కయు, త్యాగస్య చ = త్యాగముయొక్కయు, తత్త్వం = నిజరూపును, పృథక్ = వేఱువేఱుగా, వేదితుం = తెలిసికొనుటకొఱకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా॥ ఓ కృష్ణా! సన్న్యాస త్యాగశబ్దములు వేఱువేఱా? ఒకే యర్థముకలవియా? వేఱైనచో వాటి స్వరూపమును వేఱువేఱుగా నెఱుంగగోరుచున్నాను. ఏకమైనను దాని స్వరూపము నెఱింగింపుము.

అవ. శ్రీకృష్ణపరమాత్మ దీనిని గూర్చి వాదులయొక్క భేదాభిప్రాయములను ముందు వినుపించుచున్నాడు.

శ్రీ భగవా నువాచ = శ్రీకృష్ణుడు పలికెను.

2. శ్లో. కామ్యానాం కర్మణాం న్యాసం । సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం । ప్రాహు స్త్యాగం విచక్షణాః॥

అర్థము :— కవయః = (కొందఱు) పండితులు. కామ్యానాం = ఫలాశతో చేయబడు. కర్మణాం = పుత్రకామేష్ఠి మొదలగు కర్మలయొక్క. న్యాసం = విడుచుట. సన్న్యాసం = సన్న్యాస (మని) విదుః = తెలియుదురు. విచక్షణాః = (కొందఱు) విద్వాంసులు, సర్వకర్మ ఫలత్యాగం = సమస్త కర్మల యొక్క ఫలమును విడిచిపెట్టుటయే, త్యాగం = త్యాగశబ్దార్థముగా, ప్రాహుః = చెప్పుచున్నారు.

తా॥ కొందఱు పండితులు పుత్రకామేష్ఠి మొదలగు కామ్యకర్మలను స్వరూపముతోనే విడుచుట సన్న్యాసమందురు. మఱికొందఱు విద్వాంసులు నిత్యనైమిత్తిక కామ్యకర్మల నాచరించుచు వాటి ఫలములనుమాత్రము విడుచుట సన్న్యాసమందురు.

(ఈ శ్లోకమందును ముందు శ్లోకములలోను త్యాగ సన్న్యాస శబ్దములను శ్రీకృష్ణుడు పర్యాయములుగా వాడుటచే రెండును ఒకే యర్థముగల రెండు పర్యాయశబ్దములేయని తెలియుచున్నది.)

అవ. ఇంకను దీనినిగూర్చి మఱికొందఱు విద్వాంసుల యభిప్రాయముల నెఱింగించుచున్నాడు.

3. శ్లో. త్యాజ్యం దోషవ దిత్యేకే । కర్మ ప్రాహు ర్మనీషిణః
యజ్ఞ దాన తపః కర్మ । న త్యాజ్య మితి చాపరే॥

అర్థము :— ఏకే = కొందఱు మనీషిణః = బుద్ధిమంతులు, దోషవత్ = రాగాది దోషమువలె, కర్మ = సమస్త కర్మయు. త్యాజ్యం ఇతి = విడువ దగినదని, ప్రాహుః = చెప్పుదురు. అపరేచ = మఱికొందఱు (పండితులు) యజ్ఞ దాన తపః కర్మ = యజ్ఞము, దానము, తపస్సనెడు కర్మ. న త్యాజ్యం ఇతి = విడువతగనిదని (ప్రాహుః = చెప్పుదురు)

తా॥ సాంఖ్యులును, వారి ననుసరించువారును, యజ్ఞాది కర్మలన్నియు, రాగాది దోషములను బుట్టించి బంధహేతువులగుటను గాన ముముక్షువులు వాటిని దరి జేరనీయరాదందురు. మఱికొందఱు యజ్ఞాదికర్మల విడువరాదందురు.

అవ. ఇక తన నిశ్చయము నెఱింగించుచున్నాడు—

4. శ్లో. నిశ్చయం శృణు మే తత్ర । త్యాగే భరతసత్తమ ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర । త్రివిధ స్సంప్రకీర్తితః॥

అర్థము :– భరతసత్తమ ! = భరతశ్రేష్ఠా ! తత్ర = ఆ, త్యాగే = త్యాగవిషయమున, మే = నాయొక్క, నిశ్చయం = నిశ్చయమును, శృణు = వినుము, పురుషవ్యాఘ్ర = పురుషశ్రేష్ఠుడా ! త్యాగః = త్యాగము, త్రివిధః = మూడువిధములుకలదిగా, సంప్రకీర్తితః హి = చెప్పబడియున్నదికదా !

తా॥ అర్జునా ! ఇంతవరకు వారిల భిన్నాభిప్రాయములను వినిపించితిని. ఇక నా యభిప్రాయమును వినుము. వేదోక్తమైన నిత్యనైమిత్తిక కామ్యకర్మలన్నియు చేయవలసినవియే. కాని వాటిని చేయునపుడుమాత్రము, వాటి ఫలమును, 'నేను చేయుచున్నా' ననెడు కర్తృత్వాభిమానమును, 'ఈ కర్మ నాది' యనెడు మమకారమును పూర్తిగ విడిచివేయవలెను.

5. శ్లో. యజ్ఞ దాన తపః కర్మ । న త్యాజ్యం కార్య మేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ । పావనాని మనీషిణామ్॥

అర్థము :– యజ్ఞదానతపఃకర్మ = యజ్ఞము దానము తపస్సు అనెడు కర్మ, న త్యాజ్యం = విడువతగినదికాదు, తత్ = అది, కార్యం ఏవ = చేయదగినదియే, మనీషిణాం = ఉపాసకులకు, యజ్ఞః = యజ్ఞము, దానం = దానము, తపః చ ఏవ = తపస్సున్ను, పావనాని = ప్రాచీనకర్మను నశింపజేయునవి, (భవన్తి = అగుచున్నవి)

తా॥ యజ్ఞము, దానము, తపస్సులనబడు వైదికకర్మలు ముముక్షువులకు జీవించువరకును చేయుదగినవియేగాని విడువరాదు. ఏలయనగా–ఇవి వర్ణాశ్రమానుగుణముగా శాస్త్రమున విధింపబడినవి గాన నవి వారి యుపాసనకు ప్రతిబంధకమైన పూర్వకర్మలనన్నిటిని నశింపజేయును.

అవ. ఈ కర్మలు దోషావహములు కావనెడు విశ్వాసము బలపడుటకై తిరిగి దృఢముగజెప్పి ముగించుచున్నాడు.

6. శ్లో. ఏతాన్యపి తు కర్మాణి । సఙ్గం త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యానీ తి మే పార్థ ! । నిశ్చితం మత ముత్తమమ్॥

అర్థము :— హేపార్థ ! ఓ అర్జునా ! ఏతాని = ఈ చెప్పబడిన, కర్మాణి అపి = కర్మలు కూడా. సఙ్గం = మమకారమును. ఫలాని చ = ఫలములను. త్యక్త్వా = విడిచిపెట్టి. కర్తవ్యాని ఇతి = చేయదగినవని. మే = నాయొక్క. నిశ్చితం = నిశ్చయింపబడిన. ఉత్తమం = శ్రేష్ఠమైన. మతం = అభిప్రాయము (భవతి = అగుచున్నది).

తా॥ ఉపాసకులకు యజ్ఞ దాన తపస్సులు పావనములగుటచే ముముక్షువైనవాడు ఉపాసనతో పాటుగ నీ యజ్ఞాది కర్మలను గూడ నా యారాధనయే యను బుద్ధితో వాటియందలి మమకారమును ఫలమును విడిచి బ్రతికియున్నంతవరకు ప్రతిదినము నను ఉపాసనసిద్ధికై యాచరించవలెను. ఇది నా నిశ్చితమైన ఉత్తమాభిప్రాయము.

అవ. వెనుక చెప్పబడిన మంతారములన్నియు నధమములనియు తన మత ముత్తమమైనదనియు విస్తరించి చెప్పుచున్నాడు. అందు ముందుగా తామస త్యాగమును వివరించుచున్నాడు.

7. శ్లో. నియతస్య తు సన్న్యాసః । కర్మణో నోపపద్యతే
మోహాత్తస్య పరిత్యాగ । స్తామసః పరికీర్తితః॥

అర్థము :— నియతస్య = నిత్యనైమిత్తిక రూపమైనట్టి. కర్మణః = మహాయజ్ఞాది కర్మకు. సన్న్యాసః = సుతరాంవిడుచుట. న ఉపపద్యతే = తగదు. మోహాత్ = అజ్ఞానమువలన, తస్య = ఆ నిత్యకర్మయొక్క. పరిత్యాగః = విడుచుట. తామసః = అజ్ఞానమూలమని, పరికీర్తితః = చెప్పబడెను.

తా॥ నిత్యనైమిత్తిక రూపమైన మహాయజ్ఞాది వైదికకర్మలను విడువరాదు. అవి పాపములను పారద్రోలి జ్ఞానమును వృద్ధిపొందించును. వీటిని బంధకములని భ్రమించి పరిత్యజించినచో తామసులనబడుదురు. తమోగుణ మజ్ఞానమునకు మూలమగుటచే నీ త్యాగము తామసమే యగును.

అవ. రాజసత్యాగమును వివరించుచున్నాడు.

8. శ్లో. దుఃఖ మిత్యేవ యత్కర్మ । కాయక్లేశ భయాత్త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం । నైవ త్యాగఫలం లభేత్ ॥

అర్థము :– (యం = ఎవడు) దుఃఖం ఇతి ఏవ = కష్టపడిచేయవలసినదగుటచే దుఃఖాత్మకమైనదియేయని, కాయక్లేశభయాత్ = శరీరమును కష్టపెట్టునదను భయమువలన, యత్ = ఏ, కర్మ = వర్ణాశ్రమధర్మమును, త్యజేత్ = విడుచునో, సః = వాడు, రాజసం = రజోమూలమైన, త్యాగం = త్యాగమును, కృత్వా = చేసి, త్యాగఫలం = సాత్త్వికత్యాగముయొక్క ఫలమును న ఏవ లభేత్ = పొందనేరడు.

తా॥ కర్మ మోక్షసాధనమైనను దుఃఖాత్మకమైన ద్రవ్యార్జనాదులచే సాధింపదగినదియు, శరీరమును కష్టపెట్టునదియు నగుటవలన భయముచే వర్ణాశ్రమ ధర్మములను విడినచో నా త్యాగము రజోగుణ మూలమగునుగాని వాస్తవత్యాగము కానేరదు. సాత్త్వికత్యాగమునకు ఫలమైనజ్ఞానోత్పత్తి వానికి కలుగనేరదు.

అవ. సాత్త్వికత్యాగము సత్త్వగుణ కార్యమగు వాస్తవమైన జ్ఞానమూలముగాన నదియే శాస్త్రీయమైన త్యాగమని తెలుపుచున్నాడు.

9. శ్లో. కార్య మిత్యేవ యత్కర్మ । నియతం క్రియతేఽర్జున ।
సఙ్గం త్యక్త్వా ఫలం చైవ । స త్యాగ స్సాత్త్వికో మతః॥

అర్థము :– హే అర్జున ! = ఓ యర్జునా ! నియతం = నిత్యనైమిత్తిక రూపమైన, యత్ కర్మ = ఏ కర్మ, కార్యం ఇతి ఏవ = చేయదగినదని, సఙ్గం = మమకారమును, ఫలంచఏవ = ఫలమునున్ను, త్యక్త్వా = విడిచి, క్రియతే = చేయబడుచున్నదో, సః = ఆ, త్యాగః = త్యాగము, సాత్త్వికః = సత్వగుణ ప్రధానమైనదని, మతః = తలంచబడినది, (భవతి = అగుచున్నది)

తా॥ అర్జునా ! నిత్యనైమిత్తికములగు మహాయజ్ఞాది వర్ణాశ్రమ ధర్మములు నిజమునకు భగవదారాధన రూపములేగాన అవశ్యకర్తవ్యములని తలంచి వాటియందు మమకారముగాని ఫలేచ్ఛగాని లేక యాచరించుట సాత్త్వికత్యాగ మనబడుచున్నది.

సాత్త్వికమనగా వాస్తవ శాస్త్రార్థజ్ఞాన మూలమైనదని భావము—

అవ. సత్త్వగుణ మూలమైన శాస్త్రోక్తత్యాగముతో కర్మల నాచరించు వానికి ప్రధానలక్షణమైన నిర్వికారత్వమును జెప్పుచున్నాడు.

10. శ్లో. న ద్వేష్ట్యకుశలం కర్మ । కుశలే నాఽనుషజ్యతే
త్యాగీ సత్త్వసమావిష్టో । మేధావీ ఛిన్నసంశయః॥

అర్థము :– సత్త్వసమావిష్టః = సత్త్వగుణముతో కూడుకొనినవాడును, మేధావీ = తత్త్వజ్ఞానము కలవాడును, ఛిన్నసంశయః = పోయిన సంశయములుకల వాడునునగు, త్యాగీ = ఫలసంగకర్తృత్వములను విడిచినవాడు, అకుశలం కర్మ = పాపకర్మను, నద్వేష్టి = ద్వేషింపడు, కుశలే = శుభకర్మయందు, న అనుషజ్యతే = సక్తుడుకాడు.

తా॥ సత్త్వగుణ సంపన్నుడగుటవలన తత్త్వజ్ఞానము కలవాడై సంశయముల నన్నిటిని పోద్రోలి ఫల సంగ కర్తృత్వములను విడిచి కర్మల నాచరించువాడు శుభకర్మలయం దాసక్తుడుగాని, ప్రమాదముచే తటస్థించు అశుభకర్మలయందు ద్వేషయుక్తుడుగానికాడు.

అవ. ఇంతవరకు చెప్పబడిన మూడు విధములైన (ఫలసంగకర్తృత్వముల) సాత్త్విక త్యాగోపదేశమును విరమించుచున్నాడు.

11. శ్లో. నహి దేహభృతా శక్యం । త్యక్తుం కర్మాణ్యశేషతః
యస్తు కర్మఫలత్యాగీ । స త్యాగీ త్యభిధీయతే॥

అర్థము :– దేహభృతా = మానవునిచేత, కర్మాణి = కర్మలను, అశేషతః = పూర్తిగా. త్యక్తుం = విడుచుటకు, శక్యంనహి = సాధ్యము కాదుగదా । యఃతు = ఎవ్వడైతే, కర్మఫలత్యాగీ = కర్మఫలమును విడుచువాడో, సః = వాడు, త్యాగీ ఇతి = త్యాగియని, అభిధీయతే = చెప్పబడుచున్నాడు.

తా॥ శరీర మున్నంతవరకు కర్మలను బొత్తిగ జేయకుండుట శక్యము కాదు. దేహధారణకొఱకు సంబంధించిన కర్మలనున్ను విడువ శక్యముకాదు. అట్టి కర్మలను ఫల సంగ కర్తృత్వములను విడిచి చేయువాడే శాస్త్రములయందు త్యాగియని చెప్పబడుచున్నాడు.

| సంఖ్య | నామము | నిరుక్తము | ఆంధ్రానువాదము |
|---|---|---|---|
| 237 | ధరణీధరః. | భూత ధాత్రాత్వాచ్ఛ ధరణేః<br>ధారణా ద్ధరణీ ధరః॥ | సమస్తభూతములను ధరించియుండునట్టి భూమినికూడ తానే ధరించియుండువాడు. |
| 238 | సుప్రసాదః. | ప్రసాద పరమత్వాచ్ఛ<br>సుప్రసాదః ప్రకీర్తితః॥ | తన కభిముఖులైన భక్తులను (కటాక్షించువాడు). పక్ష నిరతిశయమైన యనుగ్రహము కలవాడు. |
| 239 | ప్రసన్నాత్మా | అవాప్త సర్వకామత్వాత్<br>రాగాది రహితం మనః॥<br>యస్యాస్తిస ప్రసన్నాత్మా<br>చిత్తతుష్టిప్రదో మనుః॥ | తీరిన సమస్తకోరికలు కలవాడగుటచే రాగాదులు లేని మనస్సుకలవాడు.<br>దీనిని 'ఓమ్ ప్రసన్నాత్మనేనమః' అని మంత్రముగా సన స్మరించినచో నిది మనస్సున కానందప్రదమగును. |
| 240 | విశ్వసృట్. | విశ్వజగత్సృజతియః<br>విశ్వసృక్ సప్రకీర్తితః | జగత్తునంతను సృష్టించువాడు. |
| 241 | విశ్వభుగ్విభుః. | తత్సృష్టం వ్యాప్యవై భుఞ్జన్<br>పాలయన్ విశ్వభు గ్విభుః॥ | తనచే సృష్టింపబడిన జగత్తునందంతటను వ్యాపించి దాని ననుభవించుచు, పాలించుచుండువాడు, |
| 242 | సత్కర్తా. | సత్కర్తా యస్సవిజ్ఞేయః<br>సజ్జన ప్రతిపూజకః | సజ్జనుల కెదురేగి పూజించువాడు. |
| 243 | సత్కృతః. | అర్ఘ్యాదిభి స్సజ్జనై ర్యః<br>పూజిత స్సత్కృత స్స్మృతః॥ | అర్ఘ్యాది పూజా విధానముల ముఖాలమున సజ్జనులచే పూజింపబడువాడు. |
| 244 | సాధుః. | సేవాం సారథ్యదూత్యాద్యాం<br>సాధుసాధయతీతి సః॥ | తనభక్తులను రథమును తోలుట దూతకృత్యమును నిర్వ హించుట మొదలగువాటితో సేవించువాడు. |
| 245 | జహ్నుః | అభక్తేష్వాత్మమాహాత్మ్యా<br>నిహ్నుతే ర్జహ్ను రుచ్యతే॥ | భక్తులు కాని వారలకు తనమహిమను మరుగుపరచువాడు. |
| 246 | నారాయణః | అన్తర్బహిశ్చ తత్సర్వం<br>వ్యాప్యనారాయణ స్స్మృతః॥ | సమస్తవస్తువులకును లోపలను బయటను అంతటను వ్యాపించి యుండువాడు. |
| 247 | నరః. | రః క్షయో యస్య నహ్యాస్తి<br>స నరస్సముదాహృతః॥ | 'ర' అనగా నాశము, అదిలేనివాడు. (నశించని చేతనా చేతనములను తనకు విభూతిగా కలవాడు) |

| | | | |
|---|---|---|---|
| 248 | అసఙ్ఖ్యేయః. | అగణ్య నరసఙ్ఖ్యేయః<br>సో౽సఙ్ఖ్యేయః ప్రకీర్తితః॥ | లెక్కకు మించిన నరసమూహములు కలవాడు. |
| 249 | అప్రమేయాత్మా. | ఏకైకశో౽ప్రమేయాయా<br>హ్యసఙ్ఖ్యాతా విభూతయః॥<br>తాభ్యాం చైవా౽ప్రమేయాత్మా<br>వ్యాపనాద్బహిరన్తః | చేతనములును అచేతనములును నగువిభూతులు ఒక్కొక్కటి లెక్కకు మించియున్నవి. వాటికి లోపలను బయటను అంతటను వ్యాపించి యుండువాడు. |
| 250 | విశిష్టః. | విలక్షణో విశిష్టో౽యః<br>సర్వాం స్తాననపేక్ష్య సః॥ | వాటి యపేక్ష యొకింతయు లేకయే వాటికంటె నధికుడై విలక్షణముగా నుండువాడు. |
| 251 | శిష్టకృత్. | స్వానుకూల శుభాన్ కుర్వన్<br>స్వసంబంధేన తాన్ స్వయం | తన సంబంధముచే వాటి నన్నిటిని స్వయముగ తన కనుకూలమగునటుల మంగళప్రదములనుగా జేయువాడు. స్వయం ప్రకాశమై వెలుగొందువాడు. |
| 252 | శుచిః | అనాధేయ మహాదీప్తిః<br>శిష్టకృచ్ఛుచిరుచ్యతే। | |
| 253 | సిద్ధార్థః | సిద్ధాః ప్రాప్తాయస్య సత్యే<br>హ్యర్థాస్సిద్ధార్థ ఈరితః॥ | స్వతః అవాప్త సమస్తకాముడగుటచే తమంత తామే సిద్ధించిన సకలపదార్థములును కలవాడు. |
| 254 | సిద్ధసఙ్కల్పః | సత్య సఙ్కల్ప వత్త్వాచ్చ<br>సిద్ధ సఙ్కల్ప ఈరితః | ___లోని సంకల్పము కలవాడు. |
| 255 | సిద్ధిదః | సిద్ధిదో హ్యణిమాద్యష్ట<br>సిద్ధేర్దః కాయదానతః॥ | తన భక్తులకు తనశరీరమునే స్వాధీనపరచువాడు గాన అణిమాద్యష్టసిద్ధుల నొసంగు వాడనబడుచున్నాడు. |
| 256 | సిద్ధిసాధనః | తత్సిద్ధేశ్చాపి హేతుత్వాత్<br>సిద్ధిసాధన ఈరితః | అట్టి సిద్ధికిని తానే కారణమైనవాడు. అనగా – తనను పొందుటకు సాధనము ననుష్ఠించునపుడుకూడా తనభక్తులకు ప్రియముగ నుండువాడు. |
| 257 | వృషాహీ. | వృషో౽హ్ని ధర్మ స్తద్రూప<br>మహర్యస్య దినం స్మృతమ్<br>ప్రథమాభిగమనాఖ్యం<br>వృషాహీ సప్రకీర్తితః॥ | వృషమనగా ధర్మము, అట్టి ధర్మరూపమైన దినము కలవాడు. అనగా తనను పొందు మొదటిదినము సమస్తసన్మంగళములకును ప్రారంభదినమువలె ధర్మరూపమైయుండును. గాన ధర్మరూపమగు దివసంబుకలవాడు. |

శ్రీ హయగ్రీవాయ నమః

# నవవిధభక్తులు

శ్రీమాన్ విద్వాన్ తె. కం. గోపాలాచార్యులుగారు

[వెనుక సంచిక తరువాయి]

## వందనము

శాస్త్రములలో జెప్పబడిన భగవన్మూర్తులకు శ్రద్ధా భక్తులతో సాష్టాంగముగా సాగిలి మ్రొక్కుటయే వందనము. సాష్టాంగ ప్రణామమునకు సాత్వతసంహితయందు

శ్లో॥ మనోబుద్ధ్యభిమానేన సహ న్యస్య ధరాతలే
కూర్మవచ్చతురః పాదాన్ శిర స్తత్రైవ పఞ్చమమ్॥

మనస్సు, బుద్ధి, అభిమానము, కాళ్ళు, చేతులు, శిరస్సు అనునవి యీ యష్టాంగములు ఇవి భక్తిభారముతో దండమువలె నేలకంటునట్లు నమస్కరించవలెను. మనోబుద్ధ్యభిమానములు నేలకంటుటయనగా – ఔద్ధత్యమును వీడి నమస్కరించవలెనని భావము. కావుననే మందిరములలో బలిపీఠమువద్దనే యిట్లు మ్రొక్కుట శాస్త్రసమ్మతమును వృద్ధాచారమును అయియున్నది. అనగా అహంకార మమకారముల కాకరమగు మనోబుద్ధ్యభిమానము లచ్చట బలి యిచ్చి భగవంతుని సేవించవలెనని దానిభావముగదా!

కావుననే గీతయందలి తొమ్మిదవ యధ్యాయములోని 'సతతం కీర్తయన్తో మాం' అను శ్లోకములోని 'నమస్యన్తశ్చ మాం భక్త్యా' అను చరణమునకు శ్రీభాష్యకారులు– 'భక్తిభారావనమిత మనోబుద్ధ్యభిమాన పదద్వయకరద్వయ శిరోభి రష్టాఙ్గై రచిన్తిత పాంసు కర్దమ శర్కరాదికే ధరాతలే దణ్డవత్ప్రణిపతన్తః' అని వ్యాఖ్యానమును సాయించిరి.

ఈ వందనము కేవలము భగవద్విగ్రహములకేగాక భగవత్సంబంధముగల మందిర, వాహన, విమాన, గోపురాదులన్నిటికిని జూపించవలెను. ఇంతియేగాక 'యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ' అను శ్రుతివాక్యము ననుసరించి మంత్ర మంత్రార్థ ప్రదులగుటచే నుపకారులును, ఉత్తారకులును నగు ఆచార్యులపట్లను తదర్థ ప్రతిపాదక భాష్య భగవద్విషయాది ఉభయవేదాంత గ్రంథములను కృపజేసినవారి విషయమునకూడా చేయవలెను. వారికేకాదు వారివలెనే సదాచారులును జ్ఞానానుష్ఠాన సంపన్నులగు భాగవతోత్తములందరివిషయమైకూడ నాచరించవలెను. ఇంకనుకు–

శ్లో॥ ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రామంతి యూనః స్థవిర ఆగతే॥
ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునః స్వాన్ ప్రతిపద్యతే॥

జ్ఞానానుష్ఠాన వృద్ధులు వేంచేయగనే పిన్నవయస్కుని ప్రాణములుత్క్రమింప నుద్యమించుననియు వారి నెదుర్కొని సాష్టాంగవందన మాచరించిన తిరిగి కుదుట పడుననియు ప్రమాణము కలదు. అట్లు చేయలేదనియేగదా అగస్త్యమహర్షి ఇంద్రద్యుమ్న మహారాజును ఏనుగ వగుమని శపించినదియు, దూర్వాసమహర్షి శకుంతలను నీభర్త నిన్ను విస్మరించుగాక యని శపించినదియును.

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః॥

గీత - 7 అ. 15 శ్లో.

యని భగవానుడానతిచ్చినట్లు తాము స్వతంత్రులమని తలంచువారును భగవంతుని పరతత్వమునేగాని సౌలభ్యము నెఱుంగక మేరుపర్వతము నెడలట్లు విముఖులగువారును. భగవంతుని లెస్సగ నెఱింగియు పాషండదర్శనములు కూటయుక్తులు మొదలగువాటిచే నాజ్ఞానమును పోగొట్టుకొనువారును, అట్లాజ్ఞానమును పోగొట్టుకొనకున్నను పామునకు పాలు విషమగునట్లు ద్వేషముగా మారి దూషించువారును ఒకరికంటె ఒకరు హెచ్చు పాపాత్ములగుటచే భగవంతుని నమస్కరింపనొల్లరు. ఈ పాపము హరించవలెననిన సాధుజనసేవ, సాత్వికాహారము, సజ్జన సాంగత్యము సద్గ్రంథపఠనము, శ్రవణము, మొదలగునవి ముఖ్యసాధనములు.

శ్రు. ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః
సత్వశుద్ధౌ ధృవా స్మృతిః
స్మృతిలంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః॥

సాత్వికాహారమువలన పరిశుద్ధ సత్వగుణాభివృద్ధియు, దానివలన చలించని ధ్యానమును, దానివలన రాగద్వేషముల వినాశమును, కలుగునని శ్రుతివాక్యమును శ్రీమద్భాగవతమున అజామిళోపాఖ్యానమున

ప॥ హరిభక్తులతో మాటలు
ధరనెన్నడు చెడని పుణ్యధనములమూటల్।
వరముక్తి కాంత తేటలు
అరిషడ్వర్గములు చొరనియరుదగుకోటల్॥

అను పద్యమున్ను,
శ్రీశంకరాచార్యులవారి భజగోవిందమండలి-

శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వ" మిత్యాది చరణమున్ను ప్రమాణములు.

శ్లో॥ "జంగమ శ్రీవిమానాని హృదయాని మనీషిణాం"

సాధుల హృదయములను భగవంతుని చర మందిరములందురు. కావున భగవదాలయములకవలె వీరికిని ప్రదక్షిణ నమస్కారాదులు గావించుట విధి.

ఇంకను పరిపాకావస్థను పొందిన మహాత్ములు ప్రహ్లాదునివలె చరాచరములయందును శత్రుమిత్రాదులయందును భగవంతునిగాంచి నమస్కరింతురు. ప్రహ్లాదుడు తనను కత్తులతో నరుకవచ్చిన రాక్షసులను జూచి

శ్లో॥ విష్ణు శ్శస్త్రేషు యుష్మాసు మయి చాసౌ యథా స్థితః
దైతేయా స్తేన సత్యేన మా క్రామ న్త్వాయుధాని వః॥ (వి. పు)

రాక్షసపుంగవులారా! శ్రీమహావిష్ణువు నాయందున్నట్లే మీయందును. మీచేతియందలి ఖడ్గములయందును వేంచేసియున్నాడు. కావున మీయాయుధముల నాశరీరమున ప్రయోగించుడు. నాకది నిజముగ భగవత్సంశ్లేషమే కదా! యనెను. ఈభావమునే గీతలో

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన
మధ్యస్థద్వేష్యబంధుషు
సాధుష్వపి చ పాపేషు
సమబుద్ధిర్విశిష్యతే॥ 6 అ 9శ్లో,

అనెడు శ్లోకమున కొక వ్యాఖ్యాత సుందరముగా నీవిధముగా వ్యాఖ్యానమును గావించెను.

భిన్నవయస్కులై హితమునుకోరువారు, సమవయస్కులై తనహితము నపేక్షించువారు, నైమిత్తికశత్రువులు, సన్నిహితులయ్యు కారణములేనందున హితాహితముల రెండింటిని కోరనివారు, దూరమునందుండుటచే పరిచయమసలే లేనందున తన హితాహితములు కోరనివారును, జన్మశత్రువులును, జన్మహితైషులును, సత్పురుషులు, దుర్జనులు, వీరందరియందును సమబుద్ధికలవాడధికుడు. ఇచ్చట సమబుద్ధియనగా భగవంతుడను దృష్టియని వ్రాసిరి. ఎట్లనగా 'మాలక్ష్మీః, తయాసహితఃసమః' అనగా లక్ష్మితోకూడియున్న శ్రీమన్నారాయణుడు 'స ఇతి బుద్ధిః'-సమబుద్ధిః' అతడేయను యధ్యవసాయము యవనికుండునో అతడే సర్వాధికుడు.

కావుననే శ్రీమద్భాగవతమున :-

శ్లో॥ ఖం వాయు మగ్నిం సలిలం మహీం చ
జ్యోతీంషి సత్వాని దిశో ద్రుమాదీన్।
సరిత్సముద్రాశ్చ హరే శ్శరీరం
యత్కించభూతం ప్రణమే దనన్యః॥ (11-2-41)

ఆకసము, గాలి, నిప్పు, నీరు, భూమి, నక్షత్రములు, దిక్కులు తరుగుల్మలతాదులు, నదులు, సముద్రము, సమస్తభూతజాతములు ఇవియన్నియు భగవంతుని శరీరము. కావున

వాటియందు భగవద్భావనను౦చి నమస్కరించవలెను. ఇట్టి భగవంతుడు సర్వవ్యాపిగాన సర్వతో ముఖుడుగ నజ్ఞనుడు విశ్వరూపునివలె నమస్కరించవలెను.

శ్లో॥ నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ॥ (గీత. 11-40 శ్లో)

విశ్వశరీరా! నీకు ఎదుటను వెనుకను వేయేల నీ కన్ని దిక్కులయందును నమస్కరింతును.

ఈ వందనమును భగవానుడనంతముగా పరిగణించునని శ్రుతి జెప్పుచున్నది.

శ్లో॥ అగ్నే! నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయు
నాని విద్వాన్ యుయోధ్యస్మజ్జుహురాణ మేనో భూయిష్ఠాం
తే నమ ఉక్తిం విధేమ॥ (ఈ శా. 18 మం)

అగ్నికంతర్యామివగు ఓ దేవా! నీవు మాకపేక్షితములగు చతుర్విధపురుషార్థముల నెఱింగినవాడవుగాన నర్చిరాదిమార్గముగా మమ్ము నీపాదసన్నిధికి గొనిపొమ్ము. మా పాపము లాటంకమనియా, నీజాగు! ఆ కుటిలపాపములను 'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి' అనిననీవే తొలగించుము, నీవేమి సాధనముల ననుష్ఠింతువందువా 'భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ' నీవు సర్వాధికముగ భావించు నమస్కారవాక్య నుచ్చరింతుము. వాచికమునకే యిట్టి ఫలమున్నచో నీకదానికి కాయికముకూడ తోడైన నేమి చెప్పవలెను?

దీనినే ఉపబృంహణముగావించుచు భీష్మస్తవరాజమున :-

శ్లో॥ ఏకోఽపి కృష్ణస్య కృతః ప్రణామో
దశాశ్వమేధావభృథేన తుల్యః
దశాశ్వమేధీ పునరేతి జన్మ
కృష్ణప్రణామీ న పునర్భవాయ॥ (91 శ్లో)

శ్రీకృష్ణునికి గావించిన యొక్క నమస్కారము దశాశ్వమేధములతో సమానమేగాక నతిశయయితముకూడ నగుచున్నది. ఆయశ్వమేధి తిరిగి పుట్టునుగాని ఈకృష్ణప్రణామి ఎన్నడు నిక పుట్టడు. ఈ వందన విధానమలవరచుకొనుటకు

శ్లో॥ పతితః స్ఖలిత శ్చార్తః క్షుత్వా వా వివశో బ్రువన్॥
హరయే నమ ఇత్యుచ్చై ర్ముచ్యతే సర్వపాతకాత్।
(భాగ. 12-12-46)

పడినను, జారినను, ఆపదయందున్నను, తుమ్మినను, పరవశుడై యున్నను, ఎలుగెత్తి 'హరయే నమః' యన్నచో పాపములన్నియు పోవును. శ్రీయఃపతిసహధర్మచారిణియగు శ్రీమహాలక్ష్మియనుగ్రహము నాహ్వానించి ఆ సేవందన మహిమ యుల్లముగా గోచరించును. చూడుడు.

శ్రీలక్ష్మీనృసింహస్వామి నే నమః

# గాయత్రీ క్రతువైభవము

శ్రీమాన్ మన జియ్యరుస్వామివారి యాదేశానుసారముగా 1-3-60 వ తేదీనాటికే శ్రీయాదగిరి క్షేత్రమునకు ఋత్విక్కులుగా నుండదలచిన స్వాములందరు విచ్చేసిరి. బందరునుండి శ్రీగాయత్రీ పీఠాధిపతులగు శ్రీపరమహంస పరివ్రాజక శ్రీవిద్యాశంకర భారతీస్వామివారు శ్రీజియ్యరుస్వామివారి ప్రత్యేకాహ్వానము మీద గాయత్రీ క్రతుసందర్శనార్థము విచ్చేసిరి. శ్రీభాష్య భగవద్విషయపారాయణపరులు, వేదాధ్యయనపరులు, నాలాయర ప్రబంధపారాయణపరులు శ్రీభాగవత, విష్ణుపురాణపారాయణ విద్వాంసులు, పర్యవేక్షకులును గుణకృత కైంకర్యపరులును వుచితోపనయనాపేక్షులు, ప్రేక్షకులు, ఇత్యాదులు వందలకొలది విచ్చేసిరి. వారివారికి తగిన ఏర్పాట్లు కార్యనిర్వాహక వర్గమువారు శ్రద్ధగా గావించిరి. 1-3-60 వ తేది రాత్రి గం. 8 లకు ఉచితోపనయనముగోరి విచ్చేసిన వటువులకు ఉదకశాంతి సక్రమముగా శాస్త్రీయముగా జరుపబడెను. శ్రీయాదగిరి లక్ష్మీనృసింహస్వామి సమక్షమున గాయత్రీ క్రతువునకు అంకురార్పణ ఋత్విగ్వరణ ఇత్యాది కార్యక్రమములు జరిగెను.

2-3-60 ఈనాడు ఉదయము గం. 6 లకు శ్రీజియ్యర్ స్వామివారి సన్నిధిలో తీర్థగోష్ఠి జరిగిన తరువాత 108 మంది ఋత్విక్కులు దీక్షావస్త్ర కంకణధారులై జపశాలలో ప్రవేశించి ధర్భాసనము మీద చిత్రాసనము వైచి సిద్ధపరుపగా అందు, ఆసీనులై సరిగ గం 6-30 లకు గాయత్రీజపము ప్రారంభించిరి. యజ్ఞశాలలో శ్రీలక్ష్మీనృసింహస్వామివారిని వేంచేపు చేసుకొని వచ్చి పంచకుండములతో హోమ కార్యక్రమమును సుప్రసిద్ధులగు యాజ్ఞీకస్వాములారంభించిరి. మరియొకవంక ఘనాపాటీలు, వేదపారాయణము ప్రారంభించిరి. మరియొకవంక నాలాయర ప్రబంధ వేత్తలు శ్రావ్యముగా ప్రబంధ పారాయణము ప్రారంభించిరి. మరియొకచోట శ్రీభాష్య, భగవద్విషయ పారాయణులు మరియొకవంక శ్రీభాగవత, రామాయణ విష్ణుపురాణ పారాయణములు భగవద్గీత, శ్రీవిష్ణు సహస్రనామము స్తోత్ర పారాయణములున్నూ ప్రారంభమయ్యెను. మరియొకవంక ఉచితోపనయన కార్యక్రమము ఆరంభమయ్యెను. ఆనాటి కార్యక్రమశోభ చూచి ఆనందింప వలసినదేకాని వ్రాయవీలుకాదు ఆనాడు ఉపనీతులైన వటువులు.

1. చిరంజీవి దరూరి అనంతాచార్యులు, రాయిపోలు.
2. ,, ముడుంబై కృష్ణమాచార్యులు, రంగాపురం.
3. ,, ముడుంబై కోదండరామాచార్యులు, రంగాపురం.
4. ,, ఆశ్రి రాధాకృష్ణమాచార్యులు, సీతారాంబాగ్.
5. ,, ఆశ్రి లక్ష్మీనరసింహాచార్యులు, సీతారాంబాగ్.
6. ,, చక్రవర్తుల రామాచార్యులు, కోణకంచి.
7. ,, పుట్టపాక సుదర్శనరావు, నందివనపర్తి.
8 ,, గోవిందు శ్రీనివాసరావు, హైద్రాబాద్.
9. ,, గోవిందు మురళీధరరావు, హైద్రాబాద్.
10. ,, వి. రాధాకిషన్‌రావు, హైద్రాబాద్.
11. ,, డింగిరి నరహరిరావు, పల్లారం.

12. ,, నల్లాని రామానుజాచార్యులు, మల్లావం.
13. ,, విద్యాసాగర్.
14 ,, వెల్దండ మురళీధరరావు.
15. ,, అనుకొండ వెంకటనరసింహాచార్యులు, అయ్యవారిపల్లె
16. ,, రంగరాజు శ్రీనివాసరావు నేరెడ.
17. ,, రంగరాజు జనార్దనరావు, నేరెడ.
18. ,, ఆత్రేపల్లి లక్ష్మీనారాయణరావు, వనంపల్లి
19. ,, ఆత్రేపల్లి కొండమాచార్యులు, వనంపల్లి.

సరిగ జపము గం. 10-0 లకు పూర్తిఅయ్యెను. జపానంతరము హోమములు తర్పణములు పుష్పాంజలులు మరియు సమిష్టిగా సహస్రనామ పారాయణ జరిగెను పిమ్మట శాత్తుమొఱ జరిగెను అప్పటికి పగలు 12-0 లయ్యెను. పిదప శ్రీజియ్యర్‌స్వామి గాయత్రీక్రతు నిర్వహణార్థమై భిక్షాకార్యక్రమ మారంభించిరి వెంట వందలకొలది స్వాములు, యాత్రికులు, స్త్రీలు సహస్రనామాను సంధానముచేయుచు శ్రీజియ్యర్ స్వామి వారి వెంట అనుగమించిరి. ఉత్తమ ద్రవ్యమున్న దాతలు తమ ద్రవ్యమును అవ్వెత్తుగా భక్తి ఉప్పొంగుచుండగా శ్రీస్వామి భిక్షాపాత్రలో తమ భిక్షా ద్రవ్యముంచిరి. భిక్షాగోష్ఠిలో కోమలలో శ్రీస్వామివారి సన్నిధికేగి తీర్థప్రసాదములు స్వీకరించి తిరువీధి గోష్ఠిలోతిరిగి శ్రీస్వామివారు తమబసకు విచ్చేసిరి. పిదప అఖండ తదీయారాధన ప్రారంభమయ్యెను. ప్రతిదినము వేలసంఖ్యలో తదీయారాధన జరిగెను. శ్రీవైష్ణవులకును, స్మార్తబ్రాహ్మణులకును, వైశ్యులకును, కమ్మవారు; రెడ్లు, కాపులుకును వేరువేరుగ భోజనముల కేర్పాట్లుచేయబడెను. ఒక వంక బీదలకు ప్రత్యేకముగా అన్నదానము గావింపబడెను. బీదలకు ప్రత్యేకముగా పదిరోజులు అన్నదానములు జరిపింపబడెను

ప్రతిదినము సాయంకాలము 3 గంటలకు వైదిక పండితసభ ప్రారంభింపబడెను వైదికస్వస్తితో సభ ప్రారంభమయ్యెను శ్రీ జియ్యర్ స్వామివారు గాయత్రీక్రతువు ఎందులకు చేయవలసి వచ్చినదో దాని ప్రయోజనమేమో సంగ్రహముగా సెలవిచ్చిరి. పిదప సంఘప్రధాన కార్యదర్శులగు శ్రీమాన్ న్యాయవేదాన్త విద్వాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారు సంధ్యావందనమును గురించి 54 ప్రశ్నలువైచి ఇందుకు తాము సమాధానములు కూడా వ్రాసియుంటిమనియు వీలగునప్పుడెల్ల ఈ పదిరోజులలో ముచ్చటింతుమనియు అవకాశము లేనిచో మా భక్తి నివేదన పత్రిక ద్వారా యీ విషయములను ప్రకటింతుమనియూ సెలవిచ్చిరి. అంతటితో నాటిసభా కార్యక్రమము పూర్తిఅయ్యెను.

సాయంత్రము మరల గం. 6-30 లకు ఋత్విక్కులు సాయంసంధ్యా వందనము పూర్తిచేసుకొని జపశాలకు వేంచేయగా సమష్టిసహస్రనామ పారాయణ జరిగెను తరువాత హోమములు జరిగెను ఆపిదప నాటి పారాయణముల యొక్క విన్నపము స్వామిసన్నిధిలో నివేదించుట శాత్తుమొఱ తీర్థప్రసాదగోష్ఠి జరిగెను అతరువాత శ్రీలక్ష్మీనృసింహస్వామివారిని సగౌరవముగా సన్నిధికి వేంచేపు చేయుట, ఋత్విక్కులకు ప్రసాద ప్రదానము తదితరులకు తదీయారాధన జరిగెను. రాత్రి గం 10-0 లకు విశ్రాంతి.

3-3-60 ఈనాడు పైవిధముగానే కార్యక్రమము జరిగెను. ఉపనయనములు మాత్రము లేవు. సాయంకాలము సభలో అన్నవరం దేవస్థానమునుండి విచ్చేసిన శ్రీపాద సుబ్రహ్మణ్యఘనాపాటిగారు వేదములో అవధానము గావించిరి. ఈ వేధావిధానము జూచి ఆశేషజనము ఆశ్చర్యపడిరి. ఆవిధానానంతరం శ్రీమాన్ ఉభయ వేదాన్తపండితులగు ఆశ్శి నరసింహాచార్యస్వామివారు గాయత్రీ మహిమనుగూర్చి పరమ విలక్షణముగా ఉపపన్యసించిరి. తరువాత మహావిద్వాన్ శ్రీ భీష్మదేవ్ గారు సంస్కృతములో గాయత్రిని గురించి శ్రావ్యముగా ఉపన్యసించిరి.

4-3-60 ఈనాడు యథాప్రకారముగానే ఋత్విక్కుల జపము, పారాయణలు ప్రారంభ మయ్యెను ఈనాటి సాయంకాలము గం 6 లకు మన ఆంధ్రప్రదేశ్ గవర్నరుగారు సతీసమేతులై శ్రీ జియ్యర్‌స్వామివారి ఆహ్వానము నంగీకరించి జపశాలకు విచ్చేసి ఆవైదిక క్రతుశోభను జూచి చాలా సంతోషించిరి. ఆసమయమున సంఘకవిగారైన శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యస్వామి వారు శ్రీ గవర్నరుగారికి సంస్కృతములో అభినందనపత్ర మిట్లు సమర్పించిరి.

శ్రీరస్తు

శ్రీ ఆంధ్రప్రదేశ్ గవర్నర్

శ్రీశ్రీశ్రీ భీమసేన సచార్ మహాశయస్య

# అభినందనపత్రము

శ్లో॥ ఆంధ్రదేశ గవర్నరు శ్రీ భీమసేన సచార్ సుధీః
శ్రీ యాదగిరి లక్ష్మీశ కృపయా వర్ధతాం సదా॥
శ్లో॥ ఏతద్యాదగిరౌ పవిత్ర నృహరిక్షేత్రే ప్రతిష్ఠాపితే
గాయత్రీక్రతు నామకే శ్రుతి విదాంసంస్థై స్సమారాధితే
యాగే, రాష్ట్రగవర్నరాఖ్య బిరుద శ్రీ భీమసేనాహ్వయాః
యూయం సాంప్రత్యమేత్య దర్శన మిదం మోదాయ బోభూయతే॥
శ్లో॥ ఏతద్భారత మండలం శ్రుతితపోయాగాది నానాక్రియా
భూయో నిర్వహణాది దివ్యవిధి భిర్నిత్యం జరీజృంభతే
లోకశ్రీ రధికారిణాంచ విజయో యావత్ప్రజా మంగళం
దూరోగాది వినాశనంచ భవతి శ్రీమర్తు మఖై రీక్షితృశైః॥
శ్లో॥ ఏతాదృఙ్మహనీయ యాగ కలనానిర్వాహకత్వం పురా
భూపాశ్చ క్రురనేకధా విగళితా స్తే వాసరాశ్శ్రీయుతాః।
యజ్ఞే రేవసు రేశ్వరో వితను తేవృష్టిం తయావర్ధతే
సస్యశ్రీ రనయా భజంతి భవికం లోకాస్సమస్తాః ప్రభో!
శ్లో॥ తస్మాద్రాష్ట్ర గవర్నరిత్యు పహిత ప్రఖ్యాతి మాసేదుషాం
యుష్మాకం సహకార సంపద దునాయాగాయ జేగీయతాం
యావద్యాగవిధిః ప్రభుత్వనిధి భిస్సంపూర్యతే తావతా
రాష్ట్రే శాంతి సుఖాభివృద్ధి విజయశ్రీ స్సర్వదా శోభతే
శ్లో॥ పుణ్యం యాదగిరి క్షేత్రం।।పుణ్యం శ్రీ స్వామిదర్శనం
పుణ్యాత్పుణ్యతరం శ్రీమన్ గాయత్రీక్రతు దర్శనం॥

ఈ అభినందన పత్రమును శ్రీ జీయ్యర్ స్వామివారి ద్వారా శ్రీ గవర్నరుగారందుకొని ఆనందించిరి. ఆపిదప గుంటూరు జిల్లా చౌటపాపాయపాలెం అగ్రహారమునుండి విచ్చేసిన ప్రముఖ వేద విద్వాంసులు, మీమాంసా శాస్త్రజ్ఞులు అగు శ్రీ సన్నిధానం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు గాయత్రీ మంత్రమును గురించి గంటన్నర కాలము సంస్కృతములోను, తెలుగులోను ఉపన్యసించిరి మరల రాత్రి యథావిధిగా హోమాదివిధులు జరిగినవి.

5-3-60 ఈ నాడు యథాపూర్వముగా జప హోమ పారాయణాదులు సకాలములో ప్రారంభింపబడెను. ఈ నాటి సాయంకాలం విద్వత్సభలో మైలవరం వాస్తవ్యులును సంధ్యా వందనమును గురించి అనేక గ్రంథములు

ప్రాచీన శాసనకావ్యాలగు శ్రీ లక్ష్మీపతిశాస్త్రి గారు సంస్కృతానందనమును గురించి తాము కృషిచేసిన సారాంశమును గంటకాల మువన్యసించిరి. తరువాత రాత్రి గం. 8-0 లకు దేవాలయ మంత్రులగు శ్రీ గౌరవపాత్రులగు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు శ్రీ జియర్ స్వామివారి ఆహ్వానమును పురస్కరించుకొని గాయిత్రీజపశాలకు విచ్చేసిరి. శ్రీ కల్లూరి చంద్రమౌళిగారిని గురించి శ్రీమాన్ కవిగారు ఇట్లు ఆశువుగా ఆశీస్సును పద్యరూపముగా తెలిపిరి.

## శ్రీ. గౌ. కల్లూరి చంద్రమౌళి గారికి ఆశీస్సు

చల్లని సౌమనస్యమున సర్వజనస్తవనీయులైన శ్రీ కల్లురి
చంద్రమౌళి సుధిగారికి, దైవిక మంత్రి గారికిన్
సల్లలితాంత రంగమున స్వామి నృసింహుడితో ఉదధి కన్యగా
కొల్లగ భాగ్యలక్ష్మి తోనగూర్చి నిరంతర మాయు గావుతన్
రామ చరిత్ర గ్రామ్యమను వైఖరి వ్రాసిరి. దేవళాలయ
క్షేమము గోరి మంత్రులయి శ్రీ గడియించిరి పైన త్యాగలక్ష్మి
మహిమాభి రాములయి చేసిరదే పదివేల రూప్యముల్
తామతిభక్తి భద్రగిరి దాశరథి ప్రభవ్యాప్తి చెందగా
శ్రీలలరారు యాదగిరి శృంగమునందొక కోనయందు, లక్ష్మీలల
నాసమేతు డయి చెన్నవహించు నృసింహమూర్తి దేవా
లయ మంత్రుత్వము విజయమ్మును జేసిన చంద్రమౌళికి
శాలుర కాయురభ్యుదయ సంపదలిచ్చును గాత నిత్యముగా

నాటి రాత్రి కార్యక్రమము యథావిధిగా పూర్తి యయ్యెను.

6—8—60 మరల యథావిధిగా సకాలములో జపములు వగైరాలు ప్రారంభ మయ్యెను. ఉదయము గం. 8-0 లకు శ్రీ చంద్రమౌళిగారు మరల గాయత్రీ క్రతుశాలకు విచ్చేసి శ్రీ స్వామిని సేవించుకొని శ్రీ జియ్యర్ స్వామి వారితో ఏకాంతముగా దాదాపు ఒక గంట కాలమనేక విషయములను గురించి ముచ్చటించిరి. ముఖ్యముగా వారిరువురి సంభాషణములలో ప్రస్తుత మాలయ సమస్యలను గురించి చర్చించినట్లు తెలిసినది. ఇందులకు త్వరలో ఒక సమావేశము శ్రీజియ్యరు స్వామి వారేర్పాటు చేయవలెనని సూచించగా శ్రీ చంద్రమౌళిగా రంగీకరించిరి

ఈ నాడు మరల ఉచితముగా ఉపనయనములు 30 జరిగినవి.

1. చిరంజీవి కాండూరి కృష్ణమాచార్యులు
2. ,, లక్ష్మీపతి శ్రీనివాసాచార్యులు
3. ,, అక్కిరెపల్లి రాంగోపాలరావు
4. ,, పురుషోత్తమరావు
5. ,, శ్యామసుందరరావు
6. ,, కిషనురావు
7. ,, మధుసూదనరావు
8. ,, నింబాద్రి
9. ,, మురళీధరరావు
10. ,, రామచంద్రరావు
11. ,, రామానుజాచార్యులు
12. ,, సీతాపతి
13. ,, యాదగిరిరావు
14. ,, శ్రీనివాసాచార్యులు
15. ,, కె. గోపాలాచార్యులు
16. చిరంజీవి రంగాచార్యులు
17. ,, కె. వెంకటాచార్యులు
18. ,, శేషం సత్యనారాయణాచార్యులు
19. ,, కళ్ళగుంట వెంకటనరసింహాచార్యులు
20. ,, సుదర్శనాచార్యులు
21. ,, సత్యనారాయణ
22. ,, లక్ష్మీనరసింహాచార్యులు
23. ,, గోపాల కృష్ణమాచార్యులు
24. ,, రాఘవరావు
25. ,, కిషనురావు
26 ,, పురుషోత్తమరావు
27. ,, కొమాండూరు లక్ష్మీనరసింహాచార్యులు
28. ,, యాదగిరిస్వామి
29. ,, రామానుజాచార్యులు
30. ,, జగన్మోహనాచార్యులు

సాయంకాలము జరిగిన పండితసభలో శ్రీమాన్ తూపురాణి వెంకటాచార్య స్వామివారు, సంధ్యావందన ప్రాశస్త్యమును గురించి పిమ్మట శ్రీ జియ్యర్ స్వామివారు ధ్యానమును గురించి విపులముగా ఉపన్యసించిరి. శ్రీమాన్ సంతానం గోపాలాచార్యులు గారును శ్రీ గద్వాల పండితులున్ను గాయత్రిని గురించి ఉపన్యసించిరి.

7-3-60 ఈనాడు యథా పూర్వముగా కార్యక్రమము నిర్ణత సమయమునకే ప్రారంభింప బడెను. ఈనాడు ఉదయము శ్రీ గోవర్లాంకాభా మంత్రి శ్రీ ముంగుల నర్సింగరావుగారు గాయత్రీ జపశాలకు విచ్చేసిరి. ఈనాడు సాయంకాలము జరిగిన పండిత సభలో శ్రీమాన్ న్యాయవేదాంత విద్వాన్ తె. కం. గోపాలాచార్యస్వాములు గారు. సంధ్యా వందనమును గురించి విపులముగా గంటన్నర కాలము ఉపన్యసించిరి ఈవిషయము లన్నియు. గాయత్రీసంచికయను పేరుతో ప్రత్యేకముగా ఒక సంచిక భక్తినివేదన ద్వారా ప్రచురింతుము

8-3-60 ఈనాడు కార్యక్రమము నిర్ణీత సమయమునకే ప్రారంభింప బడెను. ఈనాడు సాయంకాలము పండిత సభలో శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజా చార్యులుగారు కర్మ జ్ఞాన సహకృతమైన భక్తియే పరమ ప్రాప్యమైనదని తద్విషయము పద్యాత్మకముగా నుపన్యసించిరి. తరువాత శ్రీ మాన్ ప్యారికపురి భట్టర్ శ్రీ రామాచార్యులుగారు ఉపన్యసించిరి

9-3-60 ఈనాడు మామూలు కార్యక్రమము గాక మరల ఉచితోపనయనములు జరిగినవి ఈనాడు జరిగిన ఉపనయనములు 33

1. చిరంజీవి అక్కినేపల్లి గోపాలరావు
2. ,, అక్కినేపల్లి పురుషోత్తమరావు
3. ,, కాండూరు కృష్ణమాచార్యులు
4. ,, లక్ష్మీపతి శ్రీనివాసాచార్యులు
5. ,, కళ్ళగుంట వెంకటనరసింహాచార్యులు
6. ,, సముద్రాల నరసింహాచార్యులు
7. ,, మరింగంటి లక్ష్మీనరసింహాచార్యులు
8. ,, నలకోళి గోపాలాచార్యులు
9. ,, కంజెర్ల సుదర్శనాచార్యులు
10. ,, చక్రవర్తుల వెంకటరామానుజాచార్యులు
11. ,, నండిపాటి సీతాపతి ఆచార్యులుగారు
12. ,, గోవర్ధనం వెంకటరమణాచార్యులు
13 ,, పరాంకుశం జగన్మోహనాచార్యులు
14. ,, పుటపాక రామచంద్రరావు
15. ,, పుటపాక మురళీధరరావు
16. ,, శంకర రాధాకృష్ణమూర్తి
17. ,, సందుగు కృష్ణమాచార్యులు
18. చిరంజీవి సేపంసత్యనారాయణాచార్యులు
19. ,, గోవర్ధనం రామమోహనాచార్యులు
20 ,, వారణాసి సత్యనారాయణ
21. ,, సింతి శ్రీనివాసాచార్యులు
22. ,, రామరాజు యాదగిరిరావు
23. ,, కొమండూరి వెంకటాచార్యులు
24. ,, కొమాండూరి రంగాచార్యులు
25. ,, కొమాండూరి లక్ష్మీనరసింహాచార్యులు
26. ,, కొమాండూరి యాదగిరి ఆచార్యులు
27. ,, పోచిరాజు రాఘవరావు
28 ,, పోచిరాజు కిషన్‌రావు
29. ,, కోపూరి పురుషోత్తమరావు
30. ,, పుల్యాల శ్యామసుందరరావు
31. ,, కానర్ల మధుసూదనరావు
32. ,, కానర్ల రామకిషన్‌రావు
33. ,, శ్రీభాష్యం సింహాద్రి ఆచార్యులు

ఈ నాడు జరిగిన పండితసభలో శ్రీగాయత్రీ స్వాములవారు ఉపన్యసించిరి. పిమ్మట శ్రీ జియ్యర్ స్వామివారు గాయత్రీ, సంధ్యావందనములను గురించి కొన్ని ముఖ్య విషయములనుపన్యసించిరి.

10-3-60 ఈనాడు యథా రీతిగా కార్యక్రమ మారంభమైనది. సాయంకాలము జరిగిన పండిత సదస్సులో శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు తాము క్రొత్తగా రచించిన 'శ్రీ యాదగిరి ప్రభావము' అను కావ్యమును గంటన్నర కాలము గానముచేసి ఆకృతిని శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహ స్వామివారికి అంకితమిచ్చిరి శ్రీ జియ్యర్‌స్వామివారు కృతిసమర్పణ సమయములో శ్రీ కవిగారికి మంగళాశాసన పూర్వకముగా అర్ఘనాటపదార్థలో సత్కరించిరి. ఈనాడుకూడ తిర్గి రెండు ఉచితోపనయనములు జరిగినవి.

11—3—60 ఉదయము కార్యక్రమము యథాపూర్వముగా జరిగినది. సాయంకాలము 5 గంటలకు పూర్ణాహుతి జరిగినది.

12—3—60 ఈ నాడు ఉదయము గం. 9 లకు అవభృథోత్సవము జరిగినది. సాయంకాలము 5 గంటలకు ఋత్విక్కులకు పారాయణపరులకు అందరకు సగౌరవముగా తృప్తిగా సత్కారములు జరిగినవి.

ఈ గాయత్రీ క్రతువులో 10 రోజుల కార్యక్రమము ఇట్లు జరిగినది :—

ఉదయము :- గం. 6-0 లకు శ్రీ జియ్యర్ స్వామివారిసన్నిధిలో తీర్థగోష్ఠి.

గం॥ 6-30 లకు గాయత్రీజపప్రారంభము.

గం॥ 9-30 లకు జప విరమణము.

గం॥ 10-0 లకు హోమములు, తర్పణలు, పుష్పాంజలులు.

గం॥ 11-0 సమష్టిగా సహస్రనామ పారాయణము. హోమములు, శాత్తుముఱ, తీర్థప్రసాద వినియోగము.

గం॥ 12-0 లకు శ్రీలక్ష్మీనృసింహస్వామివారి కోవిలలోనికి వెళ్ళి పెరుమాళ్ళదర్శనము. శ్రీ జియర్ స్వామివారి భిక్షాకార్యక్రమము. పిదప అఖండతదీయారాధన.

సాయంత్రము :- గం॥ 3-0 లకు పండితసభప్రారంభము.

గం॥ 7-0 లకు సమష్టి సహస్రనామపారాయణ.

రాత్రి :- గం॥ 8-0 లకు శాత్తుముఱ.

గం॥ 9-0 లకు శ్రీ లక్ష్మీనృసింహస్వామి వారిని సగౌరవముగా సన్నిధికి వేంచేపుచేయు ఉత్సవము. పిదప తదీయారాధన. విశ్రాంతి.

# కృతజ్ఞతానుసంధానము

ఈ గాయత్రీ క్రతువులో దేవస్థానం కమిటీవారు చేసిన సహాయము అపారమైనది. దేవస్థానకమిటీవారేకాకుండగ దేవస్థానము మంత్రిజముగారు, మిగత ఉద్యోగస్థులును మరియు స్థానాచార్యులు అర్చక పరిచారక సేవకులు అందరునుకూడ అమిత భక్తి శ్రద్ధలతో క్రతువు నిర్వహణమునకై చాలతోడ్పడిరి. అందరు నిరంతర సేవజేసిరి. వీరందరికిని కృతజ్ఞులము. సికిందిరాబాద్ మేయర్ శ్రీ శిష్ణాం సత్యనారాయణ గుప్తాగారు (మేయర్) బేగంబజారు లోని శ్రీ లక్ష్మీప్రసాదుగారు హృదయపూర్వకముగా మాకుతోడ్పడిరి. మరియు శ్రీమాన్ అడ్వొకేట్ శ్రీ రామ స్వామి అయ్యంగారు శ్రీ జక్కాని సూర్యనారాయణగారు శ్రీ సానికె కాశయ్యగారు ఇత్యాదులు చాల తోడ్పడిరి. ఇందులకు కృతజ్ఞులము. ముఖ్యముగ సీతారాంబాగులోనున్న శ్రీ వైష్ణవస్వాములున్నూ శ్రీ జియ్యర్ గారి ఇంటిలో నున్న శ్రీ శృంగారం నరసింహాచార్యస్వామివారున్నుమాకుచాలకుడిభుజముగానుండియీకార్యక్రమమునునిర్వహించిరి మరియు ఈ క్రతువులో విశేషించి సహాయపడినవారు శ్రీమాన్ ముదుంబై రామానుజాచార్యులుగారి నాయకత్వము క్రింద అచ్చుట గీతామండలి భక్తబృందమందలి స్త్రీపురుషులు వరంగల్లువారలు చూపిన శ్రద్ధాభక్తులు వాచామగోచర ములు శ్రీ సతమకార్యశోకోటియాగారు, శ్రీ యాదానారాయణగారున్నూ, రామయ్యగారున్నూ, మరియు విజయవాడ వాస్తవ్యులగు శివకోటి లక్ష్మీనరశింహంగారు, శ్రీ దశరథరామంగారున్ను చాలసేవజేసిరి. మరియు స్థానాచార్యులు గారగు శ్రీమాన్ వంగిపురం నరసింహస్వామివారి ఆలయము బ్రహ్మోత్సవసమయమగుటచే జనసమ్మర్దమంత ఎక్కువగానున్న కోవిలకార్యక్రమమెంత హెచ్చుగానున్నను క్రతుకార్యక్రమమును శ్రీ జియ్యర్ స్వామివారికిని, స్వాములకును జరుగవలసిన శ్రీస్వామి సేవాదులను అవ్యాహతముగా జరపించిరి. ఇందులకు కృతజ్ఞులము.

లోక కళ్యాణార్థమై కృష్ణోత్సవంశుద్ధితో గావించిన గాయత్రీజపఫలమును ఋత్విక్కులచే గాయత్రీ యంత్రముపై ధారాదత్తముగావింపజేసి ఆయంత్రమును శ్రీ జియ్యర్ స్వామివారు సగౌరవముగా శ్రీ లక్ష్మీనృసింహ స్వామివారికి సమర్పించిరి. ఆ యంత్రముతోపాటు నృసింహయంత్రము, సుదర్శనయంత్రములను కూడ శ్రీ జీయరు స్వామివారు శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి గర్భాలయములో వేంచేపుచేసిరి.

ఈ క్రతునిర్వహణమునకై దేవస్థానం కమిటీ వారు రు. 5000/ ల రూపాయలు సమర్పించిరి మరియు ఉచితముగ నీటిపంపులను, ఎలక్ట్రిక్కు దీపములను అతివిశాలమగు అనేక సత్రములను, మరియు సుమారు రు 1200/– లు ఖరీదుగల భోజన సామాగ్రిని సమర్పించిరి. దేవస్థానం కమిటీవారందరును కూడ అత్యంత భక్తిశ్రద్ధలతో ఈ క్రతు నిర్వహణములో పాల్గొని సేవజేసిరి అందు విశేషించి కమిటీకార్యదర్శిగారగు సేఠ్ రామదయాల్ శేటుగారు చాల తోడ్పడిరి. మరియు శ్రీ కె. పురుషోత్తమ రెడ్డిగారు మిక్కిలి సేవచేసిరి. ఈ విధముగా అంతరంగ, బహిరంగములుగా ఈ క్రతువులో అన్వయించి సహాయమొనరించిన భక్తులందరకు శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహ స్వామివారు అనేకధా వారలకండదండగా నిలచి కాపాడుగాక యని కోరుచున్నాము.

ఈ విధముగా గాయత్రీక్రతువును శ్రీ యాదగిరి క్షేత్రమందు పరమ విలక్షణముగా పరిసమాప్తి గావించి శ్రీ జియ్యర్ స్వామివారు 11—3—60 వ తేది రాత్రి గం॥ 9-0 లకు బయలుదేరి తమకార్యదర్శిసతోసహా మోటారు మీద పాలకొల్లులో జరుగుచున్న శ్రీ అష్టాక్షరీ కోటియజ్ఞ కార్యక్రమములో అన్వయించుటకు అచ్చటి వ్యవస్థాపకులచే ప్రార్థింపబడి పాలకొల్లు వేంచేసిరి.

## శ్రీయాదగిరి క్షేత్రమున ది 1—3—60 మొదలు 12—3—60 వరకు జరిగిన గాయత్రీ క్రతువులో పాల్గొనిన ఋత్విక్కుల తిరునామములు

1. ఆచార్యులు:- శ్రీమాన్ ఉ. వే. ఆచ్చి నరసింహాచార్య స్వామివారు హైదరాబాద్
2. బ్రహ్మ:- ,, ఉ. వే. చిలకమర్రి శ్రీనివాసా చార్యులుగారు హైదరాబాద్
3. ఉపబ్రహ్మ ,, ఉ. వే. ప్యారకపురి బట్టరు శ్రీరామా చార్యులుగారు సీతారాంబాగ్
4. హోతలు:- ,, ఉ. వే. ఆచ్చి వెంకటాచార్యులుగారు అవునూరు
5. హోతలు:- ,, ఉ. వే. దరూరి నరసింహాచార్యులుగారు అల్వాలా
6. హోతలు;- ,, ఉ. వే. శేషం లక్ష్మణాచార్యులుగారు మంకాళ

### యాగ పర్య వే క్ష కు లు

7. శ్రీమాన్ ఉ. వే. వంగిపురం నరసింహాచార్య స్వామివారు – స్థానాచార్యులవారు

### యాగ శా లా ప రి చా ర కు లు

8. శ్రీమాన్ జీడికంటి వరదాచార్యులుగారు
9. ,, గట్టు గోపాలాచార్యులుగారు
10. ,, ముడుంబ హయగ్రీవాచార్యులుగారు
11. ,, జీడికంటి సుదర్శనాచార్యులుగారు
12. ,, జిడికంటి సీతా రామాచార్యులుగారు

### గా యి త్రీ జ పా ను ష్ఠా త లు

13 ,, అనూరి మరింగంటి మళవళా చార్యులుగారు వరంగల్లు
14 ,, అనూరి మరింగంటి లక్ష్మీనరసింహా చార్యులుగారు బందరు
15 ,, కొదమసింహం అప్పలాచార్యులుగారు బందరు
16 ,, బుక్రాయతిరాజ సంపత్కుమారా చార్యులుగారు బందరు
17 ,, శృంగారం నరసింహాచార్యులుగారు శనివారపుపేట

159 శ్రీమాన్ వేదాంతం కొండమాచార్యులుగారు హైదరాబాద్

160 శ్రీమాన్ కంతీపురం అనంతాచార్యులుగారు గాడవల్లి

161 ,, కళ్ళకుంట సీతారామాచార్యులు గారు నల్లెళ్ళ

162 ,, శేషం రత్నమాచార్యులుగారు హైదరాబాద్

## ఉపనయన పర్యవేక్షకులు

163 దేవస్థాన పురోహితులు

164 శ్రీమాన్. యాదగిరి ఆచార్యులుగారు

165 బ్రహ్మశ్రీ దేవస్థానం స్మార్తపురోహితులు

## తళియ కైంకర్యపరులు

166 శ్రీ సముద్రాల నరసింహాచార్యులుగారు వరంగల్లు

167 శ్రీ శ్రీరంగం పాపలాచార్యులు గారు

168 శ్రీ సముద్రాల వెంకటాచార్యులుగారు

169 శ్రీ సముద్రాల కృష్ణమాచార్యులుగారు

170 శ్రీ కుంతీపురం అనంతాచార్యులుగారు యాదగిరి

171 శ్రీ అచ్చి గోపాలాచార్యులుగారు

## తళియకైంకర్య పర్యవేక్షకులు

172 శ్రీమాన్. క్షీరసాగరం వరదాచార్యులు గారు

173 శ్రీమాన్. శృంగారం కృష్ణమాచార్యులుగారు

జీయార్ గూడెం

## తదీయారాధన పరిచారకులు

174 శ్రీ జీడికంటి లక్ష్మణాచార్యులు గారు

175 ,, చక్రవర్తుల తిరుమలాచార్యులుగారు

176 ,, కొండపాక నంబులాద్రి ఆచార్యులుగారు

177 ,, కొటగారి సీతారామాచార్యులుగారు

178 ,, అచ్చి రంగాచార్యులుగారు

179 ,, సందుత తిరుమలాచార్యులుగారు

180 ,, వంగిపురం వెంకట నరసింహాచార్యులు గారు

181 ,, చింతపట్ల రంగాచార్యులుగారు

182 ,, పరాశరం గోపాలాచార్యులుగారు

183 ,, సముద్రాల అళహసింగరాచార్యులుగారు

184 ,, కళ్ళగుంట వరదాచార్యులుగారు

185 ,, కోడూరి కస్తూరిరంగాచార్యులుగారు

186 ,, ఉత్పల రాజగోపాలాచార్యులుగారు

187 ,, సౌమిత్రి నరసింహాచార్యులుగారు

188 ,, పీసపాటి అప్పలాచార్యులుగారు

189 ,, ముడుంబై సింగరాచార్యులుగారు

## స్మార్త సంతర్పణ పరిచారకులు

190 శ్రీ శివాలయపు పూజారిగారు

## క్రతు పర్యవేక్షకులు

191 శ్రీమాన్ ఉ.వే. తెకం గోపాలాచార్యస్వామివారు

192 శ్రీమాన్ అ.వె. కవిరత్న గుడిమెళ్ళ రామానుజాచార్యులుగారు

193 శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యులుగారు

## గాయత్రీక్రతు అధ్యక్షులు

194 శ్రీశ్రీశ్రీ శ్రీత్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు

195 శ్రీశ్రీశ్రీ విద్యాశంకరభారతీస్వాములవారు, గాయత్రీ పీఠాధిపతులు, బందరు.

## శ్రీ జియ్యర్ స్వామివారి పరిచారకులు

196 శ్రీమాన్ న.చ. రఘునాథాచారులుగారు

197 ,, ముడుంబై సత్యనారాయణాచారులుగారు

## శ్రీ భారతస్వాములవారి పరిచారకులు

198 శ్రీ నరసింహశాస్త్రిగారు
199 శ్రీ లక్ష్మీనరసింహస్వామి పెద్దఅర్చకులు
200 శ్రీ ఆండాళ్ సన్నిధి అర్చకులు
201 యాగశాల అధ్యక్షులు
202 డిట్టో
203 ఆళ్వార్ సన్నిధి అధ్యక్షులు
204 మఱియొక అధ్యక్షులు
205 లక్ష్మీనృసింహస్వామి పాచకులు
206 డిట్టో
207 డిట్టో
208 అంబాడాన్ శాస్త్రిగారు

దేవస్థానం ధర్మకర్తగారు శ్రీ సీతారామశాస్త్రి ప్రతి నిత్యము యాగశాలకు వచ్చి తగు సలహాలు ఇచ్చుచుండెడివారు.

## శ్రీ యాదగిరి క్షేత్రము

పరమ పవిత్రమైన భారతదేశములో శ్రీ నృసింహస్వామి క్షేత్రము లనేకము లున్నవి. వానిలో శ్రీయాదగిరి క్షేత్ర మొకటి. ఇది సర్వధా సుప్రసిద్ధమైన దొక పుణ్యతీర్థము. ఇచట శ్రీ స్వామివారు వెలసిన స్థలము, ఒక పర్వత గుహాంతరాళము.

ఈ యాదగిరి క్షేత్రము ఆంధ్రప్రదేశములో నల్లగొండ జిల్లాలో భువనగిరికి దాదా పారుమైళ్ళలోనున్నది. స్కాందపురాణములో ఈక్షేత్ర వైభవమున్నట్లు కొందఱు పెద్దలు వాకొనుచున్నారు. సంగ్రహముగా ఆకథ యిట్లున్నది.

త్రేతాయుగములో విభండకుడను ఒక మహర్షి యుండెను వానికి ఋష్యశృంగుడను పుత్రుడు జన్మించెను. ఆ ఋష్యశృంగునకు యాదుడను కుమారు డవతరించెను. ఇతడు శ్రీ నృసింహ సాక్షాత్కారము కొరకు బాల్యప్రభృతి పట్టుదలగా నుండెడివాడట. అతడు తండ్రికడ సర్వశాస్త్రము లభ్యసించి శ్రీ నృసింహ జపనిష్ఠతో ననేక పుణ్యక్షేత్రములు పర్యటించి తుదకు గుట్టకు వచ్చెను. ఇది తపస్సునకు తగిన దని నిశ్చయించుకొనెను. తపము ప్రారంభించెను. స్వామి సాక్షాత్కరించెను నీ తపమునకు కారణమేమని యడిగెను. అంతట యాదఋషి దేవదేవుని యవతారములగు జ్వాలా, గండభేరుండ, యోగానందనృసింహ యవతారములను జూడవలెనని ప్రార్థించెను. అందులకే మాంసనేత్రములు చాలవని స్వామి యాదమహర్షికి దివ్యదృష్టి ప్రసాదించెను. భక్తుడు కోరిన రూపము లలో నచట దర్శన మిచ్చెను. కాని యాదుడంతటితో తృప్తిజెందక తాను తపస్సు చేసిన ఈ గుహయందు స్వయం వ్యక్త స్వరూపమై నివసించవలసినదిగా స్వామిని ప్రార్థించెను.

ఆ ప్రార్థనకు శ్రియఃపతి యానందించి జగత్కల్యాణార్థమై తనభక్తుని కోరిక ననుసరించి జ్వాలా నృసింహ, యోగానంద నృసింహ, గండభేరుండ నృసింహ, స్వరూపుడై సాక్షాత్కరించెను. అర్చకులు కర్పూర నీరాజనమిచి తజ్జ్యోతితో ఈమూడు స్వరూపములను భక్తులకు చూపుచుందురు. యాదమునిచే సుప్రతిష్ఠితమైన ఈపర్వతము యాదగిరిగా ప్రఖ్యాతినొంది శ్రీ నృసింహస్వామి వారి సాక్షాత్కారముచేత దివ్య క్షేత్రమై శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహ క్షేత్రముగా కలియుగ వైకుంఠముగా విరాజిల్లుచున్నది. అటు పిమ్మట యాదఋషి క్షేత్రరక్షణార్థమై శ్రీ ఆంజనేయ స్వామిని తపస్సుచే సాక్షాత్కరింప జేసుకొని, యీక్షేత్ర మందలి భక్తులకు, మహా వ్యాధి, స్ఫోటకము ఇత్యాది యుపద్రవములు కలుగకుండ యీగుట్టయందే వేంచేసి యుండుమని ప్రార్థించెను. తనభక్తుని వాంఛను కాదనలేక శ్రీ ఆంజనేయస్వామి అద్యాపి క్షేత్ర పాలకుడుగా యచ్చట నేయుండి పోయెను.

సింహ ద్వారమునుండి భగవత్సన్నిధికి వెళ్ళుచుండ కుడివైపున హనుమదాలయము కనిపించును దేవస్థానములో ప్రొక్కుబడులన్నియు శ్రీ అంజనేయస్వామి సన్నిధియందే భక్తులు చెల్లించుకొనుచుందురు.

ఈతిబాధలు, రోగములు, మున్నగు భౌతిక బాధలనుండి విముక్తి గోరువారు శ్రీ నరసింహ స్వామి సన్నిధిలో అహోరాత్రములు పడకోపులు పడియుందురు. అసంఖ్యాకముగా యావదాంధ్ర దేశమునుండి వేల కొలది యాత్రికులు ప్రతి నిమిషము వచ్చుచుందురు.

ఈక్షేత్రమునందు యాత్రికులచే జరిపించు, ఆరాధనాద్యభిషేకములు, తులసీకుంకుమార్చనలు, సేవలు, సత్యనారాయణవ్రతములు అసంఖ్యాకములు. త్రికాలములయందు శ్రీ స్వామివారి ధర్మదర్శన తీర్థప్రసాదములు భక్తులకు ఉచితముగా లభించును. యాత్రికులకు స్నాన పానములకు చక్కని ఏర్పాట్లున్నవి. తథాపి కొండమీద కూడ నొక కుండమున్నది. అందు సర్వదా తీర్థముండును విశేషించి యాత్రికులందరందే స్నానము గావింతురు. ఈ క్షేత్రమందు ప్రతిశనివారము యాత్రికులరాక విశేషించియుండును. ఈక్షేత్రము ఆళ్వారాచార్య ప్రతిష్ఠమైన చక్కని దివ్యదేశము. ఇందు ఆగమ పాఠశాల, సంస్కృతపాఠశాల యున్నవి ఇచ్చట శ్రీమాన్ వంగిపురం నరసింహాచార్యస్వామివారు స్థానాచార్యులుగా వేచేసియుండి అర్చకుల శిక్షణాతరగతులకు ఏర్పాటుచేసి నడిపించుచున్నారు. ఇందుకు విద్యార్థులకు ఉచితముగా సాపాటు సౌకర్యము లేర్పాటు చేసియున్నారు.

ప్రస్తుతము ఈ దేవాలయమునకు ఈక్రింది పరమభక్తులు పాలక వర్గముగా నున్నారు.

శ్రీ పన్నాసోక్ శెట్టీ (అధ్యక్షులు) భువనగిరి డిప్యూటీకలక్టరు (ఉపాధ్యక్షులు) శ్రీరాందయాలల్ పన్నాలాల్ (కార్యదర్శి) శ్రీ గౌరవనియ యం నర్సింగరావు గారు శ్రీ సీల్నాం సత్యనారాయణ గుప్తగారు (సికింద్రాబాద్) శ్రీ వ. రామచంద్రారెడ్డి గారు (ఇంజనీరు) శ్రీరాయమాణిలాల్ వ్యాస్జీ శ్రీ P. రామచంద్రరావు గారు, శ్రీ K. పురుషోత్తమరెడ్డిగారు శ్రీ B. R. లక్ష్మయ్యగారు శ్రీ పులిజాల రంగారావుగారు శ్రీ. గౌని రామచంద్రయ్య, శ్రీ అక్కినపల్లి సత్యనారాయణరావు గారు శ్రీ వేముల లక్ష్మీనర్సయ్య గారు.

శ్రీ యాదగిరిలో శ్రీస్వామివారి బ్రహ్మోత్సవములు, ప్రతి సంవత్సరము ఫాల్గుణశుద్ధ విదియనుండి ఏకాదశి వరకు జరుగును. ధనుర్మాసములో ముక్కోటి ఏకాదశి మొదలు అధ్యయనోత్సవములు జరుగును.

ఈ బ్రహ్మోత్సవములలో సాహిత్యవైజ్ఞానిక సభలు జరుగును. ఈ సమావేశములో పెక్కురు ప్రసిద్ధిగల కవులు, పండితులు, సంగీతవిద్వాంసులు, హరికథకులు ఉపన్యాసకులు విచ్చేయుదురు, ఈ 10 దినములు శారదాదేవి చరణారవింద శింజానమంజు మంజీర ఝుళం ఝుళం రావములు శ్రావ్యముగా వినిపించుచుండును.

ఈసారి బ్రహ్మోత్సవములలో గాయత్రీక్రతువుకు విచ్చేసిన విద్వాంసులను, వేదపండితులను గూడ ఆహ్వానించి వారిచే ఉపన్యాసము లిప్పించి దేవస్థానంవారు సన్మానములు గావించిరి.

ఇచ్చట శ్రీస్వామివారి ద్వారమున్ను శ్రీ ఆండాళ్ తాయారు ద్వారమున్ను బంగారు వెండిలో నగిషీపనులు చేయించి ప్రతిష్ఠించిరి మరియు మండిలా వరాహసింహద్వారమునకు వెండితొడుగులు చేయించిరి. శ్రీ యాదగిరి మీద ఎచ్చటచూచినను లక్ష్మీసరస్వతుల చల్లని కటాక్షములు నిండి నిమిడీకృతమైయున్నవి. శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహస్వామివంటి అభీష్టప్రదాత "నభూతోన భవిష్యతి." ఇందుకు మా అంతరంగమే సాక్షి. ఇచ్చట కొండక్రింద నుండి కొండమీదికి సర్వదా విద్యుద్దీపములు వెలుగుచుండును. నీటివసతికి వలయు పంపులున్నవి. ఎందరు యాత్రికులు వచ్చినను నివసించుటకు సత్రములు చాలినన్నియున్నవి. మోటారువచ్చుటకు వీలుగా కొండమీదికి రోడ్డు వున్నది. మలమూత్ర విసర్జనకు విరివిగా మరుగుదొడ్లున్నవి. ఎప్పటికప్పుడు వీధులను తుడిచి బాగుచేయుటకు పరిచారకులుండిరి ఇదియేసాక్షాత్తుగా మాకు పరమపదమనిపించినది. ఇందలి అధికారు లందరు అమృతహృదయులు. ఇంతకన్ననింకేమి వ్రాయగలము.

'స్వస్తి'

## బదరీ శ్రీనివాస రామానుజస్వామి వారల శాశ్వత తాత్కాలిక పూజా విరాళములు

శ్రీ తాటికొండ వెంకటసుబ్బారావుగారు బందరు 29/
శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు
లోగడ 10/లు గాక/ఇప్పుడు జమ ఇచ్చినది 19/
శ్రీ నాగమణియమ్మగారు ఓలేరు 30/
శ్రీ గ్రంథి కృష్ణమూర్తిగారు భీమవరం 20

శ్రీ భమిడిపాటి సత్యనారాయణమూర్తిగారు కాకినాడ 30/
తె. కం. గోపాలకృష్ణ c/o శ్రీ
తె. కం. రంగ రామానుజాచార్యులుగారు రాజమండ్రి
లోగడ 116/లు గాక ఇప్పుడిచ్చినది 159/

## సత్సంగ సదన విరాళములు

శ్రీమాన్ స. చ. రఘునాథాచార్యులుగారు వేణుగోపాలపురం లోగడ ఇచ్చిన 1300/లు గాక ఇప్పుడు ఇచ్చినది 300/

శ్రీ శాట్టలూరి రంగనాయకమ్మగారు విజయవాడ 100/

శ్రీ కొమాండూరి లక్ష్మీనరసమ్మగారు నరసాపురం 100/

శ్రీమాన్ న్యాపతి బాలకృష్ణమూర్తిగారు అడ్వకేటు శ్రీకాకుళం 50/

శ్రీ మతే రామానుజాయ నమః



శుభవార్త

## శ్రీ భగవద్గీతోపన్యాసములు

శ్రీ విశిష్టాద్వైత ప్రచారకసంఘ ప్రధానకార్యదర్శులును, న్యాయ వేదాన్త విద్వాంసులును, భగవద్గీతను కూలంకషముగా శోధించి, గీతాప్రశ్నోత్తరావళులను రచించి, గీతా పరీక్షల నేర్పాటు గావించి భగవద్గీతను సులభ శైలిలో, శాస్త్రీయముగా టీకాతాత్పర్యములను రచించి, అనేక గీతోపన్యాసములు భక్తినివేదన పత్రికద్వారా ప్రచారము గావించుచున్న శ్రీమాన్. ఉ. వే. తె. కం. గోపాలాచార్యస్వామివారు 1—4—1960 మొదలు బందరులో చల్ల బజారునందున్న శ్రీ యతిరాజ భవనమందు ప్రతిదినము సాయంకాలము గం॥ 6-30 ని. మొదలు గీతోపన్యాసములు గావింతురు. కాన ఆస్తికులగు భక్తులందరు యీ కాలక్షేపములో అన్వయించ గోరుచున్నాము.

ఇట్లు

బందరు
యతిరాజభవనం



శ్రీ విశిష్టాద్వైత ప్రవర్తక సంఘము.
శ్రీ యతిరాజసేవా మహిళామండలి.



## బదరీ శాశ్వత పూజలు

శ్రీ కొల్లా హనుమంతరావుగారు బంటుమిల్లి 29/
శ్రీ కొమ్మూరి పుష్పవల్లి తాయారమ్మగారు పాలకొల్లు 29/
చి॥ తె. కం గోపాలకృష్ణ (రాజమండ్రి) వాగ్దానంలో 159/లు గాక మరల జమ ఇచ్చినది 116/

( శ్రీమాన్ తె. కం. రంగ రామానుజాచార్యులు యం. ఏ. గారి ద్వారా )
శ్రీ పోలేపల్లి శ్రీనివాసరావుగారు చింతలపల్లి లోగడ 235/లు గాక ఇప్పుడు చెల్లించినది 40/
శ్రీ భమిడిపాటి. సత్యనారాయణగారు కాకినాడ 30/

## సత్సంగ సదన విరాళములు

శ్రీ ప్రగడ మంగయ్యమ్మగారు ఆర్తమూరు 8/
,, దాసరి వెంకయ్యమ్మగారు 16/
,, పంపన శేషమ్మగారు 16/
,, దాసరి సుబ్బయ్యమ్మగారు 16/
,, శాతలూరి రంగనాయకమ్మగారు 100/
,, కొమాండూరి లక్ష్మీనరసమ్మగారు 100/

## శ్రీ బదరీ రామానుజ కూట విరాళములు

శ్రీ మడపల్లి చలమయ్య గారి భార్య సీతామహాలక్ష్మమ్మగారు భీమవరం లోగడ ఇచ్చిన 1000/లు గాక ఇపుడు ఇచ్చిన పూర్తి రొఖ్ఖం 2,500/లు

## సంభావనలు

శ్రీ జక్కంపూడి రత్నమ్మగారి సాంవత్సరికమున స్మారకముగా సమర్పించిన సంభావన 5/లు

శ్రీ చిలకమర్రి జనార్దనాచార్యులుగారు పరమ పదోత్సవములో సంఘమున కిచ్చిన సంభావన 2/

## కట్నములు

శ్రీ కొమాండూరి లక్ష్మీనరసమ్మగారు కుమారుని వివాహ కట్నంగా పంపిన కట్నం 5/లు



శ్రీ జియ్యర్ స్వామివారి సముఖమున వరంగల్లులో
జరిగిన గీతాపరీక్షలో ఉత్తీర్ణులైన బాలురు.

## బదరీ వార్తలు

ఈ సంవత్సరము బదరి కాశ్రమములో వాతావరణము చాలా అనుకూలముగా నున్నది. అధికమైన మంచు శీతవరణ లేదు. నేనే అచ్చట యున్న పూజారిన్న బాబు ద్వారా తెలియజేసెను.

శ్రీ మతే రామానుజాయనమః



# [ జేసంగిలో ] శ్రీ రామానుజ గురుకులము

రాజమహేంద్రవరము — తులసీ రామానుజ కూటము ప్రారంభము. 1960 మే 1 వ తేది మొదలు 42 దినములు.

శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము తరపున రాజమహేంద్రవరములోని తులసీ రామానుజ కూటములో ది 1—5—1960 మొదలు వరుసగా 42 దినములు "శ్రీరామానుజ గురుకులము" అను పేరుతో శ్రీవిశిష్టాద్వైత సంప్రదాయ విషయములను నేర్పు గురుకులమును నడుపుటకు నిర్ణయించడమైనది. ఇది ముఖ్యముగా హైస్కూళ్ళ కాలేజీలలో చదువు విద్యార్థులకు సంధ్యావందనము మున్నగు, ఆత్యావశ్యక నిత్య కర్మానుష్ఠానముల గురించియు, వాని అవశ్యకత, వాని ఉపయోగము అందువల్ల కలుగు ఫలము, వీనిని వీడుటచే కలుగు అనర్థములున్ను మరియు సంప్రదాయము, శిష్టాచారము గురించియు, మరియు సామాన్య ధర్మము, నీతి, సత్ప్రవర్తన, మున్నగు వానిని గురించియు, ఉపన్యాసాది రూపములుగ తెలియజేసియు, అవకాశము ఉత్సాహము, ననుసరించ, ఆచరణను నేర్పియు శిక్షణ మీయబడుచున్నది. ఇది కేవలము విద్యార్థుల నిమిత్తమై ఏర్పరచినను, వయస్సుతో నిమిత్తము లేకుండగ ఈపైన తెలిపిన విషయముల నేర్చుకొనగోరిన వారందరును ఇందు చేరవచ్చును.

ఈ గురుకులమును నడుపుటలో

1. శ్రీ మదిత్యాది శ్రీమాన్ ఉ. వే. పరాశర సుదర్శన భట్టర్ అయ్యవార్లంగారు
   ( కోరుకొండ దేవస్థానం ధర్మకర్తలు ) ఆచార్యులుగ
2. శ్రీమత్తిరుమలపురి హాళ్ళ వెంకటాచార్యులు అయ్యవార్లంగారు ( కులపతిగను )
3. శ్రీమాన్ ఉ. వే. తె. కం. కుమార, రామానుజాచార్యులుగారు ( ఉపద్రష్టలగను )

మరియు అనేక విద్వాంసులు ఉపన్యాసకులుగ వేంచేయుదురు.

శ్రీమాన్ ముత్తంగి జగ్గారావుగారు
,, బలభద్రపు వెంకటరాజుగారు
,, కోదాడ వీరభద్రరావుగారు
శ్రీమతి రామినీడి రాయలమ్మగారు
శ్రీమాన్ రామినీడి సుబ్బారావుగారు

శ్రీమాన్ తోట సత్యంగారు
,, గ్రంధి లక్ష్మీనారాయణగారు
,, ఆ. సూర్యనారాయణగారు
,, తోండెపు సత్యంగారు

ఈ గురుకులమునందు 42 రోజులకు ఒక విద్యార్థి సాపాటు నిమిత్తమై రు 25/లు సమర్పించ వలసియుండును.

విద్య, శిక్షణ, బస, లైటింగు ఉచితముగనే, సమకూర్చబడును. అయినను బీద విద్యార్థులు గుత్తకట్టనము 25/లు సమర్పించ లేనివారు ముందుగ తెలిపినచో సాపాటు ఏర్పాటులు గూడ ఉచితముగనే సమకూర్చబడును. షుమారు 50 మంది విద్యార్థుల వరకు ఈసంవత్సరమున ఈగురుకులమున చేర్చుకొనబడి శిక్షణ నీయ బడుదురు.

ఇంకను ఏమైన వివరములు కావలసిన వారు రిప్లయి కార్డును

తులసీ రామానుజ కూటమి
ట్రైనింగ్ కాలేజి సందులో
ఇన్నీసుపేట
రాజమండ్రి

అని వ్రాసిన మాకు అందును.

ఇట్లు
ప్రధాన కార్యదర్శి
తె. కం. గోపాలాచార్యులు



శ్రియః పతయే నమః

# శ్రీ గుణరత్నకోశము

౧ వ శ్లోకము

శ్లో॥ శ్రియ శ్శ్రీ శ్శ్రీరంగే
శయ తవ చ హృద్యాం భగవతీం
శ్రియం త్వత్తో౽ప్యుచ్చై
ర్వయ మిహ పణామ శ్శృణుతరామ్.
దృశౌ తే భూయాస్తాం
సుఖ తరళ తారే శ్రవణతః
పున ర్హర్షోత్కర్షాత్
స్ఫుటతు భుజయోః కఞ్చుకశతమ్

:— అర్థము ✱ —:

శ్రియః = లక్ష్మీదేవికి
శ్రీః = ఆశ్రయభూతుడవైన
శ్రీరంగేశయ = ఓ రంగనాథుడా
తవ + చ = నీకును
హృద్యాం = మనోహరురాలైన
భగవతీం = షాడ్గుణ్యపూర్ణురాలైన
శ్రియం = లక్ష్మీదేవిని
త్వత్తః + అపి = నీ కంటెనుకూడ
ఉచ్చైః = అధికముగా
వయం = మేము
ఇహ = ఇచ్చట
పణామః = స్తుతింతుము
శృణుతరామ్ = బాగుగా వినుమా
శ్రవణతః = వినుటవలన
తే = నీయొక్క
దృశౌ = దృష్టులు
సుఖతరళతారే = సుఖముచే చంచలించు కనీనిక కలదిగ
భూయాస్తాం = అగుగాక
పునః = మరియు
హర్షోత్కర్షాత్ = ఆనందాతిశయముచేత
భుజయోః = భుజములయందు
కంచుకశతం = వందలకొలది కవచములు
స్ఫుటతు = పగిలిపోవునుగాక

—: తాత్పర్యము :—

ఓ శ్రీరంగనాథా మా కందరకును ఆశ్రయణీయురాలు శ్రీ మహాలక్ష్మి ఆమెకు కూడ ఆశ్రయణీయుడవు నీవు మా యందరికిని మనోహరుడవు నీవు నీకును కూడ మనోహరురాలును, నీ వలెనే షాడ్గుణ్యపూర్ణురాలును మహాలక్ష్మి ఇప్పుడు మేము నిన్నుకంటెను కూడ అధికముగా ఆమెను స్తుతింపబోవుచున్నాము నీవు నిప్రియురాలి స్తోత్రమును విని ఆనందసుఖముచే చంచలించు కనీనిక గలవాడవై, శరీరము ఉప్పొంగుటచే ధరించిన కవచము పగిలిపోగా మరియొక కవచము అదీ పగిలిపోగా మరియొక కవచము ఇటుల అనేక కవచముల ధరింప వలసినవాడవగుదువు గాక. గాన మాస్తోత్రము నాలకింపుమా.

# గమనిక

శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు. శ్రీ యాదగిరియందు గాయత్రీ క్రతువును జరిపించి 13—3—60 వ తేదీ రాత్రి పాలకొల్లులో జరుగుచున్న శ్రీ అష్టాక్షరీ కోటయజ్ఞమునకు అచ్చట వ్యవస్థాపకులచే ప్రార్థింపబడి పాలకొల్లునకు ప్రత్యేకముగా మోటారుపై వేంచేసిరి.

శ్రీవారివెంట కార్యదర్శులగు శ్రీమాన్. తె. కం. గోపాలాచార్యస్వామివారున్నూ, శ్రీమాన్. కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యస్వామివారున్నూ అన్వయించియున్నారు.

అడ్రసు
శ్రీ అష్టభుజస్వామివారి సన్నిధిలో
అష్టాక్షరీ కోటయజ్ఞము
చిన్నగోపురంవీధి
పాలకొల్లు.

# మనవి

పశ్చిమగోదావరి జిల్లా, పాలకొల్లులో వేంచేసియున్న శ్రీ అష్టభుజస్వామివారి సన్నిధిలో 15-3-60 మొదలు 24 రోజులు. అష్టాక్షరకోటయజ్ఞము జరుగుచున్నది. ఈ యజ్ఞము మన శ్రీ జీయ్యర్‌స్వామివారి సహాకనున జరుగుచున్నది. పారాయణలు, జపములు, హోమములు, తులసీపూజలు, ఉపన్యాసములు, తదీయారాధనలు జరుగుచున్నవి కావున భక్తులందరు. ఈ కార్యక్రమములో అన్వయించి తరింపకోరుచున్నాము.



---

సాలుచందా రు. 5 లు భక్తినివేదన - BOOK POST రి. నెం. A 195
శ్రీ వాసుదాసాశ్రమం:— నడిగడ్డపాలెం (పోస్టు) [వయా-పెద్దపాలెం] గుంటూరు జిల్లా.

శ్రీ . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

గారికి

Edited and Published by Sri T. K Gopalacharyulu Garu and Printed at Liberty press, Tenali For Sriman Press, Nadigaddapalem.